# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

ఏప్రిల్ చతుర నవల 'మాతృమూర్తి'

సమీక్షకుని పేరు : ..........................................

చిరునామా : ..........................................

..........................................

..........................................

..........................................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. ''చతుర''లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482



# 'మదనసదనం'పై చతుర సమీక్షలు



**ఫిబ్రవరి నెల 'చతుర'లో ప్రచురితమైన శ్రీకాంత్ అనువాద నవల 'మదన సదనం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.**

## ఇతిహాసపు చీకటి కోణం...

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

'గతమంతా తడిసె రక్తమున కాకుంటే కన్నీళ్లతో' అన్న మహాకవి మాటలు అక్షరసత్యాలుగా కనిపిస్తాయి "చతుర"సమర్పించిన ఫ్రెంచి నవల 'మదనసదనం' చదివినప్పుడు.

మధ్యయుగాలనాటి క్రైస్తవ మందిరాన్ని మదనుడి కేళీమందిరంగా మార్చి, బలవంతపు గర్భాదానాలతో పుత్రకామేష్టులు జరిపి అద్భుతమైన రీతిలో ఆర్యజాతిని సృష్టిస్తున్నానని పొంగిపోయాడు హిట్లర్. స్త్రీల మాన మర్యాదలను హరించి, వివాహవ్యవస్థను మంట గలిపి 'దేశభక్తి' పేరుతో హిట్లర్ అనుచరులు చేసిన అకృత్యాలు కళ్లకు కట్టినట్టు కనిపిస్తాయీ నవలలో.

నాజీల దుష్ట సంస్కృతిని బట్టబయలు చేసేవస్తువును ఇతివృత్తంగా తీసుకొని, సమర్థవంతమైన కథనంతో, సన్నివేశ చిత్రణతో చక్కటి నవలనందించారు రచయిత. వివిధ వర్గాలకు చెందిన వ్యక్తుల కథలతో వేర్వేరు చోట్ల ప్రారంభమై,ఆ పాత్రలన్నీ మదనసదనం దగ్గర కలియడంతో ప్రధాన కథతో ఉన్మీలమై ఏకోన్ముఖంగా సాగుతుంది. ఈ విధమైన కథనం వలన, మదన మందిరానికి చేరుకొన్న వివిధ వ్యక్తులకు చెందిన పూర్వాపర జీవిత పరామర్శ జరిగి, పాత్రలపై ఒక రకమైన సానుభూతిని కలిగిస్తుంది.

అన్ని పాత్రలలో, హెడ్విగ్‌పాత్ర చిత్రీకరణలో ఒక విధమైన ఉదాత్తత కనిపిస్తుంది. హిట్లర్ సామ్రాజ్యవాదాన్ని రాజకీయ విధానాలను మొదటినుండి వ్యతిరేకిస్తూ, చివరివరకు తాను నమ్మిన సిద్ధాంతాలకోసం నిలబడిన స్త్రీగా 'హెడ్విగ్' పాఠకుల హృదయాలను ఆకట్టుకుంటుంది.

అనువాదంలా అనిపించక నవల చక్కగా సాగింది. అయితే కొన్ని పాత్రల విషయంలో ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాల మాండలికాన్ని వాడడం ఎబ్బెట్టుగా తోచింది.

కథా వస్తువు దృష్ట్యా శృంగార రసపోషణ అవసరమే అయినా శృంగారం మోతాదును కొంత పరిహరించి ఉండవలసిందేమో ననిపిస్తుంది సాధారణ దృష్టికి.

మొత్తంమీద హిట్లర్ కాలపు జర్మనీలోని క్షీణసంస్కృతికి అద్దంపట్టిన నవలగా 'మదన సదనం' కనిపిస్తుంది. ప్రపంచయుద్ధానికి కాలుదువ్వి ప్రపంచశాంతిని భగ్నం చేయడంతో పాటు, తనదేశపు సంస్కృతీ విలువలకు కూడా తిలోదకాలిచ్చిన హిట్లర్ దిగజారుడుతనం నాణేనికి రెండోవేపుగా ఈ నవలలో ప్రదర్శింపబడింది.

ఇతిహాసపు చీకటికోణం అట్టడుగున మగ్గిపోయే చరిత్రను వెలికి తీసే రచనలు వెలుగు చూడ వలసిన అవసరం ఎంతో ఉంది. చారిత్రక యదార్థ సత్యాలను నిరూపించే నవలలు మరెన్నింటినో అందించవలసినదిగా 'చతుర'ను కోరుతున్నాను.

**-పంతుల సుధారాణి**
హైదరాబాద్ 500 028

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్-వికీహండా

## ప్రతీక

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

ప్రపంచపు పునాదులనే కదల్చబోయిన జర్మనీ నియంత "హిట్లర్" ఈ నవల ద్వారా ప్రత్యక్ష మయ్యాడు. హిట్లర్‌యొక్క మితిమీరిన జాతీయాభిమానానికి, దురహంకారానికి, అధికార దాహానికి, దురాగతాలకి ఈ నవల ప్రతీక. నవల చదివిన ఎటువంటివారికైనా అతని పథకానికి అసహ్యంతో ఒళ్ళు గగుర్పొడచకమానదు.

"ఏదేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం? నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం" అన్నట్లే హిట్లర్ మితిమీరిన రాజ్యకాంక్ష రెండు ప్రపంచ యుద్ధాలకు కారణమైనది. హిట్లర్ ఒక మూర్ఖునిగా, ఒక అహంభావిగా, ఒక పరాజితుడిగా మిగలడానికి కారణాలు అతడి అతితెలివితేటలు, మూఢ జాతీయాభిమానం, ఆర్య సామ్రాజ్య స్థాపనకి పూనుకోవడమే. ప్రపంచాన్ని పాదాక్రాంతం చేసుకోవాలనే దుర్బుద్ధితో, ఎవర్ని లక్ష్యపెట్టక నాజీయిజం వ్యాప్తియే ధ్యేయంగా ప్రవర్తించి, మారణహోమానికి కారకుడైనాడు. అతడి దురాలోచనకి, దూరాలోచన లేని పథకాలకి మచ్చుతునకయే 'మదన సదనం' ఏర్పాటు.

మానవజాతి సక్రమంగా జీవించడానికి, అభివృద్ధి పొందడానికి వివాహ వ్యవస్థ ఏర్పడింది. ప్రపంచంలో భారతదేశానికి, భారతీయ సంస్కృతికి పెద్దపీట వేశారంటే పవిత్రమైన వివాహవ్యవస్థ పటిష్టతే కారణం. ప్రపంచమంతా గౌరవించే ఈ వివాహ వ్యవస్థను కించపరచే పథకం అమలు జరిపాడు హిట్లర్. "కల్నల్"లాంటి కామాంధులు, "డాక్టర్"లాంటి స్వామిభక్తి పరాయణుల సహకారంతో ఆయన పథకం వర్ధిల్లడంలో ఆశ్చర్యంలేదు. ఎటొచ్చీ "లీసెల్"లాంటి అమాయక కన్యలు, "హెడ్విగ్" వంటి సుకుమార హృదయులు బలిపశువులై వచ్చని జీవితాన్ని కోల్పోయారు.

ప్రపంచానికి ఉపయోగపడే మహత్కార్యాలకు పూనుకొంటేనే మానవజాతి ఎవరికైనా అంజలి ఘటించేది. "కామం" ధర్మమార్గంలో సాగితేనే ముక్తితృప్తి. సమాజానికి ఆరోగ్యకరం. స్త్రీ ఎక్కడ పవిత్రంగా చూడబడుతుందో, గౌరవింపబడుతుందో, అక్కడ సంస్కృతి విలసిల్లుతుందని ఆర్యోక్తి. జాతి మనుగడకి ఆ సూక్తియే ఆయువుపట్టు.

-టి. సూర్యనారాయణ
పార్వతీపురం.

## నూతన ప్రయోగం

*(మూడవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

వెరైటీ నవలల వేదికగా పేరొందిన 'చతుర'లో అర్థవంతమైన ముఖచిత్రంతో వెలువడిన మరో నూతన ప్రయోగం 'మదనసదనం' నవల. అందం, ఆరోగ్యం, యవ్వనం ఉన్న ఎందరో అభాగినులను క్షోభకు గురిచేస్తూ, వారి ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా 'పునఃసృష్టి' నిమిత్తం మదనసదనానికి తరలించి, బలవంతపు గర్భధారణతో "శుద్ధ మహాఆర్య సమాజస్థాపన"కు తద్వారా ప్రపంచాధిపత్య సాధనకు పూనుకొన్న యుద్ధోన్మత్తుడు హిట్లర్ వికృత ప్రయోగోదంతాన్ని వెలుగులోకి తెచ్చి నవలా ప్రపంచంలో తన విశిష్టతను మరోసారి చాటుకొంది 'చతుర'.

యుద్ధం ప్రారంభించి అపార ప్రాణనష్టానికి, 'పునఃసృష్టికి' (అందరూ పుత్రులే పుడతారన్న గ్యారంటీ లేకపోయినా) పూనుకొని అంతులేని మానవనష్టానికి కారకుడైన నియంత హిట్లర్. ఇలాంటి వారి విపరీత ధోరణులను శిరసావహించిన మేధావి వర్గం మొదలు సామాన్య ప్రజానీకం దాకా అందరూ అయిష్టంగానైనా సహకారాలందిస్తుండటం వల్లనే నేటికీ అక్కడక్కడా ఈ రకం దురహంకారులు తమ ఆటలు నిరాటంకంగా సాగిస్తున్నారు. కాని వీరి జీవితం సుఖాంతం కాబోదన్న కఠోర సత్యాన్ని చరిత్ర స్పష్టం చేస్తున్నది.

ఆధిపత్య నిరూపణకై ప్రస్తుతం గల్ఫ్‌లో మానవ మారణహోమం సాగిస్తున్న నేతలు, 'ఖలిస్థాన్' నినాదంతో వయో, లింగ భేదం లేకుండా మానవాళిని ఊచకోత కోస్తున్న తీవ్రవాదులు, మతకలహాల పేరుతో అరాచకాలు



సృష్టించి అనకొన్నది సాధిస్తున్న నికృష్ట రాజకీయవేత్తలు - అందరూ ఆ హిట్లర్‌కు వారసులే.

జీవితంలోని ఆటుపోట్లకు తట్టుకొని తన వ్యక్తిత్వాన్ని ఉన్నతంగా తీర్చిదిద్దుకొన్న వెర్నర్, నేటి చపలచిత్త యువతరానికి ఆదర్శనీయుడు. వెర్నర్ హెడ్విగ్‌ల మనోవేదన, వారి విషాదాంతం హృదయాన్ని కదిలించేవిగా ఉన్నాయి.

అలనాటి మహానియంతలోని క్రూరత్వాన్ని కొత్త కోణంలో చూపించిన రచయితకు, అనువాదకర్తకు, అందజేసిన 'చతుర'కు అభినందనలు.

-డా కె. బలరామిరెడ్డి
అనంతపురం

## అరుదైన నవల

*(నాలుగవ బహుమతి రు. 25/- పొందిన సమీక్ష)*

**నే**ను దాదాపు దొరికిన ప్రతి ఇంగ్లీషు తెలుగు అనువాద నవలలన్నీ చదివాను కాని ఇంతవరకు మరెక్కడా దొరకని చాలా అరుదైన నవల 'మదన సదనం' ఫిబ్రవరి నెల 'చతుర'లో ప్రచురించారు. ఈ నవల బాగుందా లేదా అని చర్చించేదానికంటే ఇటువంటి నవలలు మన తెలుగు పాఠకులు ఎక్కువగా చదవాల్సిన సమయం ఇది అనటం మంచిది.

నియంత హిట్లర్ చేసిన దురాగతాల్లో ఈ పునఃసృష్టి ప్రయోగం ఒకటి. ఈ ప్రయోగం కేవలం అజ్ఞానం, మూర్ఖత్వంతో కూడినది. ఇటువంటి ప్రయోగాన్ని దాదాపు పది పన్నెండేళ్ల క్రితం చికాగో మెడికల్ యూనివర్సిటీవారు కూడా చేశారు.ఒక ఇరవైమంది అందమైన యువతులను పోగుజేసి మంచి దారుఢ్యం, విజ్ఞానం కల పురుషుల వీర్యాన్ని ఆ యువతుల గర్భంలో ప్రవేశపెట్టారు. కాని వారికి ఎటువంటి పిల్లలు పుట్టిందీ ప్రపంచానికి తెలీదు. తరువాత కూడా ఇటువంటి ప్రయోగాలు చాలాచోట్ల జరిగాయి. కాని నిర్దుష్టమైన ఫలితాలు వచ్చినట్లు ఎక్కడా దాఖలాలులేవు. ఏమైనా ఇటువంటి ప్రయోగాలు ముఖ్యంగా స్త్రీజాతి సిగ్గుపడేవి శాస్త్రజ్ఞులు మానుకుంటే మంచిది. ఎందుకంటే సమాజానికిది ఆరోగ్యకరమైన పద్ధతికాదు.

ఈ నవలలోని పాత్రల బాగోగులు గురించి చర్చించడం దాదాపు అనవసరమనిపిస్తుంది. ఎందుకంటే అక్కడి సంస్కృతిబట్టి అక్కడి స్త్రీపురుషుల ప్రవర్తన ఆధారపడివుంటుంది. మన తెలుగు పాఠకులకు వారి ప్రవర్తన మింగుడుపడకపోవచ్చు. లెఫ్టినెంట్ వెర్నర్, హెడ్విగ్ ప్రేమికుల పాత్రలు మాత్రం చాలా కాలం మరిచిపోలేనివిగా వున్నాయి. ప్రియురాల్ని 'మదన సదనం' నుండి, దౌర్భాగ్యపు బతుకు నుండి బయటకు తీసుకురావాలన్న ఆత్రంతో తన ప్రాణాలకు కూడా లెక్కచేయకుండా యుద్ధంలో వీరమరణం పొందిన వెర్నర్ పాత్ర మరపురానిది. ప్రేమించిన ప్రియుడికి తప్ప తన శరీరాన్ని ఎవరికీ చెందనివ్వకూడదనే నియమంతో 'ఒట్టో' ప్రాణాలు సైతం తీయడానికికూడా వెనుకాడలేదు 'హెడ్విగ్'. ఈమె పాత్ర మన పతివ్రతలతోపోల్చుకుంటే ఏ మాత్రం తక్కువదికాదు.

శీలంపోయిన అందరిలాగే ఆ సంగతి బయటికి చెప్పుకోలేకపోయిన కార్నీలియా పాత్ర మనకెంతో జాలిగొలుపుతుంది. అక్కడి డాక్టరు కప్పదాటు వ్యవహారంలో ఆశ్చర్యమేమీలేదు. అతనికున్న పరిధులటువంటివి.

ఆనాటి నియంత హిట్లర్ దుష్కార్యాలను 'చతుర' నవలా వేదికనెక్కించి తెలుగు పాఠకుల ముందుంచిన సంపాదకులకి అభినందనములు.

-పి.వి.యన్.ప్రసాద్
పొన్నూరు

## నమ్మలేని నిజం

*(అయిదవ బహుమతిరు. 25/-పొందిన నవల)*

**ఏ**పత్రిక చదివినా ఒకేరకం మూసరచనలు వెలువడుతున్న నేటి తరుణంలో, వెరయిటీ నవలల నందించడంలో సఫలీకృతమౌతున్న చతుర శ్రద్ధ బహుధా ప్రశంసనీయం.

ఫ్రెంచి, ఇంగ్లీషు పశువైద్యశాస్త్రవేత్తలు, మేలుజాతి సంతానోత్పత్తికి కారకులైన ఇతర





శాస్త్రవేత్తలు సైతం తమ ప్రయోగాలను జంతువులవరకే పరిమితం చేసుకుని మేలుజాతి సంకరగుర్రాలను సృష్టించగలిగారు కాని ఇదే శాస్త్రీయ సిద్ధాంతాన్ని మానవజాతికి వర్తింపచేయడానికి ఏశాస్త్రవేత్తా సాహసించని నేపథ్యంలో నైతిక సంప్రదాయాల్నీ సెంటిమెంట్లనీ దారుణంగా అణచివేస్తూ ఇటువంటి నీచ ప్రయోగపథకాల్ని రూపొందించి అమలు జరపడం ఆరోజులలో హిట్లర్‌కే చెల్లింది.

జాతి పరిశుద్ధత, పవిత్రత విషయంలో, నాజీ ప్రయోగాన్ని అమలుజరపడంకోసం హిట్లర్ తలపెట్టిన పునఃసృష్టి శిబిరాన్ని నిర్వహించడంలో పాత్రధారులైన దుష్టుల స్వార్థప్రవృత్తివలన నలిగి నశించిపోయిన జీవితాలెన్నో మనకు దర్శనమిస్తాయి. కామంతో కళ్ళుమూసుకుపోయి తన కోరిక తీర్చలేదన్న కసితో పగబట్టిన కల్నల్ తన అధికారబలాన్ని వినియోగించి చివరివరకు పాములా బుసకొట్టినందుకు జీవితాంతం క్రుంగిపోయిన "హెడ్విగ్" అందులో ఒక అమాయకప్రాణి.అంత నిస్సహాయ విపత్కరపరిస్థితుల్లోసైతం మొక్కవోని ఆత్మవిశ్వాసంతో ధైర్యంగా నిలచింది. ఆమె తన మనసు నమ్ముకున్న మార్గంలోనే నడిచి, ఆత్మత్యాగంచేసుకున్న తీరు అత్యంత దయనీయం.

ఈ నవలలో సమాజానికి ఉన్నత సంస్కృతినందించగలిగే పాత్రలు, మనల్ని కొద్దిగానైనా ఓదార్చే పాత్రలు రెండే రెండు వెర్నర్, హెడ్విగ్‌లు. అయితే ఈ రెండుపాత్రలు చివరికి ఏ ప్రాముఖ్యం లేకుండానే ముగిసిపోవడం నిరాశపరుస్తుంది.

-హైమచంద్రిక
నర్సాపూర్

## రాజు తలుచుకుంటే...

**(ఆరవ బహుమతి - రు. 25/- పొందిన సమీక్ష)**

నియంత తలచుకుంటే నీతిమాలిన పనులకు కొదవేముంటుంది! నలభయ్యోదశకంలో ప్రపంచ మానవాళి మరిచిపోలేని డిక్టేటర్ హిట్లర్ చేసిన కిరాతక చర్యలెన్నో! అరవైలక్షలమంది యూదు జాతీయులను నిర్దాక్షిణ్యంగా హతమార్చడం అతడు చేసిన దారుణమైన పనులకు పరాకాష్ట అయితే పుత్రకామేష్టి పేరుతో ఆర్య వీరయోధుల్ని తయారుచేయాలని తలంచి అందుకు అమాయక వనితల శరీరాలతో తన సైనికులను ఆడుకోమనడం అనాగరిక చర్య.

హిట్లర్ తన ఏలుబడిలో పునఃసృష్టి పేరుతో అందంతోనూ, ఆరోగ్యంతోనూ తులతూగే కన్నె పిల్లలను వాళ్ళ అభీష్టానికి వ్యతిరేకంగా ముక్కూ మొఖం తెలియని దారినంతతికి తల్లిని కమ్మని శాసించాడనేది మనమున్న శతాబ్దిలోనే జరిగిందన్న విషయం ఎంతకూ మింగుడుపడడంలేదు.

అయితే, ఈ నవలలో హెడ్విగ్, వెర్నర్‌ల జంట తప్ప మిగిలిన జంటలన్నీ మదనసదనంలో తమ శారీరకవాంఛలతో ఆనందాన్నే జుర్రుకున్నాయి. వెర్నర్ పాత్ర దేశభక్తిని, సాహసాన్ని, త్యాగనిరతిని చాటింది.

ఈ నవలలో ప్రధాన పాత్ర హెడ్విగ్ అని చెప్పుకోవాలి. మదనసదనంలో అతి హేయమైన పశుక్రీడలను దృఢంగా వ్యతిరేకించిన పాత్ర అదే! అసలు ఈ మదనసదనంలో క్రీడలను ఎంతటి నీతిమాలినవని చెప్పుకున్నా హెడ్విగ్ చెప్పినదానికన్నా తక్కువే. "మన సహజమైన నమ్రతనూ, శీలాన్నీ ధ్వంసంచేయడానికీ, ప్రకృతిసిద్ధమైనమానసిక అనురాగ భావాలన్నింటినీ హత్యచేయడానికి ప్రేమలో పవిత్రమైన ప్రతీ అంశాన్నీ కాలరాయడానికి హిట్లర్ ఆదేశించాడ"న్న ఆమె మాటలే ఇందుకు ఉదాహరణ.

శ్రీకాంత్‌గారు సరళంగా అనువదించినప్పటికీ, మితిమీరిన స్వేచ్ఛతో తెలుగు సామెతలనూ, పాటలనూ చొప్పించడం ఎంతవరకు సమర్థనీయం? ఫ్రంజే హెడ్విగ్ వేటలో హుషారుగా 'సిలక కొట్టుడు కొడితే' అనే ఈలపాట మచ్చుకొకటి!

ఏమైనా 'నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు' అన్నట్టు "చతుర"లో వచ్చిన ఈ నవలకు విలువ కట్టడం... సాహసం అవుతుంది.

-ఎం.రమాదేవి
సికింద్రాబాదు



# చతుర

సంపుటి: 14 సంచిక: 3 ఏప్రిల్ 1991

స్త్రీ మాతృమూర్తి అనిపించుకోవాలంటే పిల్లల్నే కనఖ్ఖర్లేదనీ, ఆమెకి పుట్టుకతో వచ్చే ఆ మాతృభావాన్ని, వాత్సల్యాన్ని అనురాగాన్ని అసూయాగ్ని పాలుచేయకుండా వుంటే నిజమైన మాతృమూర్తిగా, దేవతా స్వరూపిణిగా ఆమె మన్ననలందుకుంటుందన్న సత్యాన్ని సాక్షాత్కరింపచేస్తూ .... వింజమూరి విజయశాంభవి రాసిన 'మాతృమూర్తి' ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

"అమ్మా..." చందూ మూలుగుతున్నాడు.

"అమ్మా... తలుపు తియ్యమ్మా! తమ్ముడికి జ్వరంగా ఉంది. బయట చాలా చలిగా మంచుగావుందమ్మా! నీకు దణ్ణం పెడతాను తలుపు తియ్యమ్మా..."

దీనంగా అడుగుతూ ఏడుపుని నిగ్రహించుకుంటూ తలుపు తడుతోంది భారతి.

ఉన్నట్టుండి వేగంగా తలుపులు తెరుచుకున్నాయి. ఆ వేగానికి భారతి ముందుకి తూలి పడబోయింది. ఆ అమ్మాయి బుజంపట్టుకుని ఆపి చెంప మీద బలంగా కొట్టింది తలుపుతీసిన ఓ ముప్పై మూడేళ్ల యువతి.

భారతి కళ్ల ముందు మెరుపులు మెరిశాయి.

"అమ్మ... ఎవరేనీకు అమ్మ? నన్నలా పిలవద్దని ఎన్నిసార్లు చెప్పాను నీకు? మళ్లీ మొదలెట్టావా? నిన్ను కన్నానా నేను? సిగ్గులేకపోతే సరి... ఏడాది క్రితం పెళ్లి చేసి ఉంటే ఈసరికి బిడ్డతల్లివయి వుండేదానివి. నీకు నేను అమ్మనా? మరోసారి అలా పిలిచావంటే పళ్లు రాలగొడతాను..." నిప్పులు కక్కుతూన్న కళ్లతో ఛీత్కరింపుగా అంటూ తీసినంత వేగంగానే తలుపులు మూసేసుకుందామె.

పేలిపోయిన చెంపను తడుముకుంటూ వచ్చి చందూ దగ్గర కూర్చుంది భారతి. అవమానంతో బాధతో గుండెలు పగిలిపోతాయా అన్నంత దుఃఖంతో రెండు మోకాళ్ల మధ్య తలదాచుకుంది భారతి. ఎంతకఠినాత్ములు?

ఏడాది క్రితం పెళ్లిచేసివుంటే ఈసరికి బిడ్డతల్లివయివుండేదానివి అనే ఆ మాటలు పదిహేనేళ్ల భారతిని ఎంతగానో గాయపరిచాయి.

ఎందుకిలా మాట్లాడుతుందీమె? అమ్మ అనిపిలిస్తే తప్పు...

"ఆవిడ మమ్మల్ని సరిగ్గా చూడ్డంలేదు. వూరికే తిడుతోంది. ఉత్తిపుణ్యానికే నాన్నకి చెప్పి తిట్టిస్తోంది, కొట్టిస్తోంది" అని చందూ పక్కింటి అంబుజమ్మగారికి చెప్పడం వినేగా ఇంతకోపం తెచ్చుకుంది.

అలాంటప్పుడు తమిద్దరినీ జాగ్రత్తగా ప్రేమగా చూసుకోవచ్చుగా? చందూ పక్కింటివాళ్లతో అలా చెప్పడం తప్పే! కానీ, చిన్నపిల్లాడు. తప్పని వాడికేం తెలుసు? వాళ్లూవీళ్లూ ఆరాలు తీస్తుంటే ఉన్న మాట ఉన్నట్టు చెప్పేస్తాడు. పైగా ఈ రోజు రహస్యంగా పంచదార తింటున్నాడని ఆవిడ వాడిని రెండు దెబ్బలు వేసింది. ఆ కోపం మనసులో ఉంచుకున్నాడేమో.

అప్పటికీ తను వాడితో ఎన్నిసార్లు చెప్పలేదు "తప్పురా! బయటివాళ్లతో మనవిషయాలు చెప్పకూడదు. ఎన్ని విషయాలున్నా మనలోనే దాచుకోవాలి. నాయనమ్మ చెప్పలేదూ"

"ఏం చెప్పిందేమిటి? నాయనమ్మ మాత్రం ఈ రాక్షసి గురించి అందరికీ చెప్పేది కదూ" అంటూ తనతో పోట్లాడాడు.

వాడి మొండితనం చూస్తూంటే తనకి ఏడుపువస్తుంది. ఈ మధ్య కొత్తగా పక్కిళ్లల్లో చిల్లర డబ్బులు దొంగతనంగా తీయడం ప్రారంభించాడట. ఈ విషయం గుర్తు రాగానే భారతి దుఃఖం అధికమైంది. నాన్న బొత్తిగా పట్టించుకోవడం మానేశాడు. పట్టించుకున్నా ఆవిడనేమీ అనడు. తిట్లూ తన్నులూ తమకే. ఎందుకోగానీ ఆవిడకి తామిద్దరినీ చూస్తేనే పడదు. నాయనమ్మ చచ్చిపోయాక పూర్తిగా మారి పోయింది. ఈ ఇరుగూ పొరుగూకయినా బుద్ధి వుండద్దూ? ఎప్పుడూ ఒకళ్ల ఇంట్లో విషయాలు తెలుసుకోవాలన్న తపనే. తను కాస్త పెద్దదయింది. ఏ విషయాలు బయట చెప్పవచ్చు. ఏ విషయాలు చెప్పకూడదూ అన్న విషయం తెలుస్తోంది. చందూ చిన్నవాడు. వాడికి ఇదంతా ఏమీ తెలీదు. మొండితనం జాస్తవుతోంది.

"అమ్మా..." చందూ మూలుగుతున్నాడు.

భారతి కదిలి వాడి ఒంటిమీద చెయ్యివేసి చూసింది. వాడి ఒళ్లు పేలిపోతోంది. చలికి ముడుచుకుపోతున్నాడు. ఏడుపు ఉధృతంగా ముంచుకొచ్చింది భారతికి.

ఏం పాపం చేశారని తమకి ఈ బాధలు? తెల్లవారినదాకా ఈ అరుగులమీద పడివుంటే జ్వరం ఎక్కువైపోదా? నాన్నొస్తే ఆమె ఏం చెబుతుందో?

ఈమధ్య నాన్నకి కోపం జాస్తయింది.





ముందూ వెనకా చూసుకోకుండా జరిగిందే మిటో తెనుసుకోకుండా తిట్టడమో కొట్టడమో చేస్తున్నాడు. చందుకి ఈమధ్య తన్నులు బాగా తింటున్నాడు అలాగని తాను ఎంత జాగ్రత్తగా వున్నా తనకీ తిట్లు తప్పడంలేదు. తనెంత మంచిగా వున్నా ప్రతి విషయంలోనూ ఏదో లోపం కనిపిస్తుందామెకి.

అదేమంటే "మీరంటే నాకు అసహ్యం" అంటుంది.

'ఎందుకో అంత అసహ్యం'? పదిహేనేళ్ల భారతికి అర్థంకావడంలేదు. ఈ అమ్మకి అను కూలంగా ఆవిడికి ఇష్టమైనట్టు మసలుకోవడా నికి ఎప్పుడూ ప్రయత్నిస్తూనే వుంది. ప్రయత్న లోపం లేకపోయినా ప్రతి సారీ ఓడిపోతూనే వుంది. ఈ విషయం ఆ అమ్మాయికి తెలీదు.

'అమ్మా' అని పిలిస్తే ఆమె కాళి అవుతుంది.

'పిన్నీ' అని పిలిస్తే నాన్న మండిపడతాడు.

ఏమని పిలవాలి?

"మీకు దణ్ణం పెడతాను! మీరు నన్నేమీ ప్రేమతో పిలవద్దు" అంటుంది! ఆవిడతో మాట్లాడేదే తక్కువ. ఏమీ పిలవనవసరంలేదు. నిజంగా ఆమె మనసు చాలా కఠినం. లేకపోతే చిన్నపిల్లాడు తెలీక ఏదో అన్నాడని నాన్న వూళ్ళో లేడుగదాని ఇంట్లోంచి బయటికి నెట్టి తలుపులు వేస్తుందా?

అన్నం లేకుండా మంచులో జ్వరంలో ఇలా బయటపడి వుంటే తెల్లారేసరికి చందు బ్రతుకుతాడా? అని, భారతికి బిగ్గరగా పైకి ఏడవాలనిపించింది! బలవంతాన నిగ్రహించుకుంది! ఈవిషయం ఇరుగూపొరుగూ వాళ్ళెవరైనా గ్రహించారంటే రేపు ఉదయం ఏం జరిగిందో చెప్పమంటూ ప్రాణం తీసేస్తారు! చెప్పకపోతే కోపాలు.

భారతి భయంతో లేచి వరండాలో వెలుగుతున్న లైటు ఆర్పేయబోయింది. ఇదే సమయంలో వీధి గేటు చప్పుడైంది. భారతి తలతిప్పి చూసింది. గేటు తీసుకుని తండ్రి లోపలికి వస్తున్నాడు. బ్యాగ్‌తో లోపలికి వస్తూన్న తండ్రిని చూడగానే చెప్పలేనంత ఆనందం ముప్పిరిగొంది భారతిలో. నాన్నొస్తున్నాడు! చందూ ఈ రాత్రంతా మంచులో చలిలో ఉండనక్కరలేదు.

అప్పటికే బయటి వరండాలో ఒంటరిగా నిలబడి వున్న కూతుర్ని చూసి మూర్తి ఆశ్చర్యపోయాడు. అతడు పైకి వస్తూ ఏదో అనబోతుండగా అతడి దృష్టి కింద అరుగుమీద ముడుచుకు పడుకున్న కొడుకుమీద పడింది. అతడి ఆశ్చర్యం రెట్టింపుకాగా ఏదో అడగబోయాడు. ఇంతలో వేగంగా తలుపులు తెరుచుకున్నాయి. ఆమె లోపలినుండి వచ్చింది.

"వచ్చారా?" అంది భర్తని చూసి "మీకోసమే కళ్ళు కాయలు కాచేలా ఎదురుచూస్తున్నాను" అంది.

ఈ మాటలతో అంతక్రితం తండ్రిని చూడగానే భారతిలో పెల్లుబికిన ఆనందం మంత్రం పెట్టినట్టు మాయమై ఆస్థానే 'భయం' అనే భావం మనసుని ఆక్రమించుకోగా చప్పున కదిలి వెళ్ళి తమ్ముడి దగ్గర కూర్చుంది.

"ఏమయింది"? అర్థంగాక అతడు కూతురివైపూ, కింద పడుకున్న కొడుకు వైపూ, భార్యవైపూ మార్చి మార్చి చూస్తూ అడిగాడు. అప్పటికే విసుగూ, కోపం, అసహ్యం పాకి వస్తూన్నాయి అతడి మొహంలోకి.

"చందూ బొత్తిగా అలివిగాకుండా పోతున్నాడండీ" ప్రారంభించిందామె. భారతి రెప్ప వాల్చకుండా ఆమె మొహంలోకే చూస్తోంది. ఇప్పుడామె అన్నీ అబద్ధాలే చెబుతుందని ఆ అమ్మాయికి తెలుసు! నిస్సహాయంగా భయంగా ఆమె చెప్పేమాటల్ని వినడం తప్ప ఆ అమ్మాయి "ఇది అబద్ధం" అని చెప్పే సాహసం చెయ్యలేదు.

"ఈ సాయంత్రం పెరట్లో సన్నజాజులు కోస్తానంటూ గోడ ఎక్కాడండీ. 'పడతావు... వద్దురా' అని ఎంతగా చెప్పినా వినిపించుకోలేదు. గోడేమో బాగా ఎత్తుగా వుందిగదా! పైనుంచి పడనే పడ్డాడు. దెబ్బలయితే తగల్లేదు గానీ, కాస్తలో తప్పిపోయింది. గోడ పక్కనే రుబ్బురోలు వుంది. దానిమీద పడివుంటే ఏమయివుండేది? తలకాస్తా పగిలివుండేది! కోపం పట్టలేక కేకలేశాను. అంతమాత్రానికే రోషం వచ్చి పక్కింట్లో వెళ్లి కూర్చున్నాడు. ఆ అంబుజమ్మగారిగురించి మీకు తెలీనిదేంవుంది?



వాడికేం నూరిపోసిందోగానీ నామొహం కనబడగానే అసహ్యంగా తిట్టడం ప్రారంభించాడు. నా మనసంతా పాడయిపోయింది. మీరు ఊళ్ళో లేరన్న ధైర్యంతో మరీ మొండికేశాడు. ఈ పూట ఇంట్లో ఎవరికీ అన్నాలులేవు. మనసు చాలా బాధగా అనిపించి పడుకున్నాను. పక్కింటినుంచి ఎప్పుడొచ్చి ఇక్కడ పడుకున్నాడో నేను చూడనేలేదు'' చెబుతోంది ఆమె.

జరిగిన నిజమేమిటో చెప్పడానికి చందూ మేలుకుని లేడన్న ధైర్యం, భారతి తండ్రితో నిజం చెప్పదన్న నమ్మకం... చాలా సులభంగా కట్టుకథని కల్పించి చెబుతోందామె. భారతి తెల్లబోయి చూస్తోంది. ఇలా ప్రతిసారీ ఆమె ఇలాంటి కథ ఒకటి తండ్రికి చెప్పడం చూస్తున్నా ఎప్పటికప్పుడు ఇలా తెల్లబోవడం భారతికి అలవాటయిపోయింది.

భార్య మాటలు వినగానే ఆగ్రహం ముంచుకొచ్చింది మూర్తికి. ఆ ఉదయం అతడు వూరు వెళ్లిన పని పూర్తికాలేదు. ఆ చిరాకుకి ప్రయాణపు బడలిక తోడయింది. ఇప్పుడు ఇంటికి వచ్చీరాగానే ఈ గొడవ! కోపంతో ఒళ్లు తెలీలేదతడికి.

"ఒరేయ్ రాస్కెల్..." బ్యాగ్‌ని భార్యకి అందించి అరుగుమీద పడుకున్న కొడుకు జుట్టు పట్టుకోవడానికి ప్రయత్నించాడు.

"నాన్నా..." భారతి గట్టిగా తండ్రి చెయ్యి పట్టుకుంది. "వాడ్ని కొట్టకండి నాన్నా! వాడికి బాగా జ్వరంగావుంది. చూడండి! ఒళ్లు పేలి పోతోంది... ఒంటిమీద తెలివికూడా లేదు..." ఏడుస్తూ దీనంగా చెబుతూన్న కూతురి మొహం చూడగానే మండుతున్న మూర్తి కోపంమీద మంచి నీళ్ళు చిలకరించినట్ట యింది.

చందు మూలుగుతున్నాడు! మూర్తి ఆగి కొడుకు మెడమీద, నుదుటిమీద చెయ్యి వుంచి చూశాడు. శరీరం మాడిపోతోంది! అంతులేని నిస్సత్తువ ఆక్రమించుకుందతడ్ని. చెయ్యి వెనక్కి లాక్కుని విసురుగా కదిలి లోపలికి వెళుతూ "ఎలాగైనా చావండి" అన్నాడు.

భారతి తలెత్తి సవతి తల్లివైపు దీనంగా చూసింది. మొహం తిప్పుకుని లోపలికి వెళ్ళిపోయిందామె. భారతి మెల్లగా లేచి కష్టంమీద చందూని లేపి లోపలికి తీసుకొచ్చి మంచంమీద పడుకోబెట్టింది. వాడు మూలుగుతున్నాడు. ఆ అమ్మాయి ధైర్యం తెచ్చుకుని వంటగదిలోకి వచ్చి అలమరాలో వున్నా పాలగిన్నెలోంచి పాలు వంపి స్టౌమీద కాస్త వెచ్చజేసి ఇవతలికి వస్తూండగా తండ్రిగదిలోంచి ఆయనకి ఏదో చెప్పడానికి ప్రయత్నిస్తూన్న నవతితల్లి గొంతు.

చాలా అసహ్యంగా "నాకేమీ చెప్పవద్దు! నన్ను విసిగించవద్దు! మీరు ఎలాగైనా చావండి! బొత్తిగా కొంపలో మనశ్శాంతి కరువైపోతోంది..." అంటూన్నాడు తండ్రి.

భారతి అక్కడ క్షణమైనా ఆగకుండా వచ్చి తమ్ముణ్ణి లేపి పాలు తాగించింది. ఉదయం ఎప్పుడో తిన్న టిఫిన్ తప్ప రోజంతా ఖాళీ కడుపుతో ఉన్నాడేమో ఆవురావురుమంటూ తాగేసి మళ్ళీ ముడుచుకు పడుకున్నాడు. భారతి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. చందూకి దుప్పటి కప్పి లైటు ఆర్పి వాడి పక్కనే కూర్చుంది.

తండ్రి మళ్ళీ కొడుకుని చూడటానికి రాలేదు. భార్యా భర్తలిద్దరూ ఘర్షణపడుతున్నట్టు గొంతులు కాస్త పెద్దగా వినిపిస్తూన్నాయి. ఇది చాలా అరుదయిన విషయం.

భారతికి తమ తల్లి గుర్తొచ్చింది...

'అమ్మా... అమ్మా... మమ్మల్ని దిక్కులేని వాళ్లనిచేసి నువ్వెందుకు వెళ్లిపోయావమ్మా..." ఆ అమ్మాయి మనసు ఆక్రోశించింది.

ఈ ప్రపంచంలో భారతి ఒక్కదానికే కాదు సవతి తల్లి వున్నది. చాలా మందికి సవతి తల్లులున్నారు. ఎందరో భారతిలాంటి, చందూలాంటి పిల్లలు పుట్టినది మొదలు ఒక వయసంటూ వచ్చినదాకా కన్నతల్లి సంరక్షణలోనే ఎదగడంలేదు. ఎందరికో సవతి తల్లులున్నారు. కొందరు పిల్లలు వారి ఆదరణకి గురయితే- చాలామంది అనాదరణకి గురవుతున్నారు.

'ఎందుకిలా జరుగుతోంది'?

'సవతి తల్లులు ఇలాంటి పిల్లల్ని ఎందుకు ప్రేమించలేక పోతున్నారు'? 'ఎందుకిలా ద్వేషిస్తున్నారు'?

"భారతీ..."

భారతి ఆలోచనల్లో నుండి బయటికి వచ్చింది.

ఎదురుగా ప్రకాష్ నిలబడి వున్నాడు. అతడి స్కూటర్ చప్పుడు సైతం వినిపించనంతగా ఆమె గతకాలపు ఆలోచనల్లో మునిగిపోయింది.

అతడు నవ్వుతూ "నా రాకని గమనించనంతగా దీర్ఘాలోచనలో మునిగిపోయి కూర్చున్నావు! ఏమిటో ఆ ఆలోచనలు" అడిగాడు.

అతడి నవ్వు ఎంతో బావుంటుంది.

ఆమె సమాధానంగా నవ్వుతూ "మీగురించే అనుకోండి" అంది.

అతడి కళ్ళు మెరవగా ఆమె మొహాన్ని చేతుల్లోకి తీసుకోబోయాడు.

ఆమె దూరంగా వెళుతూ "అరుగో పిల్లలు..." అంది.

అతడు చప్పున ఆగిపోయి వెనక్కి చూశాడు. అక్కడ పిల్లలులేరు, అతడు చిరుకోపంగా తలతిప్పి చూసేసరికి ఆమె చప్పుడు కాకుండా నవ్వింది.





''నువ్వెప్పుడూ తప్పించుకునే మార్గాలకో సమే వెదుకుతుంటావు.పిల్లలు నీకు పెద్ద సాకుగా దొరికారు...''అంటూ అతడు హఠాత్తుగా ఆగిపోయి''వాళ్ళెక్కడ?'' అడిగాడు.

''డాబామీద కూర్చున్నారు'' అంది.

మంచంమీద కూర్చుని షూ విప్పుకోబోతున్న అతడు చప్పున తలెత్తి చూస్తూ ''డాబామీద కూర్చున్నారా?' అడిగాడు.

ఆమె ''అవును'' అంది.

అతడి మొహంలో రంగులు మారాయి. లేచి ఆమె దగ్గరికివస్తూ ''వాళ్ళు నీకు దగ్గర కావడంలేదా భారతీ? నిన్ను వేధిస్తున్నారా?'' అడిగాడు.

ఆమె నెమ్మదిగా ''వాళ్లు నన్ను వేధించడం ఏమిటి?'' అంటూ నవ్వింది.

''చిన్నపిల్లలు! వాళ్ళకి వేధించడం ఏడిపించడం ఇన్ని విషయాలు తెలుసా? ఇంకా కొత్తదనం పోలేదుగదా?'' అంది.

అతడు విసుగ్గా ''కొత్తదనమా? ఇంకా ఏం కొత్త? నువ్వు ఇక్కడికివచ్చి వారం అయింది. ఇంకా కొత్తేమిటి''? అన్నాడు.

''అదుగో అదే... ఆ విసుగే మీలో కనబడకూడదు. ముఖ్యంగా పిల్లలకి... దీన్ని వాళ్లు అర్థంచేసుకున్నారంటే ఈ కొత్త అమ్మ పట్ల వాళ్లల్లో వ్యతిరేకత పెరుగుతుంది. ఒకసారి అది మొదలయిందంటే దాన్ని తొలగించడం చాలా కష్టం. ఈ విషయాన్ని మీరు బాగా గుర్తుంచుకోవాలి'' అంది.

''సారీ'' అన్నాడు ప్రకాష్! ''వాళ్ళ పట్ల నువ్వెంత ప్రేమనీ అభిమానాన్నీ కలిగివున్నావో నాకు తెలుసు భారతీ. అయినా నీకు పిల్లలు దగ్గర కావడం లేదంటే నాకు చాలా బాధగావుంది'' ఈ మాటల్ని బాధగా అన్నాడతడు.

భారతికి నవ్వొచ్చింది! ఆమె నవ్వింది.

''నవ్వుతావెందుకు?''

''నేను ఈ ఇంటికి కొత్తగా వచ్చిన బంధువుని కాదండీ, వాళ్లు ఒకరోజంతా కొత్తకొత్తగా దూరంగా వుండి రెండోరోజు కలిసిపోవడానికి. శాశ్వతంగా వాళ్ల తల్లి స్థానంలో వుండిపోవడానికి వచ్చినదాన్ని నన్ను 'అమ్మా' అని పిలవమని మీరు చెబుతున్నారు. వాళ్లకి తెలుసు... నేను వాళ్ళ అమ్మని కాదు! అమ్మకాని ఎవరో పరాయి స్త్రీని 'అమ్మా' అని ఎందుకు పిలవాలో వాళ్లకి తెలీదు! ఎవరూ చెప్పలేదు.

''అదేమిటి భారతీ అలా అంటావు? నీ గురించి పాపకీ బాబుకీ నేను చెప్పానుగదా'' అన్నాడతడు.

'' ఏం చెప్పారు? మీకో కొత్త అమ్మ వస్తుందని చెప్పారు. ఆ అమ్మ మిమ్మల్ని బాగా చూసుకుంటుందని ఎప్పటికీ ఇక్కడే వుండిపోతుందనీ, అమ్మలేనిలోటు తీరుస్తుందనీ చెప్పారు. అంతేనా?''

''అవును ... అంతే'' అన్నాడతడు.

ఆమె అతడివైపు అదోలా చూసి నవ్వింది ''అంతేకానీ, ఈ అమ్మని ఎందుకు తీసుకురావలసి వచ్చిందో అసలు అమ్మస్థానాన్ని ఈ కొత్త వ్యక్తికి ఎందుకు ఇవ్వవలసి వచ్చిందో మీరు చెప్పలేదు! అవునా?''

ప్రకాష్ తల వంచుకుంటూ ''సారీ భారతీ'' అన్నాడు.

''ఫరవాలేదు ప్రకాష్! ఈ విషయాన్ని నా ప్రవర్తన ద్వారా ప్రేమద్వారా వాళ్లకి తెలియబరుస్తాను. అయితే మీరు చేసిన పొరపాటు ఏమిటో తెలుసా?'' అడిగింది.

తెలీదన్నట్టు తలూపాడతడు.

''ఒకటి కాదు! రెండు! మన పెళ్ళి జరగబోతోందని తెలిశాక ఇంకాస్త టైమ్ తీసుకుని పిల్లల్ని మానసికంగా ఈ కొత్త అమ్మ రాకకోసం ఎదురు చూసేలా తయారు చెయ్యకపోవడం... '' ఆమె ఆగింది.

అతడు తదేకంగా ఆమెనే చుస్తున్నాడు.

''రెండోది ఏమిటంటే... పిల్లల్ని వదిలి వచ్చి మన పెళ్ళి జరిగాక వాళ్ళకి దూరంగా కొద్ది రోజులపాటు వుండిపోవడం! ఆలోచించండి ప్రకాష్! అసలే తల్లిని కోల్పోయిన ఒంటరితనంలో వున్నవాళ్ళని మరింత ఒంటరి తనానికి గురిచేస్తూ మీరు దూరంగా వున్నారు. సవతితల్లి అంటే ఓ రాక్షసిగా భావించే ఈ సమాజంలోని మనుషుల మధ్య వాళ్లని వదిలేశారు. ఫలితంగా ఈ కొత్త అమ్మపై

ట్ల పిల్లల్లో భయం సందేహం ఏర్పడాయి! ఆలోచించండి నా మాటల్లో నిజం ఎంతవరకూ వుందో?''

అతడు సంభ్రమంగా ఆమెను చూస్తూ ''నిజమే భారతీ! కానీ, నాకే నువ్వు కొత్త. ఆ కొత్తదనం పోగొట్టుకోవడానికీ అసలు నువ్వేమిటో అర్థం చేసుకోవడానికీ నా గురించి పిల్లల గురించి నీకు అర్థం అయ్యేలా చెయ్యడానికీ వాళ్లని వదిలి నీదగ్గర పదిహేను రోజులపాటు వుండి పోయానేగానీ''

''నాకు తెలుసండీ! అదే పొరపాటు! ఒకర్ని ఒకరం అర్థంచేసుకోవడానికి ఆ పసిపిల్లలు మనకి అడ్డం అవుతారంటారా?'' సూటిగా ప్రశ్నించిందామె.

అతడు సమాధానం చెప్పలేక కాస్సేపు మౌనంగావుండిపోయి తరువాత '' పోనీ, నేనీ విషయాన్ని గ్రహించలేక పొరపాటు చేశాననే అనుకో! నువ్వయినా నన్ను హెచ్చరించి వుండాల్సింది. వెంటనే బయలుదేరి వచ్చి వుండేవాళ్లంగదా?'' అన్నాడతడు నెపం ఆమె మీద పెడుతూ.

భారతి నవ్వింది ''బావుంది నేను మీ బాధ్యతని మీకు గుర్తుచెయ్యాలన్నమాట? అయినా నేను మిమ్మల్ని పరీక్షించడానికీ పరిశీలించడానికీ దీన్నో అవకాశంగా తీసుకున్నాను'' అంది.

అతడు ఆశ్చర్యంగా ''పరీక్షించడానికా?'' అన్నాడు.

''అవును... కొత్త భార్య మోజులో పిల్లల్ని నిర్లక్ష్యం చేసే దుర్బలత్వం బలహీనత మీలో ఉన్నాయా లేవా... అని''

''భారతీ?''

''అవును...''

అతడు చాలా ఆతృతగా ''ఏమనిపించింది? నీ పరీక్షలో నేను నెగ్గానా? ఓడిపోయానా?''

''గెలుపు అంటే ఏమిటనుకుంటున్నారు మీరు?'' అడిగిందామె.

''పిల్లల పట్ల ఎప్పటి ప్రేమనీ, శ్రద్ధనీ కలిగి ఉండి నిన్ను భార్యగా ప్రేమించడం గౌరవించడం అవునా?''

''నిజమే''

''అయితే నన్ను పరీక్షించానన్నావుగదా? ఎన్ని మార్కులువేశావు?''

''ఇప్పుడు చెప్పను'' ఆమె నవ్వుతూనే అంది ''ముందు వెళ్లి పిల్లల్ని తీసుకురండి''

అతడు వెళ్లబోతూ ఆగి ''వాళ్లు నిన్ను బాగా విసిగిస్తున్నారా?'' అడిగాడు.

''ఈ విషయం వాళ్లని అడగండి అందామె వంటగదివైపు వెళుతూ.

ప్రకాష్ వెళుతున్న ఆమెవైపు అభిమానంగా చూశాడు. తరువాత కదిలి మెట్లెక్కి డాబా మీదికి వచ్చాడు. అక్కడ ఆరేళ్ల బాబు పక్కడాబా మీద పిల్లలు గాలి పటం ఎగరవేయడం ఆసక్తిగా చూస్తున్నాడు. ఎనిమిదేళ్ల పాప మాత్రం దిగులుగా కూర్చుని ఒళ్లో చేతులుంచుకుని ఉంది. కూతుర్ని అలా చూడగానే ప్రకాష్ మనసు ద్రవించింది. భారతి ఎత్తి చూపిన-తన పొరపాటు గుర్తొచ్చిందతడికి.

పాప తండ్రిని చూసింది. తలదించుకుంది.

''అంజూ'' ఆప్యాయంగా పిలిచాడు దగ్గరికి వస్తూ.

పాప తలెత్తి చూడలేదు. బాబు తండ్రి కంఠం విని వెనక్కి తిరిగి చూశాడు. అంతే ఒక్క ఉదుటున వచ్చి కూతురి దగ్గర మోకాలు మీద కూర్చున్న తండ్రి మెడని కౌగలించుకుంటూ ''డాడీ...'' అన్నాడు.

''అంజూ! కోపం వచ్చిందా తల్లీ?'' ఓ చెయ్యి కొడుకుచుట్టూ వేసి రెండో చేత్తో కూతురి తలనిమురుతూ అడిగాడతడు.

పాప కళ్లల్లో నీళ్లు తిరిగాయి. ఉక్రోషంగా తలెత్తి చూస్తూ... ''మరి... మరి నువ్వు రాగానే మా దగ్గరికి రాలేదుగా?'' అంది.

ప్రకాష్ స్థాణువయ్యాడు. ఈ సమాజం తాలూకూ అనేకానేక కోణాల్లో ఓ కోణాన్ని అతడు కొత్తగా గమనించగలిగాడు. ఆ కోణంలోంచి కనబడే సమాజం చాలా చెడ్డది. తల్లి లేని పిల్లల్ని చూసి జాలితో అయ్యో... పాపం అనే లోకం సవతితల్లి సంరక్షణలోకి వచ్చిన పిల్లల్ని చూసి కూడా అయ్యోపాపం అనే సానుభూతిగా





నిట్టూరుస్తుంది. ఈ సానుభూతే స్లోపాయిజన్‌లా ఇటు పిల్లల్నీ అటు ఆ కొత్త తల్లినీ చుట్టుముట్టి వాళ్ల జీవితాల్ని నరకప్రాయం చేస్తుంది. ఈ లోకం ఎంత మూర్ఖమైనది.

"మరేం డాడీ... భారతి నన్ను అక్కనీ కొట్టమని చెప్పిందా నీతో?" బాబు అమాయకంగా అడిగిన ఆ ప్రశ్న అతణ్ణి నిశ్చేష్టుడిని చేసింది.

భారతి...

ఈ కొత్త అమ్మని పిల్లలు తల్లిగా గుర్తించడంలేదు. తండ్రి ఈకొత్త అమ్మ ఆడించినట్టు ఆడే బొమ్మ అనే భావాన్ని ఎవరో వీళ్లల్లో నాటారు. కడుపులోనుంచి తన్నుకు వచ్చిన ఆగ్రహాన్ని అతి ప్రయత్నం మీద అణచి వేసుకుంటూ "ఎవరు చెప్పారు నీకు" అడిగాడు.

"మరేమో అంజూ చెప్పిందిగా" అక్కవైపు చూపిస్తూ చెప్పాడు.

"నీకీ విషయం ఎవరు చెప్పారు అంజూ" కఠినంగా అడిగాడతడు.

అంతమాత్రానికే పాప బావురుమని ఏడ్చేస్తూ- "రాజీ వాళ్లమమ్మీ చెప్పింది" అంది.

చటుక్కున పాపని దగ్గరికి తీసుకుంటూ- "తప్పమ్మా... వాళ్లందరి మాటలూ నమ్మకూడదు. పోనీ భారతి మిమ్మల్ని విసుక్కుందా? తిట్టిందా?"అండిగాడు.

వెక్కుతూ తల అడ్డంగా తిప్పింది.

"భారతి మంచిదమ్మా... చూడూ... మీ మమ్మీ పోయాక మనం ఎంత ఇబ్బంది పడ్డాం

మీ మమ్మీ ఉన్నప్పుడు బావుందా? లేక చనిపోయాకబావుందా మనకి?"

తల్లి గుర్తు రావడంతో దుఃఖం అధికంకాగా- "మమ్మీ ఉన్నప్పుడే బావుంది డాడీ. మమ్మీ పోయాక ఏంబాలేదు" పూడిపోతూన్న కంఠంతో చెప్పింది.

అక్క ఏడుస్తూంటే బాబుకీ ఏడుపొచ్చింది.

మెడమీద కొడుకు కన్నీళ్లు...

ఛాతీమీద కూతురి కన్నీళ్లు...

ప్రకాష్ కదిలిపోయాడు...

తనని తాను సంభాళించుకుంటూ "ఏడవకు అంజూ... అజిత్ నువ్వు కూడా. అమ్మ పోయాక చాలా రోజులు మనం ఏడ్చాం. ఎంత బాధ పడ్డాం? ఓ రెండు నెలలు అత్తయ్య మన దగ్గరుంది. ఆ తరువాత ఎన్ని ఇబ్బందులు పడ్డాం? నువ్వే ఆలోచించు. ఈ రాజీ వాళ్ల అమ్మ అప్పుడు మనకేదయినా సాయపడిందా? ఒక్కరోజు నేను ఆఫీసునుండి రావడం ఆలస్యం అయితే కనీసం కాఫీ అయినా లేక బయటే కూర్చునే వాళ్లు కదూ మీరు?"

అవునన్నట్టు తలూపింది పాప.

"ఒక్కో రాత్రి నాకు ఓపిక లేకపోతే వంటచేసుకోక పాలూ, బ్రెడ్డూ తిని పడుకునే వాళ్ళం కాదూ?"

"అవును డాడీ.."

"అర్ధరాత్రి లేచికూర్చుని అజిత్ ఆకలి అని ఏడ్చేవాడు కదూ?"

"అవును"

"అప్పుడు ఈ రాజీవాళ్ల అమ్మ మనల్నేమయినా ఆదుకుందా?"

"వూహూం..."

"కాన్వెంట్ కెళ్లేప్పుడు కనీసం నీకు జడవేసేదా?"

"లేదు డాడీ! నాలుగురోజులు వేసి తరువాత్తరువాత విసుక్కుందనికదూ నువ్వు నాకు బాబ్డ్‌హేర్ చేయించావు?" అంది పాప!

"చూడు మరి! వీళ్లంతా మంచివాళ్లు కాదమ్మా! మనం బాధపడుతుంటే ఆదుకోరు. మనం సంతోషంగా వుంటే చూడలేరు. ఈ ఇబ్బందులన్నీ పడలేకేగదూ ఈ అమ్మని తీసుకొచ్చాను"

"నువ్వు... ఈ భారతి చెప్పినట్టేవింటావా డాడీ?"

బాబు శ్రద్ధగా తండ్రీఅక్కల సంభాషణ వింటున్నాడు.

"చెప్పు! అమ్మని అలా పేరుతో పిలవచ్చా? రాజీ వాళ్ల అమ్మని అలా పిలుస్తుందా?"

"పిలవదు"

"ఇంకా నీ ఫ్రెండ్స్ ఎవరైనా పిలుస్తారా?"

పాప సమాధానం చెప్పలేదు.

"పోనీండి! వాళ్లకెలా పిలవాలనిపిస్తే అలా పిలవనీండి"!

ముగ్గురూ తలతిప్పి చూశారు. భారతి ట్రేలో కాఫీకప్పులతో వచ్చింది. ట్రే కిందవుంచి తను కూర్చుని కప్పు అందిస్తూ "వాళ్లకెలా ఇష్టమైతే అలా పిలుస్తారు. బలవంతం చెయ్యవద్దు" అంది.

"అంజూ, తీసుకోమ్మా" కప్పు తీసి అందించింది.

పాప కప్పు అందుకుని తలొంచుకుని కూర్చుంది.

"బాబూ! ఇలా రామ్మా! నీకు కప్పుతో కాఫీతాగడం ఇష్టంకదూ?" నవ్వుతూఅడిగింది భారతి.

బాబు సిగ్గుగా నవ్వాడు. తండ్రిని వదిలి రాలేదు.

"నాదగ్గరికి రాకుంటే పోన్లే! ఇదో కప్పు తీసుకో..." అంటూ అందించింది.

బాబు కాఫీమీద ధ్యాసలేక ఆసక్తిగా గాలిపటాన్ని చూస్తూ కప్పు సరిగా పట్టుకోకపోవడంతో జారకొట్టుకున్నాడు. కప్పు బద్దలైంది. ఆ ఆలోచనల్లో వున్న మిగతా ముగ్గురూ ఉలిక్కిపడ్డారు. కప్పు పగిలిపోవడంతో బాబు బిక్కమొహంవేసి బద్దలైన కప్పువంకా, భారతివంకా చూడసాగాడు. ప్రకాష్ వాడినే గమనిస్తున్నాడు. పాప భయంగా తమ్ముడినీ, భారతినీ మార్చి మార్చి చూడసాగింది. అప్పుడెప్పుడో ఓ సారి ఇలాగే తను కప్పు బద్దలుకొడితే తల్లి తన వీపుమీద రెండు అంటించడం గుర్తువచ్చింది ఆ అమ్మాయికి. ఆ తరువాత గ్లాసులో తప్ప కాఫీ ఇచ్చేదికాదు తల్లి.

ఇప్పుడు తమ్ముడిని భారతి కొడుతుందని భావించి భయంగా చూడసాగింది పాప. పాపలోని భయాన్ని ఇటు భారతీ అటు ప్రకాష్ ఇద్దరూ గమనించారు. తనవైపు భయంగా ఇంతలేసి కళ్లతో చూస్తున్న బాబుని చూసి భారతి చల్లని చిరునవ్వు నవ్వింది.

"పోతే పోన్లే. నాతో రామ్మా బాబూ. ఇంకో కప్పుతో కాఫీ ఇస్తానుగా" అంది.

బాబు నమ్మలేనట్లు చూశాడు. భారతి లేచింది. కానీ, బాబు ఆమెతో రాలేదు. తనే కిందకి వెళ్లి ఇంకో కప్పుతో కాఫీతెచ్చింది. బాబు మొహం ఆనందంతో విప్పారింది.

కప్పు వాడికి అందించి భర్తతో "మీరూ పిల్లలూ త్వరగా తయారుకావాలి. ఈ వీధి పిల్లలంతా సర్కస్‌కి వెళుతున్నారు వీళ్లనీ తీసుకెళ్లండి" అంది.

"అలాగే! నువ్వూ రావాలి" అన్నాడు అతడు.

"వూహూం... నాకు ఇంకా వంటింట్లో పని పూర్తికాలేదు. పిల్లల్ని తయారుచేసి మీతో పంపుతాను" అంది. తరువాత తను అక్కడి నుండి వెళ్లిపోయింది.

"డాడీ! సర్కస్‌కి వెళదామా?" పాప సంబరంగా అడిగింది.

"వెళ్దాం డాడీ" బాబు తండ్రి మెడని వాటేసుకున్నాడు.

"తప్పక వెళదాం నాన్నా" అని "చూశారా? భారతి మంచిదా, కాదా?" అడిగాడు.

పాప మాట్లాడలేదు.

"బోల్డు మంచిది డాడీ" అన్నాడు బాబు.

ముగ్గురూ కిందకి వచ్చారు.

"స్నానం చేయిస్తాను రండి" భారతి పిల్లల్ని పిలిచింది.

పాప మౌనంగా బాత్‌రూమ్‌లోకి వెళ్లిపోయింది టవల్ తీసుకుని. నిముషమైనా కాకముందే తిరిగివచ్చింది. ఒంటిమీద సబ్బునురగకూడా సరిగా పోలేదు. వారంరోజుల్నుండి ఇదే పద్ధతి. ఉదయంపూట స్నానం పనిమనిషి చేయిస్తుంది.

"బాబూ! స్నానం చేయిస్తాను వస్తావా? వద్దా"? అడిగింది భారతి.

తలూపాడు వస్తానన్నట్లు! ఇదే మొదటిసారి! భారతి వాడికి స్నానం చేయించి వచ్చేసరికి పాప గౌనువేసుకుని నిలబడితే తండ్రి తలదువ్వి పౌడర్ వేస్తున్నాడు.

"ఇక మీరు వెళ్లి స్నానంచేసిరండి" అంది భారతి.

ప్రకాష్ వెళ్లిపోయాడు. అతడికి ఓ




విషయం అర్థమైంది. కొస్త ఊహ తెలిసిన పాప భారతితో కలిసిపోలేకపోతోంది. ఈ కొత్తతల్లి చాలా మంచిది అన్న నమ్మకం తనకి కుదరడంలేదు. పాపకంటే రెండేళ్లు చిన్నవాడైన బాబుకి ఎవరైలా చెబితే అలా వినడం, చెయ్యడంమాత్రమే తెలుసు. పాపనికూడా భారతి చాలా త్వరగా మాలిమి చేసుకోగలదన్న నమ్మకముంది అతడికి.

"ఏమిటి అంజూ ఆ ఫ్రాకు? బయటికి వెళ్లేటప్పుడుకూడా ఎప్పుడూ వేసుకునేదేనా? ఈ కొత్తఫ్రాకు వేసుకో" అంటూ బీరువానుంచి సరికొత్త ఫ్రాకు తీసి ఇచ్చింది భారతి.

పాప కళ్లు మెరిశాయి. అందుకుని వేసుకుంది. భారతివైపు చూడలేదు, మాట్లాడలేదు. తను అటూ ఇటూ తిరిగివున్నప్పుడు పాప తననే గమనిస్తూండడం భారతి గమనించింది.

ప్రకాష్ వచ్చి అడిగాడు కిచెన్‌లో వున్న భారతిని "నువ్వెందుకు రావడంలేదు భారతీ? వంటరాలేదన్నది సాకుమాత్రమే కదూ?"

ఆమె తలూపింది "కొత్త అమ్మ నాన్ననుండి తమని విడదీసే చెడ్డవ్యక్తి అన్న భావం పిల్లల్లోంచి పోవాలి. ముఖ్యంగా పాపలోంచి. చనిపోయిన అమ్మలాగే ఈ అమ్మకూడా నాన్నతో తమని ఎక్కడికైనా పంపగలదు. తమకి ఇష్టమైన ఏ విషయాన్నీ కాదనదు అన్న నమ్మకం కలగాలి. నేను మరోసారి వస్తాను. వాళ్లని తీసుకుని మీరు వెళ్లండి" అంది.

అతడు ఆరాధనగా ఆమెవైపు చూస్తూ "రెండోపెళ్లి భర్తవల్ల కొన్ని సుఖాలకి దూరంకావలసి వుంటుందన్న విషయం నీకు ఇప్పటికే గ్రహింపుకు వచ్చివుంటుంది. అవునా?" అడిగాడు.

ఆమె మందలింపుగా చూసింది "ఈ జీవితంలో వుండే సాధకబాధకాలేమిటో తెలిసి కోరికోరి చేసుకున్న పెళ్లి ఇది. ఎంతో ఇష్టంగా ఎన్నుకున్న జీవితం. నేను నడుస్తూన్న బాటలో ముళ్లు ఎదురైనా ఏరిపారవేయగలిగిన చాకచక్యం, నేర్పు నాకు వున్నాయి. ఏమిటీ? సర్కస్‌కి మీతో రాలేకపోవడమేనా సుఖాలకి దూరంకావడం అంటే?" అంటూ నవ్వింది.

"భారతీ! నువ్వెంత మంచిదానివి?"

"ఆ(... అదే... రెండో పెళ్లాన్ని మీ మగవాళ్లు నెత్తికెక్కించుకోవడం ఇదే పద్ధతిలో".

"మంచిని మంచి అనకూడదన్నమాట?"

అనవచ్చు! మీలో మీరు అనుకోండి. మాటల్లో పదేపదే కృతజ్ఞతని వ్యక్తపరచనవసరంలేదు. నా ఈ మంచితనం వెనక మరోరూపం ఏదైనా వుందేమోనన్నదికూడా గమనిస్తూండాలి మీరు. ఈ దృష్టిలేకనే చాలామంది మగవాళ్లు మళ్లీ పెళ్లిచేసుకున్నప్పుడు ఇటు భార్యకీ అటు పిల్లలకీ మధ్య నలిగిపోతూంటారు" హెచ్చరికగా అందామె.

* * *

"భారతిగారు ! ఏంచేస్తున్నారు"

భారతి వంటగదిలోంచి బయటికి వచ్చింది. అరవింద నిలబడివుంది.

"రండి" చిరునవ్వుతో ఆహ్వానించింది.

అరవింద వచ్చి కూర్చుంది.

"ఇప్పుడే వస్తాను" అంటూ మళ్లీ లోపలికివచ్చి కప్పు కాఫీ కలుపుకువచ్చింది భారతి.

భారతి తనకి అలా మర్యాదచేయడం అరవిందకి చాలా సంతృప్తిని కలిగించింది.

"మీవారూ, పిల్లలూ కనిపించరేం?" అడిగింది అరవింద.

"పిల్లలు వాళ్ల నాన్నతో సర్కస్‌కి వెళ్లారు" చెప్పింది.

అరవింద చాలా ఆశ్చర్యంగా చూసింది. "ఏమిటి ... సర్కస్‌కా?" అడిగింది.

"అవును. ఏం ... ఎందుకు అంతలా ఆశ్చర్యపోతున్నారు?"

"ఆశ్చర్యంగాదా మరి? సుజాత వున్నప్పుడు పిల్లల్ని తను తీసుకువెళ్ళాల్సిందే తప్ప సినిమాకిగానీ, షికారుకిగానీ ప్రకాష్‌గారు ఎప్పుడూగానీ తీసుకువెళ్ళేవారే కాదు" అంది.

"అలాగా?" అని ఊరుకుంది భారతి.

ఇది కొత్త విషయమే భారతికి. అయినా ఆమె లేనిపోని ఆసక్తి ప్రదర్శించదలచుకోలేదు.

"మరి మీరు వెళ్ళలేదేమండీ?"

"నాకు ఇంట్లో పని పూర్తిగాలేదు. పిల్లలు

నరదావడుతున్నారు. వాళ్ళు ముగ్గురినీ వెళ్ళ మన్నాను''

"సెకెండ్‌షోకి వెళ్లవచ్చుగదా?"

"పిల్లలు నిద్రకి ఆగలేరు అరవిందగారూ"

అరవిందకి ఇంకేం మాట్లాడాలో తోచలేదు. భర్తనీ, సవతిపిల్లల్నీ ఇలా బయటికి పంపించి వంటగదిలో నిమ్మళంగా పనిచేసుకుంటూ కూర్చున్న సవత్తల్లిని చూడటం ఇదే మొదటిసారి ఆమెకు.

"ఎంతైనా పెళ్లిఅయిన తొలి మలిరోజుల్లో ఇలా పిల్లలు వుండడం భార్యాభర్తల ఏకాంతానికి భంగం సుమండీ" ఓరగా చూస్తూ నవ్వింది అరవింద.

ఆమె వూహించినట్టు సిగ్గుపడుతూ నవ్వలేదు భారతి. "ఏకాంతానికీ, పిల్లలకీ సంబంధం ఏముంది? చిన్నపిల్లలు పువ్వుల్లాంటివాళ్లు. వారి ఉనికి మనసుకి ఆనందమే గానీ వాళ్లని ఆనందానికి ఆటంకంగా భావించడం చాలా తప్పు. అరవిందగారూ" కాస్త సీరియస్‌గా అంది ఈ మాటని.

ఇక ఏంమాట్లాడాలో అరవిందకి తోచలేదు. ప్రకాష్ కుటుంబం గత రెండు సంవత్సరాలుగా తెలుసు అరవిందకి. సుజాతతో కాస్త స్నేహం కూడా వుండేదామెకి. ఇద్దరి పిల్లలూ స్నేహితులు కావడంతో తరచూ ఒకరింటికి ఒకరు రాకపోకలు సాగించేవారు. దాదాపు ఏడాది క్రితం సుజాత హార్ట్ఎటాక్‌తో పోయాక ప్రకాష్ పిల్లలతో నానాఅవస్థలూ పడ్డాడు. చివరికి పెళ్లిచేసుకోవాలన్న నిర్ణయానికి వచ్చినప్పుడు అరవింద తన చెల్లెల్ని అతడికి ఇవ్వడానికి ప్రయత్నించింది.

ఏ కారణంచేతనోగానీ ప్రకాష్ ఇష్టపడలేదు. ఆ తరువాత అతడు భారతిని పెళ్లిచేసుకుని తీసుకురావడం జరిగింది. ప్రకాష్‌కి తల్లిదండ్రులు సంపాదించి ఇచ్చిపోయిన స్థిరాస్థి ఎంతో కొంత పల్లెలో వుంది. సొంత ఇల్లుంది. అతడు ఇంజనీరు. మనిషి అందగాడు. వయసు ఎక్కువకాదు. కట్నప్రసక్తిలేని ఈ సంబంధం తన చెల్లెలికి కుదర్చవచ్చని ఎంతో ఆశపడ్డ అరవింద ఆశలు నిరాశలయ్యాయి.

అతడు పెళ్లిచేసుకున్న భారతి పిల్లల్ని ఇంత బాగా చూసుకుంటుందనుకోలేదు.

"మీరేం చదువుకున్నారన్నారూ?"

"ఎమ్మే"

"మీ వయసు ఎంతండీ?"

"ఆడవాళ్ల వయసు అడగరాదని సాటి ఆడవాళ్లయిన మీకు తెలీదా?" అంటూ నవ్వేసి "మావారి వయసుకీ, నా వయసుకీ గణనీయమైన తేడా ఏమీలేదులెండి" కాస్త అల్లరిగా అంది భారతి.

అరవింద మొహం ముడుచుకుంది. అయినా మళ్లీ నవ్వు తెచ్చిపెట్టుకుంటూ "అవున్లే అతడికి ఇలా రెండోపెళ్లి రాసిపెట్టివుంది గానీ ఏమంత వయసుందనీ? ముప్ఫయిఒకటో రెండో వుంటాయి. చాలా చిన్నవయసులోనే చదువు పూర్తయి కాకముందే మొదటి పెళ్లయిందట. మీకు తెలుసా? సుజాతని అతడు కోరికోరి పెళ్లిచేసుకున్నాడట. వాళ్ల వాళ్లకి పెద్దగా ఇష్టంలేదట" అరవింద రహస్యం చెప్పినట్టుగా చెబుతూంటే-

"నాకెందుకు తెలీదండీ. మీకే ఇంకా పూర్తిగా తెలిసినట్టుగా లేదు. సుజాత తల్లిదండ్రులూ, తన తల్లిదండ్రులూ ఒప్పుకోకపోవడంతో ప్రకాష్, ఆమె రహస్యంగా పారిపోయి పెళ్లిచేసుకున్నారట. అప్పటికి సుజాత మైనర్ కావటంతో మైనారిటీ తీరినదాకా మూడునెలలపాటు స్నేహితుల సాయంతో అజ్ఞాతంలో వుండి తరువాత బయటికి వచ్చి మళ్లీ రిజిస్టర్ మేరేజ్ కూడా చేసుకున్నారట. సుజాత తండ్రే ప్రకాష్‌కి వెంటనే ఉద్యోగం వచ్చేందుకు సహాయపడ్డారట. సుజాత మీకివన్నీ చెప్పలేదా?" ఆశ్చర్యం ప్రకటించింది భారతి.

అరవింద తెల్లబోయి చూసింది. నిజానికి ఇన్ని విశేషాలు ఆమెకి తెలీవు. "లేదు. సుజాత నాకు చెప్పలేదు. చాలా గోప్యమైన మనిషిలెండి. ఇంటిగుట్టు బయటికి పొక్కనిచ్చేదికాదు. అవునూ. ఈ విషయాలన్నీ మీకెవరు చెప్పారు? ప్రకాష్‌గారి అక్కా?" ఆత్రుతగా అడిగింది.

"కాదు. అతనే చెప్పాడు"

అరవింద ఇక ఏంమాట్లాడాలో తోచక "చాలా చిత్రమైన మనిషి. మొన్నటిదాకా తనసలు పెళ్లే చేసుకోడేమో అనుకునేవాళ్లం




మేమంతా'' అంది.

''తప్పదుకదండీ. పోయినవాళ్లకోసం వగస్తూ కూర్చుంటే ఉన్నవాళ్ల పరిస్థితి ఏమిటి? సుజాత ఎలాగూ తిరిగిరాదు. పిల్లలకి తల్లీ అతనికి భార్యా అవసరమే. కాదంటారా?''

అరవింద వెర్రిగా తలూపింది.

కాసేపాగి అడిగింది ''ప్రకాష్‌కి కట్నం ఏమాత్రం ఇచ్చారు?''

''మా పెళ్లిలో కట్నకానుకల ప్రసక్తి లేదు''

భారతి ఆమె అడగని వివరాలుకూడా చెప్పుకొచ్చింది. ''మానాన్నగారు బిజినెస్ చేస్తారు. బాగా సంపాదిస్తారు. సొంతిల్లుంది విజయవాడలో. నేనే పెద్దదాన్ని మా నాన్నగారి సంతానంలో. మిగతా ముగ్గురూ తమ్ముళ్లు. ఒకడు ఇంజనీరింగ్ చదువుతున్నాడు. చిన్నతమ్ముళ్లిద్దరూ తొమ్మిది. పది క్లాసుల్లో వున్నారు''

ఇక ఏం అడగాలో ఏం మాట్లాడాలో అరవిందకి బొత్తిగా తోచలేదు. ఆమెకి భారతి ఓ పజిల్‌లా చాలా చిత్రంగా కనిపించింది. ముళ్లమీద కూర్చున్నట్టు కాసేపు కూర్చుని ''ఇక వస్తాను! మీరోసారి మా ఇంటికి రండి'' అంటూ లేచి వెళ్లిపోయింది.

భారతి నవ్వుకుంది. మళ్లీ వంటగదిలోకి వచ్చి పనిలో నిమగ్నమైన భారతి మనసు అప్రయత్నంగా గతంలోకి తొంగిచూసింది.



''భారతీ! మీ నాన్నకి పెళ్లటగా?''

''..............''

''నీకు కొత్త అమ్మ వస్తుందన్నమాట?''

''........''

''అమ్మ కాదు! పిన్ని! కదే భారతీ?''

''..........''

''సవతి అమ్మ! బాగా కష్టాలొస్తాయే పాపం నీకు! మన సౌందర్యవాళ్ల పిన్నిచూడు! దాన్ని సరిగానే చూడదు...''

''...........'' భారతి మాట్లాడలేదు. ఎవరి ప్రశ్నలకీ సమాధానం చెప్పలేదు. పదమూడేళ్ల ఆ అమ్మాయి మనసులో దిగులూ.... భయం.

''భారతీ! మీనాన్న ఈ ఉదయం బయలుదేరి వెళ్లాడటగా? రేపు ఈసరికి సవత్తల్లి ఇంట్లో వుంటుందన్నమాట? ఇంతకీ మీరు దురదృష్టవంతులు. సవత్తల్లి చేతిలో మీకెలా రాసిపెట్టి వుందో?'' పక్కింటి పిన్నిగారి సానుభూతి.

''..........''

''నిజమేగదూ వదినా! అయినా దురదృష్టం కాకపోతే బంగారంలాంటి సంసారమూ, ముత్యాల్లాంటి బిడ్డలూ, అనుకూలుడైన భర్త...! అకాల మృత్యువువచ్చి రాధని పొట్టన పెట్టుకుంది. ఈ వచ్చే మహాతల్లి ఎలాంటిదో? ఈ బిడ్డల్ని ఏమాత్రం ఆదరిస్తుందో?''

భారతికి ఈ మాటలూ, వ్యాఖ్యానాలూ గుర్తొస్తున్నాయి. నిద్ర పట్టడంలేదు. పక్కమీద అటూ ఇటూ పొర్లుతోంది. పక్కలో అరుంధతమ్మ చిన్నగా గుర్రుపెడుతోంది. ఆమెకి రెండోవైపు పడుకున్న చందూ హాయిగా నిద్రపోతున్నాడు.

'నాయనమ్మకి ఇంత చక్కగా నిద్రెలా పడుతుందోగదా?' అనుకుంది భారతి.

ఈ నిద్ర పట్టకపోవడం అన్నది ఏమిటో ఆరునెలలక్రితందాకా భారతికి తెలీదు. తెలిసే వయసుకాదది. కష్టాలూ, కన్నీళ్లూ, సమస్యలూ లేని వయసు. బంగారు బాల్యం. అమ్మా నాన్నల ప్రేమ, బామ్మ గారాబం, తమ్ముడితో ఆటలూ, బడికివెళ్లి చదువుకోవడం, అమ్మ కమ్మగా వండిపెడితే తినడం.... ఇంతకుమించి మరోవిషయం గురించి తెలీదు. ఆలోచించడం తెలీదు. నిద్రలేని రాత్రులంటే ఏమిటో తెలీదు. బాధ పడడం తెలీదు. ఎప్పుడైనా బాధ, దిగులూ కలిగాయంటే అది అమ్మ కసిరినందువల్లో, నాయనమ్మతో వూరికి పంపక పోయినందువల్లో, స్కూల్లో ఏగేమ్‌లోనో ఓడిపోయినందువల్లో మాత్రమే! అప్పట్లో అవే పెద్దస

మస్యలూ, బాధలూ!

"ఇప్పటికిగా జరిగిందేముందే? ఇవేంత షాలే? అవగింజలో అర్ధభాగంకూడా కాలేదు! పోయిందికాస్తా అదృష్టవంతురాలు! ఈ ఆయనే లబలగా మొక్కుతూ మూలుగుతూ వేళకింత ఉడకేసి పెడుతున్నాను. ఇకముందుంది జర గాల్సిందంతా. వచ్చే ఆవిడ మీ నాన్నకి భార్య అవుతుంది. నాకు కోడలు అవుతుంది. మీకు తల్లికాగలదా? రక్తసంబంధం అయినవాళ్ళ పిల్లకూడా కాదు. ఎవరో పరాయిపిల్ల! మీ మొహాన ఎలా రాసివుందోగదా?" అంటూ కళ్ళనీళ్లు పెట్టు కుంది ఈ సాయంత్రం నాయనమ్మ.

నాయనమ్మ మనసు చాలా గట్టిదంటారు. అమ్మ పోయినప్పుడుమాత్రం ఏడ్చింది. మధ్యలో నాన్నని మళ్లీ పెళ్లిచేసుకోమంటూ కూడా ఏడ్చింది. మళ్లీ ఇప్పుడు. నిజంగా వచ్చే ఆవిడ అంత చెడ్డదా? ఆవిడ మంచిదైతే కాదు... నాన్నలు మళ్ళీ పెళ్ళిచేసుకుంటే వచ్చే అమ్మ లంతా ఇంతేనట. పిల్లల్ని సరిగా చూడరు. తిడతారట, కొడతారట.

ఎందుకలా?

హఠాత్తుగా దుఃఖం వచ్చింది భారతికి. బల వంతాన దిగమింగుకుంది. తను ఏడ్చినా ఏడి స్తే నాయనమ్మ తిడుతుంది.

"ఎందుకు ఏడుస్తున్నావు" అని అడుగు తుంది.

విషయం చెబితే నాయనమ్మ మాట్లాడే మాటలు వింటే తనకి ఇంకా భయం వేస్తుంది.

అమ్మ...

ఎంతమంచిది?

"మంచి వాళ్లకి ఆయుష్షు చాలాతక్కువ. దేవుడు చాలా త్వరగా తీసుకెళ్తాడు" అంటుంది నాయనమ్మ.

అమ్మ ఎప్పుడూ నవ్వుతూ ఉండేది. ఎంతో కోపం వస్తే గానీ విసుక్కునేదికాదు. "పిల్లల్ని మరీ గారాబం చేసి పాడుచేస్తున్నావు" అంటూ నాయనమ్మే అమ్మని కేకలు వేస్తూండేది.

అలాంటి అమ్మ...

ఒక్కరోజు కూడా తననీ తమ్ముణ్ణీ వదిలి



వుండలేని అమ్మ ఇప్పుడెలా వెళ్లి పోయింది? ఆ రోజు...

నాయనమ్మ పురాణం వినడానికి గుళ్లోకి వెళ్లింది. నాన్న ఇంకా ఇంటికి రాలేదు. తనూ, చందూ వెన్నెట్లో పిల్లలతో కలిసి ఆటలాడుకుంటూన్నా రు.

వెన్నెలకుప్పలు....

దాదాపు ఎనిమిదిన్నర దాకా అలా ఆడు కుంటూనే ఉన్నారు. గుళ్లో నుండి తిరిగి వచ్చిన నాయనమ్మ కేకలు వేసినదాకా ఇంటి ధ్యాసేలేదు. ఆకలి సంగతి గుర్తేరాలేదు.

"బుద్ధిలేని పిల్లల్లారా... భయమూ భక్తీ ఉండనక్కరలా? మీ అమ్మకి బొత్తిగా పిల్లల పట్ల శ్రద్ధ లేకుండా పోయింది. పట్టించుకో వటం మానేసింది. ముసలిముండ ఒకటి కా ముకుని ఉందిలే అన్న నిర్లక్ష్యం. రోజురోజుకీ పెంకెల్లాగా తయారవుతున్నారు. పదండి... పదండి... మీ నాన్న రావాలి. మీ వీపులు పట్లేయిస్తాను" అంటూ తరుముకొస్తే అమ్మ వెనక నక్కడం కోసం వేగంగా ఇంట్లోకి పరుగె త్తారు తనూ చందూ.

"రాధా... రాధా..." నాయనమ్మ వెనకనే కేక లు పెడుతూ వచ్చింది. తలుపులు బార్లా తీసి ఉన్నాయి. అమ్మ పలకలేదు. వంటగదిలో దేవుడి గదిలో లేదు. పెరట్లో కూడా లేదు.

"రాధమ్మా... పిల్లల్ని వీధి మీదికి పంపించి ఏమీ పట్టనట్టు కూర్చుంటావుగదే తల్లీ... తలు పులు బార్లా తీసి పెట్టావు! దొంగలొచ్చినా అంతేగదా? నేను అత్తముండంటే గౌరవం తగ్గిపోయిందే రాధమ్మా... పిల్లల్ని పెంచటం ఇలాగేనటే తల్లీ..." మంగళహారతులిస్తూన్న నాయనమ్మ దగ్గరికి పరుగెత్తుకు వస్తూ- "నా యనమ్మా... అమ్మ ఇంట్లో ఎక్కడా కనబడలే దు" దిగులుగానూ ఆశ్చర్యంగానూ అంది తను.

నాయనమ్మకీ ఆశ్చర్యం కలిగింది "ఎక్కడి కి వెళుతుందే? నాకు మాట మాత్రం చెప్ప కుండా ఇల్లు కదిలే పిల్లకాదే" అంటూ ఇల్లంతా వెదికింది.

పెరట్లో గాలించింది. అమ్మ కనబడలేదు. నాయనమ్మలో ఒంగారు మొదలయింది. గేటు దగ్గరికి వెళ్లి ఇరుగింటి అంబుజమ్మనీ, పొరు గింటి పార్వతినీ కేకవేసి "మా కోడలు

వచ్చిందా?'' అని అడిగింది.

''మీ కోడలా? అయ్యోరామా... ఇల్లు కదులుతుందా? ఎంత సేపూ ఈ గోడ దగ్గర నిలబడి మాట్లాడాల్సిందే గానీ నెలకోసారైనా గుమ్మందాటి ఇవతలికి వస్తుందా?'' అంటూ పురాణం విప్పింది అంబుజమ్మ. ''సాయంత్రంనుంచి ఇంటికి బంధువులొచ్చి పనిలో వున్నానమ్మా. మీ కోడల్ని మధ్యాహ్నం తరువాత చూడలేదు. ఇంతకీ ఏమయింది?''

నాయనమ్మ విషయం చెప్పింది.

''పార్వతికూడా రెండు గంటల క్రితం నాతో మాట్లాడిందండీ పిన్నిగారూ... ఈ గోడదగ్గరే నిలబడి దీపారాధన చేయాలంటూ వెళ్లింది. ఇంతలో ఏమయింది? తలుపు తీసిపెట్టి ఎక్కడికి వెళ్లిందబ్బా?'' ఖంగారుపడింది.

నాయనమ్మ ఖంగారు జాస్తయింది. ఇరుగూ పొరుగూ వచ్చిచేరారు. తనకి ఈ హడావుడి అంతా చూస్తుంటే ఏడుపొచ్చింది. చందూ అప్పటికే బెదిరిపోయి ఏడవడం ప్రారంభించాడు. ఇంతలో నాన్న వచ్చాడు. విషయం విని హడలిపోయాడు.

''ఎక్కడికి వెళ్లింది? బయటికి వెళ్లే మనిషికాదే? అదీ ఎవరితో చెప్పకుండా?'' ఎవరి నోటంట విన్నా ఇదే మాట.

''అత్తా కోడళ్ల మధ్య గానీ భార్యభర్తల మధ్యగానీ ఏవైనా గొడవలు వచ్చాయా?'' ఎవరో అడిగారు.

''ఛ...ఛ... అదేమీ కాదు. నన్ను పెందరాళే ఇంటికి రమ్మంది ఈ రోజు. సెకండ్ షోకి వెళ్లాలని అంది.'' నాన్న కంఠం వణికింది.

ఎవరికో అనుమానం వచ్చింది.

''పెరట్లో బావిలో చూశారా? కాలుజారిందో ఏం ఖర్మో...''

ఈ మాట వినగానే నలుగురు పెరట్లో బావి వైపు పరుగు తీశారు. ఈ అనుమానం అబద్ధంకాలేదు.

అమ్మ శవమై బయటికి వచ్చింది.

నాయనమ్మ గుండెలు బాదుకుని ఏడవసాగింది.

★ ★ ★

''ఓర్నాయనో... పెరట్లో తులసి పూజచేసుకుంటున్నప్పుడు ఢబీమని శబ్దం వినిపించిందమ్మా. ఏమిటో అనుకున్నాను. రాధమ్మ తల్లికి నూకలు చెల్లిపోయాయని నేనేం కలగన్నానా?'' అంబుజమ్మ బిగ్గరగా ఏడవసాగింది.

''రాధా ... ఎంతపని చేశావు రాధా?'' నాన్న తలబాదుకోసాగాడు.

తన సంగతీ, తమ్ముడు సంగతీ చెప్పనే అక్కరలేదు. ఇంట్లోవాళ్లే కాదు అమ్మ కోసం వీధివీధి విలపించింది. అంత మంచిది అమ్మ. గుండెల్లోంచి పెల్లుబుకుతూన్న దుఃఖాన్ని అతి ప్రయత్నంమీద అణచుకుంది భారతి.

''భారతీ... నిద్రపోలేదా తల్లీ?''

భారతి ఈ ప్రశ్నకి సమాధానంగా మెల్లగా కదిలింది. ''ఇంకా నిద్రపోలేదూ?'' అరుంధతమ్మ మనవరాలిమీద చెయ్యివేస్తూ అడిగింది.

భారతి వెంటనే బదులు చెప్పలేదు.

వృద్ధ అరుంధతమ్మ అడిగింది: ''ఏం ఆలోచిస్తున్నావు తల్లీ?''

ఏం చెబుతుంది.

మదిలో మెదిలే భావాల్ని గురించి, మనసులో సుడులు తిరుగుతూన్న ఆలోచనల్ని గురించి భాషలో వ్యక్తపరచడం ఎలాగో తెలీడంలేదా అమ్మాయికి. ఆమెలో అనేకానేక సందేహాలూ, భయాలూ. మొదట దేన్ని గురించి చెప్పాలో, ఎలా చెప్పాలో తెలీడంలేదు. మనవరాలి మౌనంచూసి నిట్టూర్చింది అరుంధతమ్మ. ఆర్నెల్లక్రితందాకా భారతి చాలా ఉత్సాహంగా వుండేది. ఎప్పుడూ నవ్వుతూ వుండేది. చీటికీ మాటికీ అల్లరి చేస్తూండేది. ఏనాడైతే తల్లి అకాలమృత్యువుపాలైందో ఆ అమ్మాయిలోని చలాకీదనం, ఉత్సాహం మంత్రంవేసినట్టు మాయం అయ్యాయి.

''భయపడుతున్నావా భారతమ్మా?''

''నాయనమ్మా'' భారతి లేచి కూర్చుంది.

''ఏమిటే తల్లీ?''

''వచ్చే అమ్మ నన్నూ, చందూని బాగా చూసుకోదనికదూ చెబుతున్నావు?''

"ఏమో తల్లీ ... మీ అదృష్టం ఎలావుందో?" అరుంధతమ్మ కంటతడి పెట్టింది.

"మరయితే నాయనమ్మా - నాన్నని పెళ్లిచేసుకోమని ఎందుకు పోరావే? నువ్వుగాదూ ఇంతపని చేసింది? లేకపోతే నాన్న పెళ్లిచేసుకునేవాడా?" భారతి హఠాత్తుగా ఏడుస్తూ అంది.

అరుంధతమ్మ తెల్లబోయింది మొదట. తరువాత అనునయంగా మనవరాల్ని దగ్గరికి తీసుకుంటూ "నిజమేనే అమ్మా... నేనే మూర్తిని పోరి రెండోపెళ్లికి ఒప్పించాను. లేకపోతే ముందుజీవితం గడిచేదెలాగే? నాకు చూస్తే నాలుగు కళ్లయినాయి. మూడోకాలు రేపోమాపో చేతికి వస్తానంటోంది. ఊరు పొమ్మంటోంది, కాడు రమ్మంటోంది. మీరు చూస్తేనా కసుగాయలు. మీ నాన్న పెళ్లిచేసుకోకపోతే ఎలా? చందూకి ఓ ఇరవైఏళ్ళు వయసైనా వుండివుంటే ఇంత బాధవుండకపోను. ఓ రెండేళ్లపాటు ఎలాగో కష్టపడితే ఆ తరువాత వాడికి పెళ్లిచేసేస్తే ఏ బాధ వుండకపోను. వాడా పిల్లవెధవ. నీకా పట్టుమని పదమూడేళ్లు లేవు. ఇంట్లో ఆడదక్షత లేకపోతే ఎలాగే తల్లీ? నువ్వు ఎదిగే రోజులు. ఈ బరువు బాధ్యతలు మోయగలిగే ఓపికా, ధైర్యం నాకులేదే అమ్మా! ఈ వయసులో పాపిష్టిదేవుడు నాకెంత కష్టం తెచ్చిపెట్టాడు?" అంటూ ఏడ్చిందావిడ.

"ఈ వచ్చే అమ్మ పేరేమిటి నాయనమ్మా?"

"తెలీదు" అంది ఆవిడ. "నేనేమీ మీ నాన్నని అడగలేదు"

"ఆమెని ఇంతక్రితం నాన్న చూశాడా?"

"చూశాడే అమ్మా. పేదింటిపిల్ల. కన్నవాళ్లు పెళ్ళిచెయ్యలేకపోయారు. ఈ రెండో పెళ్లి సంబంధం కట్నకానుకలు లేకుండా కుదిరిందే మహాభాగ్యం అనుకున్నారట. పేదరికంలోనుండి వచ్చిన పిల్లయితే కాస్త భయభక్తులతో అణగిమణగి వుంటుందన్నది నా ఆశ. ఎలా జరగనుందో ఏమో..." ఆశతోనూ, అనుమానంతోనూ అంది అరుంధతమ్మ.

"ఆవిణ్ని నేనూ, తమ్ముడూ ఏమని పిలవాలి నాయనమ్మా ... అమ్మ అనా, పిన్ని అనా?"

"తననే అడుగుదాం"

"రెండో పెళ్లి అమ్మలు పిల్లల్ని ఎందుకు సరిగా చూసుకోరు నాయనమ్మా"

"తన కడుపున పుట్టిన బిడ్డలు కాదుగదే అమ్మ... అందుకే ప్రేమగా చూడరు కష్టపెడతారు"

"ఎవరైనా ఇంతేనా నాయనమ్మా?"

"అంతేనే అమ్మా... నూటికో కోటికో ఎక్కడో ఓ మహాతల్లి ఉంటుంది" చేతులెత్తి దణ్ణంపెడుతూ అంది ఆవిడ.

మర్నాడు ఉదయం సూర్యోదయం కంటే ముందుగా ఇంట్లో అడుగుపెట్టిన సవతితల్లిని చూసింది భారతి. నాయనమ్మ తన సవతితల్లిని గురించి వర్ణించి చెబుతుంది. ఆవిడ నల్లగా లావుగా పొట్టిగా ఎత్తుపళ్లతో భయంకరంగా ఉండేదట. ఆవిడ పేరు కూడా తాయారు. కానీ ఈవిడ నాన్న కొత్తగా పెళ్ళి చేసుకుని వచ్చిన ఈమె చాలా చక్కగా ఉంది. తెల్లగా, పొడవుగా, పొడవుకి తగిన లావుతో అందంగా ఉంది. పేరు కూడా బావుంది తులసి. అయితే ఈ సవతితల్లి నాయనమ్మ, పక్కింటి అంబుజమ్మ, పార్వతి వీళ్లు చెప్పినట్టు గయ్యాళితనంగా కనిపించకపోయినా తననీ తమ్ముణ్ణీ దగ్గరికి పిలవలేదు. అభిమానంగా పలకరించలేదు.

"తులసీ... వీళ్లు మన పిల్లలు" అని నాన్న చెప్పినప్పుడు ఓసారి తమ వైపు చూసి తల తిప్పుకుంది.

ఆవిడ ఇంటికి వచ్చి నాలుగు రోజులు గడచిపోయినా తనతోగానీ చందూతో గానీ అసలు మాట్లాడలేదు. నాయనమ్మతో కూడా ఆవిడ పలకరిస్తేనే తప్ప తనుగా మాట్లాడేదికాదు. నాన్నతో మాత్రం ఎక్కడో లోపలిగదిలో మాట్లాడుతున్నట్టనిపించేది.

"నా అనుమానం నిజం అయిందే తల్లీ. ఇదేమీ పిల్లల్ని ప్రేమగా చూసుకునే రకం కాదు" అంటూ కళ్ల నీళ్లు పెట్టుకుంది నాయనమ్మ.

భారతి బెదిరిపోయింది. సవతితల్లిని చూస్తేనే తప్పుకుపోవడం ప్రారంభించింది.

"పిల్లల్ని పలకరించవేం తులసీ" అని




అడుగుతూన్న భర్తతో "ఆ పిల్లలు నన్ను చూస్తేనే తప్పుకుపోతారు. వాళ్లని నేనేం దగ్గరికి తీయను" అంది.

మూర్తి తన పిల్లల్ని కేకలేసేడు.

"ప్రారంభం అయింది అప్పుడే కొత్తపెళ్లాం మాటవిని బిడ్డల్ని దండించడం" తన మాటలు పసిమనసులమీద ఎలాంటి ప్రభావాన్ని చూపుతాయో అర్థంచేసుకోలేని అరుంధతమ్మ ఇరుగు పొరుగుకి చెప్పుకుని ఏడ్చింది.

ఈమధ్య చీటికీ మాటికీ ఏడవటం ఆవిడకి అలవాటయిపోయింది. తన మాటలూ వాటి తాలూకు ప్రభావం తులసికీ, పిల్లలకీ మధ్య అంతులేని అగాధాన్ని ఏర్పరుస్తున్నాయని ఆమె తన చాదస్తంమూలంగా తెలుసుకోలేకపోయింది. జీవితంతో రాజీపడి మూర్తికి రెండోభార్యగా వచ్చిన ముప్పైఏళ్ల తులసి పదమూడేళ్ల భారతిని తొమ్మిదేళ్ల చందూని తన బిడ్డలుగా భావించడానికి మానసికంగా సంసిద్ధురాలు కాలేకపోయింది.

'దీనికి కారకులెవరు?' అన్న ప్రశ్న వేసుకుంటే ఆ ఇంట్లోని పిల్లలా.... ఆమె భర్తా... అత్తా.... బయట సమాజమా!

★ ★ ★

సర్కస్‌నుంచి ప్రకాష్ పిల్లలూ తిరిగి వచ్చారు. పిల్లలు సర్కస్‌ని ఎంతగానో ఎంజాయ్‌చేశారు. కానీ, ప్రకాష్‌మాత్రం ఎంజాయ్‌చెయ్యలేకపోయాడు. కారణం.... అతడు అనేకసార్లు ఎన్నో సర్కస్‌లు చూసివుండడంమాత్రం కాదు! ఇంటిదగ్గర తన కొత్తభార్య భారతి ఒంటరిగా వున్నదన్న ఆలోచనతో! భారతి మనస్తత్వం, వ్యక్తిత్వం అతడ్ని విపరీతంగా ఆకర్షిస్తున్నాయి. ఇరవైఅయిదురోజుల సంసారజీవితంలో ఆమెని కొద్దికొద్దిగా తెలుసుకుంటూన్నకొద్దీ తన అదృష్టానికతడు చాలా పొంగిపోతున్నాడు.

"డాడీ మన ఇల్లు వచ్చేసింది" పాప అరిచింది.

అతడు ఆలోచనలోనుంచి బయటికి వచ్చాడు! బాబు నిద్రమత్తుతో జోగుతున్నాడు. స్కూటర్ చప్పుడుకి భారతి వచ్చి తలుపుతీసింది. తూగి ముందుకి పడబోతున్న బాబుని అందుకుంది! పాప తండ్రి వెంట నిదానంగా లోపలికి వచ్చింది. భారతి అప్పటికే బాబు బట్టలుమార్చి డైనింగ్‌టేబుల్‌దగ్గర పెరుగు అన్నం తినిపిస్తోంది. బాబు మెలకువ వుండీ లేనిస్థితిలో తింటూన్నాడు. రెప్పవాల్చకుండా ఆ దృశ్యాన్ని చూశాడు ప్రకాష్. పాప కూడా! పాపకి తన తల్లి గుర్తువచ్చింది! ఇలాగే అన్నంపెట్టేది అమ్మ తనకి! పాప కళ్లల్లో నీళ్లు తిరిగాయి. బాబుని పడుకోబెట్టివచ్చి తండ్రీకూతుళ్లకి వడ్డించింది భారతి. తనూ కూర్చుంది. ప్రకాష్ మౌనంగా భోంచేస్తున్నాడు! పాపకూడా మధ్య మధ్యలో భారతివైపు చూస్తోంది! భారతి ఆలోచిస్తోంది......

ఈ ఇంట్లో ఈ నాలుగు ప్రాణులమధ్య ఈ నిశ్శబ్దం ఎన్నోరోజులు వుండకూడదు! దీన్ని బ్రద్దలుచెయ్యాలి తను! పాప మనసులో నాటబడిన అనుమానం,భయం, అయిష్టం అనే బీజాలను పెకిలించివేయాలి! అది అంత కష్టమేమీ కాదు! అంజూకి కేవలం ఎనిమిదేళ్ళుమాత్రమే! ఈ అమ్మ నాన్నని తమనుండి దూరంచేసే శత్రువు కాదు... మరణించిన తల్లి లాంటిదే అన్న విషయాన్ని తన ప్రవర్తనద్వారా పిల్లలకి అర్థంఅయ్యేలా చెయ్యాలి.

"మాట్లాడవేం భారతీ? అన్నంతోపాటు మౌనాన్నికూడా భోంచేస్తూన్నావేమిటి?" ప్రకాష్ అడిగాడు.

ఆమె నవ్వుతూ "ఈమాట పాపనికూడా అడగండి" అంది.

పాప తలెత్తి భారతివైపు చూసింది! భారతి నవ్వుతూ చూస్తోంది! పాప తలవంచుకుంది!

"అంజూ మాట్లాడవేంరా?" ప్రకాష్ అడిగాడు.

తండ్రివైపుచూసి మళ్లీ తలవంచుకుంది పాప!

"అంజూ! పెరుగు వడ్డించనామ్మా?" అడిగింది లాలనగా భారతి.

తలూపింది పాప.

పదినిముషాల తరువాత "భారతీ... పాప చిన్నది. దాని మనసులో నీపట్ల చాలా సందేహాల్నీ భయాల్నీ ఏర్పరిచారు ఈ జనాలు. నువ్వు చాలా ఓపిగ్గా కోపం తెచ్చుకోకుండా, బాధపడకుండా..." ప్రకాష్ బాధగా చెబుతూనే వున్నా

డు... ఫక్కు నవ్వింది భారతి.

అతడాగి పోయాడు.

"ఎంత అమాయకురాలండీ. లోకజ్ఞానం తెలీని పసిది అంజూ. తల్లిని కోల్పోయిన బాధనుండి ఇంకా కోలుకోనేలేదు. ఒంటరితనంతో ఉత్సాహం లేకుండా వయసుకిమించిన వేదనని అనుభవిస్తోన్న దాని మానసిక పరిస్థితిని నేను అర్థం చేసుకోలేనా? ఇలాంటి అనుభవాలతో రాటుదేలిపోయాను ప్రకాష్ నేను. ఒకనాటి నా స్థానంలో స్థితిలో అంజూ ఉంది. నాలో తన తల్లిని చూపించడం ఎలాగో నాకు తెలుసు. నేను ఇంతమాత్రానికే బాధపడతానా?" ఆమె కళ్లు చెమ్మగిల్లాయి.

అతడు ఎంతో ప్రేమగా తపనగా ఆమెను దగ్గరికి తీసుకుని పెదవులమీద గాఢంగా ముద్దు పెట్టుకున్నాడు. ఆమె ఒడి అతడికి ఆ క్షణంలో తల్లి ఒడిలా అనిపించింది. కొద్ది క్షణాలపాటు ఇద్దరూ మవునంగా ఉండిపోయారు. తరువాత ప్రకాష్ భార్య ఒడిలో నుండి కదిలి ఆమెని కౌగిలిలోకి లాక్కున్నాడు. ఆమె అతని కౌగిట్లో ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. పెళ్లయి ఇరవై అయిదురోజులు దాటినా ప్రతీ రాత్రీ కొత్తగానే అనిపిస్తోంది. అతడు ఎంతో తమకంగా ఆమె ఒళ్లంతా ముద్దులతో నింపుతున్నాడు. ఉన్నట్టుండి కలలోనుండి మేలుకున్న దానిలా అతని చేతుల్లోనుండి తప్పుకుని లేచింది భారతి.

"ఏమయింది?" మత్తుగా అడిగాడు ప్రకాష్.

"చాలాపొరపాటు జరిగిపోతోంది ప్రకాష్" అందామె.

ఆమె తనని పేరుపెట్టి పిలవడం అతడికి గమ్మత్తుగా ఉంటుంది. ప్రేమించి పెళ్లాడిన సుజాత అతణ్ణెప్పుడూ పేరుతో పిలిచేదికాదు. వయసులో షుమారు అతడి మీద భారతి ఏడినిమిదేళ్లు మాత్రమే చిన్నదిగా ఉంటుంది. చెప్పుకోదగిన వయసుభేదం లేకపోయినందువలనో పెళ్లికి ముందే కాస్త పరిచయం ఏర్పడినందువలనో ఆమె అతణ్ణి పేరుతోనే ఎక్కువగా పిలవడం జరుగుతోంది.

"పొరపాటు ఏమిటని అడగరేం?" అంది భారతి.

"ఏమిటది?"

"చిన్న పిల్లలిద్దర్ని ఒంటరిగా ఓ గదిలో వదిలేసి మనం ఇలా... నాకు చాలా సిగ్గుగా ఉంది" అందామె.

అతడి మైకం దిగిపోయింది "ఏమటీ?" అన్నాడు.

"అవును! ఈ వారంగా ఓ విధమైన మత్తులో ఉన్నట్టు నేనీ విషయం గ్రహించనే లేదు" పశ్చాత్తాప్త కంఠంతో అంది ఆమె.

ప్రకాష్ వెంటనే ఏమీ మాట్లాడలేకపోయాడు.

తరువాత అడిగాడతడు "ఏం చెయ్యాలంటావూ?"

"పిల్లల్ని మన దగ్గరే పడుకోబెట్టుకోవాలి" నెమ్మదిగా చెప్పింది భారతి.

"అలా ఎంతకాలం?"

ఆమె అతడి మొహంలోకి చూసింది. వయసు సహజమైన కోరిక,తొందరపాటు,అసంతృప్తి అతడిలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"నేను ఇక్కడికి రాకముందు పిల్లలిద్దరూ ఎక్కడ పడుకునేవాళ్లు?"

"నా దగ్గరే"

"సుజాత బ్రతికివున్నప్పుడు?"

"బాబుకి నాలుగేళ్ల వయసునుంచే పిల్లలిద్దరికీ ఒ గదిలో పడుకోవడం అలవాటు చేసింది సుజాత. తను పోయాక ఒంటరి తనాన్ని భరించలేక రాత్రిళ్లు వాళ్లదగ్గరే పడుకునేవాణ్ణి" చెబుతూంటే అతడి కంఠం విషాదంగా పలికింది.

"చూశారా... ఒంటరి తనాన్ని మీరే భరించలేకపోయినప్పుడు చిన్న పిల్లల విషయం ఏమిటి? పగలూరాత్రి కంటికి పాపలా తమని అంటిపెట్టుకుని ఉండే నాన్నని ఈ కొత్త అమ్మ వచ్చి దూరం చేసిందనే భావం వాళ్లలో కలగకూడదు. కనీసం వాళ్లు నాకు మాలిమి అయ్యేదాకా మనం నిగ్రహంగా ఉండక తప్పదు" ప్రకాష్ సమాధానానికి ఎదురుచూడకుండానే భారతి అక్కడి నుండి కదిలి ఆ గదిలో నుండి పిల్లల గదిలోకి ఉన్న తలుపుల్ని తీసుకుని లోపలికి వచ్చింది.




బెడ్‌లైట్ వెలుగులో మంచం మీద అటూ ఇటూ కదులుతోంది పాప.

''అంజూ...''

ఇంత ఎత్తున ఉలిక్కిపడి కళ్లువిప్పి చూసింది. భారతి లైటు వేసింది. పాప పక్కన కూర్చుంటూ... ''నిద్ర రావడంలేదా అమ్మా? పద వెళ్లి ఆ గదిలో పడుకుందాం'' లాలనగా అంది.

''డాడీ దగ్గరా?'' చప్పున అడిగింది పాప.

''అవును'' ఆమె చెబుతూనే ఉంది.... ఒక్క ఉదుటున మంచం దిగి పరుగెత్తుకెళ్లి తండ్రి పక్కలో దూరి అతడి కంఠాన్ని కావలించుకుంది పాప.

ప్రకాష్ కళ్లు చెమర్చాయి. కూతుర్ని గుండెల్లోకి పొదువుకున్నాడు. అంజూ స్పర్శలోనే అర్థమైంది అతడికి ఆ అమ్మాయి అనుభవిస్తున్న ఒంటరితనాన్ని గురించి. కోరికలతో కళ్లు మూసుకుపోయినట్టు ప్రవర్తించిన తన తీరు అతడికి చాలా సిగ్గుని కలిగించింది.

★ ★ ★

''పాపమ్మా! కళ్లు ఎర్రగున్నాయేటమ్మా? రాత్రి నిద్ర పట్టలేదా?''

''ఓ! బాగా నిద్రపోయాను'' హుషారుగా చెప్పింది పాప

''రాత్రి ఎక్కడ పడుకున్నావు?''

''మా డాడీదగ్గర''

''ఏటీ?'' ఆశ్చర్యం

''అవును! డాడీదగ్గర నేను....''

''మరి మీ పిన్నమ్మ?''

''ఎవరూ? భారతా? అజ్జూ భారతిదగ్గర పడుకున్నాడు. నేను మా డాడీదగ్గర పడుకున్నాను. రాత్రి నాకసలు భయం వెయ్యలేదనుకో. ఏడుపుకూడా రాలేదు గంగమ్మా! హాయిగా నిద్రపోయాను''

''రాత్రి అయనగారూ భారతమ్మా ఓమంచంమీద పడుకోలేదూ...?'' ఆశ్చర్యంగా, చిత్రంగా, ఆసక్తిగా అడుగుతున్న గంగమ్మ ఎందుకో తలెత్తిచూసి అక్కడ భారతి నిలబడివుండటం చూసి హడలిపోయింది.

భారతి కళ్లు విస్ఫులింగాలను వెదజల్లుతున్నాయి.

గంగమ్మ ఏదో అనబోయింది భయంగా... గొంతు పెగల్లేదు....

అప్రయత్నంగా విరమించుకుని తలొంచుకుని పాప చెయ్యిపట్టుకుని ''పాపమ్మా! స్నానంచేద్దుగాని రామ్మా...'' అంటూ బాత్‌రూమ్ వైపు నడిపించబోయింది.

''ఆగు'' అంది భారతి.

అతిప్రయత్నంమీద తన ఆగ్రహాన్ని అణచుకుందామె.

''క్షణంవుండు'' అంటూ లోపలికి వచ్చి బీరువాలోనుండి డబ్బుతీసి లెక్కపెట్టి తెచ్చి ''ఇదుగో నీ జీతం లెక్కచూసుకో! రేపటినుండి నువ్వు పనిలోకి రానవసరంలేదు...'' అంది.

''తప్పయిపోయిందమ్మా! బుద్ధి గడ్డితిని మీ విషయాలు...'' భయంగా, దిగులుగా ఏడుపుకంఠంతో చెప్పబోతున్న గంగమ్మని వారిస్తూ ''నువ్వేమీ చెప్పనవసరంలేదు! అది నీ నైజం! అయితే నువ్వు ఒక్కవిషయం గ్రహిస్తే మంచిది! నీకు సంబంధించని ఒకళ్ల వ్యక్తిగత విషయాల్ని రహస్యంగా తెలుసుకోవాలనుకోవడం చాలా నీచమైన విషయం! నీ ఈ చెడుఅలవాటు మూలంగా నువ్వు చాలా నష్టపోవాల్సివస్తుంది. ఈ విషయం అర్థంచేసుకో! ఇక నువ్వు వెళ్లవచ్చు! నువ్వు చెప్పుకోవాల్సిందీ, నేను వినాల్సిందీ ఏమీ లేదు...'' శాంతంగానే అయినా ఖచ్చితంగా మరోమాటకి అవకాశం ఇవ్వకుండా చెప్పి పాపవైపు తిరిగి ''అంజూ! బాత్‌రూమ్‌కి పద! నీకు ఇష్టమైతే నేను స్నానంచేయిస్తాను! లేదు అంటే నువ్వే చెయ్యి...'' అంది.

జరుగుతున్నదేమిటో అర్థంగాక తెల్లబోయి చూస్తోంది పాప. గంగమ్మ మొహం మాడ్చుకుని వెళ్లిపోయింది. భారతికి చాలా సిగ్గుకలిగింది. ఈవారంగా పాప మానసికంగా ఎంత వ్యధని అనుభవించిందో రెండుమాటలద్వారా అర్థమైపోయింది. ఆమె మనసు పాడయింది. తనెంత మూర్ఖంగా ఆలోచనలేకుండా ప్రవర్తించింది ఈ వారంరోజులుగా! అయినా ఇలాంటి విషయాల్లో ఈ సమాజం ఎంత చెడ్డది?



దాదాపు పదీ పన్నెండేళ్లనాటి గతం ఆమె కళ్లముందు కదులుతోంది.

చందూ ఆరోజంతా నిద్రపోలేదు.

"నేను నాన్న దగ్గర పడుకుంటాను..." ఒకటే గోల.

మూర్తి ఇప్పుడు పిల్లల్ని గురించి అంతగా పట్టించుకోకపోవడం అరుంధతమ్మని బాగా కష్టపెట్టింది. ఊహ తెలిసిన భారతి సవతితల్లి ఇంటికి రావడంతోనే తనకి తెలీకుండానే దూర దూరంగా వుండటం ప్రారంభించింది.

"పిల్లల్ని పట్టించుకోవేమిట్రా?" అన్న తల్లి ప్రశ్నకి...

"పట్టించుకోకపోవడం ఏమిటమ్మా? నాకు బిడ్డలమీద ప్రేమ లేదా ఏమిటి? వాళ్ళ కోసమే నేను రెండో పెళ్ళి చేసుకున్నాను. ఇప్పుడు తులసి వుందిగదా. వాళ్ల బరువు బాధ్యతల్ని తనచేతుల్లో వుంచేశాను. ఇక నేను దగ్గరుండి చూసుకోవల్సింది ఏముంది? నువ్వు కూడా అనవసరంగా హైరానపడక పిల్లల విషయంలో తులసి మీద భారంవేసి కృష్ణా రామా అనుకుంటూ వుండు" అంటూ సలహా ఇచ్చాడు.

అరుంధతమ్మ నోరావలించింది. భారతికి తండ్రి మాటలు సగం మాత్రమే అర్ధమయ్యాయి. చందూది అర్ధం చేసుసుకునే వయ



నుకాదు. తండ్రిని అంటిపెట్టుకునివుండాలను కునేవాడు. తులసి ఒక్కోసారి విసుక్కునేది. మొదట్లో తండ్రిదగ్గర పడుకోవడం కుదరలే దని గోలపెట్టాడు చందూ.

"వీడికి నువ్వు నచ్చజెప్పమ్మా" అంటూ తల్లి దగ్గర కొడుకుని వదిలేసి వెళ్లాడు మూర్తి.

తులసికి ఈ పెళ్ళి ఇష్టంలేదు. ఆమె తండ్రికి అధిక సంతానానికితోడు తాగుడు వ్యసనం కూడా వుంది. సంపాదనలో సగం తాగుడికి ఖర్చయిపోగా మిగిలింది పిల్లల కడుపు నింపడానికి బొటాబొటీగా సరిపోయేది. ఫలితంగా పిల్లలకి చదువు చెప్పించే స్థితి, పెళ్ళిళ్లు చెయ్యగలిగే స్థోమత లేకుండా పోయాయి. తండ్రి ఆరుగురు సంతానంలో రెండవ కూతురు తులసి. ఆమె అక్కకి ఉన్న ఇల్లు అమ్మి సకాలంలో పెళ్ళి చెయ్యగలిగా డామె తండ్రి. తులసికి చదువుకోవాలన్న కోరిక చాలా గాఢంగా వుండేది.

"మగపిల్లల్ని చదివించగలిగితేచాలు, నిన్ను నేను ఎక్కడ చదివించగలను?" అంటూ తండ్రి టెన్త్ క్లాసుతో ఆపివేయించి ఇంట్లో కూర్చోబెట్టాడు.

ఇక అక్కడినుండి ఆమెకి అంతా తీరికే. తల్లికి ఇంటి పనుల్లో కాస్త సాయం చేసినా మిగిలిన సమయాన్ని పుస్తకాలు చదువుతూ తండ్రికి తెలిసి ఓ సినిమా, తెలీకుండా ఓ సినిమా చూస్తూ గడుపుతూండేది. క్రమంగా ఆమె ఆలోచనలూ, ఊహలూ పెళ్లిమీదికి మళ్ళాయి. పుస్తకాల్లోని, సినిమాల్లోని జీవితాన్ని ఊహించుకోవడం ప్రారంభించింది. కాస్త ఆల స్యంగా తెలిసివచ్చింది ఆమెకి తన తండ్రి తనకి పెళ్ళిచెయ్యలేడన్న విషయం. అయినా ఆమె పెద్దగా నిరాశ చెందలేదు. తన సౌంద ర్యంపట్ల తులసికి చాలా నమ్మకం వుండేది. ఏ ఆదర్శయువకుడో తనకోసం వెదుక్కుంటూ రాకపోడని ఆమె గాఢంగా నమ్మేది.

'రంగారావు కూతురు చాలా అందంగా వుంటుందట' అని ఎవరూ చెప్పుకోలేదు.

"రంగారావు పైసా కట్నం ఇవ్వలేడు. అత డి ఇంటికి వెళ్ళడం దండగ. పిల్ల అందంగా ఉన్నంతమాత్రాన సరిపోతుందా? అందాన్ని కొరుక్కుతింటామా ఏమన్నానా? పోనీగదా పాపం అని జాలిపడి చేసుకున్నా అల్లుడు వెళ్లి ఆ ఇంట్లో రెండు పూటలు వుండటం కూడా కష్టమే. ఏం మర్యాదలు చెయ్యగలడు? ఎందు కొచ్చిన బాధ? అతడి తిప్పలేవో అతడు పడతా డు" అనుకునేవాళ్లు.

ఈ విషయం తనదాకా వచ్చినప్పుడు తు లసి చాలా కృంగిపోయేది. చూస్తూండగానే ఆమెకి పాతికేళ్ళు దాటిపోయాయి. ఆమె వెనుక ఇద్దరు చెల్లెళ్ళు పెళ్ళికి సిద్ధమయ్యా రు. వీలయినంత త్వరగా పెద్దకూతురు బరు వుబాధ్యతలు వదిలించుకోవాలన్న తాప త్రయం జాస్తయింది తండ్రికి. తులసికి వయ సు పైబడేకొద్దీ రెండో పెళ్ళి సంబంధాలు రాసాగాయి.

ఆమె తల్లిదండ్రులు ఆమెని రెండోపెళ్ళి వ్యక్తికి ఇచ్చిచెయ్యడానికి సంసిద్ధులై పోయా రు. తులసి మాత్రం ఇంకా నశించని ఆశతో తన తీవ్రవిముఖత్వాన్ని ప్రకటించింది. నాలు గైదేళ్లు గడిచిపోయాయి. ముప్పైఏళ్ళు వచ్చాయి ఆమెకి. ఆమె కన్నెగానే వుండిపో యింది.

ఆమె తండ్రి ఆమెతో "నువ్విలాగే ఇంటప డివుంటే నీ చెల్లెళ్ల పెళ్ళిళ్ళు ఎలా అవు తాయి? మొదట నువ్వు ఇల్లు కదిలిపోతే మిగతా పిల్లలకి సంబంధాలు వెదకాలి నేను. నీకు ఈ ఇల్లు వదలడం ఇష్టం లేదులా వుంది" నిష్ఠూరంగానూ, కోపంగానూ అన్నాడు.

"నీకు యువరాజులాంటి భర్తను మేం తీసుకురాలేం. నీ వెనకవాళ్లకే పాతికేళ్ళు దాటుతున్నాయి. నువ్వు మొండికేస్తే లాభంలే దు. ఏ విషయం ఖచ్చితంగా తేల్చిచెప్పు. నీకు ఇష్టంలేకపోతే పెళ్ళే మానుకోవచ్చు. మిగతా ఇద్దరి విషయం ఆలోచిస్తాం" అంది తల్లి.

తప్పనిసరిగా రెండో పెళ్ళి మగవాడ్ని ఆమె అంగీకరించాల్సివచ్చింది. వెంట వెంటనే నాలుగయిదు సంబంధాలు వచ్చాయి. చూపు లకి వచ్చిన వరుల్నిచూసి ఆమె హడలిపో యింది. ఇద్దరు నలభై ఏళ్ళకి పైబడ్డవాళ్ళు. ఇంకో వ్యక్తి అంతగా వయసులేని అవిటివాడు. ఈ మూడు సంబంధాల్ని ఆమె తిరస్క రించింది. నాలుగో సంబంధం... అతడికి




దాదాపు అరవై ఏళ్ళుంటాయి. ఇటీవలే భార్య పోయింది. బోలెడంత ఆస్థివుంది. ఒంట్లో పుట్టె డు రోగాలున్నాయి. ఈ వృద్ధుడు పెళ్ళికి సిద్ధపడింది భార్యకోసం కాదు, సంతానం కోస మూకాదు. జీవితపు చివరిదశలో విశ్వాసంగా, నమ్మకంగా సేవచేస్తూ పడివుండే నౌఖరు లాంటి స్వంత మనిషికోసం.

ఆయనకి బంధువులపట్ల నమ్మకంలేక పోగా వాళ్ళ పట్ల భయం వుంది. తనని ఆస్థికోసం ఏ విషంతోనో చంపుతారన్న భయం. రంగారావు పెద్దకూతుర్ని తనకి ఇచ్చి పెళ్ళి చేస్తే చిన్నకూతుళ్ళ పెళ్ళిళ్ళకి కాస్త సాయపడ తానని అన్నాడు. రంగారావుకి ఆశ కలిగింది. దరిద్రం మనిషిలోని కొన్ని మమకారాల్ని చంపివేస్తుంది కాబోలు, మంచి వయసులోవు న్న కూతుర్ని కేవలం డబ్బుకి ఆశపడి అరవై ఏళ్ళ వృద్ధుడికి ఇవ్వడానికి సిద్ధం అయ్యాడు తులసి తండ్రి. తాను ఆ వృద్ధుణ్ణి చేసుకోనని గోలపెట్టింది తులసి. ఏడ్చింది ... తల్లీ, తండ్రీ, చెల్లెళ్ళూ, తమ్ముడు ఈ పెళ్ళికి ఒప్పుకో మని బలవంతం చేశారు.

"నువ్వు ఒక్కదానివి త్యాగంచేశావంటే అందరం సుఖపడతాం తల్లీ" అంటూ బతి మాలాడు ఆమె తండ్రి.

తులసికి ఆ ఇంట్లో మనుమలపట్ల ద్వేషం కలిగింది. సరిగ్గా ఈ సమయంలోనే మూర్తి వచ్చాడు తులసిని చూడటంకోసం. అతణ్ణి చూడగానే తులసి ఇష్టపడింది.

అది ఇష్టపడటం కూడా కాదు...

రాజీపడటం...

మూర్తికి నలభై ఏళ్లకిమించిన వయసులే దు. మనిషికూడా బాగానే వున్నాడు. సొంత ఇల్లుంది. అంతో ఇంతో చదువుకున్నవాడు. ఉద్యోగం కాకపోయినా చెప్పుకోదగిన ఆదాయం వచ్చే సొంత వ్యాపారంవుంది. ఓ ముసలితల్లి ఇద్దరు పిల్లలున్నారట. 'ఇద్దర పిల్లలు వున్నారు' అన్న విషయం తులసికి నచ్చకపోయినా అరవై ఏళ్ల ముసలివాడి సంబంధంతో పోల్చుకుంటే మూర్తి వెయ్యిరెట్లు నయం అనిపించాడు. పైగా అతడి ద్వారా పిల్లలు కలిగే అవకాశం సైతం వుంది.

ఆమె తల్లి చాలా ఖచ్చితంగా "ఒప్పు కుంటే ఈ సంబంధానికైనా ఒప్పుకో లేని పక్షంలో నీకు ఈ జన్మలో పెళ్ళికాదు" అంది.

తులసి మౌనంగా తన అంగీకారాన్ని తెలి యజేసింది. అలా మూర్తి రెండో భార్యగా అతడి జీవితంలోకి ప్రవేశించిందామె. మూర్తి చాలా త్వరగా ఆమె అందచందాలకు వశుడై పోయాడు. కానీ, ఆమెలోని అసంతృప్తి చల్లార లేదు. ఆమె కోరుకున్న జీవితం వేరు. తన సవతిపిల్లలు చంటిపిల్లలయి వుంటే ఎలా వుండేదోగానీ కాస్త పెద్దవాళ్లయిన భారతిని, చందూని చూసినప్పుడు ఆమెకి మనసులో భయం లాంటిది కలిగింది.

ఈ పిల్లలకి తను తల్లి?

"పిల్లల్ని పలకరించి దగ్గరికి తియ్యి తుల సీ..." అనే వాడు మూర్తి.

"వాళ్లు నా మొహం చూస్తేనే దూరంగా తొలగిపోతారు. వాళ్లని నేనేం దగ్గరికి తియ్యా ను?" అంది తులసి.

అప్పటికే తండ్రి తమకి దూరం అయ్యా డనే భావం అదీ కొత్తగా వచ్చిన సవతితల్లి మూలంగానే అన్నభావం చందూలో నాటుకు పోయింది. చందూ ఆమెని చాలా ద్వేషంగా చూసేవాడు. ఇరుగూ పొరుగూ అమ్మలక్కలు ఆ ఇంటికి వచ్చినప్పుడు అరుంధతమ్మ, భారతీ లేకుండా చూసి తులసితో "అయ్యో ... ముత్యంలాంటి పిల్లవి! ఈ రెండోపెళ్ళి సంబంధం ఎందుకు చేసుకున్నావు తల్లీ? బంగారు బొమ్మలా వున్నావు. దాదాపు నీ ఎత్తు న్న పిల్లలకి నువ్వు తల్లివా?" అంటూ ఒకరు బుగ్గలు నొక్కుకుంటే...

"ఖర్మ... అంతా రాత పిన్నిగారూ! ఆ అమ్మాయి ఏం చేస్తుంది చెప్పండి" అని ఇంకో ఆవిడ దీర్ఘాలు తీసేది.

ఈ మాటలు తులసిలోని అసంతృప్తిని పెంచాయి. పిల్లలపట్ల అయిష్టతని ఎక్కువ చేశాయి. దానికితోడు పిల్లలు తనను శత్రువు నిలా చూస్తూ దగ్గరికి రాకపోవడం... ఆమె వాళ్లని చాలా నిర్లక్ష్యం చెయ్యడానికి కారణం అయ్యాయి. వాళ్లు తిన్నారా లేదా? స్కూలుకి వెళుతున్నారా లేదా? అన్న విషయం కూడా పట్టించుకునేది కాదు తులసి. ఈ విధంగా.



అరుంధతమ్మ కొడుకుని రెండో పెళ్ళి చేసుకోమని ఎందుకోసమైతే పోరిందో ఆ ఉద్దేశ్యం ఫలించకపోగా ఆమె అనుమానాలూ భయాలూ నిజమై క్రమక్రమంగా తులసి సవతిపిల్లలపట్ల ద్వేషభావం పెంచుకోసాగింది.



చందూకి తులసిని ఏమని పిలవాలో ఎవరూ చెప్పలేదు. మొదట్లో అంతా 'నీకు కొత్త అమ్మ వస్తుంది' అన్నారు. ఆమె వచ్చాక 'అమ్మా' అని పిలవమని ఎవరూ చెప్పలేదు. ఏనాడూ ఆమె దగ్గరికి పిలిచి లాలించిన పాపానపోలేదు. నాయనమ్మ, తండ్రి, ఇరుగూ పొరుగూవారు ఆమెని పేరుతో పిలవడం వాడు వింటూండేవాడు. నాయనమ్మతో అక్కతో మాట్లాడేప్పుడు 'ఆ తులసి' అని చెప్పేవాడు.

"పేరుతో పిలవకూడదురా వెధవా" అంటూండేది నాయనమ్మ.

ఇప్పుడు వాడు తన ప్రమేయం లేకుండానే అలా పిలవాలన్న ఉద్దేశం లేకుండానే తులసిని పేరుతో పిలిచాడు. తొమ్మిదేళ్ళ కుర్రవాడు తనని పేరుతో పిలిచేసరికి తులసి అహం దెబ్బతింది.

మనవడు ఏడుస్తూ రావడంచూసి "ఏమయిందిరా?" ఖంగారుగా అడిగింది అరుంధతమ్మ.

"తులసి కొట్టింది నాయనమ్మా" చెప్పాడు వాడు ఏడుస్తూనే.

"కొట్టిందా?" ఆవిడ తెల్లబోయి "ఎందుకూ?" అంది.

ఈ లోపులో సబ్బునురగ అంటుకున్న చేతుల్తో వేగంగా వచ్చింది తులసి అక్కడికి. "మీ మనవడికి కాస్త చిన్నా పెద్దా మర్యాద నేర్పించండి. వాడు నన్ను పేరుతో పిలిచాడు..." అంది తీవ్రంగా.

అప్పటికే కోపం తెచ్చుకుని కేకలకి సిద్ధమైన అరుంధతమ్మ ఈ విషయం విని తగ్గిపోయింది.

"అయ్యో! పేరుతో పిలిచాడా? పసివెధవ! వాడికి తెలీదులేమ్మా! అంతలోనే నువ్వు కోపం తెచ్చుకుని కొట్టకపోతే ఏం? నాకు చెబితే నేను కేకలు వేసేదాన్నికదా?" అంది.

"పసివెధవా? వాణ్ణి సమర్థిస్తున్నారా? అవునూ వాడికి తెలీకపోతే పెద్దవారు మీరేం చేస్తున్నారు? నేర్పించుకోండి" అంటూ విసురుగా వెళ్ళిపోయింది.

అరుంధతమ్మ పెద్దరికం దెబ్బతిన్నది. భారతి ఇదంతా తెల్లబోయి చూస్తోంది. అరుంధతమ్మ కోపం అంతా పిల్లలమీదకి తిరిగింది.

"దరిద్రగొట్టు వెధవల్లారా! మీ రాత ఇట్లా తగలబడింది. బంగారంలాంటి తల్లిని మింగి కూర్చున్నారు. ఈ వయసులో నాకు మనశ్శాంతి లేకుండాపోయింది. అయినా నీకు ఎన్నిసార్లు చెప్పానే భారతీ? దాన్ని 'పిన్నీ' అని పిలవమని. నా మాట చెవిన పెట్టావా? చూడూ ఇప్పుడేమయిందో" అంటూ ముక్కు చీదేసింది.

"చిన్నంతరం పెద్దంతరం లేకుండా నన్నే మాటలని వెళ్ళింది. అవున్లే కోడళ్లంతా రాధమ్మ తల్లిలా వుంటారా ఏమిటి?"

"నాకు నువ్వు చెప్పలేదుగా 'పిన్నీ' అని పిలవమని?" ఏడుస్తూనే అన్నాడు చందూ.

"ఇకనుండి అలాగే పిలవరా నాయనా"

"ఈవిడ మంచిదికాదు నాయనమ్మా! నన్ను కొట్టిందని నాన్నతో చెబుతాను"

"అమ్మో! ఇంకేమయినా వుందా? మీ నాన్నకి చెప్పావంటే వాడు నీ వీపు చిట్లేస్తాడు. కొత్తపెళ్లాం మాటగాక మన మాటలు ఆలకిస్తాడట్రా పిచ్చివెధవా?"

ఈ మాటల్ని భారతి కూడా బాగా ఆల





# ఏరిన ముత్యాలు

## విద్యాలయం నా దేవాలయం

★ శరీరానికి వ్యాయామమెంత అవసరమో, మస్తిష్కానికి అధ్యయనం అంతే అవసరం.

-- జోసఫ్ ఎడిసన్

★ ఈరోజుల్లో చదవడం అందరికీ తెలుసు. కానీ ఏం చదవాలనేదే తెలియదు.

-- జార్జి బెర్నార్డ్‌షా

★ అధ్యయనం ఆనందాన్ని, యోగ్యతను ప్రసాదిస్తుంది.

-- బేకన్

★ ప్రతి విషయాన్ని గురించి కొద్దిగా, కొన్నింటిని గురించి క్షుణ్ణంగా చదవడం మంచిది.

-- బ్రోగా

★ చదవడంలోని నేర్పు, అనవసరపు ఘట్టాలను అతి మెలకువతో దాటివేయడం.

-- పి.జె. హామర్‌టన్

★ మననం చేయని చదువు జీర్ణం కాని ఆహారం వంటిది.

-- ఎడుండ్మబర్క్

★ ప్రసంగాల కోసం చదివేవాళ్లూ, రాసేందుకు చదివే వాళ్లూ కోకొల్లలు. ఆలోచించేందుకు చదివేవారు అరుదు.

-- సి.సి. కోల్టన్

★ ప్రజలు చదవడం మానేస్తే క్రమంగా వక్రమార్గానపడి పెరగడం మానేస్తారు.

-- నెహ్రూ

★ ఉత్తమ గ్రంథం చింతామణివంటిది. దానిని చదవడంవల్ల చెడు ఆలోచనలు రూపుమాస్తాయి. సంశయ పిశాచం పారిపోతుంది. మదిలో సద్భావం జాగృతమై గొప్ప శాంతి ఏర్పడుతుంది.

-- శివానంద

★ గతాన్ని స్మరించి, వర్తమానాన్ని ప్రేమించి, భవిష్యత్తును చూడగలిగినవాడే వాస్తవిక రచయిత.

— తుమ్మల

★ తన హృదయంలోకి న్యాయంగా చూడగలవాడు తానక్కడ చూసినదానిని నిర్భయంగా రాస్తే ఇక అతనికి పాఠకుల కరవే ఉండదు.

★ ఈ విశాల విశ్వం మహాగ్రంథంలాంటిది. ఇల్లు కదిలి బయటి ప్రపంచాన్ని చూడనివాళ్లు ఆ గ్రంథంలో ఒక పేజీ మాత్రమే చదవగలుగుతారు.

-- అగస్టీన్

---

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

కించింది. ఏదైనా కోపంతో తల్లి కేకలు వేసినా ఓ దెబ్బ కొట్టినా తండ్రికి ఫిర్యాదు చెయ్యడం చందూకి అలవాటు. ఇప్పుడు కూడా అదే అలవాటుతో తండ్రికి చెబుతానన్నాడు. వాణ్ణి చెప్పనిచ్చినా బావుండేది.

లేదా "అలా చెప్పకూడదు బాబూ" అని నచ్చజెప్పివుండినా బావుండేది.

అరుంధతమ్మ ఈ రెండూ చెయ్యక "నువ్వు చెప్పినా మీ నాన్న నిన్నే కొడతాడు. ఆవిడ మాటలే అతడికి వేదవాక్కు" అన్నట్టు మాట్లాడటంతో పిల్లల్లో తండ్రిపట్ల భయం, ఆయనకి తమకన్నా ఆవిడే అపురూపం అన్న భావమూ కలిగాయి.

ఒకరోజు భారతి తండ్రి సమక్షంలో "పిన్నీ... నాన్నమ్మకి కాఫీ కావాలట" అని అడిగింది.

"ఇస్తున్నా" అంది తులసి.

పిన్నీ అన్న ఈ పిలుపుని తొలిసారిగా విన్న మూర్తి ఆశ్చర్యపోయి "ఏమని పిలిచావు?" అడిగాడు కూతుర్ని.

"పిన్నీ అంది" తను చెప్పింది తులసి.

కోపంతో అతడికళ్లు ఎర్రబడ్డాయి. "అదేం పిలుపు? ఎవరలా పిలవమంది?" గద్దించాడు.

భారతి బెదిరిపోయి "నాయనమ్మ..." అంది.

"బుద్ధుందా ఆవిడకి?" మండిపడుతూన్నట్టన్నాడు మూర్తి.

భారతితోపాటు తులసికీ అతడికి ఎందుకంత కోపం వచ్చిందన్నది అర్థంకాలేదు.

"పిన్నేమిటి? అమ్మ అనలేవూ?" అంటూ "ఇలారా?" అంటూ కూతురి బుజం పట్టుకుని తల్లి దగ్గరికి లాక్కువెళ్లినట్టు తీసుకువచ్చి "ఏమ్మా... తులసిని పిన్నీ అని పిలవమన్నావట? ఏ మాత్రం జ్ఞానం అన్నది ఉంటే అలా చెబుతావా నువ్వు? తులసి ఈ ఇంటికి వచ్చింది ఎందుకు? పిల్లలకోసం. తనని ఓ తల్లిగా కాక సవతితల్లిగా పిల్లలకి నువ్వు చూపించదలచుకుంటే ఆ తరువాత సంభవించే పరిణామాలని ఎదుర్కొని బాధ పడాల్సింది, బాధ్యత వహించాల్సింది నేనని మర్చిపోయావా?" ఈ క్షణంలో ఓ బాధ్యత గల తండ్రిలా మాట్లాడుతూన్న మూర్తి ఇదే బాధ్యతతో మొదట్నుండీ ప్రవర్తించి వుంటేబావుండేది.

ఆ తరువాతయినా పిల్లల విషయంలో తన బాధ్యతని గుర్తెరిగి వుండగలిగి వుంటే బావుండేది.

కొడుక్కి బెదిరి "నాదే పొరపాటురా. అమ్మా అనిపిలిస్తే తులసి ఏమనుకుంటుందోనని..." అంది అరుంధతమ్మ.

"ఏదో అనుకోవడంఏమిటి? పిల్లలకి అమ్మగానే తను ఇక్కడికి వచ్చింది. ఈ విషయం గుర్తుంచుకోండి" అంటూ విసురుగా వెళ్లిపోయాడు.

"ఛీ... ఈవిడ అమ్మ ఏమిటి?" అంటూన్న చందూ వీపు మీద ఓ దెబ్బ తగిలించింది అరుంధతమ్మ.

తరువాత కళ్లనీళ్లు పెట్టుకుంది. చిన్నతనంలో ఆవిడ తన సవతితల్లిని అమ్మా అని పిలిస్తే ఆవిడ మండిపడేది. తనని పిన్నీ అని పిలవమనేది. ఆ విషయం బాగా గుర్తుంచుకుని పిల్లలకి పిన్నీ అన్న పిలుపుని అలవాటు చేసింది అరుంధతమ్మ. ఇప్పుడు అదే తప్పయిపోయింది.

"పిల్లలకి నువ్వయినా చెప్పనక్కరలేదా తులసీ?" అంటూన్న భర్తకి తులసి సమాధానం ఇవ్వలేదు.

"తులసి ఈ ఇంటికి వచ్చింది పిల్లల కోసం" అన్న భర్త మాటలు ఆమెని ఎంతో భయానికీ దిగులుకీ దుఃఖానికీ గురిచేశాయి.

తను ఇక్కడికి వచ్చింది ఈ పిల్లలకోసమా? తనకేమీ కాని వీళ్ల చాకిరీ కోసం వీళ్ల బాధ్యతని మోయడం కోసం? ఏం ఖర్మపట్టింది తనకి?

నవ్వుతూ, హాయిగా, సుఖంగా జీవితాన్ని సాగించాల్సిన వయసులో ఎవరో కనిపోయిన పిల్లలకోసం తపిస్తూ బ్రతకాల్నా తను?

"కళ్లనీళ్లు పెట్టుకుంటావెందుకు తులసీ? నేను మందలించాగా? పిల్లలు ఇకనుంచి 'అమ్మా' అని పిలుస్తార్లే! అమ్మ పెద్దదేగానీ తనకి బొత్తిగా తెలివిలేకుండా పోతోంది" అనునయంగా భార్యని దగ్గరికి తీసుకుని చెప్పాడు

మూర్తి:

ఏమనగలదు తులసి?

పిన్నీ అన్న పిలుపు తనకి నచ్చినప్పుడు ఈ అమ్మా అన్న సంబోధనని అసలు తను సహించలేదని చెప్పగలదా? భారతి బల వంతంగా అలవాటు చేసుకుని అమ్మా అని పిలుస్తూన్నప్పుడు ఆ పిలుపుని భరించడం నరకంతో సమానంగా వుందామెకి! నిన్న మొ న్న మెడలో తాళికట్టించుకున్న తను ఇంత లేసి పిల్లలకి అమ్మ అయిపోయింది! తులసి మనసులోని బాధ, దిగులూ, దుఃఖమూ క్ర మంగా పిల్లలపట్ల కోపంగా అసహ్యంగా రూపు దిద్దుకోసాగినాయి.

అమ్మ అన్న ఈ పిలుపు తులసికి ఇష్టంలే దని భారతి గ్రహించింది.

'అమ్మా' అని పిలిచినప్పుడు తీవ్రంగా చూసే తులసి మొహంవైపు చూడకుండా జాగ్రత్తపడేదామె.

'పిన్నీ' అని పిలిస్తే నాన్నకి కోపం.

'అమ్మా' అంటే తులసికి కోపం.

ఏమీ పిలవకుండావుంటే నాయనమ్మకి కోపం.

సృష్టిలో తియ్యనిదీ మధురమైనదీ అయిన ఈ అమ్మా అన్న పిలుపు ఆ సవతితల్లి, పిల్లలమధ్య దూరాన్ని ఇంకా పెంచుతోంది.

ఓవిధమైన దిగులుతో, యాతనతో కృంగిపో తోంది భారతి కూడా. సవతితల్లి నిరాదారణ కంటే ఎక్కువగా తండ్రి పట్టించుకోనితనం ఆ అమ్మాయిని చాలా దుఃఖానికి గురిచేసింది. ఎప్పుడూ భార్య వెంటవెంటే తిరగడం, ప్రతి చిన్నపనికీ 'తులసీ' అంటూ పిలవడం, తన గురించీ, తమ్ముడిగురించీ పట్టించుకోకపో వడం ముఖ్యంగా ఇరుగూ పొరుగూలద్వారా వింటూండేవారి పడకగది ముచ్చట్లు భారతిని పిరికిదాన్ని చేశాయి.

"అయితే పెళ్లాం కొంగు వదలడంటావు అరుంధతమ్మ పిన్నీ?"

"అయ్యోరామా! మెల్లగా అంటావే అంబుజం. పగలు వద్దతంతా ఓరకం. రాత్రి వ్యవహారం ఇంకోరకం. పొద్దుట బయటికెళ్లే పని హడావుడిమీద పిల్లలతో గడిపే తీరికి లేదనుకుందాం. సాయంత్రం వస్తాడుగదా? ఓగంటసేపు పిల్లలతో కబుర్లు చెప్పవచ్చునే! వాళ్ల మంచీచెడ్డ విచారించవచ్చునే! అబ్బే.... అదేమీలేదు. వస్తూనే పెద్ద పూలపొట్లంతో వస్తా డు. ఆ పూలన్నీ ఆ తల్లిజడలోకి ఎక్కికూ ర్చుంటాయి. ఇవతల పిల్లముండ వుందే, దానికి ఓ జానెడు ఇద్దాం అన్న ధ్యాస ఆ మహాతల్లికి లేకపోయినా మనవాడికి వుండొద్దా? ఎప్పుడెప్పుడు తొమ్మిది అవుతుందా గదిలోకి వెళ్లి తలుపులు వేసుకుందామా అన్న తపనే వాడికి! ఇవతల ముసలిముండని ఒకదాన్ని ఉన్నాను! ఊహతెలుస్తూన్న పిల్ల ఒకటి వుంది అన్న జ్ఞానమైనా లేదు" ఇలా మాట్లాడుతూన్న అరుంధతమ్మకివూహతెలుస్తూన్నఆ మనవరా లు ఇప్పుడు తనపక్కనే వుంది తన మాటలు శ్రద్ధగా వింటోంది అన్న స్పృహ, తెలివీ లేదు.

"అయినా ఈ మగవాళ్లు ఎంత విచిత్రంగా మారిపోతారు పిన్నీ? నీ కొడుక్కి తన పెద్దభా ర్య గుర్తుకూడా వుండివుండదనుకుంటా?"

"ఇంకెక్కడి పెద్దభార్య జ్ఞాపకాలు?" నిట్టూ ర్చింది అరుంధతమ్మ.

భారతి ఈ సంభాషణ విన్నాక తండ్రిని పరిశీలించసాగింది తనకి తెలీకుండానే! అరుంధతమ్మమాటలు అతిశయోక్తులుకాదు! పిల్లలతో ఓ రెండునిముషాలపాటు కబుర్లు చెప్పే తీరికేలేనట్టు ప్రవర్తించేవాడు మూర్తి! రాత్రి భోజనంచేసి పడకగదిలోకి వెళ్లాక వంట గదిలో ఇంకా పనిముగించుకుంటూన్న భార్య వచ్చేలోగా పది పిలుపులైనా పిలిచేవాడు. నాలుగైదుసార్లు వంటగదిలోకి వెళ్లివచ్చేవాడు.

ఒక్కోసారి తులసి విసుక్కుంటూవుండేది. మరోసారి బ్రతిమాలుతూన్నట్టు ఏదో అంటూ వుండేది. ఆ తరువాత తండ్రి నవ్వు పడకగది లోనుండి బయటికి వినిపిస్తూవుండేది. ఏ అర్ధ రాత్రో అనుకోకుండా మెలకువ వస్తే వాళ్లింకా నిద్రపోలేదన్నట్టు గదిలోంచి చిన్నగా వాళ్ల కంఠాలు వినబడుతూ వుండేవి. భారతికి నిద్ర పట్టేదికాదు.

అప్పుడు అరుంధతమ్మకి మెలకువ వుంటే "వీడు మరీ కొత్త పెళ్లికొడుకైపోతూన్నాడు" అంటూ గొణుక్కుంటూండేది.

అప్రయత్నంగా భారతికి తన తల్లి గుర్తువస్తూండేది! ఆ అమ్మాయికి దుఃఖం వచ్చేది. నిజంగా తులసి వచ్చాక తల్లిని పూర్తిగా మర్చిపోయాడు నాన్న. అంతక్రితం ఎప్పుడూ అమ్మ కబుర్లు చెబుతూండేవాడు. తెల్లారిలేచి తండ్రి మొహం చూడాలంటే సిగ్గుగా వుండేది భారతికి. దూరదూరంగా తప్పుకుతిరిగేది.

భారతీ! మీనాన్నకీ, మీ సవతి తల్లికీ కలిపి ఒకేమంచంవుందటే గదిలో?''

''అవును'' సిగ్గుతో చెప్పేది భారతి

''తెల్లగా తెల్లారినదాకా మొగుడిపక్కలోంచి లేవదటగా?''

సిగ్గుతో చితికిపోయేది భారతి.

ఆ అమ్మాయి వయసు పదమూడేళ్లే. సహజంగా ఈ వయసులో తెలీని ఇలాంటి విషయాలు చాలావరకూ తెలిసేలా చేశారు నాయనమ్మ ఇరుగూపొరుగూ కలిసి. వాళ్లు అంతటితో వూరుకున్నా బావుండేది. కానీ అత్తగారి మాటలు కోడలికి కోడలు మాటలు అత్తగారికి చేరవేయడం ప్రారంభించారు. తన గురించి ముసలి అత్తగారు ఇరుగూపొరుగూ దగ్గర పితూరీలు చెబుతోందన్న విషయం తెలిశాక తులసి భగ్గున మండిపోయింది.

ఇక్కడి అరుంధతమ్మగానీ మిగతావాళ్ళుగానీ ఓ విషయం మర్చిపోయారు. మూర్తికి ఇది రెండో పెళ్లే కావచ్చు.

అంత క్రితం మొదటి భార్యతో అతడు పదిహేనేళ్లు కాపురంచేసి వుండవచ్చు...

కానీ... తులసికి మాత్రం అది మొదటి పెళ్లే. అన్ని అనుభవాలకీ, సుఖాలకీ ఆమె కొత్తే. అలాంటిది అందరూ కలసి మొగుణ్ణి కొంగుకి కట్టేసుకుంది అంటూ చేస్తూన్న ఆరోపణలు ఆమె అభిమానాన్ని గాయపరిచి ఆమెని రెచ్చగొట్టాయి.

★ ★ ★

ఆనాడుతనూ, చంద్రం అనుభవించిన మానసికమైన వ్యధని పాపగానీ బాబుగానీ తనమూలంగా అనుభవించకూడదు. ఇందుమూలంగా తను కొంత వ్యక్తిగతమైన సుఖాన్ని ఆనందాన్ని నష్టపోవాల్సి వచ్చినా సరే.

ఆ ఒంటిరితనం...

ఆ దిగులు...

తమని ఎంతగా కృంగదీశాయో ఈ పిల్లల్ని కూడా అంతగానూ కృంగదీస్తాయి.

భారతి ఆలోచిస్తుండగానే ప్రకాష్ నిద్రలేచాడు. అతడికి కాస్త ఆలస్యంగా నిద్ర లేవడం అలవాటు. తొమ్మిదికంతా ఆఫీసుకి బయలుదేరాలి. అంతకు గంటకు ముందుగానే పిల్లలు వెళ్లిపోతారు. నలుగురూ రావడం సాయంత్రమే. ఈలోపల వంటచేసి ముగ్గురికీ కారియర్‌లో సర్దాలి. పిల్లల కాన్వెంట్ దూరం ఏమీకాదు. అయినా రిక్షాలో వెళతారు. ఉదయం పని కాస్త ఎక్కువే మొదట్లో ఈ పని హడావుడి కాస్త కష్టంగానే అనిపించినా భారతి క్రమంగా అలవాటు పడుతోంది.

బాబు లేచివచ్చాడు. పాపకంటే కాస్త ఆలస్యంగా లేస్తాడు.

''ఏమ్మా! స్నానం చేయించనా?'' లాలనగా అడిగింది భారతి.

వాడు సిగ్గుగా తలూపాడు. బాబుకి భారతి పట్ల మూడు సంఘటనల్తో ఇష్టం ఏర్పడింది. నిన్న సాయంత్రం కాఫీకప్పు పగలగొడితే ఏమీ అనకపోవటం. రాత్రి డాడీకి చెప్పి సర్కస్‌కి పంపించడం. రాత్రి అచ్చు అమ్మలా తనని పక్కలో పడుకోపెట్టుకోవడం, భారతి ఆ ఇంటికి వచ్చిన వారంరోజుల తరువాత తొలిసారిగా తనకైతాను నిద్రలేస్తూనే భారతి దగ్గరికి వచ్చాడు బాబు. భారతి ఈ విషయం గమనించింది. ఆమెకి చాలా ఆనంధం కలిగింది. ఆమె వాడికి స్నానం చేయించింది.

అక్కకీ తమ్ముడికీ పాలు కలిపి ఇస్తూండగా ''భారతీ'' అంటూ వినిపించింది ప్రకాష్ పిలుపు.

ఆమె అతడి కోసం కాఫీ కలపసాగింది.

బాబు పాపని అడిగాడు- ''అక్కా! భారతి మంచిది కాదూ?''

పాప సమాధానం చెప్పలేదు.

''రాత్రి నేను భారతి దగ్గర పడుకున్నానుగా'' కాస్త గొప్పగా అన్నాడు.

''నేను డాడీ దగ్గర పడుకున్నాను'' పాప గర్వంగా అంది.




పాప మొహం కూడా ఆనందంగా వుంది.

"భారతి మంచిదికాదూ?" మళ్లీ అడిగాడు బాబు "రేపు కాఫీకప్పు పగలగొడితే నన్ను కొట్టలేదుగా" అన్నాడు.

"రేపు కాదురా" పాపకి నవ్వొచ్చింది "నిన్న" అంది.

"అవును. నిన్న! నేను భారతిని అడిగి గాలిపటం కొనుక్కుంటాను" ఉత్సాహంగా చెప్పాడు.

పాపకి కూడా భారతి మంచిదిలాగే కనబడింది. మరయితే రాజీ వాళ్లఅమ్మ ఇంకా వూరి దగ్గర అత్తా వాళ్లందరూ అలా చెప్పారేమిటి? బాబు మళ్ళీ అడిగాడు "డాడీకి చెప్పి మనల్ని కొట్టిస్తుందన్నావుగా?"

"నేను కాదు. అరవింద ఆంటీ" చెప్పింది పాప.

"మరి కొట్టించలేదుగా?"

"నాకు తెలీదురా అజిత్" ఏంచెప్పాలో తెలీక అంది పాప.

"నాకు చూడు ఏంచక్కా స్నానంచేసి తల దువ్వింది" గర్వంగా అన్నాడు బాబు- "ఛీ... ఛీ... నీ మెడమీద సబ్బునురగ పోలేదు" అన్నాడు మొహమంతా వికారంగా పెట్టి.

పాప మొహం చిన్నబోయింది. కాస్త ఉక్రోషంగా- "నేను భారతిని అడిగి కొత్త ఫ్రాకువేసుకుంటాను" అంది.

"నేను గాలిపటం కొనుక్కుంటాను" పోటీగా అన్నాడు బాబు.

అప్పుడే అక్కడికి వచ్చిన భారతి- "ఏమిటి బాబూ?" అడిగింది.

అంతసేపు మాట్లాడిన బాబు హఠాత్తుగా మూగబోయినట్టు మౌనం వహించాడు.

"ఏమిటి అంజూబాబు అంటున్నాడు?"

"మరి... మరి... వాడికి గాలిపటం కావాలట"

"అంజూకి కొత్త ఫ్రాకు కావాలట" బాబు ఈసారి వేగంగా చెప్పాడు. భారతికి నవ్వొచ్చింది. నవ్వింది. ఆమె నవ్వు చూసి బాబుకి ధైర్యం వచ్చింది.

ఆమె దగ్గరికి వచ్చి నిలబడుతూ- "మరి... మరీ... నాకు గాలిపటం కొనిపెట్టవూ" కాస్త భయంగానూ, కాస్త ఆశగానూ అడిగాడు.

"తప్పక. అలాగే డాడీని అడుగుదాం. సరేనా?"

వాడు సంతోషంగా తలూపాడు. అక్కవైపు గర్వంగా చూశాడు.

పాపకి చాలా ఈర్ష్యగా అనిపించగా చప్పున "నేను ఈరోజు కొత్తగౌను వేసుకుంటాను" అనేసింది.

"అలాగేనమ్మా! సాయంత్రం కాన్వెంట్ నుండి రాగానే వేసుకుందువుగాని. యూనిఫారం వేసుకెళ్లాలిగా ఇప్పుడు?"

పాప సంతోషంగా తలూపి తమ్ముడివైపు తనూ గర్వంగా చూసింది.

ఇంతలో పేపర్ పట్టుకుని అక్కడికి వచ్చిన ప్రకాష్ "ఏమిటి అంతా ఓచోట చేరారు?" అడిగాడు.

"బాబు మిమ్మల్నేదో అడగాలనుకుంటున్నాడట. నన్ను సిఫార్సు చెయ్యమంటున్నాడు" నవ్వుతూ అంది భారతి.

ప్రకాష్ కళ్లు సంతోషంతో మెరవగా "ఏమిట్రా అజ్జూ" అడిగాడు.

"మరే డాడీ... నాకు గాలిపటం కావాలి డాడీ..." గారంగా అడిగాడు.

"సాయంత్రం నేను వస్తూ తెస్తానుగా" అన్నాడు.

"నీకేం కావాలో అడగు అంజూ" భారతి చెప్పింది.

"డాడీ... మరి .... నాకూ..."

"చెప్పమ్మా" నవ్వుతూ కూతుర్ని దగ్గరకి తీసుకున్నాడు ప్రకాష్.

"నేను... నేను... రోజూ నీ దగ్గరే పడుకుంటాను డాడీ"

ప్రకాష్ భారతి మొహమొహాలు చూసుకున్నారు. పాప అడగడంలో ఈ కొద్దిరోజులుగా అనుభవిస్తూన్న ఒంటరితనం వుంది. తండ్రి ఎక్కడ కాదంటాడో నన్నభయం వుంది.

"అలాగే... అలాగే..." అన్నాడు ప్రకాష్ ఆర్ద్రంగా.



భారతి ఎంత బాగా ఆలోచించిందో తెలిసివచ్చింది అతడికి. ఆమె వైపు అభిమానంగానూ కృతజ్ఞతగానూ చూశాడు.

"నేను రోజూ నీ దగ్గరే పడుకోనా?" బాబు ఆశగా అడిగాడు భారతిని.

వాణ్ని అమాంతం ఎత్తి చంకన వేసుకుని బుగ్గమీద ముద్దు పెట్టుకుంది భారతి. వాడు ఆనందంతోనూ సిగ్గుతోనూ భారతి మెడ దగ్గర మొహం దాచేసుకున్నాడు. ఈ అపురూప దృశ్యాన్ని కంటిరెప్పలార్పకుండా చూసింది ఒక్క ప్రకాష్ మాత్రమే కాదు పాప కూడా. అమ్మ కూడా అచ్చు ఇలాగే ఎత్తుకుని ముద్దాడేది తనకి చాలా సంతోషం ముద్దూ కలిగినప్పుడు తననీ బాబునీ. పాపకి ఎందుకో దిగులుగా అనిపించింది కొన్ని క్షణాలపాటు.

మరో గంటన్నర తరువాత...

ఇల్లు చాలా నిశ్శబ్దంగా వుంది. ప్రకాష్ ఆఫీసుకీ పిల్లలు స్కూలుకీ వెళ్లి పోయారు. భారతి తీరిగ్గా ఇల్లు సర్దడం ప్రారంభించింది. ఆమెకి బీరువాలో సుజాత ఫొటో కనిపించింది. చాలా చక్కనిది సుజాత. పాప ముమ్మూర్తులా తల్లి పోలిక. బాబు తల్లి పోలికలూ తండ్రిపోలికలూ కలగలుపుకుని పుట్టాడు. ప్రకాష్‌కి సుజాతపట్ల విపరీతమైన ప్రేమాభిమానాలున్నాయి. ఈ నాటికీ అవి చెక్కుచెదరలేదు. ఆమె పోయాక మూడునెలలపాటు అతడు మామూలు మనిషి కాలేకపోయాడట. ఇన్ని రోజులూ ఆఫీసుకి సెలవు పెట్టాడు. అతడు అన్ని విషయాలు భారతికి చెప్పాడు. ఆమె చాలా శ్రద్ధగా ఆసక్తిగా విన్నది.

అతడొక మాట అన్నాడు ఆమెతో...

నేను మళ్లీ పెళ్లి చేసుకుంది కేవలం పిల్లల కోసమేకాదు. అందుకోసమే అయితే నెలకి రెండు మూడొందలు ఇస్తే మనిషి దొరక్కపోదు. నా కోసం కూడా... జీవితంలో అర్థాంతరంగా వచ్చి చుట్టుముట్టిన ఒంటరి తనాన్ని విషాదాన్ని దూరం చేసుకోవడం కోసం. ఇంకో విషయం చెప్పనా భారతీ... సుజాత పోయిన మొదట్లో జీవితం చీకటిమయం అయినట్టు అనిపించినా క్రమంగా నాకు జీవితం పట్ల గల ఆశలూ, ఆకాంక్షలూ, కోరికలూ చెక్కుచెదరక అలాగే వున్నాయని సుజాతతో పాటే అవీ సమాధికాలేదని గ్రహించాను నేను. అందుకే సుజాత స్మృతుల్ని మధుర స్మృతులుగా మార్చుకుని నా జీవితాన్ని పంచుకునే మరో తోడుకోసం వెదుకుతూండగా అదృష్టంలా నా జీవితంలోకి వచ్చావు నువ్వు" అతడు ఉన్న మాట ఉన్నట్టు చెప్పడం ఆమెకి నచ్చింది.

తన తండ్రిలా ఇంకా భార్య పోతే రెండో పెళ్లి చేసుకున్న అనేకమందిలా అతడు "నేను మళ్లీ పెళ్లి చేసుకుంది నా కోసం కాదు. కేవలం పిల్లలకోసం" అని ఆత్మవంచన చేసుకుని మాట్లాడలేదు.

అతడిలో నిజాయితీవుంది. ఇది భారతిని విపరీతంగా ఆకర్షించింది. ఏ మనిషిలోనైనా ఆమె ఇష్టపడేది ఇలాంటి నిజాయితీనే. నిజాయితీతో జీవించాలనుకునే మనిషి జీవితం చాలా స్వచ్ఛంగా ఏ కల్మషమూ లేకుండా వుంటుంది. వాళ్ల జీవితంలో ఏ దాపరికాలూ హిపోక్రసీ వుండవు. ఓ మనిషిగా అతడిలో కొన్ని లోపాలు వుండివుండవచ్చు. అవి నిదానంగా బయటపడవచ్చు. అయినా తను సర్దుకు పోగలదు. ఎలాంటి వ్యక్తి అయితే భర్తగా లభిస్తే బాగుణ్ణని తనుకోరుకుందో ప్రకాష్‌లో ఆ సుగుణాలు కనిపించడం ఆమెని చాలా ఆనందపరిచింది. భారతికి నిండాపాతికేళ్ల వయసులేకపోవచ్చు. కానీ ఆమెకి తన చిన్న జీవితం అనేక అనుభవాల్ని పాఠాల్ని నేర్పింది.

భారతి ఇల్లు సర్దడం ముగించి మొహం కడుక్కుంది. ఉదయాన్నే తెలతెలవారక ముందే స్నానంచెయ్యడం ఆమెకి ఉన్న మంచిఅలవాటు. నాయనమ్మనుండి సంక్రమించిన అలవాటు అది. పేపర్ చదవడంకూడా ఆమెకి అలవాటు. ఇది తండ్రి నుండి సంక్రమించింది. మంచి సాహిత్యాన్ని ఎంతగానో ప్రేమిస్తుందామె. ఇది వస్తుతః ఆమెకి అలవడిన అభిరుచి. పేపర్ చదువుతూండగా హఠాత్తుగా గుర్తువచ్చిందామెకి. బట్టలు ఉతకాలి. పనిమనిషి ఈ సాయంత్రంనుండి రాదు. కొత్త పనిమనిషి వచ్చినదాకా అన్నిపనులూ తనే చేసుకోవాలి. కొంచెం శ్రమపడాలి. ఇల్లు వూడవడం దగ్గరి




నుంచి బట్టలు ఉతకడం, మార్కెట్‌కి వెళ్లి కూరలు తెచ్చుకోవడం వరకూ తనే చేసుకోవాలి.

అయినా ఫరవాలేదు. గంగమ్మలాంటివాళ్ల నీడకూడా పాపమీద పడకూడదు. ఆమె లేచివెళ్లి బట్టలు ఉతకడం ప్రారంభించింది. భారతికి అనిపించింది, 'ప్రకాష్ తనవాడు! అతడి పిల్లలు తనవాళ్లు' అనుకున్నందువల్ల వాళ్లకి సంబంధించిన ఏపని చెయ్యడానికీ మనసు సంకోచించడంలేదు. పైగా చాలా హాయిగా వుంది. తనకోసం, తన ఇంటికోసం, తనవాళ్ల కోసం చేసుకుంటూన్న భావన.

అంతకుమించి కావలసిందేంవుంది?

ఆమె బట్టలు ఉతకడం పూర్తి అవుతూండగా బయట తలుపు తడుతున్న చప్పుడైంది. భారతి చేతులు కడుక్కుని వచ్చి తలుపులు తీసింది. ఎదురుగా ఛమారు అరవైఅయిదేళ్ల వయసున్న వృద్ధురాలు! భారతి ప్రశ్నార్థకంగా చూసింది.

"ఈ ఎడమవైపు ఇంటి దుర్గ లేదా? దాని అత్తనే అమ్మాయీ" అంది ఆవిడ చొరవగా లోపలికివస్తూ.

"నమస్కారమండీ" అంది భారతి.

ఆవిడ ఆసక్తితో భారతిని ఎగాదిగా చూస్తూ "ఇదేనే అమ్మాయీ నిన్ను చూడటం! ఈమధ్య వూళ్లో లేనే! చక్కని చుక్కవేనే" అంది.

భారతి నవ్వి "కూర్చోండి బామ్మగారూ! ఇప్పుడే వస్తాను" అంటూ లోపలికి వచ్చి పిండిన బట్టలు గబగబ ఆరవేయడం ప్రారంభించింది.

భారతికి ఇక్కడ అరవింద తరువాత పరిచయం అయింది దుర్గ మాత్రమే. ఆమె ఏదో గవర్నమెంటు ఆఫీసులో స్టెనోగా చేస్తోంది. భర్తకి బాంక్‌లో ఉద్యోగం. ఓసారి వచ్చి తనని పరిచయం చేసుకుని వెళ్లింది దుర్గ. రెండోసారి వచ్చి ఓ రెండునిముషాలు మాత్రమే కూర్చుంది.

"ఇరుగుపొరుగు వాళ్లం పరిచయం చేసుకుంటే మంచిదని వచ్చాను" అంది.

లేనిపోని ఆసక్తి ప్రదర్శించలేదు భారతివిషయంలో. ఈ ఇంటికి ఎడమవైపు ఇల్లు దుర్గవాళ్లది. ఆ లోకాలిటీలో ఎక్కువగా పైస్థాయి, మధ్యతరగతి కుటుంబీకులు జీవిస్తున్నారు! అయితే దాదాపు అందరూ ఉద్యోగస్థులే! కుడివైపు ఇంట్లోవుండే రామానుజులు గారికి మాత్రం సొంతబిజినెస్ వుంది. ఆయన భార్యకి పక్షవాతం. మంచంలోనుంచి కదలేదు. నలుగురూ కొడుకులే. రామానుజులు ఓసారి వచ్చి భారతిని పలకరించి వెళ్లాడు.

"నువ్వోసారి వెళ్లి ఆయన భార్యని చూసిరా భారతీ" అన్నాడు ప్రకాష్.

ఆమె వెళ్లాలనుకుంటూనేవుంది. కుదరడంలేదు. కొత్తఇల్లు! కొత్త పరిసరాలు! కాస్త కుదురుకునేసరికి వారంరోజులు పట్టింది. ఇంతకుమించి పరిచయాలేం కలగలేదు. ప్రకాష్‌తో రెండమూడుసార్లు బయటికి వెళితే ఆ వీధిలో వాళ్లు చాలా ఆసక్తిగా చూడటం గమనించింది భారతి. ఆమె పనిముగించుకుని తిరిగివచ్చి బామ్మగారి ఎదురుగా కూర్చుంది.

"మీ ఆయన బాగా చూసుకుంటున్నాడా అమ్మాయీ?" అంటూ క్రాస్‌ఎగ్జామిన్ ప్రారంభించిందావిడ.

"లక్షణంగా" నవ్వుతూ సమాధానం ఇచ్చింది భారతి.

"మీదేవూరు? ఎక్కడ? రెండోవాడ్ని ఎందుకు చేసుకున్నావు?" ఇత్యాది ప్రశ్నలన్నీ అయ్యాక గాఢంగా నిట్టూరుస్తూ "అయినా ఈ సంసారం, ముత్యాల్లాంటి బిడ్డలతో ప్రాణంలా చూసుకునే మొగుడూ.... సుజాతకి ప్రాప్తంలేక పోయింది! ఎప్పుడూ కళకళలాడుతూ తిరిగే పిల్ల! ఏనాడుకూడా 'తలనొప్పిగావుంది బామ్మగారూ' అనడంకూడా విని ఎరగను అమ్మా! ఆ హార్ట్‌ఎటాకో... పాడో... మృత్యువు ఆరూపంలో వచ్చి పొట్టనపెట్టుకుందమ్మా! నువ్వు ఈ ఇంటికి రావాలనీ, ఈ భోగాన్నంతా అనుభవించాలనీ వుంటే తనెలా బ్రతుకుతుంది?" ఆవిడ ధోరణి అంతాఏదో ఆరోపణ చేస్తున్నట్టు సాగింది.

చిరునవ్వుతోనే ఆవిడ మాటలు వింది భారతి.

"పిల్లలు బాగా దగ్గరికి వస్తారా అమ్మాయి?

ఇప్పుడిప్పుడే అలవాటు పడుతున్నారు"

నవితల్లులు ఈ రోజుల్లో పిల్లల్ని సరిగా చూస్తున్నారా? మొగుడు కావాలి గానీ ఆ మొగుడి బిడ్డలు మాత్రం అవసరంలేదమ్మా... మొగుడికి తెలీకుండా దాపరికాలు. ఇద్దరు బిడ్డలు పుట్టుకొచ్చారా... ఇక నవతిపిల్లల మొహం కూడా చూడరు. వాళ్లని కాల్చి గంపల కెత్తుతారు. మొగుళ్లు పెళ్లాలకి దానులయిపో తారు. నువ్వయినా పిల్లల్ని కాస్త జాగ్రత్తగా చూసుకోమ్మా...''

''అది నాకు ప్రత్యేకంగా చెప్పాల్నా బామ్మా గారూ. నేను వచ్చిందే అందుకు నా బాధ్యత నాకు బాగా తెలుసు'' అంది భారతి చప్పున. ఇలాంటి వాళ్లకి ఎలాంటి సమాధానాలు ఇవ్వాలో ఆమెకి బాగా తెలుసు.

''అయినా సుజాతమ్మకి హఠాత్తుగా చావు ముంచుకురావడం చూడరాదూ...''

''ఏం చేస్తాం బామ్మగారూ... మీరు చెప్పిన ట్టు ఆమె తెచ్చుకున్న ఆయుష్షు అంతవరకు మాత్రమే వుండింది దాటుకునిపోయింది. మీ రేమీ బాధపడకండి నన్ను సుజాతలా భావించండి. పిల్లలకీ వాళ్ల తండ్రికీ ఏలోటూ లేకుండా చూసుకునే బాధ్యత నాది. సరేనా?'' శాంతంగానే అయినా ఆవిడనోరు మూతబ డేలా చెప్పింది భారతి.

''నిజమేలే అమ్మా... తన భాగ్యం అంతవర కే వుంది ఇక వస్తాను'' అంటూ లేచింది.

''ఓ నిముషం కూర్చోండి'' అంటూ లోపలికి వెళ్లి ఫ్రిజ్‌లోంచి రస్నతో తిరిగి వచ్చింది.

దాన్ని చూడగానే ఆవిడ మొహం విప్పా రింది. గ్లాసు అందుకుని గడగడతాగి ఇచ్చేస్తూ ''ఎంతైనా చదువుకున్న పిల్లవి గాదూ... మర్యా దబాగా తెలుసు'' అంది.

''అప్పుడప్పుడూ వస్తూండండి బామ్మగా రూ. ఈ ఇంటికీ సంసార బాధ్యతలకీ కొత్తదా న్ని తెలీని విషయాల్లో సలహాలు ఇస్తూండండి''

ముసలావిడ మొహం చాటంత చేసుకుని ''ఇంతగా చెప్పాల్నా అమ్మాయి? నాకు ఓ కోడలుంది. తనుగాబట్టి చదువుకుందని ఉద్యోగం చేస్తోందనే గర్వం. నా మాట ఖాతరు లేదు. సుజాత కూడా మొదట్లో నీలాగే నన్ను అభిమానంగా చూసేది. తరువాత తరువాత మంది మాటలు విందో ఏమోగానీ సరిగానే మాట్లాడేదికాదు. ఎందుకులే పోయినదాన్నిగు రించి చెడ్డగా చెప్పుకోవడం. వస్తానమ్మా'' అంటూ వెళ్లిపోయింది.

ఇలాంటి వాళ్ల మనస్తత్వాలూ వీళ్ల నోరు ఎలా మూయించాలో వీళ్లనేవిధంగా కట్టిపడే యాలో భారతికి తెలుసు.

బామ్మగారు అలా వెళుతూండగానే వచ్చా డు పద్దెనిమిదేళ్ల రామానుజంగారి రెండో కొ డుకు ''అక్కా... అమ్మ మిమ్మల్ని ఓ సారి రమ్మంది'' అంటూ.

''వస్తాను'' నవ్వుతూ చెప్పింది.

ఈ ముసలావిడ్ని ఎక్కువగా రానివ్వకండి. ఈ ఇంటి కబురు ఆ ఇంటికి ఆ ఇంట్లో విషయాలు ఈ ఇంట్లో చెప్పి గొడవలు పెడు తుంది. మాకూ సుజాత అక్కకీ మనస్పర్ధలు వచ్చేలా చేసింది. అప్పటినుండి మేం మా ఇంటికి రానివ్వం. సుజాతక్కయ్య కూడా ఈవి డతో సరిగా మాట్లాడేది కాదు'' అంటూ చెప్పుకొ చ్చాడు.

అదన్న మాట విషయం అనుకుంది భారతి.

★ ★ ★

మధ్యాహ్నం ఒంటరిగా కూర్చుని భోంచె య్యబోతే ఆమెకి ఎక్కలేదు. ఒంటరిగా భోంచే సే అలవాటు తక్కువ కావడంతో ఆమెకి తిన్నట్టుండదు. పైగా దాదాపు నెలరోజులుగా ప్రకాష్‌తో తినడం అలవాటయిందేమో ఆ పూట సరిగా తినలేకపోయింది. ఏదో పుస్తకం పట్టుకుని మంచం మీద వాలింది. అయితే ఆమె పుస్తకం చదవలేకపోయింది. పనిలో బాగా అలిసిపోయిందేమో ఆమెకి అలవాటు లేని గాఢనిద్రముంచుకొచ్చింది. అలా ఎంత సేపు పడుకుందో కాలింగ్‌బెల్ చప్పుడికి మెల కువ వచ్చింది ఆమెకి. తెరిపిళ్లుపడని కళ్లతో బలవంతంగా లేచింది. వచ్చి తలుపు తీసింది.

ప్రకాష్.

అతణ్ణి చూసి ఆమెనిద్ర మత్తు ఎగిరిపో యింది.

''బాగా నిద్రపోయావా?'' అంటూలోపలికి

వచ్చాడు.

"చాలాసేపయిందా మీరొచ్చి?"

"ఇప్పుడే" అంటూ లోపలిగదిలోకి వెళ్లాడతడు. ఆమె ఆశ్చర్యంగా అతడివైపు చూసి బాత్‌రూమ్‌లోకి వెళ్లి మొహం కడుక్కుని వచ్చింది.

"కాఫీ తీసుకు రానా?"

"ఊహూఁ..."

"ఇదేమిటి ఈ టైమ్‌లో వచ్చారు?"

సమయం అప్పుడు సరిగ్గా రెండు. "సరైన టైమ్‌లో వచ్చాను" బట్టలు మార్చుకుని ఆమె దగ్గరికి వస్తూ అన్నాడు. ఆమె ఆశ్చర్యంగా చూస్తూండగానే అతడామెను గాఢంగా కౌగలించుకుని ఉప్పెనలా చుట్టేశాడు. విషయం ఆమెకి అర్థమైంది.

"ఆఫీసు..."

"సెలవు పెట్టాను... ఆమెని బెడ్‌మీదకిచేర్చి తమకంగా ఆమె పెదవులు చుంబిస్తూ అన్నాడు.

ఆమె ఏదో అనబోయింది.

అతడామెని మాట్లాడనీలేదు.

క్రమంగా ఆమె అతడికి వశురాలైపోయింది.

దాదాపు నాలుగు గంటలప్పుడు అన్నాడతడు ఆమె ముంగురులతో ఆడుకుంటూ... "చాలా ఆకలవుతోంది భారతీ... నువ్వు ఇచ్చిన కారియర్ ఆఫీసులో నే వదిలేశాను" అని.

ఆమె చాలా ఆశ్చర్యంగా చూసింది.

తరువాత చాలా సిగ్గుతో "ఇదేమిటి మీరిలా..." మాట పూర్తి చేయలేకపోయింది.

"ఏం చెయ్యను? మనసు పని మీద లగ్నం కాలేదు" అన్నాడతడు.

ఇక అప్పుడేమీ మాట్లాడలేకపోయింది భారతి.

ఆమె వేడివేడిగా టిఫిన్ చేసిపెడితే తింటూ- "కొద్దిరోజులపాటు ఈ పద్ధతి అవలంబించక తప్పేలా లేదు" అన్నాడు ప్రకాష్.

భారతి వెంటనే మాట్లాడలేదు. తరువాత అడిగింది "ఇంట్లో పెద్దవాళ్లెవరూ లేరనుకోండి. వుండివుంటే ఏం చేసేవారు?"

అతడు నవ్వాడు "పెద్దవాళ్లు అంటూ వుంటే సమస్యలేకపోయేది"

"పోనీ పాప బాబు ఇంత చిన్నవాళ్లుకాక కాస్త పెద్దవాళ్లయివుంటే?"

"అప్పుడు ఇలాంటి పరిస్థితి ఎదురుకాదు"

"ఏమో... ఎలా చెబుతారు? మీ దూకుడు చూస్తుంటే నాకు భయం వేస్తోంది అతడామెని ఆర్తిగా దగ్గరికి తీసుకుంటూ- "నేను మూర్ఖుడినికాను, మూగాణ్నీ కాను. వయసు సహజమైన మానవ సహజమైన కోరికలు నాలోవున్నాయి. ఇంకో విషయం కూడా నేను మర్చిపోను భారతీ... దాంపత్యజీవితం సంసారసుఖం నాకు కొత్తకాకపోవచ్చు. నువ్వు కొత్తగా ఎన్నో కలలతో కోరికలతో నా జీవితంలో అడుగుపెట్టావు. ఆ విషయం నేను విస్మరిస్తే ఎంతో పాపం చేసిన వాడినవుతాను. కాదంటావా?" అడిగాడు.

భారతికళ్లు మెరిశాయి. ఒంగి అతడి చెంపని చుంబించింది. తన ఆనందాన్ని కృతజ్ఞతని ఆ ఒక్క ముద్దుద్వారా వ్యక్తపరచిన భారతి కాసేపు మౌనంగా వుండి అడిగింది.

"పోనీ పిల్లల్ని ఓ నెలరోజులపాటు మీ అక్కగారి దగ్గరికి పంపుదామా?"

చప్పున తల అడ్డంగా తిప్పుతూ "ఊహూఁ... వద్దు మళ్లీ వాళ్లు నువ్వు చెప్పినట్టు ఒంటరితనానికి నిరాశకి గురయ్యే ప్రమాదం ఉంది" అంటూన్న ప్రకాష్ ఆమెవైపు చూసి హఠాత్తుగా నవ్వుతూ- ఎంత తెలివైనదానివి? ఇంకాననన్ను పరీక్షించడానికి ఈ ప్రశ్న వేశావుకదూ?" అడిగాడు.

ఆమె తేలిగ్గా విశ్వసించి "అవును... ఈ ఏడాదిగా వాళ్లనుభవించిన బాధ చాలు. మనం వెంటలేనిదే మన పిల్లల్ని ఎక్కడికీ పంపవద్దు" అంది.

"కొన్ని విషయాల్లో నాకు ముందుచూపు నాస్తి. తొందరపాటు ఎక్కువ అలాంటప్పుడు నన్ను నువ్వు హెచ్చరించాలి భారతీ... సుజాత నాకు ఏ విషయంలోనూ ఎలాంటి సలహా చెప్పేదికాదు. ప్రతివిషయంలోనూ నేను చెప్పిన విధంగా నడుచుకునేది. అలా అని తను



తెలివితక్కువదేంకాదు. తెలివైనదే. నాలో నీకు నచ్చని విషయాలుంటే స్పష్టంగా నిర్మొహమాటంగా చెప్పెయ్యాలి సుమా"

"అలాగే ప్రకాష్" అంది భారతి.

పిల్లలు వచ్చారు. బాబు వస్తూనే అడిగిన మొదటి ప్రశ్న నాకు గాలిపటం తెచ్చావా డాడీ? ఏదీ?"

ప్రకాష్ నాలిక్కరచుకున్నాడు. "సారీ అజ్జూ... మర్చిపోయాను రేపు తప్పక తెచ్చిపెడతాను"

బాబు మొహం చిన్నబుచ్చుకున్నాడు. ఫిర్యాదుగా భారతి వైపు చూశాడు.

ఆమె వాడ్ని దగ్గరికి తీసుకుంటూ "ఇప్పుడు అజ్జూ స్నానం చేసి టిఫిన్ చేస్తాడు. అప్పుడు వాళ్లడాడీ వాడిని స్కూటర్ మీద తీసుకెళ్లి తనకి ఇష్టమైన రంగురంగుల గాలి పటాలు కొనిస్తారు" అంది.

బాబు ఎగిరిగంతేశాడు "నిజం?"

"నిజంగా నిజం"

"తప్పదా?" ప్రకాష్ అడిగాడు.

"తప్పదు... రేపు ఆదివారం. రేపంతా మాబాబు గాలిపటం ఎగరేసుకోవాలి"

బాబు గంతులేస్తూ లోపలికి పరుగెత్తాడు. పాప అక్కడే నిలబడిపోయింది.

"అంజూ... గాలిపటం నీకు అక్కరలేదా?" ప్రకాష్ కూతుర్ని అడిగాడు.

చిన్నబుచ్చుకున్న మొహంతో నిలబడ్డపాప చప్పున తలూపుతూ- "కావాలి డాడీ" అంది.

"ఆ విషయం నాకెలా తెలుస్తుంది? బాబు అడిగాడు. అంజూ అడగలేదుగా నన్ను! తనకి అవసరం లేదేమో అనుకున్నాను" అంది భారతి.

ప్రకాష్ భార్యవైపు చూశాడు. ఆమె ఉద్దేశం అతడికి అర్థమైంది.

'మీకేం కావలసివచ్చినా నన్ను అడగాలి. మీరు చెప్పకపోతే మీకేం కావాలో నాకు తెలీదు. కాబట్టి తప్పనిసరిగా నాకు చెప్పాలి' అన్న విషయాన్ని పాపకి అర్థం అయ్యేలా చెయ్యడం కోసం తన సంగతి పట్టించుకోనట్టు నటించింది భారతి.

"నాకు గాలి పటం కావాలి" మెల్లిగా అంది పాప.

అరగంట తరువాత పాప, బాబు తండ్రితో వెళ్ళి గాలి పటాలు, దారపు వుండలు తెచ్చుకున్నారు. వాటిని వెంటనే ఎగరవేయాలని ఉత్సాహపడ్డారు గానీ అప్పటికి చీకటిపడుతోంది.

"రేపు ఉదయం ఎగరేసుకుందురుగానిలే" అంది భారతి.

పాప తండ్రి దగ్గరికి వెళ్ళి "డాడీ ... నేను రాజీ వాళ్లింటికి వెళతాను డాడీ" అంది.

"వెళ్ళు ... అమ్మకి చెప్పి వెళ్ళు" అన్నాడతడు.

పాప సందేహంగా వంటగదిలో వున్న భారతి దగ్గరికి వచ్చింది. గుమ్మంలో నిలబడ్డ పావని చూసి "ఏం కావాలి అంజూ?" అడిగింది భారతి.

"మరి..."

"ఊఁ... మరి?"

"నేను రాజీ వాళ్లింటికి వెళతాను" ఎక్కడ వద్దంటుందోనన్నట్టు చూస్తోంది. "వెళ్ళమ్మా! త్వరగా వచ్చెయ్... సరేనా?"

పాప తలూపి వెళ్ళబోతోంటే "ఆగు అంజూ ... ఉదయం కొత్త ఫ్రాకు కావాలన్నావుగా? నేను మర్చేపోయాను, వేసుకుని వెళుదువుగాని రా" అంటూ వెళ్ళి కొత్త ఫ్రాకు తెచ్చిఇచ్చింది.

పాప సంతోషంగా అందుకుని, వేసుకునివచ్చి హుక్స్ పెట్టమన్నట్టు భారతి దగ్గర నిలబడింది. తనకై తానుగా ఈ కొత్త అమ్మ దగ్గర తన పనికోసం నిలబడటం ఇదే. భారతి హుక్స్ పెట్టగానే సంతోషంగా పరుగెత్తింది పాప.

★ ★ ★

భారతి ఆ రోజు పనితో సతమతమయిపోవడం గమనించి ప్రకాష్ అడిగాడు "భారతీ ... గంగమ్మ రాలేదా?"

"ఊహుఁ ... ఇకరాదు"

"ఏం"

"నేనే రావద్దన్నాను" చెప్పింది భారతి.

అతడు ఆశ్చర్యంగా "ఎందుకని?" అడిగాడు.





ఆమె విషయం చెప్పింది! అతడు నిశ్చేష్టు డయ్యాడు.

"అప్పుడే నీమీద వాళ్ల దాడి ప్రారంభమయిందా?"

"అయింది" అందామె "వీళ్ళదాడికి నేను లొంగను! పిల్లల అమాయకమైన మనసులు వాళ్ల బారిన పడి కృంగిపోకుండా మనంకూడా జాగ్రత్తలు తీసుకోవాలి. పిల్లల్ని వాళ్ళల్లోకి వెళ్లనివ్వాలి. కానీ, వాళ్ల మాటల్ని పిల్లలు నమ్మని విధంగా వాళ్లని మనం మన ప్రేమతో, అభిమానంతో కట్టేసుకోవాలి"

హఠాత్తుగా అడిగాడతడు "నువ్వు గమనించావా? పాప రాత్రినుంచి అదోలా వుంటోంది. ఈ పూట బాబుతో కలిసి ఉత్సాహంగా గాలిపటంకూడా ఎగరవేయటం లేదు"

"అవును ... రాత్రి సరిగా అన్నం తినలేదు కూడా. అరవిందవాళ్ల ఇంటికి వెళ్ళి వచ్చినప్పటినుండి అలా వుంది. నిన్న ఉదయంనుంచీ కనిపించిన ఉత్సాహం లేదు"

"వీళ్ళేం మనుషులు? పచ్చని సంసారాల్లో చిచ్చుపెట్టడానికి తయారవుతారా?" ఆగ్రహంగా అన్నాడతడు.

"చిత్రం ఏమీలేదు ... రకరకాల మనస్తత్వాలతో, స్వభావాలతో కూడిన మనుషులతో నిండి వుంది ఈ సమాజం. ఈ మనుషులు పక్కవాడి ఆనందాన్ని సంతోషాన్ని చూసి ఓర్వలేరు. ఎవర్నీ ఉన్నతంగా గొప్పగా ఊహించడానికి కూడా ఇష్టపడరు. ఎదుటిమనిషిలోని లోపాల్ని వెదికేందుకు ఎప్పుడూ ప్రయత్నిస్తూంటారు. మీరు మరో విషయంకూడా గ్రహించాలి. పాపకి నా గురించీ మీ గురించే కాదు, మన ఇద్దరికీ ఒకర్ని గురించి మరొకరికి చెడుగానో, మరోవిధంగానో చెప్పడానికి సైతం వీళ్ళు ప్రయత్నిస్తూంటారు. అలాంటప్పుడు వీళ్లకి తగిన సమాధానం చెప్పడానికి మనం సిద్ధపడి వుండాలి. చాలామంది చెప్పుడు మాటలు వినేవాళ్ళు వాళ్ళ మాటలకి లొంగిపోయి స్వయంకృతాపరాధాలకు సిద్ధపడిపోతూంటారు.

"అది చాలా తప్పు ... దానిమూలంగా సరిదిద్దుకోలేని పొరపాట్లు జరిగిపోతూంటాయి. ఈ మనిషి ఈ మాట ఏ ఉద్దేశంతో చెబుతున్నాడు అన్న విషయాన్ని గురించి ఆలోచించగలిగే విజ్ఞత మనకి ఉంటే వాళ్ల ఉద్దేశం మనకి అర్థమైపోతుంది. అలా అని మనుషులంతా ఇలా వుండరు. వీళ్లు కూడా చెడ్డవాళ్లుకారు. వీళ్ళల్లో నిజకోణం మాత్రమే ఇది. అయితే ఒకళ్ల గురించి పట్టించుకోనివాళ్లు కూడా వుంటారు. వాళ్ల మూలంగా మనకి లాభనష్టాల నేవి అసలుండవు" అంటూ ముగించింది భారతి.

అతడు ఆలోచనల్లో పడ్డాడు.

"సాధారణంగా రెండో పెళ్ళి వ్యక్తిని చేసుకున్న స్త్రీలు తప్పనిసరై చేసుకున్నవారై వుంటారు. అందులో బిడ్డల తండ్రిని చేసుకున్నవారు అసంతృప్తితో నిండివుంటారు. అలాంటి స్త్రీలను వీళ్ల మాటలు మరింత అసంతృప్తి పాలూ, అశాంతి పాలూ చేస్తాయి. నాకు తెలుసు, అప్పుడా సంసారం నరకం అవుతుంది" గొణుగుతూన్నట్టందామె.

"ప్రకాష్‌బాబూ..." ఎవరో పిలిచారు.

అతడు వెళ్ళాడు.

అప్రయత్నంగా భారతి మనసు గతంలోకి తొంగిచూసింది.

★ ★ ★

పెద్దదిగా వున్న అద్దం ముందుకూర్చుని మాటిమాటికీ తన మెడలోని నగలవైపు చూసుకుంటోంది తులసి. ఆమెలో రకరకాల భావాలు. ఆ నగలు మరణించిన ఆమె సవతి రాధవి. ఇప్పటివరకూ అవి తాకట్టుకింద వుండేవి. నిన్నరాత్రే వాటిని తెచ్చాడు మూర్తి.

తెస్తూనే ఆమెకి ఇచ్చి "ఇకనుండి నువ్వు ఎప్పుడూ వీటిని వేసుకుని వుండు తులసీ" అన్నాడు.

ఓ రెండు పేటల నల్లపూసలదండ, నాలుగు గాజులూ. అంతక్రితం పెళ్లప్పుడే ఆమెకి అతడు ఓ నానుతాడు, ఉంగరం, రాళ్ళదిద్దులూ ఇచ్చాడు. ఇప్పుడీ నగలు ధరించడంతో తన అందం ద్విగుణీకృతమయినట్టు అనిపించసాగింది తులసికి. ఆమెకి చాలా ఆనందంగానూ, గర్వంగానూ అనిపించసాగింది. బంగారు నగ అంటూ చిన్నతనంలో ఎప్పుడు ఆమె ఒంటిమీద వుందో ఆమెకి

సరిగ్గా గుర్తులేదు. ఒకప్పుడు వాళ్ళింట్లో బంగారం బాగా వుండేది. తండ్రి వ్యసనం, దానిమూలంగా ఇంట్లో జరుగుబాటు లేకపోవ డంతో నగలన్నీ హారతి కర్పూరంలా హరించు కుపోయాయి.

ఆ నగలుదాచుకునే పెట్టెమాత్రం వాళ్లింట్లో నగల బీరువాలో ఉండేది. తులసి అప్పుడప్పు డూ ఆ పెట్టెని తీసి చూస్తూండేది. అమ్మ, నాయనమ్మ చెప్పే నగల కబుర్లు ఆసక్తిగా వినేది. ఏ నాటికైనా ఆ పెట్టె ఎప్పటిలా నగలతోనిండి పూర్వ వైభవాన్ని సంతరించుకో కపోతుందా అన్న ఆశ వుండేది ఆమెలో. ఆమె ఇతర ఆశలూ, కోరికలూలాగే అదీ తీరని కోరిక అయింది. ఇప్పుడు ఈనాటికి ఈ రెండో పెళ్ళి భర్త మూలంగా మంచి నగలు పెట్టుకోవాలన్న ఆమె కోరిక తీరుతోంది.

"ఈ సంవత్సరం ఆదాయాలు బాగు న్నాయి. ఇంకా బంగారం తాకట్టులో వుంది. విడిపించేస్తాను త్వరలో' అన్నాడు మూర్తి.

భర్తమీద తులసికి రాత్రినుండి కాస్త ప్రేమ అధికమయింది. మొదట్లో మూర్తితో ఆమె ప్రేమ నటించేది. క్రమంగా అతడు తనపట్ల కనబరుస్తూన్న శ్రద్ధ, విపరీతమైన ప్రేమని గమనించేకొద్దీ ఆమె మనసు కాస్త సమాధానప డసాగింది. ఆమె కొత్తరకంగా ఆలోచించడం ప్రారంభించింది.

మూర్తికి కాస్త వయసు ఎక్కువనిగదా తనిలా బాధపడుతూంది. అదే తన పద్ధెనిమి దేళ్ళ వయసులో ఇదే మూర్తితో పెళ్లయివుంటే ఎలా వుండేది తను?

చాలా సంతోషంగా ఒప్పుకుని వుండేది. ఎందుకు అంటే అప్పుడతడికి ఇరవై ఎనిమి దేళ్లు వుండేవి. అప్పుడు తను చాలా ఆనందంగా కాపురం చేసేది. ఇప్పుడు తనకీ పెళ్ళి వయసు మీరడం ... మూర్తికి భార్య పోయి రెండో పెళ్ళికి సిద్ధపడటంతో అతణ్ని వయసు ముదిరినవాడిలా భావిస్తూ అసంతృ ప్తిచెందుతోంది తను.

ఒక్కొక్క సారి ఇలా ఆలోచిస్తూ తనకి తాను సర్దిచెప్పుకోవడానికి ప్రయత్నించేది.

ఇంకోసారి...

అదే జరిగివుంటే ఇలా వగచాల్సిన అవ సరం ఏముండేది? చిన్నవయసులో అతడితో పెళ్ళి జరిగివుంటే తాను ఇప్పటికి కానుపుతో, సంసారబాధ్యతలతో అవ్వలా తయారయి వుండేది; అతడికి తగిన జోడీ అయివుండేది. ఇప్పుడలా కాదే ... మూర్తి కాస్త పెద్దవాడిలా అనిపిస్తోంటే తను మంచి వయసులో అందంతో రెండో పెళ్ళి భార్య అని చూసేవాళ్ళ కి అనిపించేలావుంది. ముఖ్యంగా అతడికి బిడ్డలున్నారు. ఇది మరో మైనస్ పాయింట్ అయింది తులసి దృష్టిలో.

ఇలా ఆలోచించే తులసి మరోలా ఆలో చించలేకపోయేది.

అతడు మరో పది సంవత్సరాలు తక్కువ వయసుగలవాడైవుండి పిల్లలు కూడా లేకపో యివుండిన పక్షంలో భార్య పోయిన వెంటనే తనకంటే చిన్న అమ్మాయిని చాలా మంచి సంబంధం చూసి కట్నకానుకలతోసహా పెళ్లాడి వుండేవాడని ఆమె ఆలోచించడానికి ప్రయ త్నించేదికాదు. ఆమె మనసులోకి బాధకి తోడు ఈమధ్య ఓ సంఘటన జరిగింది.

తులసికి సినిమాలపిచ్చి అధికం అనే చెప్పాలి. పుట్టింట్లో తండ్రికి పెద్దగా గిట్టకపో యినా ఆమె తల్లి మాత్రం "ఈ ఇంట్లో ఆడపిల్లలకి సుఖపడే యోగ్యత ఎలాగూలేదు. ఇంట్లో కూర్చుని పొద్దస్తమానం ఏం చేస్తారు, జీవితాన్ని గురించి ఏడవడం తప్ప. ఏ సిని మాకో వెళ్లి వస్తే మనసు కాస్త సంతోషంగా వుంటూది" అంటూ కూతుర్లు అడిగితే కాదన కుండా సినిమాలకి పంపేది.

రానురాను అది 'అన్నం లేకపోయినా ఓ పూటకి ఫర్లేదు ... సినిమావుంటే చాలు' అను కునేలా తయారయ్యారు తులసీ, ఆమె చెల్లె ళ్ళూ.

భార్య యొక్క ఈ సినిమాల పిచ్చిని మూర్తి ఏనాడూ విమర్శించలేదు. అతడి మొదటి భార్య ఎప్పుడో అతడు పిలిస్తేనో, పిల్లలు గోల చేస్తేనోతప్ప సినిమాలకి వెళ్ళేదికాదు. కొత్త భార్య అలాకాదు సినిమాల పిచ్చిది. ఈ విషయం మైకంలో మునిగివున్నట్టుగా వున్న అతడు ఏ మాత్రం పట్టించుకోలేదు. అరుంధ తమ్మ మాత్రం గొణుక్కుంటూ వుండేది. ప్రతి

రెండు మూడురోజులకోసారి మూర్తి తులసిని సినిమాకి తీసుకెళుతూండేవాడు. అలా సినిమాకి వెళ్ళినప్పుడు ఓసారి ఈ భార్యాభర్తల వెనుక సీట్లలో కూర్చున్న ఇద్దరు యువకుల కామెంట్స్ తులసి మనసుని కలతబార్చాయి.

"ఈ అంకుల్ పక్కన కూర్చున్న బేబీ ఎవర్రోయ్?"

"అబ్బ ... బేబీ ఏం షోగ్గా వుందిరా?"

"ఎవరై వుంటుంది? చెల్లెలై వుంటుందంటావా?"

"నీ మొహం ... కూతురయి వుంటుంది. చూస్తూంటే తెలీడంలేదూ?"

"కొంపదీసి రెండో పెళ్ళి భార్య కాదుగదా?"

"నోర్ముయ్ ... ఆమాట నీ నోటికెలా వచ్చిందిరా వెధవా! ఈ పాపకసలు పెళ్ళయి వుండదు, పందెం"

ఈ మాటలు విని తులసి మనసులోనే కృంగిపోయింది. వాళ్ళమాటలు అతిశయోక్తుల్లాకాక వచ్చినిజాల్లా ఆమెకి అనిపించాయి. వాళ్లు సంస్కారహీనులనీ, తండ్రినీ కూతుర్నీ గురించి కూడా ఇలాగే మాట్లాడగలరనీ ఆమె ఆలోచించలేకపోయింది. పెళ్ళయ్యాక ఆమె ఎప్పుడూ అంతగా మానసిక వేదనని అనుభవించలేదు.

'నిజంగా మూర్తి తనకంటే చాలా పెద్దవాడిలా అనిపిస్తాడు' అన్న ఆలోచన ఆమెని వేధించసాగింది.

అయితే తనతోపాటు మూర్తికూడా ఈ మాటల్ని విన్నాడని, విననట్టే వుండిపోయాడనీ ఈ మాటలు అతడిలోనూ అశాంతిని రేపాయన్న విషయం ఆమె గ్రహించలేకపోయింది. అతడిలోనూ తను భార్యముందు వయసు మళ్ళిపోయిన వాడిలా వుంటాడు అన్న భావన పెరిగి పెద్దదవసాగింది. ఈ మాటలు భార్య విన్నదేమోనని అతడు భయపడ్డాడు. ఆ తరువాత అతడు తన వయసు పటుత్వం ఏమాత్రం తగ్గలేదు అన్న విషయం భార్య దగ్గర రుజువు పరచాలన్న తహతహతో ఈ విషయాన్ని పడకగదిలో రుజువుపరచడానికి ప్రయత్నించేవాడు - చాలామంది రెండో పెళ్ళి భర్తల్లాగే.

అయితే అతడికి తెలీదు ... దీన్ని గురించి రేయింబవళ్ళూ ఆలోచిస్తూ తన భార్య మనసు పాడుచేసుకుంటోందని. ఆమె అతణ్ణి అనేక యాంగిల్స్‌లోనుండి చూస్తూండేది. మూర్తి మంచి పొడుగరి. మంచి రంగు. ఎత్తుకి తగిన లావు. తల కాస్తపలచబడింది. పలచబడటంకూడా కాదది జుట్టు కాస్త పైకి ఎగదోసుకుపోయింది. అలా అని బట్టతల కాదు. భర్తకి ఒత్తయిన క్రాఫ్ లేకపోవడం తన దురదృష్టంగా భావించి వ్యధచెందేది ఆమె.

"తులసీ... నువ్వు చాలా అందంగా వుంటావు" అని ఎవరైనా అంటే అద్దంముందు నిలబడి వాళ్ల మాటని "నువ్వు నీ భర్తకంటే చాలా చిన్నగా అనిపిస్తావు" అన్న ఉద్దేశ్యంతో అలా అనలేక ఆ అర్థాన్ని పరోక్షంగా ఈ మాటలద్వారా వ్యక్తపరిచారు అనుకుని కృంగిపోయేది ఆమె.

ఒక్కోసారి మూర్తి ఆమె కళ్లకి చాలా పెద్దవాడిలా కనిపించేవాడు. ఆ తరువాత తరువాత క్రమంగా భర్తతో మాట్నీషోలకీ ఫస్ట్ షోలకీ వెళ్లడం తగ్గించేసిందామె. అలా వెళ్లుతూన్నప్పుడు దారంట చూసేవాళ్లు వయసుమళ్లిన భర్తకి వయసులోవున్న భార్య అని ఎక్కడ చెప్పుకుంటారోనన్న భయం. అలా అని సినిమాలు చూడకుండా వుండనూ లేదు. భర్తని సెకండ్ షోలకి బయలుదేరదీసేది.

"సెకండ్‌షోకి వెళ్లడం ఎందుకు తులసీ? నిద్రపాడు చేసుకోవడం కాదా?" అయిష్టంగా భర్త అంటే...

"సెకండ్ షో అయితేనే బావుంటుంది. హడావుడిగా పనిచేసుకుని ఉరుకులూ పరుగుల మీద వెళ్లాల్సిన బాధ వుండదు. నింపాదిగా వెళ్లి హాయిగా చూడవచ్చు. పైగా మీ అమ్మగారు పిల్లల్ని కూడా తీసుకెళ్లడం లేదంటూ గొణుగుతూంటారు. రెండో ఆటకి బయలుదేరితే పిల్లలు నిద్రపోతారు. సమస్యే వుండదు" అంటూ నచ్చజెప్పింది తులసి.

తులసి ఈ మాటలు చెప్పినప్పుడు అదీ నిజమే అనిపించింది గానీ ఈమధ్య పిల్లల విషయం పట్టించుకోవడం తను బొత్తిగా మర్చిపోయాడని పిల్లలకీ తల్లిదండ్రులతో కలసి బయటికి వెళ్లాలన్న కోరిక వుంటుందన్న ఆలోచన అతడికి రాలేదు. ఈ విధంగా భర్తతో




కలసి బయటికి వెళ్లే అవసరాలు లేకుండా చేసుకుంది తులసి.

మరో విషయం ఆలోచించడానికి కూడా తులసి ఇష్టపడేది కాదు. తనకి ఏ పదిహేడో ఏటనో పెళ్లి అయివుంటే భారతి వయసు కూతురు వుండివుండేదని ఆమె ప్రతి ఆలోచనా తనకి అనుకూలమైన తన మనసుకి సంతృప్తినీ అసంతృప్తినీ సమానంగాపెంచే వాదనతో కూడివుండేవి. ఆమె మనసు ఆమె అదుపులో లేకుండా పరిపరి విధాల ఆలోచనలతో దిగుళ్లతో సతమతమవుతూ ఉండేది. అలా అని ఆమె తన భర్తని ద్వేషించలేకపోయేది. దానికి కారణం అతడామెపట్ల చాలా ప్రేమని వ్యక్తపరచడం. ఆమెని ఎంతో అపురూపంగా ఒక వరంలా భావించడం.

ఆమె మనస్ఫూర్తిగా ఇష్టంగా మూర్తిని పెళ్లి చేసుకోలేదు. జీవితంలో రాజీపడి మాత్రమే చేసుకుంది. ఇది ఆమె పరిస్థితి మాత్రమే కాదు. ఎందరో మధ్యతరగతి కుటుంబాలకి చెందిన ఆడపిల్లలవి కూడా.

ఏ ఆడపిల్లా రెండోపెళ్లి మగవాణ్ని చేసుకోవడానికి మనస్ఫూర్తిగా అంగీకరించదు. ఏ బాధ్యతలూ లేని తిరుగుబోతు బ్రహ్మచారి యువకుడినైనా చేసుకోవడానికి అంతగా సందేహించదేమోగానీ, రెండోపెళ్లి వ్యక్తిని మాత్రం ఇష్టపడదు. కానీ ఇక్కడ చేసుకోక తప్పని పరిస్థితులు ఎదురవుతున్నాయి. దానికి కారణం ఆర్థిక బలహీనత. డబ్బులేని కారణంగా కట్నం ఇచ్చుకోలేక ఆడపిల్లలకి పెళ్లిళ్లు కావడంలేదు. వయసుమీరిపోతోంది. సమాజంలో పెళ్లికాని ఆడపిల్ల చిన్నచూపుకి గురవుతోంది.

ఈ సమస్య దిగువ, పై తరగతి కుటుంబాలకి వుండదు. కేవలం మధ్యతరగతి కుటుంబాల మీదనే వరకట్నం చాలా ప్రభావాన్ని చూపిస్తోంది. ఎందరో కన్నెల జీవితాల్ని ఎండగడుతోంది, బలి తీసుకుంటోంది. చదువుకుని ఆర్థికస్వాతంత్ర్యాన్ని పొంది తమకాళ్ల మీద తాము నిలబడగలిగిన స్త్రీ విషయం వేరు. తులసి లాంటివారి పరిస్థితి చాలా దయనీయమైనది. వారికి చదువుకునే స్థోమత లేదు. అటు చదువుకోలేక ఇటు కట్నం ఇచ్చి పెళ్ళిళ్లు చేసుకునే వీలూలేక త్రిశంకు స్వర్గంలో ఉన్నలాంటి స్థితిలో చిక్కుకుపోతున్నారు. తులసికి ఓ స్నేహితురాలు ఉండేది. ఆమె అనేది...

"ఏం మీ నాన్నే సంబంధం వెదకాలి కట్నం ఇచ్చి మొగుడ్ని తీసుకురావాలి అని ఎగురు చూస్తూ కూర్చోకపోతే ఏ ఆదర్శవివాహమో చేసుకోరాదూ? నీ కులం నీ గోత్రం ఉన్న వ్యక్తేకావాలి అనుకోకుండా ప్రేమ వివాహం ద్వారా నీకు నీ మనసుకీ అన్ని విధాలా నచ్చిన వ్యక్తిని భర్తగా పొందవచ్చుగదా? అది ఆదర్శం కూడా అవుతుంది"

ఆదర్శాలనుగురించి పదేపదే వల్లించే ఆ స్నేహితురాలికి సకాలంలో పెళ్లయిపోయింది. ఆమె తండ్రి రెండు లక్షల కట్నంతో ఘనంగా పెళ్లి జరిపించాడు. ఇలాంటివాళ్ల మాటలు ఎలా ఉంటాయా అంటే ఏడంతస్తుల మేడలో కూర్చుని పంచభక్ష్య పరమాణ్ణాలతో భుజించిన వ్యక్తి గుడిశెలో ఆకలితో పేగులు మాడ్చుకుంటూన్న అవిటివాడికి ఎన్ని లక్షలూ కోట్లూ సంపాదిస్తే సులభంగా మేడకట్టేయవచ్చో చెబుతూన్నట్టుగా ఉంటాయి. అసలు పది రూపాయలు సంపాదించి కడుపునింపుకునే అవకాశమే అవిటి వాడికిలేదన్న విషయాన్ని ఇలాంటివాళ్లు పట్టించుకోరు. తులసి నలుగుర్లో తిరగే అవకాశంవున్న ఆడపిల్లకాదు. ఉద్యోగం చేసే అమ్మాయికాదు. నాలుగు గోడల మధ్య కట్టిపడవేసినట్టు పడివుండే మామూలు ఆడపిల్ల.



పెళ్లయిన తరువాత చాలారోజులకి తులసికి పుట్టింటిమీద ధ్యాసమళ్లింది. భర్తతో పుట్టింటికి బయలుదేరింది. ఒకనాడు తనకి

పెళ్ళికాలేదని 'ఇక జన్మలో కాదు' అని హేళనగా చిన్నచూపు చూసినవారికి తనవైభోగాన్ని చూపించడంకోసం చేస్తున్న ప్రయాణమది. ఓవైపు మనసులో తనభర్తని పెద్దవయసువాడనుకుంటారేమోనన్న అనుమానం పీకుతూనే వుంది. అందుకే ఆమె ప్రయాణానికి వారంముందుగానే అతడ్ని తనకి ఇష్టంవచ్చిన రీతిలో మలచడం ప్రారంభించింది. అది బాహ్యాలంకరణకి సంబంధించి.

తనకిష్టమైన రంగుల్లో బట్టలు తెప్పించింది. వాటిని తనకి ఇష్టమైనరీతిలో కుట్టించమని భర్తని కోరింది. మూర్తి తబ్బిబ్బయ్యాడు. ఈ కొత్త భార్య తనకి సంబంధించిన ప్రతి చిన్నవిషయాన్నీ పట్టించుకోవడం అతడికి అపరిమితమైన ఆనందాన్ని కలిగించింది.

"ఈ నేరోపాంట్లూ ఈ బిగుతు చొక్కాలూ ఎవరు వేసుకుంటున్నారండీ ఇప్పుడు, ఎవరో మునలివాళ్ళు తప్ప! బట్ట ఒంటికి అంటుకుపోతే ఏం బావుంటుంది?'' అంది.

భార్య తనని పెద్దవాడిగా భావించకపోవడం మూర్తికి ఎంతో సంతృప్తిని కలిగించింది.

"మరీ కాలేజీకుర్రాడిలా నేను బట్టలేసుకోవడం ఏం బావుంటుందీ?'' సందేహంగానే అన్నాడు మూర్తి.

"పోనీ ఓపని చేయండి. చక్కగా లాల్చీపైజమాలు అలవాటు చేసుకోండి! పదహారేళ్లవయసు వాళ్లనుండి ఎనభైఏళ్లవాళ్లవరకూ అందరూ ఈరకం దుస్తుల్ని ఇష్టపడతారుగదా?'' అంది.

ఇది మూర్తికి నచ్చింది.

"మీరు మంచిరంగు కదా? కళ్లకి కూలింగ్ గ్లాసెస్ పెట్టుకుంటే బావుంటుంది'' అంటూ రంగుఅద్దాలు కొన్నదాకా వూరుకోలేదు.

"తలకి నూనె అంతలా అంటుతారేమిటి? రోజూ షాంపూచేసుకుంటే జుట్టు పొడిగా చక్కగా వుంటుందిగదా'' అంటూ తలకి నూనె పెట్టే అలవాటుసైతం మాన్పించేసింది.

మూర్తికి ఇప్పుడు తనవయసు అయిదేళ్లు తగ్గినట్టుగా అనిపించి మనసుకి చాలా ఆనందం కలిగింది. ఈ సరికొత్త గెటప్‌లో నిజానికి మూర్తివయసు గణనీయంగా తగ్గిపోయినట్టు చూసే జనాలకి అనిపించిందో లేదో తులసికి తెలీదుగానీ ఆమెకిమాత్రం కాస్త సంతృప్తిగా అనిపించింది. ఇంట్లో అరుంధతమ్మ ఇంటిపక్కలవాళ్లు మూర్తియొక్క ఈ కొత్త వేషాన్నిచూసి బుగ్గలు నొక్కుకున్నారు.

తులసి ఇదేమీ పట్టించుకోలేదు. ఆమె భర్తతో కలసి పుట్టింటికి బయలుదేరింది. అక్కడ ఇరుగూ పొరుగూ వాళ్లకి స్నేహితురాళ్లు అనదగ్గ వాళ్లకి తన ఒంటిమీది నగల్నీ తన భర్తనీ సగర్వంగా చూపించింది. అంత క్రితం పెళ్లప్పుడు తులసి భర్తన్ని ఎవరో ముఖ్యులైన నలుగురు బంధువులు తప్ప మిగతా వాళ్లెవరూ చూడలేదు. చాలా వేగంగా నిశ్శబ్దంగా జరిగిపోయిందామెపెళ్లి. ఇప్పుడు తులసిని ఆమె భర్తని చూసి తులసి మంచి ఇంటికే వెళ్లిందనుకున్నారువాళ్లు.

"మీ ఆయన బావున్నాడే తులసీ'' అన్నారు.

తులసి అపరిమితమైన ఆనందాన్ని అనుభవించింది. "రెండోపెళ్లి వ్యక్తి అంటే కాస్త వయసు ముదిరినవ్యక్తేమో అనుకున్నాం... ఫరవాలేదు'' అన్నారు.

తులసి తన భర్తని వాళ్లు యువకుడిగా భావిస్తున్నారని సంతోషించిందే గానీ ఇప్పుడు ఇక్కడివాళ్లు తన వయసుని కూడా దృష్టిలో వుంచుకుని మాట్లాడుతూన్నారన్న విషయాన్ని గుర్తించలేదు.

"మీ పిల్లల్ని తీసుకురాలేదేం'' తులసి వైభోగానికి ఈర్ష్యపడ్డ ఓ స్నేహితురాలు అంది.

"పిల్లలా పిల్లలేమిటి? ఒక బాబుమాత్రమే'' అంది.

వాళ్లు మొహమొహాలు చూసుకుని "మీ ఆయన పెద్ద భార్య కూతురుకూడా వుంది గదా?'' అన్నారు.

"లేదు మీరు పొరబాటుగా వినివుంటారు. ఒక్క బాబు మాత్రమే. వాడికి ఆరేళ్ళు. వస్తానంటూ వెంటబడ్డాడు గానీ, వాళ్ల నాన్నమ్మ వాడిని చూడకుండా వుండలేదు. అందుకని తీసుకురాలేకపోయాం. నేనంటే వాడికీ వాడంటే నాకూ ప్రాణంతో సమానం అనుకోండి'' నిజ జీవితంలో సవతిపిల్లల ఉనికిని





ఏమాత్రం సహించలేని మానసికస్థితిలో వున్న తులసి ఇప్పుడు వాళ్లపట్ల మాటల్లో మమకారాన్ని గుప్పిస్తూ మాట్లాడింది.

ఆమె ఇక్కడ మరో విషయాన్ని కూడా మర్చిపోయింది. తన పుట్టింటివాళ్లద్వారా భర్త వివరాలని ముందుగా వాళ్లు తెలుసుకుని వుంటారన్నది.

అయితే తులసీ నేను తొందరలో విజయవాడ వస్తాను. మా పెదనాన్న రెండో కొడుకుపెళ్లి వుంది. అప్పుడు మీ ఇంటికి వస్తాను. వచ్చి నీగుట్టూ మట్టూ తేల్చుకుంటాను అన్నట్టే అంది ఓ స్నేహితురాలు.

''మేం త్వరలో ఇల్లు మారబోతున్నాం'' పక్క గదిలో వున్న భర్తకి వినిపించకుండా గొంతు తగ్గించి అంది.

''అదేమిటి? సొంత ఇల్లేగదా?''

''సొంత ఇల్లే. మంచి సౌకర్యంగా కూడా ఉంటుంది. మావారి షాపుకి దూరమైపోయింది. అందుకని ఇల్లు అద్దెకి ఇచ్చి మాకు సౌకర్యంగా మా వారికి దగ్గరగా వుండే ఇల్లు చూసుకుందాం అనుకుంటున్నాం. నువ్వు గబుక్కున వచ్చేశావంటే ఇబ్బంది పడతావు. నేను వెళ్లాక కొత్త ఇంటి అడ్రస్‌తో ఉత్తరం రాస్తాన్లే'' అంది.

వాళ్లకి తన భర్త పెళ్లయ్యాక కొని ఇచ్చిన ఖరీదయిన చీరలు చూపించింది. అంతకు ముందు తులసికి దాపుడుకంటూ రెండు చీరలు మాత్రమే వుండేవి.

''ఇంకా నగలున్నాయి. మోయడం విసుగుగదా? అందుకే వేసుకురాలేదు'' చెప్పింది.

''మా వారి బిజినెస్‌లో చాలా ఆదాయాలుంటాయి'' అని చెప్పుకుంది.

మావారు ఎమ్మే. అప్పట్లో ఉద్యోగం చెయ్యడం ఇష్టంలేక స్వతంత్రంగా తన కాళ్ల మీద నిలబడాలన్న పట్టుదలతో బిజినెస్ ప్రారంభించారు'' గొప్పగా చెప్పింది.

నిజానికి మూర్తి బి.ఎ. చదువుతూ ఆర్థికపరిస్థితి సహకరించని కారణంగా చదువు మధ్యలో మానేశాడు. అయితే ఆ తరువాత అతడు స్వయంకృషితో పైకి వచ్చాడు. మొత్తానికి తులసి బడాయి కబుర్లన్నీ ఆమె స్నేహితురాళ్లు విన్నారు. వాళ్లు తన మాటలు నమ్మారా లేదా అన్న విషయం తులసికి అనవసరం. తులసిలాంటి స్త్రీలు ఈ సమాజంలో మనకి ఎదురవుతూనే ఉంటారు. తులసి నిరుపేద కుటుంబంలో పుట్టి వుంటే ఎటువంటి పరిస్థితుల్లోనూ ఇలా ప్రవర్తించి వుండేదికాదు. దొరికిన దానితోనే సంతృప్తి పడి వుండేది. ఆమె బ్రతికి చెడిన మధ్యతరగతి కుటుంబానికి చెందిన యువతి. ఆమె కలలూ కోరికలూ ఫలించలేదు.

మనసులో జీవితం పట్ల ఎంతో అసంతృప్తిని నింపుకునివున్న ఆమె ఒకనాడు తననిగురించి చులకనగా చెప్పుకున్నవారికి తన వైభోగాన్ని చూపించేవాళ్ళు ఈర్ష్య పడుతూన్నారని భావిస్తూ కొంతలో కొంత సంతృప్తిని పొందగలుగుతోంది. పేదతనంలో వున్న ఆమె పుట్టింటివారు ఆమెకి ఆమె భర్తకి బ్రహ్మరథంపట్టారు. చేతినిండా డబ్బుతో వచ్చిన తులసి అక్కడున్న నాలుగు రోజులూ చాలా ఉత్సాహంగా ఆనందంగా గడిపి తిరిగివచ్చింది. ఇంటికి వచ్చాక అప్పటిదాకా గాలిలో విహరిస్తూన్నట్టుగావున్న ఆమె పరిస్థితి హఠాత్తుగా నేలమీదకి జారి పడినట్టయింది ఓ చిన్న సంఘటనతో.

ఆరోజు అరుంధతమ్మ కోడల్ని అడిగింది. ''తులసీ... ఆ గాజులూ నల్లపూసలదండా ఎప్పుడు తెచ్చాడే అబ్బాయి?''

''పదిరోజులయింది'' చెప్పింది తులసి.

పదిరోజులక్రితమే అరుంధతమ్మ చూసింది. అయినా తెలీనట్టే ఇప్పుడు అడిగింది.

''ఓ జత గాజులు భారతికి ఇవ్వలేకపోయావామ్మా?''

తులసిమొహంలో రంగులు మారాయి ఈ మాట వినగానే. ఆమె ఏమీ మాట్లాడలేదు.

''బడికి వెళ్లి చదువుకునే పిల్ల! ఎదుగుతూన్న పిల్ల. దాని సైజు చేయిస్తే చక్కగా వేసుకు వెళుతుందిగదా?''

''నాకు తెలీదు. మీ అబ్బాయి నన్నే వేసుకోమన్నారు'' తులసి కోపంతో విసురుగా అంది.

''నేను వాడితో చెబుతాను! దాని తల్లివేగా ఆ గాజులు! మేం చేయించినవికూడా కాదు.

దాని పుట్టింటివాళ్లు చేయించారు'' నిష్టూరంగా అంది అరుంధతమ్మ.

తులసి ఛర్రున కదిలి నాలుగు గాజులూ, నల్లపూసలగొలుసూ తీసి విసిరేసినట్టు అత్తగారిముందు పడేసి గదిలోకి వెళ్లి తలుపులు వేసుకుంది. అరుంధతమ్మ తెల్లబోయింది.

''ఇప్పుడు నేనేమన్నానే తులసీ? పిల్లదానికి రెండు గాజులివ్వమన్నాను! అంతకే తప్పయిపోయిందా? ఇదిగో నీ సొమ్ము నువ్వు తీసుకో అమ్మా! ఎందుకు గొడవ?'' అంది తలుపుదగ్గిరికి వెళ్లి.

ముసలావిడ కొడుక్కి భయపడుతోందని అర్థంచేసుకున్న తులసి ఈ గొడవమూర్తిదగ్గిరికి తీసుకువెళ్లినదాకా వూరుకోలేదు.

''మీ అమ్మ నన్ను కేటాయింపుగానే చూస్తోంది. గాజులు నాదగ్గర ఉంటే ఒకటీ, భారతి దగ్గర వుంటే ఒకటీనా? రేపు తను పెద్దదయ్యాక తనకిగాక నేను అట్టిపెట్టుకుంటానా? నాకసలు వీటిని వేసుకోవడం ఇష్టంలేదు. మీ మనసు బాధపడుతుందని తీసుకున్నానే గానీ'' అంటూ కళ్ళనీళ్లుపెట్టుకుంది.

మూర్తికి తల్లిమీద పట్టరాని ఆగ్రహం వచ్చింది.

ఛర్రున కదిలివెళ్లి ''అమ్మా పెద్దదానివవుతున్నావుగానీ బుద్ధిమాత్రం మందగించిపోతోంది నీకు! తులసిని నువ్వు పరాయిదానిగా చూస్తావెందుకు? నీకు రాధ అయితే ఒకటీ, తులసి అయితే ఒకటీనా? ఎందుకిలా తయారయ్యావు నువ్వు? కోడలితో కలిసిమెలిసి వుండవు! పిల్లల్ని కలవనీవు! ఏమిటి నీ ఉద్దేశం? అలాంటి దానివి నాకెందుకు మళ్లీ పెళ్లిచేశావు?'' అని గద్దించి అడిగాడు.

అరుంధతమ్మ కొడకువైపు తెల్లమొహంవేసుకుని చూడసాగింది. భారతి తండ్రినే భయంగా చూస్తోంది.

''ఇదేనీకు చెప్పడం! తులసిని బాధపెట్టేలా ఒక్కమాట అన్నా నేను సహించలేను! రేపోమాపో మంచంలో పడతావు. తనచేతుల మీదుగా వెళ్లవలసినదానివి....'' మూర్తి నవమాసాలూమోసి కని కష్టపడి పెంచిన ఆ తల్లికి కొడుకులా మాట్లాడటంలేదు.... ముద్దుల భార్యకి భర్తలా మాట్లాడాడు.

అరుంధతమ్మ గుడ్లనీళ్లు కుక్కుకుంది. ఆవిడ పెద్దరికం కోడలిముందు ఘోరంగా దెబ్బతింది. మూర్తి మళ్లీ నగలు భార్యకిచ్చాడు. అతనిచేత పదిసార్లు బతిమాలించుకుని గానీ తుళసి వాటిని తీసుకోలేదు. అయితే అరుంధతమ్మ ఈ విషయాన్ని ఇంతటితో వదిలివెయ్యలేదు. ఇరుగూపొరుగూకి చెప్పుకుని ఏడ్చింది. పంతంతో తనచేతుల్లోవున్న పాతకాలంనాటి వత్తుల్ని కత్తిరించి భారతికి రెండు గాజులు చేయించిది. ఈ విషయం తులసికి తెలిసింది. అటు అత్తగారివట్ల, ఇటు పిల్లలపట్లవ్యతిరేకత పెరిగింది. అరుంధతమ్మ తనగురించిన ప్రతివిషయం చుట్టుపక్కలవాళ్లతో చెబుతోందని తెలుసుకున్న తులసి తన తరపు వాదనని వాళ్లకి వినిపించడానికి అలవాటుపడిపోయింది.

సవతి తల్లికీ, పిల్లలకీ మధ్య దూరం పెరుగుతూనేవుందిగానీ తరిగేమార్గం కనిపించడంలేదు. పైగా భారతి తనని అమ్మ అని పిలవడం ఆమెకు ఎంత బాధ కలిగించేదో చందూ అసలు తనని పట్టించుకోకపోవడం ఆమెకి అంతే బాధనీ, కోపాన్నీ కలిగించేది. ఎప్పుడైనా ఆమె ఏదైనా పని చెబితే వాడు చేసేవాడు కాదు. ఆఖరికి వాడ్నిచూస్తేనే మండిపడేస్థితికి వచ్చింది తులసి. దీనికితోడు ఇరుగుపొరుగువాళ్లు, ఇంట్లో అత్తగారూ ఎప్పుడూ ఆ పిల్లల తల్లి మంచితనంగురించి పొగడుతూండేవారు. తులసికి ఆమాటలు వింటూంటేచెవుల్లో సీసంకరిగించి పోస్తూన్నటుండేది.

ఆమె ఆ ఇంటికి, మూర్తికి భార్యగాకంటే అతడి పిల్లలకి తల్లిలేనిలోటు తీర్చడంకోసంగా వచ్చింది. అయితే ఆమె ఈ విషయాన్ని పూర్తిగా విస్మరించింది. ఆమె మూర్తికి ప్రియమైన భార్య కాగలిగింది గానీ పిల్లలకి అమ్మ కాలేకపోతోంది. ఈ సృష్టిలో తియ్యనయినదీ, మధురమైనదీ, ఉన్నతమైనదీ అమ్మస్థానం. ఆ స్థానానికి ఆమె న్యాయం చేకూర్చలేకపోగా, ఆ పిలుపునే అసహ్యించుకునే స్థితిలో వుంది. ఆమె అమ్మగా పిల్లలతో మధురమైన బంధానికి కట్టుబడలేకపోయింది. ఆమె దౌర్బ





ల్యం కొన్ని బాహ్యశక్తులూ కలిసి ఆమెని అచ్చమైన సవతితల్లిగామారుస్తున్నాయి. ఈ విషయాన్ని గుర్తించి తనని తాను సంస్కరించుకునే విజ్ఞత, విచక్షణ ఆమెలో లేకపోయాయి.

సమాజం దృష్టిలో సవతితల్లిగా ఆమెస్థానం స్థిరపడుతోందని ఆమెకి తెలీదు. తెలిసినా లెక్కచేసేస్థితిలో ఆమె లేదు కూడా.

★ ★ ★

''అమ్మా.... అమ్మా...''

భారతి ఉలికిపాటుతో చూసింది.

బాబు సుడిగాలిలావచ్చి ఆమెను చుట్టేసుకున్నాడు. ''మరేమో నా గాలిపడగ శివా గాలిపడక్కంటే ఎత్తుగా ఎగిరిందే....''

భారతి ఆనందంగానూ , ఆశ్చర్యంగానూ బాబునే చూస్తోంది. తొలిసారిగా తనకైతానుగా వాడు ఒకళ్ళు చెప్పకుండా 'అమ్మా' అని పిలిచాడు. ఆ పిలుపులోని మాధుర్యం ఆమె గుండెల్ని తాకింది. ఆమె చప్పున వాడ్ని ఎత్తుకుని గుండెలకి హత్తుకుని బుగ్గలు ముద్దుపెట్టుకుంది. బాబు ఒదిగిపోయాడు. ఆమె స్పర్శలోనుండి జాలువారుతున్న ప్రేమ, మమకారం వాడి చిన్నిమనసుని ఆనందంతో ముంచేశాయి. సహజపు నేర్పుళ్ల ప్రభావం తాకలేనంతటి చిన్నవయసులో వున్నాడు వాడు. పాప వాడిమీద రెండేళ్లు పెద్దది. కొత్త అమ్మకీ తమకీ మధ్య వున్న దూరాన్ని వాడు అవలీలగా దాటివేయగలిగాడు. పాప దాటలేకపోతోంది.

ఓ తల్లిగా తన ప్రేమనీ, అభిమానాన్నీ వాళ్లకి పంచడానికి తహతహలాడుతోంది ఆమె. కొత్త అమ్మదగ్గర తమ్ముడికి ఏర్పడిన చనువు చూసి పాప అసూయపడుతోంది. అలా అని తనుగా ఆమెదగ్గరికి వెళ్లలేకపోతోంది. ఒకనాడు ఏమాటలైతే పదమూడేళ్ల భారతిని సవతితల్లికి దగ్గరకాకుండా పిరికిదాన్ని చేశాయో పాపనీ అవేమాటలు భయపెడుతున్నాయి.

''ఈ పిల్లలు చాలా దురదృష్టవంతులు పాపం! ప్రకాష్ రెండోభార్య చాలా తెలివైంది. మిగతా సవత్తల్లుల్లా పిల్లల్ని విసుక్కోవడం, తిట్టడం ఏమీ లేదు. పైపెచ్చు ఎంతో ప్రేమ వున్నట్టు మాట్లాడుతుంది. అదెలా సాధ్యం వదినా? సవతి పిల్లలమీద ఏ ఆడదానికైనా అంతలేసి ప్రేమ కారిపోతుందా? నమ్మే మాటేనా ఇది? మనకి తెలిసి ఎంతమంది సవత్తల్లుల్ని చూడలేదూ? నాకు తెలిసినంతట్లో ఏ ఆడదీ సవతి బిడ్డల్ని రాచిరంపానపెట్టకుండా వుండలేదు. ఈ భారతి చాలా గడుసుది. మహానటిలా నటిస్తోంది. పైగా కొత్త మోజు. చూస్తాంగా ఈ మురిపెం ఎన్నిరోజులుంటుందో? ఆ ప్రకాష్ పెళ్లాంమాయలో బాగానే పడ్డట్టున్నాడు. అతగాడ్ని మాయచేసి ఆస్తీ పాస్తీ రాయించుకుని ఈ పిల్లల్ని వీధిలోకి నెడుతుందో, ఏంపాడో...''

తమకి గిట్టని సాటి స్త్రీని గురించి...... ఆమె స్వభావం గురించి ఆమెలోని చెడ్డతనం గురించీ ఏమీ తెలీకపోయినా ఇంతకంటే అన్యాయంగాకూడా మాట్లాడగలరు అరవింద లాంటి స్త్రీలు. తమలో లేని మంచితనం, గొప్పదనం తమలాంటి మరోస్త్రీలో వుండడాన్ని వాళ్లు సహించలేరు. పాపకి ఈ మాటలు పూర్తిగా అర్థంగాకపోయినా కొత్తఅమ్మ మంచిది కాదని వాళ్లు అనుకుంటున్నారని మాత్రం అర్థమైంది.

డాడీ ఈ కొత్తఅమ్మమాట వింటాడు......

విన్నందువల్ల వచ్చే నష్టాలేమిటో తెలుకునే వయసుకూడా కాదు పాపది. ఏదో తెలీని దిగులు పాపని ఆవరించింది. వాళ్లంతా అలా చెడ్డదని చెప్పుకునే ఈ అమ్మ అజిత్‌ని ఎంతో ప్రేమగా చూస్తూండడంకూడా పాపకి అర్థంగాని విషయం అయిపోయింది. తండ్రికూడా ఈ అమ్మ మంచిది అంటున్నాడు. ఇంతవరకూ ఒక్కసారికూడా తమని విసుక్కోనయినాలేదు. కేకలు వెయ్యలేదు. పాపకి భారతి దగ్గరికి వెళ్లాలనివుంది. వెళ్లడానికి భయంగానూ వుంది.

భారతి బాబుతో చెబుతోంది ''నాకు నీలాంటి, అంజూలాంటి చిన్నపిల్లలంటే చాలా ఇష్టంరా అజ్జూ! అసలు నేను ఈ ఇంటికి ఎందుకు వచ్చాననుకున్నావు?. మీ ఫ్రెండ్స్ అందరికిలా నీకూ అంజూకీ అమ్మలేదని, అమ్మ లేకపోవడంతో మీరు బోల్డంత దిగులుపడిపోయివున్నారని, చాలా ఇబ్బందు

లు పడుతున్నారని నాకు తెలిసింది. అందుకే మీ డాడీని పెళ్లిచేసుకుని ఇక్కడికి వచ్చేశాను. మీరిద్దరూ నాకెంతో నచ్చారు తెలుసా?''

పాప ఈ మాటలు వింటోందని భారతికి తెలుసు. వినాలనే చెబుతోంది భారతి.

★ ★ ★

దుర్గ వచ్చింది భారతి దగ్గరికి.

''ఇదుగో ఇలాంటి ఆదివారాలు తప్ప మాబోటివాళ్లకి తీరిక దొరకదు. స్నేహితులతో ఓముక్క మాట్లాడుకోవడానికి కుదరదు'' అంది సంజాయిషీ ఇచ్చుకుంటున్నట్టు.

''ఫరవాలేదు ఆ మాత్రం అర్థంచేసుకో లేనా?''

ఓ అయిదు నిముషాలు మాత్రమే కూర్చుంది దుర్గ. భారతి ఓ విషయం గమనించింది. తనకి తీరికవుండదు. తను ఉద్యోగస్తురాలు అన్న విషయాన్ని పదేపదే గుర్తు చెయ్యడం దుర్గకి అలవాటు. ఈ అయిదు నిముషాల్లో ఈ విషయం గురించి మూడుసార్లు మాట్లాడటం కాక మరో రెండు సంగతులు ప్రస్తావించింది.

''మా అత్తగారు వచ్చిందా భారతీ ఇక్కడికి?''

''అప్పుడప్పుడు వస్తూనే వుంటారు''

''ఆవిడ్ని అంతగా చేరనీకు నోరు అంత మంచిదికాదు. ఇక్కడి విషయాలు అక్కడ అక్కడి విషయాలు ఇక్కడ చెప్పడం ఆవిడకి వున్న దురలవాటు. దీని మూలంగా ఇరుగూ పొరుగూతో మనస్పర్థలు రావచ్చు'' అంది దుర్గ హెచ్చరిస్తూన్నట్టు.

బామ్మగారు తన విషయంలో అపరిమితమైన ఆసక్తిని ప్రదర్శించడం భారతికి గుర్తొచ్చింది.

దుర్గ నిట్టూరుస్తూ ''ఆవిడ తత్వం అది. పెద్దావిడ ఎన్నిసార్లని చెప్పగలం? అప్పటికీ ఇది మంచిపద్ధతి కాదని నేను చెబుతూనే వుంటాను. ఆవిడకి చెడ్డకోపం. నా గురించి కూడా చెప్పివుంటుందే'' నవ్వుతూ అంది.

తను ఉద్యోగస్తురాలినన్న గర్వం తనకోడలికి బాగావుందని ఆవిడ చెప్పడంగుర్తొచ్చింది.

ఈ విషయం భారతి దుర్గకి చెప్పలేదు. తనకేమీ చెప్పలేదన్నట్టు తల అడ్డంగాతిప్పింది.

దుర్గ మళ్లీ నిట్టూర్చి ''ఆవిడ చెప్పకుండా వుండదు అదావిడ నైజం'' అంది. ''అవును భారతీ... నీకు ఈ విషయం తెలుసా? ప్రకాష్ పిల్లలు కలగకుండా వేసక్టమీ చేయించుకున్నాడు. ఈ విషయం తెలిసీ అతన్ని పెళ్లి చేసుకున్నావా నువ్వు?''

భారతి దుర్గవైపు చూసింది. వెంటనే ఏం సమాధానం చెప్పాలో ఆమెకి తోచలేదు.

''ఇద్దరుపిల్లలు ఉన్నారనుకో. నీ కడుపున పుట్టిన ఓ బిడ్డవుంటే మంచిదిగదా?''

భారతి నవ్వి వూరుకుంది. ఈ విషయాన్ని గురించి భారతి ఏమీ మాట్లాడక పోవడం దుర్గకి ఆశ్చర్యం కలిగించింది. తరువాత దుర్గ వెళ్లిపోయింది. అప్పుడు సమయం ఒంటిగంట దాటింది. బాగా ఎండగా వుండడంతో పిల్లలూ ప్రకాష్ పడుకున్నారు. ఆమె రామానుజులుగారింటికి వెళ్లింది తొలిసారిగా. రామానుజులుగారి రోగిష్ఠి భార్యని ఓసారి పలకరించి వచ్చేద్దామని ఆ ఇంటికి వచ్చిన భారతి దాదాపు రెండు గంటలపాటు అక్కడినుండి కదలలేకపోయింది. అంతగా ఆకర్షించిందా ఆమెను ఆవిడ.

ఆమె పేరు సౌందర్యమ్మ. గత ఆరేళ్లుగా పక్షవాతంతో మంచంలో వుంది. రోగబాధ, ఒకరి సాయంలేనిదే కదల్లేని నిస్సహాయత్వం, నిరాశా నిస్పృహలు ఆవిడనే మాత్రమూ కృంగదీయలేదని ఎప్పుడూ నవ్వుతూన్న ఆమె మొహం చూస్తూంటే అర్థమైపోతుంది. కొంతమంది వ్యక్తులుంటారు. జీవితాన్ని నవ్వుతూ చివరి ఘడియలదాకా గడపాలనుకునే వాళ్లు. ఆకోవకి చెందిన వ్యక్తి సౌందర్యమ్మ.

తను దిగులుతో దుఃఖంతో కుళ్లిపోయినంత మాత్రాన తన రోగం నయంకాదన్న సత్యాన్ని గ్రహించాక ఆ బాధని ఆమె వదిలేసింది. బ్రతికే నాలుగురోజుల్ని ఏడుస్తూ తన వాళ్లని ఏడిపిస్తూ బ్రతకడం ఎందుకు? తను నవ్వుతూ వుంటే వాళ్లూ ధైర్యంగా వుంటారు. తను ఓ భారంగా బరువుగా వాళ్లకి అనిపించకూడదు. ఇలా ఆలోచించి ఆమె ఎప్పుడూ నవ్వుతూ వుండడం అలవాటు చేసుకుంది. నలుగురు మగపిల్లలు. ఆమెని ప్రేమించే భర్త, ఆమె




లేచి తిరగకపోయినా అలా ప్రాణాలతో తమ కంటికి ఎదురుగా వుండడమే చాలని భావిస్తారువాళ్లు.

మంచంలో వుండే పెద్ద గొంతుకతో వాళ్లకి సలహాలిస్తూ పురమాయిస్తూ కేక లేస్తూ వుంటుందావిడ. అదే వాళ్లకి మహాభాగ్యంగా ఉంటుంది. తలా ఓపనీ చేసుకుంటారు. భర్తా పిల్లలూ బయటికి వెళుతూ బయటతాళం వేసుకుని వెళతారు. ఈలోపల పుస్తకాలే ఆవిడకి కాలక్షేపం. రామాయణ భాగవతాలేకాదు మామూలు డిటెక్టివ్ నవలలూ పత్రికలూ కూడా చదువుతుందామె. టి.వి. ప్రోగ్రామ్స్ చూస్తుంది. ఆవిడ ధైర్యం నిబ్బరం చూసి భారతి ఎంత ఆశ్చర్యపోయిందో ఆవిడ పట్ల తొలిచూపులోనే అంత అభిమానం కలిగిందామెకి.

"ఓ పని పిల్లని ఏర్పాటు చేసుకోకూడదా పిన్నిగారూ?" ఆదివారం పూట మధ్యాహ్నం కూడా మగపిల్లలు బయట హాల్లో కూర్చుని పప్పులూ బియ్యం శుభ్రం చేసుకోవడం గమనించి అడిగింది భారతి.

ఆవిడ ఆమెవైపు చిరుకోపంతోనూ చిరునవ్వుతోనూ చూస్తూ "మీ నాన్న బాగా సంపాదిస్తారా?" అడిగింది.

తన మాటకి ఆవిడ ఈ ప్రశ్న అడగడానికి గల సంబంధం ఏమిటో అర్థంకాక "ఈ మధ్య బాగానే సంపాదిస్తున్నారు. ఎందుకలా అడిగారు పిన్నిగారూ?" అడిగింది.

"ఇంకా సంసారంలోని సాదకబాధకాలు నీకు అవగతం కాలేదు. చేసుకోగలిగిన శక్తి ఉన్నప్పుడు అదనంగా మరో పనిమనిషిని సాకడం దేనికి? ఖర్చుదండగ. నా రోగమే మరో ఇద్దరు మనుమల పెట్టు. మధ్యతరగతి కుటుంబాల్లో మనుమలకి చాలా సుఖాలు అందుబాటులో వుండవు భారతీ..."

"నిజమే" అంది భారతి, "కానీ వాళ్లంతా వెళ్లిపోయాక మీరు ఒక్కరే ఉంటారు"

"నాకోసం అయితే అసలు అవసరంలేదు. ఈ పుస్తకాలే నాకు నిజమైన మిత్రులు" అంది సౌందర్యమ్మ. "నేను ఇరుగూపొరుగూ దగ్గరికి వెళ్లలేను. ఎప్పుడూ మంచంలో పడివుండే నాతో కబుర్లు వాళ్లకి విసుగు. ఎప్పుడోగానీ రారు. ఈ పుస్తకాలు అలా కాదుగా! అందుకే వీటిని నిజమైన స్నేహితులుగా భావిస్తాను" ఈ మాటలు ఆవిడ బాధతో అనలేదు, తన మామూలు నవ్వుతో చెప్పింది.

భారతి చాలా ముగ్ధురాలైంది. ఇలాంటివాళ్లు నరకంలాంటి జీవితాన్నికూడాస్వర్గంగా మార్చుకోగలిగిన సమర్థులు. ఆమెతో పరిచయం భారతికి ఎంతో ఆనందం కలిగించింది. ఆమెనుండి జీవితం గురించి నేర్చుకోవాల్సింది ఎంతో ఉందని ఆమెకి అనిపించింది. ఆవిడ చాలాసేపటితరువాత భారతి వ్యక్తిగత జీవితానికి సంబంధించిన ఓ ప్రశ్న అడిగింది.

"భారతీ ... ఇద్దరు పిల్లల తండ్రిని ఎందుకు చేసుకున్నావమ్మా?" ఆవిడ కళ్లల్లో మామూలు ఆసక్తిమాత్రమేవుంది.

"నేను సవత్తల్లి పెంపకంలో పెరిగానుకాబట్టి"

ఈ సమాధానంవిని ఆవిడ ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ చూసింది. ఆవిడ కాసేపేమీ మాట్లాడలేదు.

తరువాత "ఈ లోకానికి సవత్తల్లులందరూ బ్రహ్మరాక్షసుల్లా కనబడతారు. అప్పుడప్పుడూ నీలాంటివాళ్లు ఇది పచ్చిఅబద్ధం అన్న విషయాన్ని ఋజువు చేస్తూవుంటారు. నేను సవత్తల్లుల్లో మామూలు తల్లుల్నికూడా చూశాను. మనం చూసే దృష్టినిబట్టికూడా ఉంటుంది. ఎప్పుడూ మనం అనుమానం కళ్లతో చూస్తూ వుంటే మంచివాడికి కూడా కసికొద్దీ దొంగతనం చెయ్యబుద్ధవుతుంది. నీలాంటివారి విషయంలో లోకం చాలా చెడ్డది భారతీ! ఈ విషయం నీకు అనుభవపూర్వకంగా తెలుసుననుకుంటాను" అంది.

"అవును పిన్నిగారూ... ఈలోకం నామీద ఎలాంటి ప్రభావాన్నీ చూపించలేదు" దృఢంగా అంది భారతి.

"ప్రకాష్ పిల్లలు అదృష్టవంతులు" మెచ్చుకోలుగా కాదు ఆమె అన్నది... ఆనందంగా.

భారతి పనిమనిషి గంగమ్మ విషయం చెప్పింది.

''అది చదువూ, సంస్కారం లేనిమనిషి. తెలివితేటలు, జ్ఞానం వున్న మనుషులుకూడా ఇలాగే ప్రవర్తించగలరు'' అంటూ నిట్టూర్చిందామె.

''పనిమనిషి అవసరంకదూ భారతీ?''

అవుననడానికి ఆమె సిగ్గుపడింది.

సౌందర్యమ్మ నవ్వుతూ ''మా పరిస్థితి వేరు. నీ పరిస్థితి వేరు భారతీ! ఎనిమిది గంటల కంతా భర్తనీ, పిల్లల్నీ బయటికి పంపెయ్యాలి కదా, పనితొక్కిడిగా వుంటుంది. సిగ్గుపడకు. కాళ్లూ చేతులూ సక్రమంగా వున్నప్పుడు నా చేతికింద ఎప్పుడూ ఓ మనిషి అవసరంవుండేది. ఖర్చులమూలంగా అవసరాల్ని కుదించుకోవాల్సివచ్చింది. ఇప్పుడు నువ్వు పనిమనిషిని వుంచుకోలేదనుకో, అది పొదుపు కోసమే అవుతుంది; అంతేకాదు నాబోటివాళ్ల దృష్టిలో పిసినిగొట్టుతనంకూడా అవుతుంది. అవకాశాలున్నప్పుడు ఈ చిన్నజీవితంలో దొరికే ఈ కొద్దిపాటి సౌకర్యాల్నిమాత్రం ఎందుకు వదులుకోవాలి? అవతలి మనుషులకి ఎలాంటి కష్టమూ, నష్టమూ కలగకుండా మన పరిధుల్లో, పరిమితుల్లో మన జీవితాన్ని మనం అనుభవించడం నేర్చుకోవాలి. అలా అనుభవించలేకపోవడం చేతగానితనమూ, అజ్ఞానం అవుతుంది. రేపటిగురించి ఎవరమూ వూహించలేం. రేపెలా వుంటుందో తెలీదు. రేపటి గురించిన ఆలోచనతోపాటు ఈరోజుని సుఖంగా ఆనందంగా గడపగలిగిన తెలివితేటలు ప్రతి మనిషిలోనూ వుండాలి భారతీ...'' ఆమె చెబుతూంటే భారతి ముగ్ధురాలైంది.

ఆవిడ అంది ''మీ బాబాయిగారితో, పిల్లలతో చెబుతాను ఎక్కడైనా ఓ మనిషిని చూడమని''

భారతి వస్తూండగా హెచ్చరించింది సౌందర్యమ్మ....

''భారతీ ... నువ్వు దుర్గగురించీ, ఆమె అత్తగారి గురించీ అసలు పట్టించుకోవద్దు. ఆ ఇద్దరికీ క్షణం పడదు. మనం ఒకరిమాటలు వింటే మరొకరికి కోపం. పార్టీ కడతారు. మనం వాళ్లగురించి పట్టించుకోకపోయినా వాళ్ల గొడవలతో మనల్ని హడలగొడతారు. సుజాత మొదట్లో అత్తకీ, కోడలికీ మధ్య సయోధ్య కుదర్చడానికి అమాయకంగా పూనుకుని ఇద్దరిచేతా మాటలుతింది. వాళ్లేం చెప్పుకున్నా వినివూరుకో ... అంతే''

ఈ మాటలు విని భారతి చాలా ఆశ్చర్యపోయింది. పూర్వక్రితం దుర్గ తన అత్తగారిని గురించి మాట్లాడిన మాటలు గుర్తొచ్చాయి. వాళ్ల కథ కొంతవరకూ అర్థమైనట్టు అనిపించింది. భారతి సౌందర్యమ్మ దగ్గర సెలవు తీసుకుని వస్తూన్నప్పుడు ఓ విషయం గమనించింది.

''అప్పుడప్పుడూ తీరిక చూసుకుని వస్తూండు'' అని ఆవిడ అనలేదు.

వాళ్లకి రావాలని అనిపిస్తే వస్తారు. ఒకర్ని ఇబ్బందిపెట్టడం మంచిది కాదన్న ఆమె అభిప్రాయంకూడా భారతికి అర్థమైంది. సౌందర్యమ్మతో స్నేహం పెంచుకోవాలని అనిపించింది ఆమెకి. కొంతమంది జీవితాలు ఎందరికో బతుకుపాఠాలు అవుతాయి. ఆమె ఇంటికి తిరిగివచ్చేసరికి ప్రకాష్ హాల్లోనే పేపర్ తిరగవేస్తూ కనిపించాడు.

''లేచారా ... సౌందర్యమ్మగారిదగ్గరకి వెళ్లాను'' అందామె.

ప్రకాష్ మాట్లాడక రెప్పవాల్చకుండా తన వైపు చూడటం ఆమె గమనించింది.

''ఏమిటలా చూస్తారు, మీ కాఫీకి ఆలస్యమైపోయిందా? మొహం కడుక్కుని వస్తాను వుండండి'' అని వెళ్లబోతూ ఆగి ''ఏం ... తీరిగ్గా వున్నారుగా? ఓ కప్పు కాఫీ కలుపుకోవచ్చుగదా? నాకూ ఓ కప్పు ఇస్తే సంతోషించేదాన్ని'' అని వెళ్ళిపోయింది.

ఆమె మాటలు నవ్వుతూ అన్నా అనాలనే అన్నదని ప్రకాష్ గ్రహించాడు. అతడికా ఉదయం జరిగిన సంఘటన గుర్తొచ్చింది.

అతడు నిద్రలేస్తూనే అలవాటు ప్రకారం ''భారతీ...'' అంటూ కేకపెట్టాడు.

భారతి వెంటనే వచ్చింది. ఆమె చేతిలో గరిటవుంది.

వస్తూనే ''ఎందుకూ ... టూత్‌బ్రష్‌కోసమా? ఎలాగూ వెళతారుగా - బాత్‌రూమ్‌లోనే వుంటుంది తీసుకోండి'' అంది.





ఆమె అలా అనడంతో అతడికి చటుక్కున కోపం వచ్చింది. ఎనిమిదేళ్ళుగా తన పనులు తను చేసుకునే అలవాటుకూడా తప్పిపోయిందతడికి.

"ఏమిటలా చూస్తారు ... కోపం వచ్చిందా? ఈ నెలరోజులుగా నేను ఉన్నాననుకోండి. అంతక్రితం ఏడాదిగా ఈ పనులన్నీ ఎవరు చేసేవారు?" ఆమె నవ్వుతూ అడిగింది.

ఆమె నవ్వుని చూసి అతడు తన కోపాన్ని అణిచేసుకున్నాడు.

"చెప్పండి?"

"పాపవుందిగా" అన్నాడతడు.

"అయితే తల్లితోపాటు పాపకూడా మిమ్మల్ని పాడుచేసిందన్నమాట?" అంది.

"పాడుచెయ్యడమా?"

"మరేమిటయితే? కాళ్ళూచేతులూ లక్షణంగా వుండి ఒకళ్ళు మీ పనులు చేసిపెట్టడం ఏమిటి ప్రకాష్? నేను ఈ నెలరోజులుగా గమనిస్తూనే వున్నాను. ప్రతిరోజూ మీ పెన్‌లో ఇంక్ నిండుకుందీ, లేనిదీ కూడా ఇవతలివాళ్ళే చూసిపెట్టాలి. మీరేమీ ఇవతలివాళ్లపనుల్లో సాయంచెయ్యనక్కరలేదు. మీ సొంతవిషయాలు మీరు చూసుకుంటే చాలు" అంది భారతి.

అతడికి ఏం మాట్లాడాలో తోచలేదు. కొన్ని విషయాల్లో అతడికి ఊరికే కోపం వచ్చేస్తుంది. అలాంటి సమయాల్లో ఎదుటిమనిషి ఎదురు చెబితే సహించలేడు. ఇప్పుడతడికి కోపంతో సమానమైన ఆశ్చర్యాన్ని కూడా కలిగించాయి ఆమె మాటలు. ఆమెపట్ల అతడికి ఉన్న గౌరవం ఆమెమీద తన కోపాన్ని వ్యక్తపరచకుండా చేసింది. భారతి అతడికి బ్రష్ అందించకుండానే వెళ్ళిపోయింది. అతడు ఆలోచించాడు. ఆమె మాటల్లో నిజం ఉందని అతడికి అనిపించింది. ప్రకాష్‌కి తన మొదటి భార్య గుర్తొచ్చింది. ఆమె ఇంటిపనితో సతమతమవుతూనే పరుగులెత్తి అతడి పనులు చేస్తూండేది.

ఎప్పుడైనా ఆమె మనసులో విసుక్కునేదేమో అతడికి తెలీదుగానీ 'ఈ పనితో చచ్చిపోతున్నానుబాబూ' అనేది తప్ప అతడి పనులు అతణ్ణిచేసుకోమని ఎప్పుడూ చెప్పలేదు. ఆదివారంరోజయితే మరోగంట ఆలస్యంగా లేస్తాడతడు. ఆరోజు మొదటిసారిగా ప్రకాష్ తనే బ్రష్ వెదుక్కుని దానిమీద పేస్ట్ వేసుకున్నాడు. స్నానం చేసివచ్చి తన బట్టలు తనే తీసుకున్నాడు.

ఇప్పుడు అదంతా గుర్తువచ్చింది అతడికి. తను మొహం కడుక్కుని వచ్చేసరికి ప్రకాష్ కిచెన్‌లో కాఫీ కలుపుతూండటం చూసి నవ్వొచ్చింది భారతికి.

అతడందిస్తూన్న కప్పు తీసుకుంటూ "థాంక్యూ" అందామె.

అతడు సీరియస్‌గా "ఎందుకూ?" అని కాఫీ రుచిని గురించి ఆమె ఏమంటుందోనని ఎదురుచూశాడు.

భారతి కాఫీ సిప్‌చేసింది. ఆమె దాన్ని గురించి ఏమీ వ్యాఖ్యానించలేదు.

"ఎలావుంది భారతీ కాఫీ?"

"కషాయంలా వున్నా మీ చేత్తో తయారు చేసి ఇచ్చారు కాబట్టి కమ్మగా వుంది" చిలిపిగా అందామె.

అతడు తెచ్చిపెట్టుకున్న సీరియస్‌నెస్ ఎగిరిపోగా నవ్వాడు "నాకు మింగుడు పడటంలేదు"

"మొదటి ప్రయోగానికే ఎవరూ నలుడూ, భీముడూ అయిపోలేరుగా? నాకు మాత్రం తృప్తిగా వుంది మావారు నాకు ప్రేమగా కాఫీ చేసి ఇచ్చినందుకు" అల్లరిగా అందామె.

"సారీ భారతీ" సిగ్గుగా అన్నాడతడు. "భర్త నుండి భార్య ఇలాంటి కొద్దిపాటి సాయం ఆశిస్తుందని ఈ మాత్రానికే చాలా సంతోషిస్తుందన్న విషయం ఎప్పుడూ నా ఆలోచనల్లోకి రాలేదు"

"ఇప్పుడు తెలుసుకున్నారుగా?" అంటూ ఆమె అతడికి కాఫీ కలిపి ఇచ్చింది.సౌందర్యమ్మ తనకి ఎంతగా నచ్చిందో భారతి చెబుతూ వుండగా అతడు హఠాత్తుగా "భారతీ ... ఇందాక దుర్గ వచ్చిందిగదా? నా గురించి ఏమిటో చెబుతోంది?" అడిగాడు.

ఆమె చేస్తూన్న పని ఆపేసి అతడివైపు



చూసింది. అతడు తమ ఇద్దరిమధ్యా జరిగిన సంభాషణని విన్నాడని ఆమెకి అర్థమైంది.

"నాకు నిద్రపట్టలేదు. గదిలోంచి బయటికి వచ్చాను. మీ సంభాషణ నా చెవులబడింది" ఇలా చెబుతున్నప్పుడు అతడి మొహం ఎర్ర బడింది.

అతడు తన ఆగ్రహాన్ని బలవంతాన దిగ మింగుతున్నాడని ఆమెకి అర్థమైంది.

"చెప్పు ... ఆమె మాటలు నమ్మావా?"

భారతి తల అడ్డంగా తిప్పుతూ "నమ్మి వుంటే ఎప్పుడో మిమ్మల్ని అడిగివుండేదాన్ని. అయితే ఆమె అలా ఎందుకు చెప్పిందో మిమ్మల్ని అడిగి తెలుసుకుందామని అనుకు న్నాను" అంది.

"ఇలాంటివాళ్లు చాలా ప్రమాదకరమైన వ్యక్తులు. అజిత్ పుట్టాక సుజాత ట్యూబెక్టమీ చేయించుకుంది. ఒకవేళ నేను వేసక్టమీ చేయించుకునివుండిన పక్షంలో పెళ్ళికి ముందే నీకు చెప్పివుండేవాడిని. అలాంటిదే మీ లేదని అప్పుడు నేను సౌదామినికి చెప్పాను. ఆమె నీకు చెప్పేవుండవచ్చు"

"అవును ... ఆమె నాకు చెప్పింది"

"నేనప్పుడు పిల్లలు కలగకుండా ఆపరేషన్ చేయించుకునే వుండివుంటే మళ్లీ ఆ అర్హత సంపాదించుకున్నదాకా పెళ్ళిచేసుకుని వుండేవాణ్ణికాదు. నేను మానవత్వం లేని మనిషిని కాదు. మాతృత్వపు మాధుర్యంనుండి అమాయకురాలైన ఓ స్త్రీని దూరంచేసే హక్కు నాకేకాదు ఎవరికీ లేదు. అది చాలా నేరంకూడా"

"ఎందుకు మీరంతగా ఫీలవుతారు?" భారతి అతడి చేతిని తన చెంపకి ఆనించు కుంటూ అంది "ఇలాంటి విషయాలు కల్పించి చెప్పడం ఆమె నైజంకావచ్చు లేదా ఎవరిద్వారానో వినివుండవచ్చు. నిజానిజాలే మీతో తెలుసుకోకుండా తను నాతో అలా చెప్పడం మూలాన మనమధ్య ఓ పెద్దగొడవ ఉత్పన్నమవ్వచ్చన్న ఆలోచనా జ్ఞానంసైతం లేని మనిషి. వీళ్లు చదువుకుంటారు. ఉద్యోగాలు చేస్తూంటారు. తాము చాలా తెలివైనవాళ్ల మనుకుంటూ వుంటారు కానీ చదువుసంధ్యలు లేని పాతకాలంనాటి స్త్రీల ధోరణికి భిన్నంగా వుండవు కొన్ని విషయాల్లో వీళ్ల ఆలోచనలూ, పద్ధతులూ. మానసికంగా వీళ్లు పరిపూర్ణంగా ఎదగలేరు"

మళ్లీ తనే "ఈ విషయం గురించి మన పెళ్ళికి ముందు నేను మీతో డైరెక్ట్‌గా మాట్లాడ లేదు. అయితే మీ మాటలు విశ్వసించాను. దుర్గ ఇప్పుడీమాట చెప్పాక ఆమె అలా ఎందుకు చెప్పిందా అని ఆలోచించాను. సమయం వచ్చినప్పుడు మిమ్మల్ని అడగాల నుకున్నాను" అంది.

అతడు కృతజ్ఞతగా చూశాడు. ఇప్పుడు భారతికి దుర్గ స్వభావం చాలావరకూ అవగత మైనట్టు అనిపించింది. ఆమెకి తీరిక దొరక దు. సమయం అంటూ దొరికితే ఆమె అర విందకంటే భిన్నమైన మనిషి ఏమీకాదు.

"వీళ్లతో స్నేహాలుపెంచుకుని సుజాత ఎన్నో తలనొప్పుల్ని తెచ్చుకుంటూండేది" అన్నాడు ప్రకాష్.

"నాకు ముందుగానే తెలిసిపోయిందిగదా వీళ్లను గురించి. ఎంత దూరంలో వుంచాలో అంతదూరంలో వుంచగలను" అంది భారతి.

ఈ సంఘటన తరువాత ప్రకాష్‌కి తన భార్యపట్ల ఏర్పడిన గౌరవం ఇంకా పెరిగింది. భారతిని తనకి పరిచయం చేసి ఆమె తన జీవితభాగస్వామిని కావడానికి తోడ్పడిన సౌదామినికి అతడు మనసులోనే కృతజ్ఞతలు తెలియజేసుకున్నాడు.

ఆ మర్నాడు రామానుజులుగారు వచ్చారు "అమ్మా భారతీ ... నీకు పనిమనిషి అవసరం అని మీ పిన్ని చెప్పింది. మా గుమాస్తా ఒకతను ఓ అమ్మాయి వుందని చెప్పాడు. నువ్వు మాట్లాడమంటే మాట్లాడతాను"

"అమ్మాయా?"

"సుమారు పదిహేనేళ్లుంటాయని అన్నాడు. ఈ వూరుకాదు, ఇక్కడికి దగ్గర్లోని ఏదో పల్లె. మన ఇంట్లోనే వుంచుకునేలా ఏర్పాటుచేసుకోవాలి" అన్నాడాయన.

భారతి ఆలోచించింది.

"పల్లెటూరి అమ్మాయి అయితే బాగానే





వుంటుందండీ. మాట బాగా వింటారు. కష్టపడి పనిచేస్తారు. చిన్నమ్మాయి అంటున్నారు కాబట్టి తనకి తెలీని పనులు కూడా నిదానంగా చెప్పి నేర్పించుకోవచ్చు. ఇంట్లోనే వుంటే మరికాస్త సౌకర్యంగా వుంటుంది. నెలకి ఒకరు చెప్పున మారే ఈ పనిమనుషులకంటే కొంతకాలంపాటు నిలబడి చేసే మనిషి అయితే బావుంటుందనిపిస్తుంది నాక్కూడా ... మాట్లాడండి బాబాయిగారూ'' అంది.

ఆయన సరేనని వెళ్ళిపోయాడు. ఇంట్లో జరుగుబాటులేక చాలామంది కాస్త వయసు పిల్లలు సొంత వూరికి దూరంగా మూడుపూటలా తిండిపెట్టి, ఒంటినిండా బట్టఇచ్చే ఇళ్ళల్లోచేరి పనులుచేసుకుని బతకడం భారతికి తెలుసు.

రామానుజులు మాట్లాడి వచ్చాడు.

''రేపు ఆ అమ్మాయిని వాళ్ల తండ్రి తీసుకుని వస్తాడట. జీతం మిగతా విషయాలు మీరు మాట్లాడుకోండమ్మా'' అన్నాడు.

అంత శ్రద్ధగా రెండురోజుల్లో పనిమనిషిని కుదిర్చిపెట్టిన ఆయనకి కృతజ్ఞతలు చెప్పుకుంది భారతి. మర్నాడు ఉదయం తెలతెలవారకముందే తన తండ్రితో ఆ ఇంటికి వచ్చింది సీతామాలక్ష్మి. ఆ అమ్మాయికి పదిహేనేళ్ళులేవు. పదమూడేళ్ల సీతామాలక్ష్మిని చూసి భారతి ఆశ్చర్యపోయింది.

''ఇంత చిన్న అమ్మాయా?'' భారతి ఆశ్చర్యంగా అడిగింది.

''ఈ అమ్మాయికి పదిహేనేళ్లున్నాయమ్మా. చూడ్డానికి చిన్నగా అనిపిస్తదిగానీ పనిలో పెట్టింది పేరు. ఒంచిన నడుం ఎత్తకుండా పొద్దుటేల్నుంచి రాత్రిదాకా పన్జేయగలదు. ఊడవడం, కడగడం, ఉతకడం అన్ని పనులు చేతనవును. ఒంటే పెద్దగా చేతకాదు. మాబోటివాళ్ల ఇళ్ళల్లో అయితే ఇంత అన్నం ఉడకేసి ఏదో పప్పుచారూ, పచ్చడీ చెయ్యగలదుగానీ తమలాంటి పెద్దిళ్లలో వండుకునే ఏపుళ్ళూ, మసాలాకూరలూ, సాంబారూ చేతకాదు. దగ్గరుండి నేర్పించారంటే నెల తిరక్కముందే నేర్చుకోగల్దు. విశ్వాసంగా వుంటది'' అంటూ చెప్పుకొచ్చాడు ముప్పైలయిదేళ్ల ఆ అమ్మాయితండ్రి.

ఆ అమ్మాయి మాత్రం నిశ్శబ్దంగా నిలబడింది. భారతికి చాలా జాలిగా అనిపించింది. బహుశా ఆ అమ్మాయి ఒక్క పొట్టని పోషించడం ఆ తండ్రికి చాలా కష్టంగా వుండి వుండొచ్చు. సంతలో నిలబడ్డ జీవం గురించి దాని యజమానిలా, పెళ్ళిచూపుల్లో కూర్చున్న పెళ్లికూతురు తండ్రిలా ఆ అమ్మాయి అర్హతల్ని గురించి ఏకరువు పెట్టాడతడు.

''దానికింత కడుపునిండా పెట్టి, ఒంటి నిండా గుడ్డలిచ్చి నెలకింత జీతం ఇచ్చినారంటే తమకి రుణపడి వుంటాం తల్లీ'' చేతులు జోడించి అన్నాడతడు.

''సరే...'' అతడి స్థితికి జాలిపడ్డ భారతి అంగీకరించింది.

ఆమె చెప్పిన నెలజీతానికి మరో పదిరూపాయలు అదనంగా ఆమెని ఒప్పించాడు సీత తండ్రి. అంతటితో వెళ్ళిపోలేదతడు.

''ఈరోజు మా పిల్ల పని చూడండి'' అన్నాడు.

ఇంత జరుగుతున్నా సీత నోరువిప్పి మాట్లాడలేదు.

''నువ్వు మాట్లాడవేం సీతా ... ఇక్కడికి రావడం నీకు ఇష్టమేనా?''

మెల్లిగా తలూపింది సీత ఇష్టమేనన్నట్టు.

''కలుపుగోలు పిల్లకాదు, కాస్త ముంగి'' తండ్రి చెప్పాడు.

ప్రకాష్ అడిగాడు ''వాళ్లస్థితిచూసి జాలిపడి ఆ అమ్మాయిని తీసుకోవడానికి ఒప్పుకున్నట్టున్నావు. అంత చిన్నమ్మాయి నీకేం పనిచేసి పెట్టగలదు?''

''చూద్దాం ఓ నెలపాటు'' అంది భారతి.

అయితే వాళ్ల సందేహాలన్నింటినీ పటాపంచలుచేస్తూ ఆరోజు రంపంలా పనిచేసింది సీత. ఇల్లూ వాకిళ్ళూ పెరడూ చిటికెలో వూడ్చేసింది. గిన్నెలన్నీ శుభ్రంగా తోమిపెట్టింది. చకచక బట్టలన్నీ ఉతికి పిండి ఆరవేసింది. దాదాపు గంటన్నరలో ఈ పనులన్నీ పూర్తిచేసి ఇంకా ఏం చెయ్యాలి అన్నట్టు ఎదురుచూస్తూంటే భారతి చాలా ఆశ్చర్యపోయింది.

''ఇలాంటి మనిషే కావాలి భారతీ మనకి.

పాతిక రూపాయలు ఎక్కువైనా ఫర్వాలేదు'' అన్నాడతడు.

ఆ సాయంత్రం కూతుర్ని భారతికి అప్ప గించి తన స్వగ్రామం బయలుదేరుతూ ''జాగ్ర్త ... అమ్మగారు చెప్పినట్టు ఇనుకో, బాగుపడ తావు. మళ్లీమళ్ళీ చెప్పించుకోకుండా పనుల న్నీ సుబ్బరంగా చెయ్యి. అమ్మగారు కాలితో చెప్పిన పని చేత్తో అందుకో' అంటూ సీతకి లక్ష జాగ్రత్తలు చెప్పి ''అప్పుడప్పుడూ నేనొచ్చి చూసెళుతూంటాన్లే'' అంటూ అతడు వెళ్లిపో తూంటే సీత కళ్ళల్లోకి నీళ్ళు ఉబికి వచ్చాయి.

''దిగులుపడకు సీతా... మీ తల్లిదండ్రుల దగ్గరేవున్నట్టు భావించు. ఇక్కడ నీకెలాంటి కష్టమూ వుండదు. చెరోపని చేసుకుందాం'' ఓదార్పుగా, జాలిగా అంది భారతి.

కళ్ళు గట్టిగా తుడుచుకుని నవ్వింది సీత. ఆ అమ్మాయి నవ్వు చాలా బాగుంది. ఆ ఇంట్లో అడుగుపెట్టిన తరువాత తొలిసారిగా నవ్వింది సీత. భారతి జాలిగా నిట్టూర్చింది. ఆ అమ్మాయి తండ్రి అవసరాన్నిబట్టి అబద్ధం చెప్పుకున్నా సీతకి పదమూడేళ్ల వయసుకంటే ఎక్కువవుండదు. ఈ వయసులో తల్లికి, తండ్రికి, తోబుట్టువులకి దూరంగా వుండటం అన్నది ఎంత కష్టమో, ఎలాంటి శిక్షో భారతి అర్థంచేసుకోగలదు. 'దరిద్రం' అన్నది కన్నబి డ్డల్ని కూడా తాకట్టుపెట్టిస్తోంది కన్నవారిచే తనే.

''సీతా ... మీ అమ్మకి మీరెంతమంది?''

''ముగ్గురం'' చెబుతూంటే సీత కళ్లల్లో మళ్లీ నీళ్లు తిరిగాయి ''నేనూ, ఇద్దరు తమ్ము ళ్ళు'' అంటూ కళ్లు తుడిచేసుకుంది.

భారతి అంతక్రితం సీత చేతనే శుభ్రం చేయించిన ఓ చిన్నగదిని చూపిస్తూ''నీ పెట్టె అక్కడ పెట్టుకో' అని చెప్పింది.

సీత తన చిన్న ట్రంకుపెట్టెను అక్కడ పెట్టుకుంది. ఆమెకి ఓ నవ్వారు మంచం, దిండూ, రెండు పాతదుప్పట్లు ఇచ్చింది భారతి. ఆరోజంతా సీత దిగులుగానే వుంది. భారతి మనసంతా ఏదోలా వుంది. కాస్సేపు తను ఆ అమ్మాయిని పనిలోకి తీసుకోకపోయి వుంటే బావుండేదేమో అనిపించింది.

అది విని ప్రకాష్ ''నీ మొహం ... నువ్వు కాదంటే మరో దగ్గర పెడతారు ఆ అమ్మా యిని. వాళ్ళ అవసరం అలాంటిది, నువ్వు అనవసరంగా బాధపడకు'' అన్నాడు.

''అదికాదు ప్రకాష్ ... తల్లి ప్రేమకి దూర మైన పిల్లల్ని చూస్తే నాకు చాలా బాధ కలుగుతుంది. శాశ్వతంగా తల్లిని పోగొట్టుకు న్న పిల్లలు ఎలాగూ బాధపడుతున్నారు. తల్లి వుండీ ఇలాదూరంగా వుండాల్సిరావడం...'' భారతి కంఠం ఆర్ద్రమైంది. ప్రకాష్ ఆమెతో అనునయంగా ''సీత తల్లివుంది. కాకపోతే కాస్త దూరంగా. ఒకనాటికి తను తల్లి దగ్గరికి వెళ్లిపో తుంది. నువ్వు ఒకందుకు సంతోషించాలి భారతి... నీలాంటి మంచి యజమానురాలు దొరికింది సీతకి. మరో ఇంట్లో అయివుంటే ఇంత మాత్రపు ఆదరణ ఆ అమ్మాయికి దొరికివుండేదికాదు''

రెండురోజులు గడిచేసరికి సీతపట్ల వున్న అభిమానం రెట్టింపైంది భారతికి. ఉదయాన్నే బట్టలన్నీ ఉతికేసి స్నానంచేసి కానీ టిఫిన్ చేసేదికాదు. మార్కెట్‌కి వెళ్లి కూరలు తెచ్చేది. సీతకి పిల్లలన్నా ఇష్టం.

తనని అమ్మగారూ అనిపిలుస్తోంటే ''వద్దు సీతా... నన్ను అక్కా అని పిలువు'' అంది భారతి మందలింపుగా.

సీత అంత ధైర్యం అయితే చెయ్యలేదు గానీ అమ్మా అనిపిలవడం ప్రారంభించింది. తన హద్దులేమిటో తనకి తెలుసునన్నట్టు ప్రవ ర్తిస్తూన్న సీతని చూస్తూంటే భారతికి చాలా ముచ్చటగా అనిపించేది.

''సీతా... ఇంత చిన్నవయసులో ఈ పనుల న్నీ ఎక్కడ నేర్చుకున్నావూ?'' అని అడిగితే ''మా అమ్మ దగ్గర'' సీత పెదవులు నవ్వితే కళ్లు తడిసేవి.

''పోనీ ఓసారి మీ అమ్మ దగ్గరికి వెళ్లొ స్తావా?''

చప్పున తల అడ్డంగా తిప్పి ''ఊహుఁ.. రెండు రోజులేగా నేనొచ్చి అయింది. నాకేం మా అమ్మని చూడాలనిపించడంలేదు'' అంది.

భారతి ఇక ఏమీ అనలేకపోయింది. తరు వాత తెలిసింది సీత ఆసక్తిగా పిల్లల పుస్తకా





లూ పత్రికలూ తిరగవేస్తున్నప్పుడు... తనకి చదువు వచ్చని. సీత మాటలు కూడా శుభ్రంగా వుంటాయి.

''సీతా... నువ్వు స్కూలుకి వెళ్లావా?''

''వెళ్లానమ్మా''

''ఎంతవరకూ చదువుకున్నావు?''

''ఏడోతరగతి పాసయ్యాను...'' అంటూ తలొంచుకుంది.

భారతి ఆశ్చర్యచకితురాలై ''ఆ తరువాత ఎందుకు చదవలేదు?''

''మా నాయన...'' ఏదో చెప్పబోయి ఆగి పోయి ''కుదరలేదు'' అంది.

భారతికి వెంటనే ఓ ఆలోచన వచ్చింది ''ఓ పని చెయ్యి సీతా... నీకు చదువుకోవాలన్న కోరిక వుంటే ఇంట్లోనే చదువుకోవచ్చు. నీకు నేను పుస్తకాలు తెచ్చిస్తాను.

ఎనిమిది తొమ్మిది తరగతులకి నేనే నీకు టీచర్ని. ఈ ఇల్లే బడి. నేను నీకు పాఠాలు చెబుతాను రోజూ. పరీక్షలు పెడుతూంటాను. వచ్చే సంవత్సరం ప్రయివేటుగా టెన్త్ పరీక్షలు రాయవచ్చు'' అంది.

సీత మొదట ఆనందంగా నమ్మలేనట్టు చూసింది. తరువాత సంతోషంగా తలూపు తూ... ''నేను చదువుకుంటానమ్మా'' అంది.

సీత మొహంలో ఆనందం చూసి చాలా సంతోషం కలిగింది భారతికి. ప్రకాష్ కూడా భారతిని ప్రోత్సహించాడు. ''బయటినుండి వచ్చిన సీతకి అప్పుడే తల్లితో సమానురాలివై పోయావు. పాప నీకు దూర దూరంగా వుండిపో తోందేం భారతీ?'' అతడు బాధగానూ కొస్త ఆవేదనగానూ అన్నాడు.

''పాప నావైపు ఓ అడుగు వేసిన వెంటనే ఓ రెండు అడుగులు వెనక్కి వేస్తోంది. అంతగా బయటి వ్యక్తుల ప్రభావం వుంది తన మీద. కానీ చాలా తొందరగా నా దగ్గరికి తను పరుగెత్తుకు రాగలదు'' అంది భారతి.

''అయితే తనని బయటికి వెళ్లనీకపోవ డమే మంచిదేమో''

''అదే పొరపాటు. చిన్న పిల్లల్ని బంధించడం అంతటి మూర్ఖత్వం ఇంకోటిలే దు. దాని వలన నాపట్ల, మీపట్ల విముఖత్వం పెరిగిపోయే ప్రమాదం వుంది'' అంది భారతి.

''నేను తనకి తల్లిగానే కాదు, ఓ మంచి స్నేహితురాలిలా కూడా అనిపించాలి'' దృ ఢంగా అంది భారతి.

ఆ సాయంత్రం భారతిని అడిగింది సీత సంకోచిస్తూనే ''అమ్మా... పాప మీతో చనువుగా వుండదేం బాబులా?''

భారతి నవ్వుతూ... ''ఆ విషయం పాపనే అడుగు'' అంది.

సీత ఆశ్చర్యంగా చూసింది. ఆ తరువాత పాప సీతల మధ్య జరిగిన సంభాషణ భారతి కూడా విన్నది.

''పాపా... అమ్మతో చనువుగా వుండవేం? అమ్మతో మాట్లాడవేం?'' పెరట్లో ఒంటరిగా కూర్చున్న పాప సీత తనని ఇలా అడగడంతో వెంటనే సమాధానం చెప్పలేదు.

మరోసారి అడిగింది సీత.

''మరి... మరి...'' పాప ఏదో చెప్పబోయి ఆగిపోయింది.

ఈసారి తను అడిగింది. ''సీతా మరి నీకు అమ్మవుందా?''

''వుంది''

''మీ అమ్మ మంచిదా?''

''చాలా మంచిది'' దిగులుగా అంది సీత. ''ఇక్కడ మీ అమ్మలాగే మా అమ్మ కూడా ఎంతో మంచిది. అయితే...'' సీత అసంపూర్తిగా ఆపే సింది.

''మరి... మరి... ఈ అమ్మ... మా అమ్మ కాదుగా? కొత్తమ్మ''

''అంటే...?'' సీతకి అర్థం గాలేదు.

''మా అమ్మ చచ్చిపోయిందిగా! భారతి కొత్త అమ్మ''

సీతకి పాప చెబుతుందేమిటో వెంటనే అర్థం గాలేదు. అర్థమయ్యాక తెల్లబోయింది. ''నిజమా పాపా?''

''అవును. డాడీ ఈ కొత్తమ్మను పెళ్లిచేసుకు న్నారు''

సీతకి వెంటనే ఏం మాట్లాడాలో తోచలేదు. ఆ అమ్మాయి వయసులో చిన్నదే. హఠాత్తుగా

ఈ కొత్త విషయం తెలిసేసరికి బిత్తరపోయినట్టుగా అయింది.

"సీతా - ఈ అమ్మ మంచిదా?" పాప అడిగింది.

"చాలా మంచిది" చప్పున అంది సీత. "ఎంతో మంచిది. నేను మీ అమ్మే అనుకున్నానుగా. నువ్వే అమ్మతో మాట్లాడవెందుకూ?"

"కొత్తమ్మ మంచిది కాదటగా?"

"ఎవరు చెప్పారు?"

"అరవింద ఆంటీ, పక్కింటి బామ్మా అందరూ అన్నారు- కొడుతుందట... తిడుతుందట. డాడీ ఈ కొత్తమ్మ మాటే వింటాడట. నిజమా?"

"ఛీ... ఛీ... కాదు అబద్ధం" అంది సీత కోపంగా.

"వాళ్ల మాటలు అబద్దాలా?" పాప అడిగింది.

"ఒట్టి అబద్దాలు. అమ్మ ఎంత మంచిది. మిమ్మల్ని చక్కగా ప్రేమగా చూస్తుంది మీ అమ్మలాగే. మీ నాన్నగారు కూడా మంచివారు. బాబుని చూడు అమ్మ ఎంత బాగా ఎత్తుకుంటుందో... ముద్దు చేస్తుందో! నువ్వే అమ్మ దగ్గరికి వెళ్లవు. వాళ్ల మాటలన్నీ నమ్మకు. అబద్ధాలు చెబుతారు. నీకు తెలుసా పాపా మీ నాన్నలాలాగే మా అమ్మ కూడా రెండోపెళ్లి చేసుకుంది. మా నాయన చచ్చిపోయాడు. నన్ను ఇక్కడ వదిలిపెట్టాడే ఆయన అమ్మని పెళ్లిచేసుకున్నాడు. నన్ను మంచిగానే చూడడు. కొడతాడు... తిడతాడు" ఇలా చెబుతూ సీత తొలిసారిగా వెక్కివెక్కి ఏడ్చింది.

వాళ్ళిద్దరి మధ్య జరుగుతున్న సంభాషణని వింటున్న భారతి తెల్లబోయింది. ఏమిటీ? అతడు సీతకి సవతి తండ్రా?

సీత చెబుతోంది "మా అమ్మకి నేనంటే ఎంతో ఇష్టం. అమ్మ నాతో ప్రేమగా మాట్లాడినా ఈ నాయన ఒప్పుకోడు. అమ్మని కొడతాడు. నన్ను తమ్ముళ్లని కూడా ఎత్తుకోనీయడు. అమ్మకి దూరంగా నన్ను తెచ్చి ఇక్కడ వదిలేసాడు..." ఏడుస్తోంది సీత.

భారతి మనసు బాధగా దిగులుగా అయిపోయింది. ఇప్పుడు ఆలోచిస్తోంటే అర్థం అవుతోంది. సీతకి కన్నతండ్రిలా ప్రవర్తించలేదతడు ఆరోజు. సరకు నాణ్యతని చూపించి అవతలి మనిషిని మెప్పించి అంటగట్టే వ్యాపారిలా ప్రవర్తించాడు.

"మీ అమ్మకేం? ఎంత మంచిదని? నన్ను కూడా చాలా అభిమానంగా చూస్తోంది. మా నాయన చాలా చెడ్డవాడు. నన్ను చదువుకోనీలేదు కూడా. ఎక్కడైనా కన్నతండ్రి ఇట్లా బిడ్డల్ని ఎవరో ఇంటికి పంపుతాడా?" పదమూడేళ్ల సీతలో కనిపించే తెలివితేటలూ, పనీ,వయసుకుమించిన విషయ అవగాహన ఎక్కడినుండి వచ్చాయో భారతికి అర్థమవుతోంది.

అనుభవాల్నుండి...

'సవతి తండ్రి' అనే ఏకైక పెద్ద అనుభవంనుండి. భారతి కళ్లల్లో అప్రయత్నంగా నీళ్ళు తిరిగాయి. ఇలాంటిస్థితి పగవాడికిగానీ, ఎంత దుర్మార్గుడికిగానీ సంభవించకూడదు. తల్లి ప్రేమకి, తండ్రి ఆదరణకి బాల్యంలో దూరం కావడం అంతటి దురదృష్టం మరొటి లేదు. బయటినుండి చూసేవారికి దీన్ని గురించి కొంత మాత్రమే తెలుస్తుంది. అనుభవించినవారికిగానీ ఆ శిక్ష ఎంత భయంకరమైనదో అర్థంకాదు.



అరుంధతమ్మకి ఈమధ్య ఒంట్లో బావుండటంలేదు. పెద్దగా తిరగలేకపోతోంది. పెద్ద వయసు, మనోవ్యధా కలిసి ఆమెను కృంగదీస్తున్నాయి. మనవల గురించిన దిగులుతో ఒక్కో రాత్రి ఆమె కంటిమీద కునుకు కూడా పడటంలేదు. రోజులు గడుస్తున్నకొద్దీ తులసికీ, పిల్లలకీ మధ్యదూరం ఎక్కువవుతుందేగానీ తరగటంలేదు. పిల్లల్ని తులసి ప్రేమగా దగ్గ

రికి తియ్యకపోగా వాళ్ల పొత్తు గిట్టనట్టు ప్రవర్తించటం అరుంధతమ్మని ఎంతో మనస్తాపానికి గురిచేస్తోంది.

కొడుకు ఈ విషయం గురించి బొత్తిగా పట్టించుకోవడంలేదు. పోనీ తులసి తీరుతెన్నుల గురించి కొడుకుతో చెబుదామా అంటే అరుంధతమ్మకి ధైర్యం చాలడంలేదు. మూర్తి ఇంట్లో పరిస్థితిని గురించి బొత్తిగా అర్థం చేసుకోకపోవడమే గాక దాన్ని గురించి వివరించి చెప్పబోతోన్న తల్లిమీద మండిపడేవాడు. సవతితల్లీ పిల్లలు అరుంధతమ్మ మూలంగా దగ్గర కాలేకపోతున్నారు అన్నట్టు మాట్లాడేవాడు. ఈ ఆరోపణలో కొంత నిజం లేకపోలేదు. తన చాదస్తం మూలంగా సవతితల్లిపట్ల తన మనసులో వున్న భయం మూలంగా అరుంధతమ్మ పిల్లల్ని సవతితల్లి నీడలోకి వెళ్లనీకుండా తన వెంటవెంటే వుంచుకుంటూ వాళ్లల్లో కూడా అదే భయాన్నీ భావాల్ని రేకెత్తించింది. అయితే తమ సవతితల్లిపట్ల భారతి, చందూ చెరో రకంగా ప్రతిస్పందించేవారు.

స్వతహాగా మెత్తనిదీ భయస్తురాలూ అయిన భారతి తులసిపట్ల తనలో కలిగే భయాల్నీ సందేహాల్నీ అయిష్టాన్నీ మనసులోనే దాచుకుంటే చిన్నవాడైన చందూ వీటిని పైకి ప్రకటించేవాడు. ఈమధ్య అరుంధతమ్మకో దిగులుపట్టుకుంది. తన ఆరోగ్యం చూస్తే ఈమధ్య బొత్తిగా బావుండటంలేదు. పిల్లలు చిన్నవాళ్లు, వీళ్లనీడ కూడా కొత్తకోడలికి బొత్తిగా గిట్టడంలేదు. తను పోయాక వీళ్ల గతి ఏమిటా? అన్నది ఆ దిగులు.

మూర్తి తన సంపాదనంతా తెచ్చి భార్య చేతుల్లో పోస్తున్నాడు. డబ్బునంతా ఏ విధంగా ఎలా ఖర్చు చేస్తున్నదీ తులసి అరుంధతమ్మకి అంతుబట్టనీయడంలేదు. చనిపోయిన రాధ అలా కాదు. ఏరోజు భర్త తన చేతికి ఎంత డబ్బు ఇచ్చిందీ ఎంత ఏ విధంగా ఖర్చు అవుతూందీ అత్తగారికి చాలా వివరంగా లెక్కలతో సహా చెప్పేది. డబ్బు కోడలి చేతిలోవున్నా ఇంటి పెత్తనం అంతా అరుంధతమ్మదే అన్నట్టుగా వుండేది. ప్రతివిషయంలో రాధ అత్తగారి సలహా తీసుకుంటూండేది. అత్తాకోడలు కలిసి చర్చించుకుని గానీ ఏ పనీ చేసేవాళ్లుకాదు. ఇద్దరూ కలిసి మాట్లాడుకుని గానీ ఓ వస్తువుని ఇంట్లోకి తెచ్చేవాళ్లు కాదు. అప్పట్లో మూర్తి ఇంటిగురించి పెద్దగా పట్టించుకునే వాడు కాదు. తల్లి పెద్దది వుందన్న భరోసా, ఇప్పుడలాకాదు. పరిస్థితి మారిపోయింది పూర్తిగా. అంతా తులసి ఇష్ట ప్రకారమే సాగుతోంది. ఏ చిన్న విషయంలోనూ అత్తగారి సలహాని ఆశించదు తులసి.

తనే ఇదిమంచి అని చెప్పబోతే విసుక్కుంటుంది.

"నేను చిన్న పిల్లనా? నాకు తెలీదా? పెద్దవారు మీకెందుకు ఆయాసం?"

అంటుంది చిరాగ్గానూ వ్యంగ్యంగానూ.

"నువ్వు చిన్నదానివి ఎందుకు అవుతావు? నాకొడుకుని వలలో వేసుకున్న జాణవి కాదూ?" గొణుక్కునేది అరుంధతమ్మ.

"ఏమిటి అంటున్నారు? అనేదేదో గట్టిగా అనండి నేనూ వింటాను." బిగ్గరగా అనేది తులసి.

అరుంధతమ్మ వీలయినంత వరకూ బదులు చెప్పేదికాదు. ఆవిడ వుండబట్టలేక కోడలికి జవాబు చెబితే ఇంట్లో పెద్ద గొడవ అయ్యేది. తులసి అలక పాన్పు ఎక్కుతుంది. ఈ గోలనంతా భరించే శక్తి లేక వీలయ్యేంతవరకూ కోడలి మాటకి బదులు చెప్పడం మానేసింది అరుంధతమ్మ. అయితే ఇరుగూపొరుగూ దగ్గర మాత్రం ఆమె నోరు వూరుకుండేది కాదు. ఇదే ఆమెలో వున్న పెద్ద చెడ్డ అలవాటు.

"చివరికి పిల్లలకి బట్టలు తీసుకురావడం కూడా ఆ మహారాణి ఇష్టమే. నాసిరకంవి తెస్తుంది" అనేది.

"నా కొడుకు సంపాదనంతా రెండో పెళ్లాం దోసిట్లో పోస్తున్నాడు. అది ఆ డబ్బుని మంత్రం పెట్టినట్టు మాయం చేస్తోంది. దాచిపెట్టుకుంటోందో పుట్టింటికి పంపుతోందో తెలీడంలేదమ్మా..." అంటూ వాపోయేది.

ఈ మాటలు చాలా వేగంగా తులసిని చేరేవి. ఆమె మండిపడేది. అత్తగారి పట్ల వున్న ఆగ్రహంకాస్తా పిల్లలపట్ల ద్వేషంగా మారిపోతోంది ఆమెలో అరుంధతమ్మలో




ఒకటే ఆలోచన. ఏదో ఒక రోజున తను గుటుక్కుమంటుంది. అప్పుడు ఈ పిల్లల బ్రతుకెలా తయారవుతుంది? తులసికి ఈరోజు కాకపోతే రేపు పిల్లలు కలగకపోరు. అప్పుడు ఈ పిల్లల పరిస్థితి ఏమిటి? మరీ దయనీయంకాదా? అరుంధతమ్మ వెయ్యిదేవుళ్లకి మొక్కుకునేది తులసికి పిల్లలు పుట్టకుండా చెయ్యమని. తులసికి పిల్లలు పుడతారన్న ఆలోచన ఆవిడకి ఎంత భయాన్ని కలిగించేదంటే ప్రతినెలా ఆమెకి ఋతుక్రమం వస్తోందీ లేనిదీ జాగ్రత్తగా గమనిస్తూండేది. ఏ ఒక్క రోజు ఆలస్యమైనా ఆమెకి భయంతో దిగులుతో పిచ్చెక్కినట్టుండేది. ఒక్కోసారి కొడుకుని కోడలి నీడ సోకనంత దూరానికి తీసుకెళ్లి విషయమూ తన భయమూ వివరించి చెప్పి పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చెయ్యించుకోమని వేడుకుందాం అని కూడా అనిపించేది. అంతలోనే ఆవిడకి భయం వేసేది.

కొత్త పెళ్లాం మూర్తికేదో మందుపెట్టింది. వాడు తనమాట వింటాడా? వూహూఁ... వినడు. వినడుగాకవినడు. ఇలా అనుకుని ఎంతో నిరాశచెందేది. ఈ విషయంలో తనెంత క్రూరంగా ఆలోచిస్తుందన్నది అరుంధతమ్మ ఎప్పుడూ గమనించలేదు. పాప పుణ్యాల పట్ల విపరీతమైన నమ్మకం కలిగిన అరుంధతమ్మ తనది పాపపు ఆలోచనగా ఎప్పుడూ తలచలేదు.

ఆరోజు...

అరుంధతమ్మ గుండెల్లో రాయి పడ్డట్టయింది. అరుంధతమ్మ ఏ విషయం తలచుకునైతే భయపడుతూండేదో అది అవనే అయింది. భారతి వ్యక్తురాలైంది.

"ఈరోజుల్లో పిల్లలు ఎలా వున్నారే? చూసిరమ్మంటే కాల్చివస్తున్నారుగదే? ఇంత అమాయకప్పిల్లవైతే ఎట్లాగే తల్లీ? ఈ ముసలిముండ ఎల్లకాలమూ నిన్ను అంటిపెట్టుకుని వుంటుందా?" అంటూ నాయనమ్మ కళ్లనీళ్లు పెట్టుకుంటూంటే భారతి బిత్తరపోయింది.

కోడల్ని ఎప్పుడోగానీ అరుదుగా పిలిచి ఏవిషయమూ సంప్రదించని అరుంధతమ్మ ఇప్పుడు తులసిని పిలిచింది "అమ్మా తులసీ... భారతి పెద్దదయిందే! ఎలా ఇప్పుడు? ఎక్కడ కూర్చోబెడదామంటావు? బయట వరండాగది ఖాళీచేసి అక్కడ కూర్చోపెడదామా? లేకపోతే పెరట్లో వరండాలో కూర్చోపెడదామా?" అని సలహా అడిగింది.

అత్తగారి మాటలు తులసి గుండెల్లో ఫిరంగుల్లా మోగాయి.

"ఏమిటీ?" అంది పాలిపోయిన మొహంతో.

"భారతి వ్యక్తురాలైంది తల్లీ! దాని తల్లే వుండివుంటే ఎంత సంబరపడివుండేదో" అంటూ కళ్లు తుడుచుకుంది అరుంధతమ్మ.

తులసి ఏమీ మాట్లాడలేదు.

"చెప్పవే అమ్మా? ఎక్కడ కూర్చోపెడదాం అంటావు?"

అప్పటికి తేరుకుంది తులసి. చాలా వ్యంగ్యంగా "బాత్‌రూమ్‌లో కూర్చోబెట్టండి, కుంకుడురసం తెస్తాను. నెత్తిమీదవేసి తలంటి ఇంట్లోకి తీసుకొద్దాం" అంది.

"ఏమిటీ?" అరుంధతమ్మకి అర్థంకాలేదు.

తులసి మరోసారి చెప్పి "కూర్చోబెట్టడం ఏమిటి అసహ్యంగా? అదంతా బాగుండదు. ఈ విషయం ఎవరితోనూ అనకండి. ఇలాంటి చాదస్తాలకి ఇప్పుడెవరూ పోవడంలేదు. తలస్నానం చేయించి స్కూలుకి పంపెయ్యండి. స్కూల్‌టైమ్‌కూడాఅవుతోంది" అంటూ వెళ్లిపోయింది.

వెర్రిమొహంవేసి చూసింది అరుంధతమ్మ.

తులసి బాధ తులసిది. ఈ ప్రమాదాన్ని గురించి తులసి ఎప్పుడూ ఆలోచించలేదు. దానికి కారణం భారతి కాస్త పీలగా ఇంకో రెండుమూడేళ్లకిగానీ అందాకా రాదు అనిపించేలావుంటుంది. ఇంతలో ఇంతపని చేసివూరుకుంది. ఈ విషయం నలుగురికీ తెలిస్తే...

"పిల్ల ఎదిగిపోయింది" అంటారు.

అప్పుడే ఎదిగిన పిల్ల తల్లిగా ముద్రపడిపోతుంది తనకి. ఈయేడూ వచ్చేయేడూ జరుగుతుండగానే "పిల్లకి పెళ్లిచేసెయ్యాలి" అంటూ పోరు మొదలుపెడుతుంది ముసలావిడ.

సంబంధాలకోసం వేట ప్రారంభిస్తాడు భర్త.

ఏదో సంబంధం కుదురుతుంది. భారతికి పెళ్లయిపోతుంది. అప్పుడు తను అత్తగారవు తుంది. ఏడాది తిరిగేసరికి భారతికి పిల్లలు పుట్టుకొస్తారు. తను అమ్మమ్మ అయిపోతుంది. భర్త తాత అవుతాడు.

"అదుగో, ఆ వెళ్లేఆవిడ లేతగా కని పిస్తోందా, ఆవిడకి మనవళ్లుకూడా వున్నారు" అని చెప్పుకుంటారు జనాలు.

తులసికి ఏడుపొచ్చినంత పనయింది. ఈ మునలావిడ చాదస్తంతో ఈ విషయం అందరి కీ తెలిసిపోతుందేమో... తెలీడానికిలేదు.

తులసి ఆలోచనలు ఇలా వుంటే అరుంధ తమ్మ ఆలోచనలు ఇంకోలావున్నాయి.

ఏమంటోంది తులసి?

ఈ విషయం నలుగురికి తెలీకుండా దాచు కోవాల్నా?

ఏంఖర్మ?

ఇంటికి పెద్దపిల్ల, ఒక్కగానొక్క ఆడపిల్ల పెద్దమనిషయితే ఈ విషయం బయటికి చె ప్పుకోకూడదా ... ఏం అంత ఖర్మ? తామేం పిల్ల ముద్దూముచ్చట్లూ తీర్చుకోలేని గతిలేని వాళ్లా? దాని తండ్రి బాగా సంపాదిస్తున్నాడు. నలుగురికి చెప్పుకుని సంబరంగా కార్యం జరుపుకుంటే ఎంత బాగుంటుంది? నలుగు రు ముత్తయిదువలు వచ్చి పిల్లని ఆశీర్వ దించివెళితే ఎంతమంచిది? చాన్నాళ్లకు ఇంట్లో శుభకార్యం జరగబోతోంటే వద్దంటుందా? తనకి పిచ్చి అనుకోవాల్నా చాదస్తం అనుకోవాల్నా?

"తులసీ.... లోపలికి వెళ్లి కూర్చుంటే ఎలా గే" అంటూ వచ్చింది.

"ఇదంతా నాకు ఇష్టంలేదని చెప్పానా? ముందు ఆ అమ్మాయికి స్నానంచేయించి లోపలికి తీసుకురండి. మీకు ఓపిక లేదంటే నేనే ఆ పనిచేస్తాను"కంపరంగా అంది తు లసి.

కోడలు తన మాటలు వినిపించుకోదని అర్థమై పోయింది అరుంధతమ్మకి.

అత్తకీ కోడలికీ మధ్య మళ్లీ ఘర్షణ...

అరుంధతమ్మ చాలా పట్టుదలగా కది లింది... "ఏం? నువ్వు పట్టించుకోక పోయి నంత మాత్రాన నీకు ఇష్టం లేకపోయినంత మాత్రాన ఏమీ అవదనుకుంటున్నావా?" అంటూ వెళ్లి ఇరుగుపొరుగుని పిలుచుకువ చ్చింది.

తులసి ప్రేక్షకురాల్లా చూస్తూండగా ఆమె ప్రమేయంలేకుండానే నానా ఆర్భాటంగా వరండాగదిలో గడ్డిపరిచి దానిమీద పక్కవేసి తులసిని కూర్చోబెట్టి మిగతా తతంగాలు జరి పించేశారు అమ్మలక్కలు. ఆ సాయంత్రం లోపల ఈ విషయం ఆ వీధంతా తెలిసిపో యింది. తెలిసిన వాళ్లంతా కొబ్బరిచిప్పలూ నెయ్యీ బెల్లం పండ్లూ పూలూ పసుపూ కుంకుం తీసుకుని వచ్చి భారతికి ఇచ్చి ఆమెను చూసిపోసాగారు.

"మూర్తికి తొందర్లోనే అల్లుడు వస్తాడన్న మాట?" అంటూ హాస్యాలాడసాగారు.

అంబుజమ్మచేత చేయించిన చిమ్మిలి పే రంటాళ్లకి ఇప్పించింది అరుంధతమ్మ. జరిగే తతంగాన్నంతా చాలా నిస్సహాయంగా చూ స్తూండిపోయింది తులసి. ఆమెకి పుట్టెడు దుఃఖం ముంచుకొచ్చింది. అప్పుడు మూర్తి వూళ్లోలేడు. వ్యాపారం మీద పెట్టుబడి పెంచ డానికి డబ్బు అవసరమై అక్కడెక్కడో పల్లెటూ ర్లో వున్న ఎకరం పొలం అమ్ముకురావడానికి వెళ్లాడు. అతడు తిరిగివచ్చేసరికి నాలుగు రోజులు గడిచిపోయాయి. ఈ నాలుగురోజుల్లో అరుంధతమ్మ చెయ్యాల్సిన హడావుడి అంతా చేసింది. ఈ విషయాన్ని తన బంధువులంద రికీ తెలియచేస్తూ ఉత్తరాలు రాయించింది. అందరినీ పదకొండో రోజుకి వచ్చెయ్యమనీ ఆ రోజు పెద్ద ఎత్తున సంబరం జరుగుతుందని వ్రాయించింది.

తులసి నిమిత్తమాత్రురాల్లా వుండిపోతే "ఇ దంతా ఎందుకే నాయనమ్మా?" సిగ్గుపడటం కూడా తెలీని భారతి విసుగ్గా అంది.

ఆ అమ్మాయికి బడి మానేసి రోజుల తరబ డి పడకమీద ఉండిపోవడం చాలా చిరాగ్గా వుంది. కదలకూడదు. మెదలకూడదు. బాత్ రూమ్‌కి వెళ్లాలన్నా నాయనమ్మ పసుపునీళ్ల చెంబులో వేపమండలువుంచుకుని వాటిని చల్లుకుంటూ ముందుదారి తీస్తుంది. పొద్దస్త





మానం ఏదో ఒక తినుబండారాలు చేసి తీసుకొచ్చి "తిను... తిను..." అంటూ ప్రాణం తీసేస్తుంది.

తినలేకపోతే "మరీ అంతసుతారమైతే ఎలానే తల్లీ? తింటేకదూ ఒంట్లో శక్తి కూడేది? ఇక ఇదీ ఎదగాల్సిన వయసు. పుష్టిగా తినాలే అమ్మా... ఎంత తింటే అంత బలం. మీ అమ్మా నేనూ ఈ ముచ్చట గురించి ఎన్ని కలలు కనేవాళ్లం. దానికి చూసే రాతలేకపోయింది" అంటూ కళ్ల నీళ్లు పెట్టుకునేది.

తల్లి గుర్తొచ్చి భారతికీ కళ్లనీళ్లు తిరిగేవి. అరుంధతమ్మ నానా హైరానా పడి రోజుకి రెండు రకాల స్వీట్స్ చేస్తుండేది. తులసి ఆ ఛాయలకి కూడా వెళ్లేదికాదు. అరుంధతమ్మకి చాలాకాలం తరువాత ఒంట్లోకి చాలా శక్తి వచ్చినట్టుగా అనిపించసాగింది. కొడుకు ఎప్పుడెప్పుడు వస్తాడా అని వెయ్యి కళ్లతో ఎదురు చూడసాగింది.

మనవరాలితో "ఈ మధ్య ఒంట్లో ఏమీ బాగుండటంలేదు. ఎప్పుడు గుటుక్కుమంటానో. ఆ తరువాత ఇదుగో ఇలాంటి ముచ్చట్లు నీకెట్లా తీరుతాయా అని దిగులుపడి చచ్చేదాన్నే తల్లీ... ఇప్పుడు నా ఒంట్లో ఎంత హుషారుగా వుందో చెప్పనేను. నిండునూరేళ్లు బ్రతకగలనన్న ధైర్యం వచ్చింది" అంటూ సంబరంగా నవ్వేది.

"నాయనమ్మా... నువ్వు ఇక ఎప్పుడూ ఇలా ఫలహారాలు చేస్తూంటావా?" చందూ అడిగేవాడు.

"ఎప్పుడూ ఎందుకు చేస్తారా వెర్రినాగమ్మా? భారతిలేచేదాకే"

"అక్కా... నువ్వు ఆ చాపమీద నుంచి అస్సలు లేవకే ఎప్పటికీ" బ్రతిమాలేవాడు చందూ.

"హరి భడవా... అదా నీ బాధ?" ముసలావిడ హాయిగా నవ్వుకునేది.

జరగబోయే శుభకార్యం గురించి కలలు కంటూ భారతికి ఎలాంటి బట్టలు ఎంత ఖరీదులో ఎన్ని జతలు తీసుకురావాలో ఆరోజుకి ఏమేం పిండివంటలూ కూరలూ చెయ్యాలో అమ్మలక్కల్ని సలహాలు అడిగేది. తులసి పరిస్థితి వెలి వెయ్యబడిన దానిలా అయింది.

"భారతికి ఇక ఓణీలు ఇస్తానమ్మా. ఈ కళ్లతో అన్ని ముచ్చట్లూ చూడాలి" అంటూండేది అరుంధతమ్మ.

అప్పటికే ఓ పాత చీర చింపి భారతికి పైట వేసింది ఆవిడ. ఈ నాలుగు రోజుల్లో తులసి మొహంతోసహా పీల్చుకుపోయి జబ్బుపడి లేచినదానిలా తయారయింది. మూర్తి వచ్చాడు. అతడ్ని బయటవరండాలోనే నిలబెట్టి విషయం అంతా వివరించేసింది అరుంధతమ్మ.

"ఘనంగా ఈ శుభకార్యం జరిపించేసెయ్యాలిరా నాయనా. ముసలిముండని ఏదో నా చాదస్తం. ఈ కోర్కెని మాత్రం కాదనకు ఏం?" అని తల్లి చిన్న పిల్లలా అడుగుతూంటే మూర్తి కాదనలేకపోయాడు.

"సరేలేమ్మా" అన్నాడు.

అప్పుడతడు అంతకుమించి ఏమీ ఆలోచించలేదు.

భార్యని చూసి అతడు "అదేమిటి తులసీ అలావున్నావు? ఒంట్లో బావుండలేదా?" ఆదుర్దాగా అడిగాడు.

"నాకేం? సలక్షణంగా వున్నాను" అంటూ మొహం తిప్పుకుంది తులసి.

అరుంధతమ్మ కొడుకు గమనించకుండా మూతీముక్కు విరుచుకుని ఇవతలికి వచ్చేసింది. కొడుకు తన కోరికని ఆమోదించడంతో చాలా సంబరంగా ఈ విషయం నలుగురితో చెప్పుకుని వచ్చింది.

"దగ్గరుండి ఈకార్యం జరిపించాలే అంబుజం... మూడు కాళ్లముసలిదాన్ని ఒంటి చేత్తో నెగ్గుకురావడం నా వలన ఏమవుతుంది? కోడలుందీ అంటే అది కొరివి అయికూర్చుంది"

"నువ్వు ఇంతగా చెప్పాల్నా పిన్నీ... మేమంతా లేమూ" అంది అంబుజమ్మ.

అయితే ఆ మర్నాడు ఉదయం అరుంధతమ్మ కలలన్నీ కల్లలుగా మిగిలిపోక తప్పదన్న సత్యం తెలిసివచ్చింది. తులసి భర్తకి ఏం చెప్పిందో ఎలా నచ్చజెప్పిందో గానీ "ఏమిటమ్మా నీ చాదస్తం? ఈరోజుల్లో ఈ తతంగాలన్నీ

ఎవరు చేస్తున్నారని? మా అమ్మాయి ఇలా అని నలుగురికీ తెలుపుకోవాల్నా అసహ్యంగా భారతిని ఇంట్లోకి తీసుకొచ్చేసెయ్'' అన్నాడు తల్లితో మూర్తి.

అరుంధతమ్మ తెల్లబోయి ''అదేమిట్రా?'' అంది.

తులసి అందుకుంది ''భారతి చిన్న పిల్ల... ఏ వయసు పిల్లల్ని అలా వుంచేస్తే మంచిది. లేనిపోని పెద్దరికం అంటగట్టడం ఎందుకూ? ఇప్పుడిలాంటి సింగినాదాలన్నీ ఎవరుచేస్తున్నారు? చదువుకున్నవాళ్లు నవ్వుతారు. మీరు నా మాటలు ముందుగా వినిపించుకున్నారా?'' అంది.

''భారతీ... స్నానం చేసి ఇంట్లోకి వచ్చెయ్'' కూతుర్ని కేకవేశాడు మూర్తి.

అరుంధతమ్మకి తన ఆశాసౌధాలన్నీ ఒక్కొక్కటిగా కూలిపోతూన్నట్టుగా అనిపించాయి.

''అయ్యో అదేమిట్రా? మన వాళ్లందరికీ జాబులు వ్రాసేశాను. ఒక్కగానొక్క పిల్ల తల్లి లేనిది...'' విలవిల్లాడుతూ కొడుక్కి నచ్చజెప్పబోయింది.

''అమ్మా నోర్మూయ్...'' అన్నాడు మూర్తి.

రెండో భార్యని తన పిల్లలకి తల్లి లేనిలోటు తీర్చడం కోసంగా తెచ్చాను అని చెప్పుకునే అతడు, ఆ భార్యని తన పిల్లలకి తల్లిని చెయ్యలేక భార్యగా మాత్రమే మిగుల్చుకున్న అతడు తన స్వంత అభిప్రాయాల మీదగాక భార్య అభిప్రాయాల మీద ఆధారపడి బ్రతకడానికి అలవాటుపడ్డ అతడు ఆ భార్య ముందు వృద్ధురాలైన కన్నతల్లిని 'నోర్మూయ్' అన్నాడు.

''బోడి ఉత్తరాలు వ్రాస్తే ఏం? ఎవర్నీ రావద్దని రాసేస్తాను. తల్లిలేదా? తులసి తల్లికాదా? నువ్వు బ్రతికివుండగా తల్లీ పిల్లల్ని అన్యోన్యంగా వుండనిచ్చేలా లేవు. ప్రతి విషయంలోనే వేరు బంధంగా చూస్తున్నావు తులసిని. ఏం మనిషివి నువ్వు?''

అరుంధతమ్మ కళ్లు ఎర్రచేసి మీదకి వచ్చి పడినట్టే మాట్లాడుతూన్న కొడుకుని నిలువుగుడ్లతో చూస్తుండిపోయింది. ఆమె చూస్తుండగానే పైట తీసిపారేసి స్నానం చేసి ఇంట్లోకి వచ్చింది భారతి. పుస్తకాలు పట్టుకుని స్కూలుకి వెళ్లిపోయింది. మూర్తి తన బంధువులందరికీ పేరు పేరునా తన తల్లి చాదస్తంగా ఏదో వ్రాసిందని ఆమె ఉత్తరాల్ని పట్టించుకుని రావద్దని వ్రాసివదేశాడు.

చాదస్తం...

అతడి భార్య చెప్పింది అతడికి ఈ మాట... ఆమె చెప్పినదాకా అతడు తల్లి కోరికను తిరస్కరించలేదు... చాదస్తం...

భార్య చెప్పకముందే అతడావిడ కోరికను తీసిపారవేయలేదు... నిజమే...

ఆవిడది చాదస్తమే...

మొదటే అతడు నెమ్మదిగా తల్లి మనసుని నొప్పించకుండా ఈ విషయం నచ్చ జెప్పి వుంటే ఆవిడకి అంత అసంతృప్తిలోనూ కాస్త వూరట లభించివుండేది. నిజంగా అత్తగారి కోరిక చాదస్తం అనిపించికాదు, తులసి అడ్డు పడింది. స్వార్థంతో కేవలం వ్యక్తిగతమైన తన స్వార్థంతో...

ఒకనాడు భారతిలాంటి పరిస్థితిలో తను వున్నప్పుడు తన స్నేహితురాళ్ళకిలాగా తనకి ఘనంగా కార్యం జరిపించలేదని తను ఏడ్చి గొడవచేసిన విషయం తులసికి బాగా గుర్తుంది. తనకి తల్లీ తండ్రీ అందరూ వుండీ డబ్బులేని కారణంగా ఇలాంటి ముచ్చట్లు తీరలేదు. ఇప్పుడు తల్లిలేని భారతి కోసం ముసలావిడ పడుతోన్న ఆరాటం, చేస్తూన్న ఆర్భాటం చూస్తూంటే అసూయ ముల్లులా గుచ్చుతోంది తులసి మనసుని దాన్ని మించింది... భారతి పెద్దది అనుకుంటే తనూ వయసులో చాలా పెద్దదిగా పరిగణింపబడుతుందన్న భయం. మూర్తి ఇదంతా గమనించకుండా మరోసారి తల్లి పెద్దరికాన్ని అవమానించాడు. ఆమె ముచ్చటని మొదట అవునని తరువాత కాదన్నాడు. కేవలం భార్య మాటలు విని.

ఇప్పుడే ఈ విధంగా భార్య మాటలకి కట్టుబడి ఆమె ఆడిస్తోన్నట్టు ఆడుతూన్న మూర్తి చేతుల్లో పిల్ల భవిష్యత్తు ఎలా ఉంటుంది? ఏ దారంట వెళ్లేవాడికో పిల్లనిచ్చి చేద్దామంటే కాదనకుండా వాడివెంటపంపించి వెయ్యడా? ఆ రాత్రి మనవరాల్ని గుండెల్లో పొదువుకుని





కుళ్ళి కుళ్ళి ఏడ్చింది అరుంధతమ్మ.

భారతికీ ఏడుపొచ్చింది.

"భగవంతుడా ఈ తల్లిలేని బిడ్డలకి ఇక నువ్వేదిక్కు" ఎన్ని వందలసార్లు ఆవిడ దేవుణ్ణి వేడుకుందో ఆవిడకే తెలీదు.

ఏ వేకువ ఝామునో ఆవిడకి నిద్రపట్టింది. అరుంధతమ్మ మళ్ళీ నిద్ర మేలుకోనేలేదు. శాశ్వత నిద్రలోకి వెళ్ళిపోయింది.

తల్లి పోయాక భారతికి ఇప్పటిదాకా అనుభవించిన దుఃఖం దిగులూ బాధ ఒక ఎత్తు. నాయనమ్మ నీడలోంచి సవత్తల్లి సంరక్షణలోకి వచ్చిన భారతి ఎదుర్కొన్న చవిచూసిన అనుభవాలు ఇంకొక ఎత్తు.

మొదటిది పిల్లగాలయితే రెండోది పెనుగాలి. ఒంటరితనానికి, బతుకుభయానికి అర్థం తెలిపి కేవలం రెండు సంవత్సరాల్లోనే అమాయకురాలైన భారతిని మానసికంగా ఎంతగానో ఎదిగేలా చేశాయి ఆమె ఎదుర్కొన్న ఆ అనుభవాలు. ఆమెని భవిష్యత్తులో ఒక 'మంచి అమ్మ'గా తీర్చిదిద్దిన ఘనత సవతితల్లి నిర్దయది, సవతితల్లి కఠినత్వానిది. సవతితల్లి స్వార్థానిది.

★ ★ ★

"అమ్మా... చీకట్లో కూర్చున్నారు. అయ్యయ్యో... పొయ్యిమీద అన్నం మాడిపోతోందమ్మా" సీత ఖంగారుగా అనడంతో చప్పున కలలోంచి తెలివి తెచ్చుకున్నట్టు కదిలింది భారతి.

ఆమె చెక్కిళ్ళమీద కళ్లనీళ్లని చూసి సీత బిత్తరపోయింది.

"అమ్మా. " అంటూ ఏదో అనబోయి ఆగిపోయింది.

ఆ ఇంటికి వచ్చిన మొదటి రెండు రోజులూ ఎంతో ముభావిగా కనిపించిన సీత భారతి అందిస్తూన్న అభిమానం ఆప్యాయతలతో తన జంకుని, సంకోచాల్ని చాలావరకూ వదిలివెయ్యగలిగింది. ఆ ఇంట్లో ఒకరిగా కలిసిపోవడానికి ప్రయత్నిస్తోంది. మాడిన అన్నాన్ని దించి, కిందపెట్టేసి స్టౌ ఆర్పేసి సీత భుజాలు రెండూ పట్టుకుని ఉద్వేగ్నంగా అంది భారతి-

"సీతా నువ్వు నన్ను 'అమ్మా' అని పిలుస్తూంటే ఈ అమ్మాయి నన్ను 'అక్క' అని పిలవడానికి ఎందుకింతగా సంకోచించాల్నా అనుకునేదాన్ని. నిదానంగా నీచేత ఆ అలవాటు మాన్పించి అక్కా అని పిలిపించుకోవాలనుకేదాన్ని. కానీ, ఇప్పుడు ఆ అభిప్రాయాన్ని మార్చుకున్నాను. 'అమ్మా' అని కన్నతల్లిని పిలవడానికి కూడా నోచుకోలేని దురదృష్టవంతురాలివి. నువ్వు అనుభవిస్తూన్న బాధని మరోరకంగా నేనూ అనిభవించాను సీతా! నన్ను 'అమ్మా' అని పిలవడం ద్వారా నీ మనసు ఏ కాస్త ఊరటపొందినా నాకు ఆనందమే..."

సీత భారతి మాటలు సరిగ్గా బోధపడనట్టు బెరుగ్గా చూసింది.

"నువ్వు ఇక్కడికి పనిమనిషిగా, బలవంతంగా తీసుకురాబడ్డ కథ గురించి నాకు తెలిసిపోయిందమ్మా..." రుద్ధకంఠంతో అంది భారతి.

సీతకి విషయం అర్థమయింది. పదమూడేళ్ల సీత ఒకనాడు ఆ వయసులో ఉన్నప్పటి భారతికంటే తెలివైనది.

"అమ్మా..." అంది పూడిపోతున్న కంఠంతో- "మీ దగ్గిర నాకు అమ్మ దగ్గర వున్నట్టే వుంది. నాకు కడుపునిండా అన్నం పెడుతున్నారు. నన్ను ప్రేమగా చూస్తున్నారు. నాకిప్పుడు అంతగా దిగుల్లేదమ్మా. అమ్మ అక్కడ ఎంతగా ఏడుస్తోందో...?"

"నిన్ను అప్పుడప్పుడు నేను మీ అమ్మ దగ్గరికి తీసుకెళ్ళి చూపిస్తుంటాను- సరేనా?"

ధైర్యం చెబుతూన్నట్టంది భారతి "నువ్వు ఒంటరితనంతో బాధపడకూడదు. నీ మనసులో కష్టం సుఖం నాతో చెప్పుకోవాలి. నీకేం కావలసివచ్చినా మొహమాటపడకుండా నన్ను అడగాలి. నీ కాళ్లమీద నువ్వు నిలబడగలిగేలా నిన్ను నేను తీర్చిదిద్దుతాను. సరేనా? ఈ ఇంటి పనిమనిషిగా నిన్ను నువ్వు భావించుకోవద్దు. ఈ కుటుంబసభ్యురాల్లా కలిసిపోవాలి. ఏం?"

"సరేనమ్మా" ఆనందంగా అంది సీత.

పాప తమ్ముణ్ణి అడుగుతోంది- "అజిత్! కొత్త అమ్మ నిజంగా మంచిదేనా?" "ఓ..." కళ్లు



పెద్దవిచేసి రెండు చేతులూ చాపి- ''అమ్మ మంచిది, చాలా మంచిది'' అన్నాడు బాబు.

''నువ్వంటే అమ్మకి చాలా ఇష్టమా?''

''ఓ... బోల్డంత ఇష్టం. అమ్మ నన్ను ఎత్తుకుంటుంది. స్నానం చెయ్యిస్తుంది. అన్నం తినిపిస్తుంది. చిచ్చు కొడుతుంది. అమ్మ నాది'' ఎక్కడ అక్క పోటీకి వస్తుందో అన్నట్టు అన్నాడు వాడు.

పాపకి చాలా ఈర్ష్యగా అనిపించింది. కళ్లలో నీళ్లు తిరిగాయి.

''డాడీ నాకు'' అంది.

''నాకు డాడీ - మమ్మీ ఇద్దరూ'' గట్టిగా అన్నాడు వాడు.

''నా క్కాడా ఫో...'' అంటూ వాణ్ణి గట్టిగా రెండుదెబ్బలు వేసింది పాప ఉక్రోషంతో.

బాబు ఏడుపు లంకించుకున్నాడు. అయితే వీళ్లగొడవ పట్టించుకోనంతగా సీత చెబుతూన్న ఆమె కథ, ఆమె తల్లికథ వినడంలో పూర్తిగా నిమగ్నరాలైవుంది భారతి. సీత చెబుతోంది...

ఈ ప్రపంచంలో సవతితల్లుల సంరక్షణలో అమాయకురాలైన పిల్లలు అనుభవిస్తూన్న కష్టాలకథే సీత కూడా. అయితే సవతి తల్లికి బదులుగా సవతితండ్రి ఉన్నాడామె కథలో. అనేకమంది సవతి తల్లుల్లో వుండే స్వార్థం, నిర్దాక్షిణ్యం సీత రెండో తండ్రిలో వున్నాయి. అయితే స్త్రీలలో వుండని కర్కశత్వం కూడా అతడిలో వున్నాయి. మగవాడి స్వార్థానికి సంకుచితత్వానికి మచ్చుతునక సీతయొక్క ఈ తండ్రి మనస్తత్వం.

సీత తల్లి శేమ చాలా తక్కువదిగా భావించబడే కులంలో పుట్టింది. పదిహేను పదహారేళ్ల వయసులో తల్లితండ్రులామెకి పెళ్లిచేశారు. పదిహేడేళ్ళ వయసు వచ్చేసరికి శేమకి కూతురు పుట్టింది. శేమ భర్త ఆమెని చాలా ప్రేమగా చూసుకునేవాడు. అతడికి తాగుడు అలవాటుంది. అతడు తాగివచ్చినరోజు భార్యని తిట్టడం, కొట్టడంలాంటివి చేసేవాడు కాదు. నిశ్శబ్దంగా పడుకునేవాడు. దానిమూలంగా, భర్తయొక్క ఈ అలవాటు మూలంగా శేమకి ఎలాంటి కష్టమూ, బాధా కలగలేదు. పైగా శేమ అందమైనది కావడంతో ఆమెని ప్రేమగా చూసుకునేవాడు భర్త రామదాసు. పేదరికంలో వున్నా వున్ననాడు తిని లేనివాడు పస్తులున్నా భర్త, బిడ్డతో జీవితం సుఖంగానే అనిపించేది శేమకి. భర్తతోపాటు తరచూ తనూ పనీపాటలకి వెళుతూండేది. సీత తరువాత ఆ దంపతులకి మళ్లీ సంతానం కలగలేదు. ఇంకో కొడుకు కావాలని వుండేది శేమకి. రామదాసుకి కూతురంటే ప్రాణం.

''నాకో బిడ్డచాలే శేమా. నా కూతుర్ని చదివించి డాక్టరమ్మని చేస్తా'' అంటూండేవాడు అప్పుడప్పుడు.

''ఒయబ్బో! అదీ చూడనా?'' అనేది శేమ మురిపెంగా.

సుఖంగా సాఫీగా సాగిపోతూన్న ఆ కుటుంబాన్ని చూసి విధికి కన్నుకుట్టిందా అన్నట్టు నాలుగురోజుల కూలిడబ్బులు ఒక్కసారిగా చేతిలో పడేసరికి రామదాసు పూటుగా సారాయికొట్టి ఒళ్లుతెలీని స్థితిలో ఇంటికి వస్తుండగా తెగిపడిన వీధిస్తంభపు కరెంటు తీగ అతడ్ని బలితీసుకుంది. శేమ వితంతువైంది. సీత తండ్రిలేని బిడ్డయింది. వూరంతా 'అయ్యో అంటే అయ్యో' అంది. శేమ శోకానికి అంతులేదు. అప్పుడప్పుడే వూహ తెలుస్తున్న సీతకి తండ్రిలేడని ఇక కనబడడనీ కాస్త అర్థమైంది. 'నాయన కనబడడు' అన్న విషయం సీతకి చాలా దుఃఖం కలిగించింది.

''అమ్మా! కువైట్‌పోయిన మంగత్త మొగుడిలాగా నాయన ఇంకరాడా?'' అని కూతురు అడుగుతూంటే శేమ గుండె బద్దలయ్యేలా ఏడ్చింది.

అయితే తనిలా అర్థాంతరంగా చేజేతులా ఆయుష్షుతుంచుకుని ఏడుస్తూ కూర్చుంటే తన కడుపూ కూతురి కడుపూ నిండదన్న సత్యాన్ని గ్రహించి తన దుఃఖాన్ని తనలోనే అణచుకుని కూలీనాలీకి వెళ్లటం ప్రారంభించింది శేమ భర్త పోయిన పదిరోజుల తరువాతనుండే. ఆమె తల్లిదండ్రులూ నిరుపేదలే. తన రెక్కల కష్టంమీదే తనూ తన బిడ్డ బతక్క తప్పదని శేమకి తెలుసు. అప్పుడామెకి పాతికేళ్లు. భర్త పోయిన దుఃఖాన్ని మర్చిపో

తుండగా తారసపడ్డాడామెకి సింగరాజు. అత డిదీ అదేవూరు. అయితే నాలుగేళ్లక్రితం పెళ్లి చేసుకుని అత్తగారి వూరికి ఇల్లరికం వెళ్లిపోయాడు. అంతక్రితం అతడూ రెక్కల కష్టంమీద జీవించేవ్యక్తే. తల్లిదండ్రులకి ఏకైక సంతానం అయిన భార్య కానుపు కష్టమై పోవడంతో అతడికి కాస్త ఆస్తి కలిసివచ్చింది.

దాన్ని అమ్ముకుని వచ్చి సొంతవూరులో ఓ ఎకరం పొలం కొనుక్కున్నాడు. మళ్లీ పెళ్లిచేసుకోవాలనే ఉద్దేశంలో వుండగా అతడి కంటబడింది యవ్వనంలో విరగబూసిన ముద్దబంతి లాంటి శేషు. ఆ తరువాత అతడు శేషుని లోబరచుకోవడానికి చెయ్యని ప్రయత్నం లేదు. అయితే అతడియొక్క ఏ ప్రయత్నానికి శేషు లొంగలేదు. ఒక్క పెళ్లి ప్రస్తావన తెచ్చినప్పుడు తప్ప. వాళ్ల కులంలో స్త్రీ మారు మనువు చేసుకోవడం అసాధారణ విషయం ఏమీకాదు. కాకపోతే బిడ్డతల్లి పెళ్లికి సిద్ధపడటాన్ని చిత్రంగా చెప్పుకున్నారు. తన కూతుర్ని బాగా చూసుకోవాలని పెళ్లికి ముందుగా షరతు పెట్టింది శేషు.

"నీ బిడ్డ నా బిడ్డలాంటిదే. నువ్వు నన్ను నమ్మాలి" అన్నాడు సింగరాజు.

శేషు తన పాకకంటే కాస్త విశాలమైనదైన సింగరాజు పాకలో అతడి రెండో భార్యగా తన కూతురితోసహా అడుగుపెట్టింది. తొలిమోజులో రోజులు గడిచిపోతుండగా అంతగా పట్టించుకోలేదు గానీ తన రెండో భర్తకి తన కూతురు సీతాలక్ష్మి అంటే కాస్తయినా ప్రేమ లేకపోగా అసలు గిట్టదని కాస్త ఆలస్యంగా అర్థమైంది. ఈ విషయం తెలిసి వచ్చేసరికి ఇంకో నలుసు శేషు కడుపునబడ్డాడు. రాజు మొదట్లో సీతను విసుక్కుంటూ కసురుకుంటూ వుండేవాడు.

"అదేవిటయ్యా... పసిదాన్ని అట్టా కసుర్తావు?" అని అడిగితే...

"నాయనా... నాయనా అంటూ ఎంటబడతది. అదేం నా సంతా?" అంటూ మండిపడ్డాడోరోజు రాజు.

శేషు బిత్తరపోయింది. అదే తొలిసారి అతని సంకుచితత్వం స్పష్టంగా బయటపడడం. అంతక్రితందాకా సీత ఉనికి గిట్టక తనలోతానే ఉడికిపోతూండే రాజు ఆ తరువాత తన అయిష్టాన్ని బహిరంగంగా వ్యక్తపరచసాగాడు.

"దీని మొహం అంటేనే నా కొళ్లుమంట. అచ్చం దీనబ్బలాగుంటది" అనేవాడు.

"ఎందుకట్టాదాన్ని తెగముద్దులాడతావ్? దాని బాబు గుర్తొచ్చాడా?" అని అడిగేవాడు.

క్రమక్రమంగా అతడిలోని కోపం అయిష్టం సీతపట్ల ద్వేషంగా రూపాంతరం చెందసాగాయి. సీత కూర్చున్నా తప్పు, నిల్చున్నా తప్పు, మాట్లాడినా తప్పు, అతణ్ణి 'నాయనా' అని పిలిచినా తప్పే, పిలవకపోయినా తప్పే. తల్లితో బిడ్డ చనువుగా చొరవగా, ప్రేమగా వుంటే ఇంకా పెద్ద తప్పు. శేషు భర్తలోని ఈ కొత్త మనిషిని చూసి కుమిలిపోసాగింది. శేషుకి ఇద్దరు కొడుకులు పుట్టారు.

ఇద్దరివైపు బంధువులూ రాజు తన భార్య కూతురిపట్ల చూపుతూన్న వివక్షతని గురించి తెలిసి, "వాడికేం మగోడు. దానికి బుద్ధి వుండాల. బిడ్డతల్లి రెండోపెళ్లి చేసుకోవడమేటి? ఈ సంగతి అప్పుడాలోచించలేదా? మగోడి గుణమే అంత" అన్నారు.

రానురాను రాజు ప్రవర్తన సీత పట్ల భయంకరంగా తయారవసాగింది. ఇంటిపనంతా సీత చేత చెయ్యించేవాడు. ఉత్తి పుణ్యానికే తిట్టేవాడు. కొట్టేవాడు. తల్లి అడ్డు వెళ్లబోతే ఆమెని చావబాదేవాడు. తల్లీకూతుర్లు నవ్వుతూ నాలుగు మాటలు మాట్లాడుకున్నా సహించలేని స్థితికి వచ్చాడతడు. సీత అతడు ఇంటికి వస్తూన్నాడంటేనే వణికిపోసాగింది. శేషు జీవితం చాలా దుర్భరంగా తయారయింది. అతణ్ణి వదిలి వెళ్లిపోదామంటే అతడికి కలిగిన బిడ్డలు కాళ్లకి బంధాలైనారు. ఆ బిడ్డల్ని తీసుకుని అతడు వెళ్లనీడు. ఈనాడు శేషు ఇది వరకులా కూలీపనులకి వెళ్లడంలేదు. ఇంటి పట్టునే వుండి శారీరక కష్టంలేని జీవితాన్ని గడుపుతోంది.

అయితే ఆమెకి ఈ జీవితంకంటే తన మొదటి భర్తతో రెక్కలు ముక్కలు చేసుకుని కష్టపడుతూ బతికిన బతుకు చాలా గొప్పదిగా సుఖమయమయినదిగా అనిపించసాగింది. అవునుమరి... మనశ్శాంతి కరువైన భోగభాగ్యాలు కటికదరిద్రం కంటే హీనమైనవి. భయంక





రమైనవి. ఇప్పుడు ఆనాటి నిశ్చింతలేదు. ఆనాటి సుఖంలేదు. కడుపునిండా తిండి వున్నంత మాత్రాన ఏంలాభం?

"ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్టు వుంటా వేమే? నీ మొదటి మొగుడికంటే తీసిపో యానా ఏంటి నేను? వాడిలాగానేను నిన్ను పస్తులు మాడ్చటం లేదే?" వ్యంగ్యంగా అడిగే వాడు.

పస్తులున్నా చెట్టుకిందవున్నా నాకు ఆ జీవి తమే బాగుండేది అని చెప్పే ధైర్యం శేమకిలే దు. ఒళ్లు కావరంతో చేసుకున్నా పాపానికి ఫలితం అనుభవిస్తున్నానని కుమిలిపోసా గింది శేమ. ఇక సీత సంగతి... కన్న తల్లి దగ్గరుండీ నోరారా అమ్మా అని పిలవలేని దౌర్భాగ్యం. ఈ నాయనకి తనంటే ఎందుకంత కోపమో అర్థం అయ్యేదికాదు. బడిలో వున్నంత సేపూ మాత్రమే సీత ప్రాణానికి హాయిగా వుండేది. ఇంటికి వస్తూంటే దిగులు... భయం... కూతుర్ని చదివించి గొప్ప దాన్ని చెయ్యాలన్న తన మొదటి భర్త కోరికను శేమ మర్చిపోలేదు. సీత చదువులో తెలివిగా వుండేది. చివరికోరోజు సీత చదువుకి మంగళం పాడాడు రాజు. సీత ఏడవ తరగతి ఫస్ట్ క్లాస్‌లో పాసవడమేకాదు... ఆ వూళ్లో స్కూలు ఫస్ట్ వచ్చింది. ఈ సంగతి వూళ్లో చాలా గొప్పగా చెప్పుకున్నారు. ఇంట్లో ఎన్ని బాధలున్నా ఇంటెడు చాకిరీ చేస్తూన్న కూతు రు అంత చక్కగా మార్కులు తెచ్చుకోవడం చూసి శేమ పొంగిపోయింది.

"నా బంగారుకొండా నిన్ను పెద్ద చదువులు చదివిస్తానే" అంటూ కూతుర్ని కౌగలించుకుని ముద్దు పెట్టుకుంది.

ఇరుగూ పొరుగూతో "మా సీతమ్మని బాగా చదివిస్తాను. వాళ్ల నాయన కోరిక కూడా అదే. దాన్ని చదివించి గొప్ప దాన్ని చెయ్యాలనుకు న్నాడు. ఆయనకి ఆయుష్షులేకపోయింది" అని చెబుతూ కళ్లనీళ్లు పెట్టుకుంది.

ఇది రాజు చూశాడు. విన్నాడు. ఆరోజే చెప్పాడు. "ఇంకనీ కూతురి చదువుసాగదు. చదివించే శక్తి నాకు లేదు. ఇంట్లో కూచోని పనీ పాటా చేసుకోమని చెప్పు" అన్నాడు చాలా ఖచ్చితంగా.

శేమ నివ్వెరపోయింది. తరువాత అతడి కాళ్ళావేళ్లాబడింది. రాజుకి కనికరం కలగలే దు.

"మగబిడ్డల్ని చదివించుకుంటే చాల్లేవే పాడుముండా. రెండు మూడేళ్లల్లో దానికి పెళ్లి చేసి ఈ కొంపలో నుండి పంపెయ్యందే లాభంలేదు. దాని అబ్బ మీద వుండే ప్రాణం అంతా దాని మీద కుమ్మరిస్తా నా బిడ్డల మంచీ చెడ్డా అంతగా పట్టించుకోవటం లేదు నువ్వు దొంగముండా..." అంటూ బూతులు తిడుతూ భార్యని చావగొట్టాడు.

"అమ్మా... ఇక నేను చదువుకోనే... నువ్వు నాయనతో గొడవపెట్టుకోవద్దే" అంటూ ఏడ్చింది సీత.

చదువంటే ఆ పిల్లకి చాలా ఇష్టం. ఇక తను చదువుకునే అవకాశం మృగ్యమైందని, తనని ఎన్నివిధాల సాధించాలో అన్నివిధాలా సాధించటమే రెండో తండ్రి ధ్యేయమని సీత గ్రహించగలిగింది. తన తండ్రి వున్నప్పుడు తల్లితో మాట్లాడేదికాదు. తమ్ముళ్లని తప్పించు కుని తిరిగేది. ఇంటెడు చాకిరీ చేసి ఎక్కడో ఒంటరిగా బిక్కుబిక్కుమంటూ గడిపేది. శేమ అనుభవిస్తున్న మానసిక హింసగురించి చె ప్పనే అక్కరలేదు. వాళ్లిద్దరూ ఎంత బాధప డితే రాజుకి అంత పండగ. చివరికి రాజు తన భార్య మొదటి భర్త కూతుర్ని ఇంట్లో కూడా వుండకుండా చేసే పథకాన్ని ఆలోచించాడు.

ఆ అమ్మాయి ఉనికి సహించరానిదిగా వుంది అతడికి. శేమ ఏడ్చింది, మొత్తుకుంది, తలబాదుకుంది, సీత విలవిల్లాడింది ఏమీ లాభంలేకపోయింది. ఆ వూరికి దూరంగా పట్టణంలో భారతి ఇంట్లో సీతని పనిపిల్లగా వదిలి వెళుతూ అమ్మా బొమ్మా అంటూ వూరికే కొంపకి పరుగెత్తుకొచ్చావంటే మొదట నీ అమ్మని పాతేస్తాను" అని హెచ్చరించి మరీ వెళ్లాడు రాజు.

సీత చెప్పడం పూర్తి చేసి "నేను దూరంగా వున్నానని మా అమ్మ ఏడుస్తూ వుండి వుంటుంది. అయినా ఫరవాలేదు. ఇప్పుడు అమ్మకి తన్నులుండవు. తిట్లుండవు. అమ్మ సుఖంగా వుంటుంది" అంటూ ఏడ్చింది.



భారతి మనసు ద్రవించిపోయింది. సింగ రాజులాంటి వ్యక్తుల్ని ప్రత్యక్షంగా చూడకపోయినా ఇలాంటివారి గురించి భారతికి తెలుసు.

''అమ్మమీద నీకు ప్రేమవుంది. మీ అమ్మకీ నీమీద ప్రేమవుంది. అయితే దాన్ని పైకి ప్రకటించుకుని స్వేచ్ఛగా అనుభవించలేని దురదృష్టం మిమ్మల్ని కమ్ముకుంది. పరిస్థితులకి తలవంచక తప్పనిస్థితి సీతా! నువ్వు బాగా చదువుకోవాలి. నీ తల్లిదండ్రులు నిన్ను విద్యావంతురాల్ని చెయ్యాలని అనుకున్నారు. నువ్వు నీ కాళ్ళమీద నిలబడగలిగిన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సంపాదించుకుంటే నీ సవతి తండ్రి నీమీద ఎలాంటి అజమాయిషీని చలాయించలేడు. ఏడాదికోసారి వెళ్ళి మీ అమ్మని చూసి వస్తూండు. నువ్వు ప్రయోజకురాలివైనంతవరకూ నీకు నా అండవుంటుంది. ఆ తరువాత నీ తల్లి తరపునా, నీ తరపునా నువ్వే నీ సవతితండ్రితో పోరాడవచ్చు'' అంటూ ధైర్యం చెప్పింది భారతి.

కళ్ల నీళ్ళతో ఆనందంతో చూసింది సీత.

ఆ తరువాత ప్రకాష్, సౌందర్యమ్మ భారతి నిర్ణయాన్ని బలపరిచారు. సీత ఆ ఇంట్లో పనిమనిషిలాకాక ఆ కుటుంబసభ్యురాల్లా మారిపోయింది.

★ ★ ★

''అమ్మా ... పాపకి స్నానం చేయిస్తానంటే రావట్లేదు'' సీత ఫిర్యాదు చేసింది.

''ఏమ్మా అంజూ?''

పాప సమాధానం చెప్పలేదు. తల వేలాడేసుకుని నిలబడింది.

''పోనీ నువ్వే చేస్తావా? త్వరగా కానీ మరి'' అనునయంగా అంది.

దానికీ సమాధానం ఇవ్వలేదు, కదల్లేదు.

''మమ్మీ ... మరేం అంజూకి నువ్వే స్నానం చెయ్యించాలట'' బాబు భారతి నడుం చుట్టేస్తూ చెప్పాడు.

భారతికి ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగాయి. ఆమె నవ్వుతూ పాప దగ్గరికి వచ్చి తలమీద చెయ్యివేస్తూ ''అవునా?'' అంది.

తల ఎత్తకుండానే అవునన్నట్టు తలవూపింది.

''మరి చెప్పవేం... అమ్మ దగ్గర సిగ్గూ, మొహమాటం దేనికి - పద'' అంటూ తీసుకెళ్ళింది.

భారతి స్నానం చేయిస్తూంటే పాపకి చాలా ఆనందంగా, హాయిగా అనిపించింది. స్నానం చేయించి, తల దువ్వి డ్రెస్ చేస్తూంటే బాబు ఉక్రోషంగా వచ్చి ''అంజూ ... అమ్మ నాది'' అన్నాడు.

పాప వాడివైపు గుర్రుమంటూ చూసింది.

భారతి ''కాదు ... ఇద్దరిదీ,! అవునా అంజూ'' అంటూంటే ఎప్పుడొచ్చాడో వెనక నుండి ప్రకాష్ ''కాదు ... ముగ్గురిదీ'' అన్నాడు.

భారతి అతడివైపు చిరుకోపంగా చూస్తూ ''పిల్లలకంటే మరీ అన్యాయం అయిపోయారు మీరు'' అంది.

ప్రకాష్ సమాధానంగా ఏదో అనబోతూండగా ''అబ్బో అబ్బో... తల్లీ పిల్లలూ మొగుడూ! ఏం ముచ్చటగా వుంది సంసారం? ఆడదానివంటే నువ్వేనే అమ్మాయి - కాపురానికి వచ్చి సరిగ్గా పదిరోజులు కాలేదు - సవతి పిల్లల్ని లక్కలా అంటుకుపోయావు'' అంటూ వచ్చింది బామ్మగారు.

''రండి బామ్మగారూ'' ఆవిడ మాటలు చిరాకుని కలిగించినా మర్యాదకోసం అంది భారతి.

''నా కోడలూ వుంది, ఎందుకూ? కొరివి. ఉద్యోగస్తురాలినన్న గర్వం, పొగరు. పెద్దా చిన్నా మర్యాదలేదు. కడుపున పుట్టిన పిల్లల్ని సైతం సక్రమంగా పెంచుతోందా? వాళ్ళనెత్తి హాస్టల్లో పడేస్తుందట ఈ సంవత్సరం. పిదప కాలం పిదపబుద్ధులూను. అందరూ అలా వుంటారా? ఉండరనేదానికి నువ్వే ఓ ఉదాహరణ. సవతి పిల్లల్నికూడా ఎంచక్కగా ...''

ఆవిడ మాటలు పూర్తిగాకముందే ''బామ్మగారూ ... పదేపదే సవతితల్లి, సవతి పిల్లలు అనకండి. వీళ్లు నా పిల్లలు. వీళ్లకి నేను సవతితల్లిని అనుకోవడంలేదు. సుజాత ఇప్పుడు బతికిలేదు. ఆమె ఉండి నేను ప్రకాష్‌కి భార్యగా వచ్చివుంటే సవతి పిల్లలు అన్నమా





టికి అర్థం ఉండివుండేది. నేను వీళ్ల తల్లి స్థానంలోకి వచ్చాను. కాబట్టి నేను వీళ్ల తల్లిని మాత్రమే. నేను పిల్లల్ని ప్రేమించటంలోగానీ, పిల్లలు నన్ను అభిమానించటంలోగానీ చిత్రంగా చెప్పుకోవాల్సింది ఏమీలేదు. దయ చేసి మరోసారి సవతితల్లీ, పిల్లలు అన్నమా టని మీనోట రానివ్వకండి, కనీసం నా పిల్లలముందూ, నా ముందూ. మరో విషయం కూడా మీకు ఇప్పుడే చెప్పేస్తున్నాను. మీ కుటుంబవిషయాలను గురించి, వ్యక్తిగత సమ స్యలను గురించి కూడా మా ఇంట్లో ప్రస్తావించ వద్దు. పెద్దవారు ... ఎప్పుడైనా వస్తే రండి. మీ విలువైన సలహాలు ఇస్తే ఇవ్వండి. అంతేగానీ అనవసర విషయాలను గురించి ఇక్కడ మీరు మాట్లాడవద్దు. నా మాటలు మీకు కష్టం కలిగి స్తే క్షమించండి'' నిష్కర్షగా చెప్పింది.

భారతి ఇంత నిర్మొహమాటంగా, గట్టిగా చెప్పడంతో బామ్మగారి మొహం పెనంమీద పేలాల గింజలా మాడిపోగా ''ఏదో పెద్దదా న్ని...'' ఏదో చెప్పబోయింది.

''పెద్దవారనే మిమ్మల్ని గౌరవిస్తున్నాను బామ్మగారూ! అయితే పెద్దవారైనా, చిన్నవా రైనా అవసరంగాని విషయాలు మాట్లాడటం మంచిదికాదని చెబుతున్నాను'' అంటూ భారతి లోపలికెళ్ళిపోయింది.

ముసలావిడకి అక్కడ ముళ్లమీద కూర్చు న్నట్టనిపించగా ''ఏదో చాదస్తంగా మాట్లాడాను నాయనా ... మీ ఆవిడకి కోపం వచ్చింది'' అంది ప్రకాష్‌తో.

అతడేమీ మాట్లాడలేదు.

ఆవిడ అంతవరకూ అదృష్టవంతురాలే. భారతి ఆవిడకి వార్నింగ్ ఇవ్వడం క్షణం ఆలస్యం అయినా అతడు నోరువిప్పి వుండే‌వా డు. దాదాపు ఆవిణ్ని బయటికి గెంటినంతపని చేసివుండేవాడు. ఈ అమ్మలక్కల వ్యవహారా లూ మాటలూ సాధారణంగా మగవాళ్లు భార్యల ద్వారానో తల్లి ద్వారానో తప్ప ప్రత్య క్షంగా ఎప్పుడో గాని వినరు. వీళ్లు ఎంత భయంకరంగా మాట్లాడగలరో ప్రకాష్‌కి ఈమ ధ్య అర్థం అవుతోంది. తనకోపాన్నతడు బల వంతంగా అణుచుకుని మౌనంవహించాడు. బామ్మగారు గొణుక్కుంటూ వెళ్లిపోయింది.

ప్రకాష్ భార్యతో ''బాగా బుద్ధి చెప్పావు భారతి... నువ్వు చెప్పడం ఆలస్యం అయి వుంటే నేనే ఆవిణ్ని ఈ ఇంటికి రావద్దని చెప్పివుండేవాణ్ని'' అన్నాడు ఆగ్రహంగా.

''బహుశః ఆవిడ ఇక ఇక్కడికి రాకపోవ చ్చు. వచ్చినా అధిక ప్రసంగం చెయ్యకపోవ చ్చు. అంత్య నిష్ఠూరంకన్నా ఆది నిష్ఠూరం మేలు. ఇలాంటివారి మాటలు నాబోటి తల్లుల మీద పిల్లల మీద ఎంతగా పని చేస్తాయో మీకు తెలీదు. అంజూ, అజిత్ లాంటి పిల్లలు వీళ్ల ఇళ్లకి ఏ ఆటలకో వెళ్లారనే అనుకోండి వీళ్లు అడిగే మొదటిమాట ఏమిటో తెలుసా? మీ అమ్మ మీ స్వంత అమ్మ కాదుటగదా? మిమ్మల్ని బాగా చూస్తోందా? మీతో ప్రేమగా వుంటోందా? విసుక్కుంటుందా? తిడుతోందా? మీ నాన్న ఆవిడ మాట వింటాడా? జాగ్రత్త... సవతితల్లితో జాగ్రత్తగా మసలుకోండి. మిమ్మ ల్ని పట్టించుకోకపోతే మీనాన్నతో చెప్పండి ఎదురు తిరగండి. ఇవీ వీళ్ల నేర్పుళ్లు, సలహ లూ. సవతి తల్లి మనిషికాదు వీళ్ల దృష్టిలో. పిల్లల భవిష్యత్తును నాశనం చేసే మహా మ్మారి. ఆమెకి లేని ఉద్దేశ్యాల్ని అంటగడుతా రు. తల్లికీ పిల్లలకీ మధ్య దాటలేని అగాధం అవుతారు. ఇంకానయం... నేనెంతో అదృష్ట వంతురాల్ని ఇలాంటి వాళ్లు ఇంట్లోనే లేరు'' అంది భారతి.

ఈ మాటలు వింటోన్న సీత విస్ఫారిత నేత్రాలతో చూస్తోంది.

''ఈ అమ్మ బంగారుతల్లి'' అనుకుంది.

ఆ పూట ఇంకా వంట కాలేదంటూ పిల్లల్ని రిక్షాలో పంపేసింది భారతి.

''నేను ఈ పూట క్యారియర్ తీసుకెళ్లను'' అంటూ బయలుదేరి వెళ్లాడు ప్రకాష్.

అతడి ఉద్దేశ్యం ఆమెకి అర్థమైంది. ప్రకాష్ వెళ్లగానే చాటంత మొహంతో వచ్చింది దుర్గ ''భారతీ... మా ముసలావిడకి బాగా గడ్డి పెట్టావటగా? మనిషి మనిషికీ చెప్పు కుంటుంది. మంచిపని చేసేవు. నీలాంటి నిర్మొ హమాటం మనుషులుంటేగానీ ఇలాంటి వాళ్ల కి బుద్ధిరాదు''

''నిజమే దుర్గగారు... ఇలాంటి వ్యక్తులతో

నిర్మొహమాటంగా నిక్కచ్చిగా వ్యవహరించాలి. లేకపోతే మనం లేనిపోని సమస్యల్ని నెత్తికెత్తుకోవాల్సి వస్తుంది. నా ఇంటి విషయాలు ఒకళ్లు పట్టించుకోవడమూ అనవసరపు మెచ్చుకోళ్లు నాకు బొత్తిగా ఇష్టంవుండవు. అలాగే వాళ్ల వ్యక్తిగత విషయాలూ, చెప్పుడుమాటలూ నాకు గిట్టవు. స్నేహం అన్నది నిష్కల్మషంగా వుండాలిగానీ. స్నేహం పేరుతో ఇక ఇంట్లో సమావేశం అయి వాళ్లగురించీ వీళ్లగురించీ, అత్త మీద కోడలూ కోడలి మీద అత్తా చాడీలు చెప్పుకోవడం చాలా అసహ్యం. ఆవిడ మీ అత్తగారు. మీరు ఆవిడ కోడలు. మనస్పర్ధలు అన్నవి ప్రతి ఇంట్లోనూ వుండకపోవు. మీరు మీరూ ఎప్పటికైనా ఒకటే. ఈ విషయం విస్మరించి ఎవరికోవెళ్లి మన గొడవల గురించి చెప్పుకోవడం అన్నది అవతలివాళ్లకి చులకన అయిపోవడమే. మనం వెనక్కి తిరగ్గానే వాళ్లు ఇలా అని చెప్పుకుని నవ్వుకుంటారు వెక్కిరింతగా. హేళనగా మాట్లాడుకుంటారు. ఆ అవకాశం వాళ్లకి మనం ఇవ్వకూడదు. మనగొడవల్ని మనం పరిష్కరించుకోవడమే మంచి పద్ధతి. తాత్కాలికమైన సానుభూతిని ఆశించి పదిమందికి చెప్పుకోవడం అసహ్యకరం. అదే మీ అత్తగారితో చెప్పాను. దానికి ఆవిడకి కోపం వచ్చి బాధకలిగినా నేను చెయ్యగలిగింది ఏమీ లేదు'' అంది భారతి.

ఈ మాటలు విని దుర్గ మొహం నల్లబడింది.

''నా మాటలు నిజమంటారా? కాదంటారా?'' మామూలుగా అడిగింది భారతి.

''నిజమే వస్తాను. నా ఆఫీసుకి టైమైపోయింది'' అంటూ వెళ్లిపోయింది.

ఎంతబుద్ధిలేనితనం. తన అత్తగార్ని ఎవరో చిన్న బుచ్చారని తెలిసీ సంబరంగా ఆ మాట్లాడినవాళ్లని అభినందించడానికి వచ్చింది. తెలివీ విజ్ఞతగల మనిషి అయివుంటే ఈ విషయం తెలీనట్టే వూరుకుని వుండేది. ఆ తరువాత సొంత విషయాల గురించి ఇక ఎప్పుడూ తన దగ్గర ప్రస్తావించేది కాదు. తను తన అత్తగారికి ఇచ్చిన వార్నింగ్ ఆవిడకే పరిమితం అనుకుంది. చదువువేరూ జ్ఞానంవేరూ అనిపిస్తుంది ఇలాంటి వాళ్లని చూస్తూంటే.

''మొన్న మార్కెట్‌లో కలిసి నప్పుడు ఈవిడ మా అత్తగారు భారతితో నా గురించి ఏదైనా చెబుతుందా? అని అడిగిందమ్మా'' సీత చెప్పింది.

భారతికి ఏమీ వింతగా అనిపించలేదు. ఆ పూట భారతి చాలా నిదానంగా వంటపని ముగించింది.

మరి పిల్లలకి భోజనం నేను తీసుకెళ్లనామ్మా?'' సీత అడిగింది.

''నేను తీసుకెళతాను సీతా'' అంది భారతి.

సీత కాస్త ఆశ్చర్యంగా చూసింది. తరువాత తలూపింది. భారతి పిల్లలకి లంచ్ తీసుకుని బయలుదేరింది.

''అక్కా... ఆకలవుతుంది. అమ్మ అన్నం పంపుతానంది. ఇంకా పంపలేదు మరి'' అని అడుగుతూన్న బాబు మొదట తనే చూశాడు గేటులోంచి లోపలికి వస్తోన్న తల్లిని.

''అదుగో మమ్మీ...'' అంటూ సంబరంగా అరుస్తూ భారతికి ఎదురు పరుగెత్తాడు.

ఆశ్చర్యంగా చూస్తూన్న పాప దగ్గరికి వచ్చి చేతిలో బాస్కెట్ క్రింద వుంచి ''మీ స్కూల్‌నీ మీ ఫ్రెండ్స్‌నీ చూద్దామని వచ్చానురా అంజూ...'' అంది నవ్వుతూ భారతి.

పాపకి ఎందుకో చాలా ఆనందంగా అనిపించింది. తల్లి వున్నప్పుడే పాప స్కూలుకి వెళ్లేది. చాలామంది పిల్లల తల్లులు అప్పుడప్పుడూ తామే స్వయంగా పిల్లలకి భోజనం తీసుకొస్తూ వుంటారు. సుజాత ఎటువంటి పరిస్థితుల్లోనూ వచ్చేదికాదు.

''ఓసారి నువ్వు రామ్మా... నువ్వెప్పుడూ రావు. మా ఫ్రెండ్స్ వాళ్ల అమ్మలు చాలామంది వస్తారు'' అని పాప మారంచేస్తే ''నా వల్లకాదు. హడావుడిగా వంటచేసుకుని ఇంటిపనంతా ముగించుకుని నేను పరుగెత్తుకు రాలేనే తల్లీ'' అనేది సుజాత.

ఒక్కోసారి వంటపూర్తికావడం ఆలస్యం అయినప్పుడు పిల్లల్ని పంపేసి మధ్యాహ్నం పనిమనిషిచేత పంపేది. అందుచేత పిల్లలెవరూ పాప తల్లిని చూడలేదు. ఇప్పుడు తను దగ్గరుండి పిల్లల చేత భారతి అన్నం తినిపిస్తోంటే చాలామంది పిల్లలు ఆమెను ఆస




క్తిగా గమనిస్తున్నారు. పాప వాళ్లందరివైపూ గర్వంగా చూసింది. పాప కళ్లల్లోని ఆనందాన్ని భారతి గమనిస్తూనే వుంది. పాప భారతిని అంటుకున్నట్టే కూర్చుంది.

"సాయంత్రం డాడీతో కలిసి వెళ్లి కారమ్ బోర్డ్ తెచ్చుకోండి" అంది భారతి పిల్లలతో.

"అమ్మా నాకు పెద్ద బాల్ కావాలే" అన్నాడు బాబు.

"అలాగే తెచ్చుకుందురుగాని"

"మరి సినిమాకి వెళ్లొద్దా?"

"డాడీకి చెబుతాను"

"నువ్వు కూడా రావాలి" మారాం చేస్తూన్నట్టన్నాడు.

"నేనా? భారతి పాపవైపు చూసి "నేనురానా అంజూ?" అడిగింది.

చప్పున తలూపింది. ఈ కొత్తఅమ్మకి తామంటే ఎంతో ఇష్టం తమకి ఇష్టంలేని పనులేవీ చెయ్యదు. తమకి ఆకలవుతోందని తనే స్వయంగా అన్నం తెచ్చింది. పిల్లలు ఇలా ఆలోచించగలిగేలా చెయ్యాలి. అందుకే ఆమె స్వయంగా ఆ పూట అక్కడికి భోజనం తెచ్చింది.

"మరి డాడీ చెప్పాడా అన్నం తీసుకెళ్లమని?" పాప సందేహంగా అడిగింది.

"వూహూఁ... నేనే తెచ్చాను" నవ్వుతూ చెప్పింది.

"నీకెలా తెలుసూ?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఏమిటమ్మా తెలియడం?'

"అమ్మ అన్నం తీసుకొస్తే నాకు ఇష్టమని?" పాప అమాయకంగా అడుగుతూంటే తన బుగ్గ మీద ముద్దుపెట్టుకుని "నేనే అమ్మనిగదా అంజూ... పిల్లలకి ఏది ఇష్టమో కాదో అమ్మకి బాగా తెలుస్తుంది" అంది భారతి.

"మరి మా సుష్మా టీచర్ని చూస్తావా?" ఉత్సాహంగా అడిగింది పాప.

"మా మిస్‌ని కూడా" బాబు ఉత్సాహంగా అన్నాడు.

ఈ సుష్మాటీచర్ అనే ఆవిడ పాపకి చాలా ఇష్టమైన వ్యక్తి అని గ్రహించి "ఓ... తప్పక చూస్తాను" అంది.

పాప అంతలోనే "మర్చిపోయాను. సుష్మాటీచర్ ఈరోజు స్కూలుకి రాలేదుగా" అంది.

మళ్లీ తనే "రోజూ మాతో హోంవర్క్ కూడా చెయ్యిస్తావా?" అడిగింది.

"తప్పకుండా రోజూ సాయంత్రం మీకు నేనే ట్యూషన్ చెబుతాను" అంది భారతి.

పాప చాలా హుషారుగా తన స్నేహితుల్ని చూపింది, వాళ్ల పేర్లు చెప్పింది. భారతి వాళ్లతో నవ్వుతూ మాట్లాడుతూంటే పాప అనుకుంది- "నిజంగా ఈ అమ్మ చాలా మంచిది. నేనంటే చాలా ఇష్టం" అని.

భారతి తిరిగి వచ్చేస్తూ పిల్లల ఫ్రెండ్స్‌తో- "మీరంతా ఓ ఆదివారం మా ఇంటికి రండర్రా. అంజూకీ, అజిత్‌కీ చాలా బొమ్మలున్నాయి. చక్కగా ఆడుకోవచ్చు" అని చెప్పింది.

వాళ్లంతా హుషారుగా "వస్తాం ఆంటీ" అన్నారు.

తమ ఫ్రెండ్స్‌తో భారతి అంత బాగా మాట్లాడటం పిల్లలకి ఆనందంగానూ స్నేహితుల ముందు గర్వంగానూ అనిపించింది.

"మీ అమ్మ చాలా మంచిది" అన్నారు వాళ్లు.

లల్లీ అనే అమ్మాయి "అంజూ... ఆవిడ మీ నిజం అమ్మ కాదుగా" అంది.

పాపకి కోపం వచ్చింది "ఛ....ఛ... మా నిజం అమ్మే" అంది గట్టిగా.

పాపలో భారతి పట్ల ఏర్పడిన విముఖత్వం మెల్లమెల్లగా కరిగిపోతోంది. భారతి ఇంటికి వచ్చేసరికి ప్రకాష్ ఆమె కోసం ఎదురుచూస్తున్నాడు.

"ఆకలితో అల్లాడిపోతోంటే ఎంతగా పిల్లల తల్లివైతే మాత్రం పతిదేవుణ్ని పట్టించుకునేది లేదా?" అల్లరిగా అన్నాడతడు.

"తమరు ఎలాగూ ఈపూట దయచేస్తారని తెలుసు. వచ్చిన వాళ్లెలాగూవుంటారుగా..." అంటూ ఆమె దగ్గరికి రాబోతున్న అతడిని తప్పించుకుని వంటగది వైపుదారి తీస్తూ మీకు అన్నం అక్కరలేదులావుంది" అంది.

"నిన్ను చూస్తూంటే..." పూర్తిచేశాడతడు.

భోంచేస్తూండగా అడిగాడు ప్రకాష్ "పాప నీకు దగ్గరవుతూన్నట్టుంది భారతీ?..."

"అవును" అంది భారతి "ఈ సాయంత్రం సినిమా ప్రోగ్రాం వుంది. నేనూ వస్తూన్నాను" చెప్పింది.

"నిజమా?" అతడు ఉత్సాహంగా అడిగాడు.

అయితే సవతి తల్లి పట్ల పాపలో ఏర్పడుతూన్న సదభిప్రాయమూ ఇష్టమూ ఒక్కసారిగా ఆవిరయిపోయి ఆ స్థానంలోనే చెప్పలేనంత భయం గూడు కట్టుకునేలా చేసిందో సంఘటన. ఆమధ్యాహ్నం క్లాసులోవున్న టీచర్ దగ్గరికి పరుగు పరుగున వచ్చి చెప్పింది ఓ ఆయా- "అమ్మా! సుష్మా టీచర్ చచ్చిపోయిందట"

ఈ మాటని టీచర్‌తోపాటు పిల్లలంతా విన్నారు.

"వ్వాట్? సుష్మా చచ్చిపోయిందా? మైగాడ్. ఎప్పుడూ"? గుండెలమీద చెయ్యివేసుకుని కుర్చీలో కూలబడిపోయింది ఆ టీచర్.

ఒక్కసారిగా క్లాస్ రూం నిశ్శబ్దంగా అయిపోయింది. ఆయా ఏడుస్తూ "ఈ ఉదయం పది గంటలప్పుడు చచ్చిపోయిందటమ్మా! మాధవీ మేడమ్‌గారిది వాళ్ళ పక్క ఇల్లేగా... ఆమె లంచ్ కోసం ఇంటికి వెళ్ళేసరికి అంతా అయిపోయిందట. ఉరిపోసుకుందట" చెప్పింది.

పిల్లలంతా బిక్కమొహాలువేసుకుని ఒకరితో ఒకరు "సుష్మా మేడమ్ చచ్చిపోయిందట" అని చెప్పుకోసాగారు.

ఎప్పుడూ నవ్వుతూ తుళ్ళుతూ అందంగా వుండే సుష్మా టీచర్ అంటే పిల్లల కందరికీ ఎంతో ఇష్టం.

"లల్లీ... ఉరి అంటే ఏమిటి?" పాప లల్లీని అడిగింది.

"ఉరి అంటేనా? నీకు తెలీదా?" ఆశ్చర్యంగా అడిగింది తొమ్మిదేళ్ళ లల్లీ.

"ఊహుఁ... అంటే ఏమిటీ?"

"పైన సీలింగ్ ఫాన్ లేదూ? దానికి తాడుకట్టి తాడుని మెడని బిగించేసుకుంటే చచ్చిపోతారట? అంటే ఆ తాడుకి వ్రేలాడుతూ చచ్చిపోతారన్నమాట"

పాప కళ్ళు భయంతో పెద్దవికాగా "సుష్మా మేడమ్ ఎందుకలా చచ్చిపోయింది?" కళ్లల్లో నీళ్లు తిరుగుతూండగా అడిగింది పాప.

"నాకేం తెలుసూ" అంది లల్లీ.

చచ్చిపోవడం అంటే ఏమిటో ఆ థర్డ్ క్లాస్ పిల్లలకి తెలుసు. దేవుడి దగ్గరికో ఎక్కడికో స్వర్గంలోకో వెళ్ళిపోతారు. ఇక మళ్లీ రారు. ఎప్పుడూ కనిపించరు. పిల్లలకి ఏడుపొచ్చింది. ఇంతలో మాధవీ మేడమ్ ఇంకో ఇద్దరూ కలిసి అక్కడికి వచ్చారు.

"ఈ ఘోరం విన్నావా ఎలిజబెత్?"

"విన్నాను మాధవీ. నాకాళ్ళూచేతులూ ఆడటంలేదు. అసలు ఇదెలా జరిగింది?" కళ్ళల్లో నీరు చెంపలమీదకి జారిపోతూండగా అడిగింది ఎలిజబెత్.

ఇదంతా ఆ సవతి తల్లి లేదూ? దాని పుణ్యమే. సుష్మాని కాల్చుకుతినేది. దానికేనాడు మనశ్శాంతి లభించిందని? ఇప్పుడు తన తాగుబోతు తమ్ముడ్ని చేసుకోమని గట్టిగా ఒత్తిడి తెచ్చిందట. సుష్మా ఒప్పుకోలేదు. గట్టిగా ప్రతిఘటించింది.

ఈ విషయం నాకు తెలుసు. నిన్న సాయంత్రం దాని ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా ముహూర్తాలు పెట్టించేసిందట. ఆ సవతి తల్లి పట్టుదల గురించి తెలుసు కాబట్టి ఆ పెళ్ళి ఇక తప్పదని ఈ ఉదయం ఉరిపోసుకుంది" ఈ విషయం చెబుతూన్న మాధవిగానీ వింటూన్న ఎలిజబెత్ ఇంకా విద్యావంతులైన •ఆయువతు లెవరూ ఇంట్లోనుండి ధైర్యంగా బయటికి వచ్చెయ్యలేని ఆర్థిక స్వాతంత్రం వున్న సుష్మా పిరికితనాన్ని గురించి చెప్పుకోలేదు.

టీచర్ల సంభాషణని పిల్లలంతా విన్నారు.

"సుష్మా మేడమ్‌కి అమ్మ లేదుట పాపం. సవతి అమ్మ వుంది. ఆవిడ బాగా బాధలు పెట్టేస్తే సుష్మా మేడమ్ చచ్చిపోయిందిట పాపం. పాప మొహం పాలిపోగా "లల్లీ ... సుష్మామేడమ్ వాళ్ల కొత్తమ్మ మంచిదికాదా" అడిగింది.

"ఛీ... చాలా చెడ్డది. కొత్త అమ్మకాదు. సవతి అమ్మ. ఈ సవతి అమ్మలూ ఎప్పుడూ మంచి





వాళ్లుకాదు. మీ అమ్మ అయినా అంతే'' అంత క్రితం అంజూ తల్లి స్కూల్‌కి భోజనం తెచ్చి పిల్లలచేత తినిపించడం ప్రేమగా వాళ్లతో కబుర్లు చెప్పడం చూసి ఈర్ష్య పడ్డ లల్లీ ఇప్పుడు మాటల్లో తన అసూయని వ్యక్తపరి చింది.

ఉన్నట్టుండి పాప వెక్కిళ్ళతో ఏడవసా గింది. ఈ ఏడుపు అందర్నీ ఆకర్షించింది.

''ఎందుకూ అంజూ ఏడుస్తోంది?'' ఎలిజె బెత్ అడిగింది.

''పాపం అంజూకి సుష్మా అంటే చాలా అభిమానం. సుష్మాకీ అంతే'' మాధవి సాను భూతిగా అంది.

లల్లీ లేచి ''అదికాదు మేడమ్. మరేమో అంజూకి అమ్మలేదుగా. సవతి అమ్మ తనని బాగా ఏడిపిస్తుందట- అందుకని'' అరిందాలా చెప్పింది.

టీచర్లు నలుగురూ మొహమొహాలు చూసు కున్నారు. పాప వైపు జాలిగా చూశారు. ఈ చూపులే పాపలాంటి అమాయకపు పిల్లల్ని మరింత భయపెట్టేది. వాళ్లు చదువుకున్నవా ళ్లు తెలివైనవాళ్లు. ఆ సమయంలో ఎనిమిదే ళ్ళ ఆ అమ్మాయి తనకి ఇష్టమైన ఓ టీచర్ సవతి తల్లి వేధింపు మూలంగా మర ణించిందని తెలిసి తన సవతి తల్లిని గురించి గుర్తుతెచ్చుకుని భయంతో ఏడుస్తోందని తెలు సుకునీ ధైర్యం చెప్పే ప్రయత్నం చెయ్యలేదు. సవతి తల్లులందరూ కర్కశ హృదయులు కాదన్న విషయం విడమరచి చెప్పేందుకు ప్రయత్నించలేదు.

''అంజూ! నీకు అమ్మలేదా?'' జాలిగా అడింగింది రెండు నెలల క్రితమే అక్కడికి వచ్చిన ఎలిజబెత్.

తల అడ్డంగా తిప్పింది పాప.

''నీకు తెలీదు కదూ? ఏడాదిక్రితం అంజూ తల్లి పోయింది. అప్పుడు మేమంతా వెళ్లి చూసి వచ్చాంకూడా! తండ్రి ప్రకాష్ టింగు రంగాఅంటూ ఈ మధ్య పెళ్లిచేసుకున్నాడు'' మాధవి చెప్పింది.

''అంజూ! మీ సవతి అమ్మ నిన్ను ప్రేమగా చూడదా?'' వాళ్ళప్పుడు మధ్యాహ్నం పూట ఏమీ తోచక వీధి అరుగులమీద చేరిన పల్లె టూరి అమ్మలక్కల్లా మాట్లాడుతున్నారు.

ఈ ప్రశ్న వినగానే పాపకి తన తమ్ముణ్ణి ప్రేమగా దగ్గరికి చేర్చుకునే కొత్త అమ్మ గుర్తొ చ్చింది. తనని అలా ఎత్తుకోదుగా? పాప తల అడ్డంగా తిప్పింది. ఏడుపు ఉధృతమైంది. గుండెల్లో గడ్డకట్టుకుంటున్న భయం.

''ప్చ్... తల్లి లేని పిల్లల బ్రతుకు దుర్భరం అనుకో...'' సుధ అంటూంటే ''అందరి విష యంలోనూ అలా అవుతుందని ఎందుకు అనుకోవాలి. పిల్లల్ని ప్రేమగా చూసుకునే సవ తల్లులూ వుంటారు'' అంటూన్న ఎలిజబెత్ మాటల్ని వాళ్లంతా కొట్టేశారు.

ఆ పూట పిల్లల్ని త్వరగా వదిలేశారు. టీచర్స్ అంతా సుష్మాని చూడ్డానికి వెళ్ళారు. ఇంటికి వస్తూండగా బాబు అడిగాడు ''మ రేం... అంజూ మీ సుష్మా మేడమ్ చచ్చిపో యిందిటగా- అందుకేనా ఏడ్చావ్''

ఈ మాట వినగానే ఏడుపు ముంచుకువ చ్చింది పాపకి.

''మనకిలాగే సుష్మా టీచర్‌కి అమ్మలేదురా అజిత్. వాళ్ల కొత్తమ్మ వలనే సుష్మా టీచర్ చచ్చిపోయింది. మనల్ని కూడా మన కొత్తమ్మ బాధలు పెట్టుందిట''

''ఛీ... ఏంకాదు. అమ్మ మంచిది'' కోపంగా అన్నాడు వాడు.

ఇంటికి వచ్చిన దాకా పాప ఏడుస్తూనే వుంది. ఇంట్లో అడుగుపెడుతూనే ఎదురైన తండ్రి దగ్గరికి పరుగెత్తి అతణ్ణి చుట్టుకుని బావురుమంది. ప్రకాష్ ఖంగారుపడ్డాడు.

''అంజూ ఏమయిందిరా? ఎందుకిలా ఏడు స్తున్నావు?'' అతడు అడుగుతూంటే భారతి లోపల్నుండి పరుగెత్తుకొచ్చింది.

''డాడీ... మరేమో అంజూ వాళ్ల సుష్మా టీచర్ లేదూ?''

''అయితే?''

''వాళ్ళ కొత్తమ్మ లేదూ?''

''కొత్తమ్మా?'' అన్న ప్రకాష్ వెంటనే అర్థమై నట్టు తలూపుతూ ''వూఁ''అన్నాడు.

''కొత్తమ్మా... సుష్మా టీచర్?'' ఎలా చెప్పాలో బాబుకి తెలీక బిక్కమొహం వేశాడు.



ప్రకాష్ బుజ్జగించగా ఏడుస్తూనే మధ్య మధ్య భారతిని భయంగా చూస్తూ విషయం మొత్తం చెప్పిన్న పాప తండ్రిని గట్టిగా కౌగ లించుకుని "డాడీ... మరి... నన్నూ తమ్ము ణ్ణి..." అంటూ వెక్కుతూంటే ప్రకాష్ స్థాణువ య్యాడు.

తననో భూతన్ని చూస్తూన్నట్టు చూస్తున్న పాపని చూసి భారతి నిశ్శబ్దంగా లోపలికి వెళ్ళిపోయింది. ప్రకాష్ పాపకి భారతి మంచి తనం గురించి నచ్చజెప్పేందుకు ప్రయ త్నించాడు. అయినా సుష్మా మరణం, తన స్నేహితుల టీచర్ల మాటలు కలిగించిన షాక్‌నుండి కోలుకోలేని పాప ఆ పూట స్నానం చెయ్యలేదు, భోంచెయ్యలేదు. ఆ రాత్రి పాపకి జ్వరం వచ్చింది.

"డాడీ! ఈ అమ్మ మనకొద్దు. నన్ను కొడు తుంది. మన కొద్దుడాడీ" అంటూ పాప కలవరి స్తూంటే భార్యవైపు చాలా నిస్సహాయంగా చూ శాడు ప్రకాష్.

"భారతీ ... ఈ వెధవ మనుమలకి దూ రంగా ఓ నెలపాటు ఎక్కడికైనా వెళ్లిపోదామా? ఇక్కడినుండి ట్రాన్స్‌ఫర్‌కి ప్రయత్నిస్తాను" అన్నాడతడు.

భారతి ఐస్ బాగ్‌ని పాపనుదుటిమీద పెడుతూ "నువ్వు హైరాన పడకు ప్రకాష్! చిన్నపిల్ల! సుష్మా మరణంతో బాగా భయపడి పోయింది. రెండురోజుల్లో మామూలవుతుంది" అంది.

అతడు భార్యచేతిని తనచేతిలోకి తీసు కుంటూ "నీకు బాధగా లేదాభారతీ? నువ్వు ప్రేమమూర్తివి. పాప నువ్వు అందిస్తూన్న ప్రే మని అందుకోలేకపోతోంది" చాలా విచారంగా అన్నాడు.

ఆమె సహనంగా నవ్వింది "పిల్లలు ఇంత మాత్రం భయపడకపోతే సవతితల్లి ఎందు కింత ప్రఖ్యాతిని ప్రత్యేకతని సంపాదించుకు నేది? నేను సవతి తల్లి పెంపకంలో పెరగకపో యివుంటే మొదట్లో ఆమె మూలంగా అనేక మైన బాధల్ని అనుభవించకుండా వుండి వుంటే నాకిప్పుడు అంజూ అనుభవిస్తూన్న ఈ బాధా భయం అర్థంలేనివిగా అనిపించేవి. నేను ఈ పిల్లల పట్ల ఇంత ప్రేమని పెంచుకో లేకపోయేదాన్ని. అప్పుడు నామూలంగా మన నలుగురి జీవితాలూ ఓ నరకంలా ఓ శాపంలా మారివుండేవి. అదృష్టం ఏమిటంటే నేనో సవతి తల్లి సవతి కూతుర్ని. ఆ తల్లి పెంప కంలో కొంతకాలం పాటు తండ్రివుండీ లేన ట్టుగా అనాథలా పెరిగిన దాన్ని . అందుకే నేను ఈ పిల్లలకి ఒక అమ్మలా తప్ప సవతి తల్లిలా ఎప్పటికీ మారలేను. నాలో ఈ విష యంలో కొండంత సహనంవుంది. నిష్కల్మష మైన ప్రేమవుంది. ఈ రోజు కాక పోతే రేప యినా పాప ఈ అమ్మ ఒడిలో నిశ్చింతగా నిద్రపోవాల్సిందే" ఆమె చెబుతూంటే ప్రకాష్ ఆనందంగా చూశాడు.

అంజూ జ్వరం తగ్గు ముఖం పడుతూంటే భారతి మనసు గత కాలపు స్మృతుల్ని వెదు క్కుంటోంది. అక్కడ కన్నీళ్ళూ కష్టాలతోపాటు ఆమెనో మంచి అమ్మగా తీర్చిదిద్దిన విలువైన పాఠాలూ, జీవితానుభవాలూ వున్నాయి.



అరుంధతమ్మ మరణం ఆవిడ మనవలనే కాదు, తులసినీ కృంగదీసింది.

"ఈ కొత్తకోడలు మూలంగానే రాయిలాంటి అరుంధతమ్మ హరీమంది. మొగుణ్ణి కొంగుకి కట్టేసుకుంది. ఇంట్లో ముసలావిడ మాటకి విలువ లేకుండాపోయింది. ఆవిడ ముప్పటప డి శుభకార్యం ఏదో జరిపించాలంటే ఈ మహా తల్లి అడ్డం పడింది. బంధువుల దగ్గర ముస లావిడకి తలవంపులయింది. ఆవిడ ఎంతగా కుమిలిపోకపోతే అర్థాంతరంగా ప్రాణం పోతుంది" తులసి సమక్షంలోనూ, పరోక్షంలో




నూ ఈ మాటలన్నారు.

తన మూలంగానే అత్తగారు మరణించింద న్న అపరాధభావంతో కృంగిపోతున్న తులసిని మూర్తి చాలా ఓదార్చాడు. ఈ పరిసరాలకి దూరంగా ఓ నెలపాటు ఆమెను పుట్టింట్లో వుంచాడు. వారానికి రెండుసార్లు వెళ్లి చూసి వచ్చేవాడు. తులసి క్రమంగా కోలుకుంది. ఆమె తిరిగి తన ఇంటికి వచ్చేసరికి తన భర్త మొదటి భార్యపిల్లలపట్ల రెట్టింపయిన ద్వేషంతో తిరిగివచ్చింది. కొందరు మనుష్యుల స్వభావం బహువిచిత్రమైంది. అలాంటి తత్వమే తులసిది కూడా. ఆమె ఇలా ఆలోచించింది. తనకీ మరణించిన అత్తగారికీ మధ్య పిల్లలు అనే రాక్షసులు లేకపోయివుండి వుంటే తామిద్దరూ ఎంతో అన్యోన్యంగా, ఒద్దికగా వుండేవారు. తాను ఆవిణ్ణి గౌరవించేది. ఆవిడా తనపట్ల ప్రేమగా వుండేది. వీళ్లిద్దరి మూలంగా తనకావిడ పగ అయిపోయింది. జీవితంతో రాజీపడి రెండోపెళ్లివాణ్ణి కట్టుకున్నా అక్కడా మనశ్శాంతి కరువయింది. ఈ పిల్లల మూలంగానే. ఇలా ఆలోచిస్తూ- ఆ పిల్లలపట్ల ద్వేషభావం పెంచుకుంది తులసి.

తను పిల్లలకోసమే వాళ్ల తల్లిగా ఆ ఇంట్లో అడుగుపెట్టిన విషయం ఆమె బొత్తిగా మర్చిపోయింది. ఇప్పుడు అరుంధతమ్మ కూడా లేకపోవటంతో పిల్లలపట్ల ఆమె ప్రవర్తన ఎలా వున్నా పట్టించుకునేవాళ్లు లేకపోయారు.

'అమ్మా' అన్న భారతి చందూల పిలుపు కర్ణకఠోరంగా అనిపించగా ఓ రోజు "ఇదిగో ఇదే చెప్పడం- నన్ను మీరు అమ్మా అని పిలవద్దు" అంది కఠినంగా భారతితో.

భారతి భయంగా చూస్తూ- "మరేమని పిలవను?"

"వల్లకాట్లో మల్లమ్మా అని పిలువు" కసిగా అంది.

భారతి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"పిలవకముందే పరుగెత్తుకొస్తాయి కన్నీళ్లు. ఈ నంగనాచి ఏడుపులు ఏడ్చేగా నలుగురిలో నన్ను రాక్షసిని చేశారు అవ్వా మనవరాలూ కలిసి"

భారతి కళ్లల్లో నీళ్లు కళ్లల్లోనే కుక్కుకుంది.

"ఇదిగో ఇదే చెప్పడం, పక్కిళ్లకి, పెత్తనాలకి వెళ్లడం ఇంటి విషయాలు వాళ్లతో చెప్పటంలాంటివి చేసి నన్ను పిచ్చిదాన్ని చెయ్యొద్దు. ఇల్లూ బడీ అంతే. మరో విషయం పట్టించుకోకూడదు" తీవ్ర స్వరంతో తులసి చెబుతూంటే ఆ మాటల్లో పాతికోవంతు కూడా అర్థంగాని చందూ మారాం చేస్తున్నట్టు- "నేను పార్వతి పిన్నివాళ్లింటికి వెళతాను. వాళ్ల రవితో ఆడుకుంటాను" అన్నాడు.

"నోర్మూయ్" అంది తులసి.

"నువ్వే నోర్మూయ్..."

చందూ చెంపలు అదిరిపోయాయి. వాడు ఏడుపు లంకించుకున్నాడు.

"చిన్నా పెద్దా లేకుండా వాగావంటే వూపిరి తీస్తాను. ఇంతకాలం ముసలావిడ అండచూసుకుని ఆటలాడారు. అధిక ప్రసంగం చేశావంటే పీక నొక్కిపడేస్తాను. ఎలాగూ నన్ను నలుగురిలో వెధవని చేశారు. నిండా మునిగిన దానికి చలేమిటి? నేను దేనికీ జంకను" కర్కశంగా అంది తులసి.

భారతి భయంతో బిగుసుకుపోయినట్టు నిలబడిపోయింది.

"వెళ్లండి. నా కళ్లముందునుండి. శనిమొహాల్లారా" ఛీత్కరించుకుంది.

తమ్ముడి చెయ్యి పట్టుకుని బయటికి వచ్చేసింది భారతి.

"అక్కా! ఈ దయ్యం మనల్ని వూరికే కొడుతుందే. నాన్నతో చెప్పనా?" చందూ వెక్కుతూ అడిగాడు.

"తప్పు... చెప్పకూడదు"

"ఎందుకు చెప్పకూడదూ?" రోషంగా అడిగాడు.

ఎందుకు చెప్పకూడదో భారతికి తెలీదు. "నాన్నకి కోపం వస్తుంది. మనల్నే తిడతారు"

"నేను పార్వతి పిన్ని వాళ్లింటికి వెళతాను. రవితో ఆడుకుంటాను" మొండిగా అన్నాడు.

"అమ్మకి కోపం వస్తుందిరా" నిస్సహాయంగా అంది భారతి.

"ఛీ... ఆ దయ్యం అమ్మకాదు" చందూ అంటూంటే భయంగా వాడినోరు మూసేసింది



భారతి.

రోజులు గడుస్తున్నాయి. భారతి ఆ ఇంట్లో ఒదిగి ఒదిగి వున్నట్టుగా వుంటోంది. స్వంత ఇంట్లో వున్నట్టుగాకాక పరాయిఇంట్లో ఒకళ్ల దయాధర్మాలమీద ఆధారపడి వున్నట్టుగా భయంభయంగా, బెరుగ్గా సంచరించడానికి అలవాటు పడిపోతోంది. ఈ కొద్దిరోజుల వ్యవధి లోనే భారతి ఆలోచనల పరిధి పెరిగింది. తను ఇరుగూ పొరుగూలతో మాట్లాడకూడదు. వాళ్ల ఇళ్లకి వెళ్లకూడదు. అలావెళితే తనమీద వాళ్ల కి చాడీలు చెబుతుందని సవత్తల్లి భయపడు తోంది. వాళ్లు తనకేదో నేర్పిస్తారని అనుమాని స్తోంది. అలాగే తనూ తమ్ముడూ అమ్మా అని పిలవడం ఆమెకి ఇష్టంలేదు. ఎందుకో తన న్నా తమ్ముడన్నా ఆవిడకి బొత్తిగా గిట్టదు. ఎంతో కోపం కూడా.

సాధారణంగా ఆప్తులూ, ఆత్మీయులూ మరణం ద్వారా దూరమైనప్పుడు భారతి వయసుపిల్లలు అంత వెంటనే కోలుకోలేరు. కానీ ఇప్పుడు నాయనమ్మ మరణం కలిగించిన షాక్‌నుండి భారతి చాలా త్వరగా కోలుకుంది. తల్లీ, నాయనమ్మల మరణాలని గురించి ఆలో చించే అవకాశం సైతం ఆ అమ్మాయికి లేకపో యింది. సవతితల్లితో ఎలా వ్యవహరించాలో ఏంచేస్తే, ఏంమాట్లాడితే ఏక్షణాన ఆవిడ ఆగ్ర హానికి గురికావలసివస్తోందన్న భయం... ఆవి డకి అనుకూలంగా మసలుకోవాలన్న తపన, దిగులూ ఇవి తప్ప నాయనమ్మ మరణం గురించి పెద్దగా ఆలోచించే వ్యవధి, అవకాశం భారతికి లేకపోయాయి. పరిస్థితులకి అనుగు ణంగా ఆలోచించి నడచుకోవడం అన్నది కూడా భారతికి తెలీకుండానే పట్టుబడుతోంది.

అమ్మా అని పిలిస్తే తులసికి కోపం. పిలవ కపోతే తండ్రి మండిపడతాడు. తండ్రి ఇంట్లో వున్నప్పుడు సవత్తల్లికి దూరంగా వుండడం అలవాటు చేసుకుంది భారతి. ఏ పెరట్లోనో, బయటి వరండాలోనో ఏదోపని చేస్తూ గడిపేది. వీలయినంతవరకూ తులసితో మాట్లాడే అవ సరం రాకుండా జాగ్రత్తపడేది. సాధ్యమైనంత వరకూ తమ్ముణ్ణి ఆ ఛాయలకి వెళ్లనిచ్చేదికా దు. ఒకవిధంగా చెప్పాలంటే తులసి ఆ ఇంటికి వచ్చిన తరువాత తండ్రికీ, పిల్లలకీ మధ్య దూరం పెరిగిపోయినా వాళ్లకి కలి పివుంచిన లింకులాంటి అరుంధతమ్మ వుండేది. వాళ్ల అవసరాలు కొడుక్కు చెబు తుండేది. ఒకటి కాకపోయినా ఒకటయినా కొడుకునుండి సాధిస్తూండేది. ఇప్పుడాలింకు తెగిపోయింది. ఇప్పుడు మూర్తి పిల్లల గు రించి పట్టించుకునేది రెండు మూడు విషయా ల్లోనే.

''స్కూలుకి వెళుతున్నారా? బాగా చదువు తున్నారా?

అమ్మకి ఇంటిపనుల్లో సాయం చెయ్యండి. తను చెప్పినమాట వినండి'' ఇవి మాత్రమే.

ఒక్కోసారి భార్యని అడుగుతాడు- ''పిల్లలు అన్నం తిన్నారా?''

''నిద్రపోయారా?''

''నిన్నేం విసిగించి గొడవపెట్టడం లేదు గదా?''

ఇంతటితో తన బాధ్యత తీరిపోయిందను కుంటాడో లేక తన పిల్లలు ఎప్పటిలా నిశ్చింతగా వున్నారని అనుకుంటాడో అతనికే తెలియాలి. స్కూలు ఫీజులూ, పుస్తకాలూ, బట్టలూ వీటన్నింటికీ తులసి మీదనే పిల్లలు ఆధారపడాల్సివస్తూంది.

''నాన్నా! ఈరోజు పుస్తకాలు కొనుక్కోవాలి. డబ్బు కావాలి నాన్నా'' ఓరోజు నెమ్మదిగా తండ్రిని అడిగింది భారతి.

ఇంతక్రితం నాయనమ్మతో చెబితే ఆవిడ అడుగుతూండేది.

''నన్ను అడగడం దేనికమ్మా. నాకు బొత్తిగా తీరికలేదు. మీకేం కావాలన్నా మీ అమ్మని అడగండి. తనని తీసుకెళ్ళి కొనుక్కోండి'' అన్నాడు.

తులసి- ''మీకేం కావాలన్నా నన్ను అడ గండి. ఆయన్ని విసిగించకండి'' అంది.

ఆ తరువాత కావలసినవి అడగటం పిల్లల వంతయితే తీసిఇవ్వడం, ఇవ్వకపోవడం అమ్మది. తులసి ఇష్టాఇష్టాలమీద ఆధారపడిన విషయం అయింది. సవాలక్ష ప్రశ్నలు అడి గేది.

''అవెందుకూ?''

''ఇవెందుకూ?''




"అవసరంలేదు. సర్దుకోండి" ఇలా అనేది.

తనుగా వచ్చి కొని ఇవ్వటం తప్ప పైసా కూడా చేతికి ఇచ్చేదికాదు. ఇలాంటి పరిస్థితుల్లోనే చందూ చిన్న చిన్న దొంగతనాలకి అలవాటు పడ్డాడు. సవత్తల్లి చేతికి పైసా అందనీయదు. ఒక్క ఆటవస్తువూ కొనివ్వదు. గాలిపటం కొనుక్కోవాలన్నా నాలుగురోజులపాటు అడుక్కోవాలి. అప్పటికీ ఇరవైనాలుగుమాటలు అనిగానీ ఇవ్వదు. పిల్లలకి ఎప్పుడూ ఏదో తినుబండారాలమీద మనసుంటుంది. ఒకప్పుడు మూర్తి ప్రతి సాయంత్రం ఇంటికి వస్తూ పిల్లలకి పండ్లూ బిస్కట్లూ తెస్తూండేవాడు.

అరుంధతమ్మ బయటికి వెళ్ళినప్పుడు పిల్లలకి ఇష్టమైన స్వీట్స్ కొనితెస్తూండేది. తల్లి ఇంట్లో ఏదో ఒక ఫలహారం చేస్తూండేది. ఇప్పుడు పరిస్థితి మారింది. మూర్తి తన వ్యాపారాన్ని విస్తరించే గొడవలో ఇదివరకులా పిల్లలకోసం ఏదైనా తీసుకురావడం అన్నది తగ్గిపోయింది. ఎప్పుడైనా ఏదైనా తెచ్చినా పిల్లలదాకా రావడం సందేహమే. తులసి పండ్లు డజన్ల లెక్కన కొనుక్కు వచ్చినా ఒకటి రెండూ మాత్రం ఇచ్చేది. అడిగే ధైర్యం భారతికి లేదు. చందూ కళ్లతో చూస్తూ అడిగేవాడు. అలా వాడు అడగడం తులసికి తిండిబోతుతనంగా కనిపించి మంటగా వుండేది. కుళ్ళిపోతే పారెయ్యడానికైనా మనసొప్పుతుందేమోగానీ పిల్లలకి ఇవ్వడానికి తులసికి మనసొప్పేది కాదు. ఇంట్లో ఏదైనా చేసినా చెరికాస్త పెట్టి దాచేస్తూ వుండేది.

చందూ నోరు తెరిచి అడిగితే- "ఇంకెక్కడుంది? అయిపోయింది ఎప్పుడో" అనేది.

చందూ ఇట్టే ఆమె ఎక్కడ దాచిందో కనిపెట్టేసేవాడు. పెట్టిన మూత పెట్టినట్టే వుండేది. లోపలున్న పదార్థాలు మాయం అయ్యేవి. తులసి ఉడికిపోయేది. చందూ దొంగతనానికి అలవాటుపడ్డాడూ అంటే దానికి కారణం కేవలం తులసే. తినగలిగిన బిడ్డల నోరు కప్పెయ్యాలనుకోవడం ఆమె తప్పు. భారతి రహస్యంగా తమ్ముడితో దొంగతనం ఎంత తప్పో చెప్పేది. చూసిచూసి ఒకనాడు సవతితల్లి ఈ విషయం తండ్రితో చెబుతుందనీ ఆయన చంపేస్తాడనీ చెప్పేది. వాడు వినిపించుకునే వాడు కాదు.

"నాకావిడ పెట్టలేదుగా! నేనలాగే తింటాను" అనేవాడు మొండిగా. భారతి నిస్సహాయంగా చూసేది. ఆ అమ్మాయికి ఒక్కోసారి ఏడుపు కూడా వచ్చేది.

'నాయనమ్మ అయినా బతికివుంటే బాగుణ్ణు' అనుకునేది.

★ ★ ★

తులసి చిన్ననాటి స్నేహితురాలు శాంతి అనే ఆమె వచ్చింది మూర్తి ఇల్లు వెదుక్కుంటూ. శాంతిని చూడగానే తులసికి దిగులు కలిగింది. ఎందుకంటే తన ఆనందమయ జీవితాన్ని శాంతి చూసివెళ్లి నలుగురితో చెబుతుందని దిగులు... ఈ పిల్లల్ని చూసి నవ్వుకుంటుందని. శాంతి తులసికి చిన్ననాటి స్నేహితురాలు. పదేళ్లక్రితమే ఆమెకి పెళ్లయిపోయింది. తొమ్మిదేళ్ల కొడుకూ, ఎనిమిదేళ్ల కూతురూ వున్నారు. ఆ వూళ్లో బంధువులు వుంటే వచ్చింది.

మొన్న మా ఊళ్లో నేను మార్కెట్‌కి వెళ్లివస్తుంటే అక్కడ మీ నాన్న కనిపించాడే తులసీ. తనే నన్ను గుర్తుపట్టి పలకరించాడు. మీ చెల్లెలికి ఏదో సంబంధం చూడటం కోసం వచ్చానన్నాడు. ఈమధ్య ఏడాదిగా నేనూ మన వూరు వెళ్లలేదు. నీకు పెళ్లయిందనుకున్న విషయం ఆయన చెబితేగానీ నాకు తెలీలేదు. ఈ వూళ్లో వున్న విషయం చెబితే నా కెలాగూ ఈ నెలలో ఇక్కడికి రావాల్సిన ప్రయాణంవుంది. నిన్ను చూసి చాలా రోజులయింది. చూద్దాం అని అడ్రస్ అడిగి తెలుసుకున్నాను" అని చెప్పుకొచ్చింది.

"కాస్త ఆలస్యమైనా మంచి సంసారంలోకే వచ్చినట్టున్నావు. ఇల్లు బావుంది" అంటూ మెచ్చుకోలుగా శాంతి అంటూవుంటే గర్వంగా ఫీలయింది తులసి.

"నాలుగేళ్లక్రితం కట్టించిన ఇల్లు. త్వరలో డాబా మీద నాలుగు గదులు వెయ్యాలన్న ఆలోచన వుంది మావారికి" చెప్పింది. తన నగలూ చీరలూ చూపించింది.

"అదృష్టవంతురాలివే... మీవారు ఇప్పుడు కనబడరా?"



"మధ్యాహ్నం భోజనానికి వస్తారు. ఉంటావు గదా?"

"చాలాకాలం తరువాత కలిశాంగదా? సాయంత్రం దాకా వుంటాను" అంది.

తులసి వంట చేస్తుంటే శాంతి కబుర్లు చెబుతూ కూర్చుంది.

"మీ చెల్లి పెళ్లికి నువ్వు సాయంచేస్తానన్నావటగా. మీ నాన్న చెప్పాడు" శాంతి అంటూ వుంటే "హుష్... మెల్లిగా" అంది తులసి.

ఆరోజు స్కూలుకి సెలవు కావడంతో భారతి, చందూ ఇంట్లోవున్నారు.

శాంతి కంఠం తగ్గించి "మీవారికి తెలీకుండానా?" అడిగిందినవ్వుతూ.

"తెలిసికాస్త తెలీకకాస్త. ఎంతయినా మగ వాళ్ళు కదా. చూస్తూ ఒప్పుకుంటారా..." తనూ నవ్వుతూ అంది తులసి.

"అవునూఇంట్లో వున్న పిల్లలెవరూ?" అడిగింది శాంతి.

ఇటీవలికాలంలో శాంతి పుట్టింటికి వెళ్లకపోవడంతో తులసి పెళ్లికథ గురించి ఆమెకి తెలీదు. రెండోపెళ్లి వ్యక్తికి ఇవ్వడం జరిగిందని ఆమె తండ్రి సూచాయగా అన్నాడు. ఈ విషయం తులసి గ్రహించింది. ఆమెకి చాలా ధైర్యం వచ్చింది. ఇంతలో భారతి వంటగదిలోకి వచ్చింది.

"వీళ్లిద్దరూ మా ఆడపడచు పిల్లలు. అక్కడ చదువుకునే అవకాశం లేక ఇక్కడ వుండి చదువుకుంటున్నారు" చెప్పింది.

"ఓహెూ..." అంది శాంతి. "ఈ అమ్మాయి బొమ్మలావుంది"

ఈ మాట వింటేనే కారం రాచుకుంటున్నట్టుగా వుంటుంది తులసికి. ఈ సంభాషణ భారతి విన్నది. ఆ అమ్మాయి నివ్వెరపోయింది తాము నాన్న పిల్లలు కారా? ఆయన చెల్లెలు పిల్లలా? అంటే నాన్న తమకి నాన్న కాదు. మామయ్యా అవుతాడా? ఇక్కడ భారతికి ఇంకో విషయం కూడా బోధపడింది. తనని తాము అమ్మా అనిపిలవడం ఇష్టం లేకపోవడమేకాదు. తనూ చందూ నాన్న పిల్లలు అవటం కూడ తులసికి ఇష్టం లేదు. ఎందుకో భారతికి భరించరానంత దుఃఖం వచ్చింది. అక్కడి నుండి పెరట్లోకి వెళ్లి సన్నజాజి పందిరిచాటున కూర్చుని వెక్కివెక్కి ఏడ్చింది.

ఆ ఏడుపులో ఒంటరితనం తను అనాధనన్న భావం...

అక్కడే కూర్చుని బిళ్లాకోడూ చెక్కుకుంటోన్న చందూని భారతి చూడలేదు.

అక్క ఏడవడం చూసి "అక్కా... ఎందుకేడుస్తున్నావు? ఆ దయ్యం తిట్టిందా?" అడిగాడు చందూ.

దయ్యం అన్న పదాన్ని తులసిని ఉద్దేశించి మాట్లాడేప్పుడల్లా ఉపయోగిస్తూన్నాడు ఈమధ్య చందూ.

"ఏడవకే... ఎప్పుడో ఈ కర్ర తీసుకుని కొట్టేస్తాను. ఆఁ..." అన్నాడు.

భారతి వెక్కుతూనే "చందూ... తప్పురా" అంది.

"ఫో... నువ్వెప్పుడూ ఏదైనా తప్పంటావు. మనల్ని తిట్టడం పుస్తకాలకి డబ్బులివ్వకపోవడం తప్పుకాదూ? ఈవిడ వల్లనేనటగా నాయనమ్మ చచ్చిపోయింది?" కోపంగా అన్నాడు చందూ.

"అబద్ధం. నీకెవరు చెప్పార్రా ఇలాంటి మాటలు?"

"అంబుజమ్మ మామ్మా, పార్వతి పిన్నీ నువ్వే అబద్ధాలు చెబుతావు తులసి మంచిదని, వాళ్లెప్పుడూ నిజమే చెబుతారు" అంటూ ఆటలకి పరుగెత్తాడు.

వీడు పెద్దవాడయితే సవతితల్లిని అసలు లక్ష్యపెట్టడని భారతికి అనిపిస్తుంది. భయమేస్తుంది. తన స్నేహితురాలికి భారతి, చందూ తన భర్త సోదరి పిల్లలని చెప్పాక తులసికి నిశ్చింతగా అనిపించింది. భారతి నోరు మెదపదని తెలుసు కాబట్టి భారతి ముందు చెప్పడానికి సైతం తులసి సందేహించలేదు. తన ఈ మాటలు భారతి పసి మనసుని ఎంతగా కలవరపెడతాయో అన్న విషయం గురించి ఆమె అస్సలు ఆలోచించలేదు. ఈరోజు కాకపోయినా మరో రోజుయినా శాంతికి నిజం తెలుస్తుందని అప్పుడు శాంతి తన వెనక నవ్వుకుంటుందని అది చాలా అసహ్యకరం అని




కూడా ఆమె అనుకోలేదు. తులసికి కావల సింది ఈక్షణంలో శాంతిని నమ్మించడమే. తులసిలాంటి వ్యక్తులు ఈ సమాజంలో చాలామంది వుంటారు. చాలాతరచూ మనకి తారసపడుతూనే వుంటారు. బయటివాళ్లనే కాదు... వాళ్లు మూర్తి పిల్లలు కాదన్న విషయా న్ని తనని తానే నమ్మించుకో చూసేంతటి ఆత్మవంచనకి అలవాటుపడుతోంది తులసి.

దానికి కారణం... వాళ్లు తన బిడ్డలుకాదూ అన్న భావం... తన సుఖాన్ని ఏదో కోల్పోతోంద న్న భావం. ఇష్టంలేని ఆశించని జీవితంతో రాజీపడాల్సివచ్చిన అసంతృప్తి. ఈ కారణాల వలన ఆ పిల్లలమీద పెంచుకుంటూ వస్తూన్న ద్వేషం ఇవన్నీ కలసి తులసి చేత అలా మాట్లాడిస్తున్నాయి. ఆమెచేత అలా ప్రవర్తింప చేస్తున్నాయి. తులసి వాళ్లని తీర్చిదిద్దేతల్లిలా కాకుండా వాళ్లు నడిచే మార్గంలో ముళ్ల కంపలా మారిపోయింది. ఆ మధ్యాహ్నం మూ ర్తి భోజనానికి వచ్చినప్పుడు అతణ్ని తన స్నేహితురాలికి పరిచయం చేసింది తులసి. తులసి భర్త కాస్త వయసుమీరిన వ్యక్తి అని గ్రహించింది శాంతి. అయితే తులసికీ ముప్పై ఏళ్లు దాటాయి కాబట్టి ఆమె దాని గురించి విచిత్రంగా అనుకోలేదు.

"త్వరగా పిల్లల్ని కనండే బాబూ"

శాంతి నవ్వుతూ అంటే తులసి మనసు చి వుక్కుమంది.

తన భర్తకి వయసుమీరి పోతోందని శాంతి అలా అంటోందని భావించింది తులసి.

"ఏం ముంచుకుపోయిందిలే? మా వారి వయసు ముప్ఫయిఆరు మాత్రమే" నవ్వుతూ తన భర్త వయసు ఆరేడేళ్లు తగ్గించేసింది.

ఆ తరువాత తులసి తన భర్తకి వడ్డిస్తూన్న ప్పుడు శాంతి బయటిగదిలో కూర్చున్న పిల్లల దగ్గరికి వచ్చింది. వాళ్ల చదువుల గురించి అడిగింది. భారతి మెల్లిగా అక్కడినుంచి తప్పుకుంది. ఆమె లోతుగా తమని గురించి అడిగితే ఎక్కడ నిజం బయటపడుతుందో ఆ తరువాత తులసిచేత పడాల్సిన మాటలూ అవీ తలచుకుంటే ఆ అమ్మాయికి భయం వేసింది. అయితే భారతి భయపడినంత జర గనే జరిగింది.

శాంతి హుషారుగా కబుర్లు చెబుతూన్న చందూని ముచ్చటగా చూస్తూ అడిగింది- "మీది ఏవూరు బాబూ?"

"ఏ వూరేమిటి? ఈ వూరే?" అన్నాడు చందూ.

"నేను అడుగుతూంది మీ అమ్మా నాన్న వున్నవూరు"

"అమ్మా నాన్నా? నాకు అమ్మ లేదుగా? నాన్నే వున్నాడు. లోపలున్నాడుగా?" తులసిని తల్లిగా చందూ మనసు అంగీకరించడం లేద న్నదానికి ఇప్పటి వాడిమాటలే ఒక ఉదాహ రణ.

చందూ మాటలు సరిగా బోధపడక- "మీ నాన్న లోపల వుండడం ఏమిటి?" అంది.

వాడు కూడా శాంతివైపు ఆశ్చర్యంగా, అయో మయంగా చూస్తూ "తులసి మీకేం కావాలి?" అడిగాడు.

"తులసా? తులసేమిటి? పెద్దవాళ్లని పే రుతో పిలవచ్చా? నీకు అత్త కాదూ?" అంది శాంతి మందలింపుగా.

"అత్తకాదు అమ్మట. నాన్న అమ్మా అని పిలవమంటాడు. అలా పిలిస్తే తులసి తిడు తుంది" కోపంగా చెప్పాడు.

శాంతికి అప్పటికి ఏదో అనుమానం వచ్చింది- "మూర్తిగారు నీకేం కావాలి? మామ య్యా కాదూ?"

"కాదు. మా నాన్న. మా అమ్మ చచ్చిపోతే మా నాన్న తులసిని పెళ్లిచేసుకున్నాడు" చందూ అచ్చు తన నాయనమ్మని అనుకరిస్తూ కంఠం తగ్గించి- "ఈ తులసి మంచిదికాదు. నన్నూ అక్కనీ తిడుతుంది. పుస్తకాలకి డబ్బి వ్వదు. మంచి బట్ట కూడా కొనదు. స్వీట్స్ చేస్తే దాచేస్తుంది. పెట్టదు. మా నాయనమ్మ కూడా ఈ తులసివల్లనే చచ్చిపోయిందట. తులసి మంచిదే కాదు. నేను 'దయ్యం' అంటాను. నువ్వు మరి ఈ విషయం తులసికి చెప్పకేం? నన్ను చంపేస్తుంది" గుసగుసగా చెప్పాడు.

ఈ మాటలు విని శాంతి దాదాపు షాక్ తిన్నది. ఇప్పుడు ఆలోచించగా అర్థం అయింది ఆమెకి. తులసి తనకి వచ్చిగా

అబద్ధాలు చెప్పిందనీ, ఆమె భర్త, ఇద్దరు బిడ్డల తండ్రి అనీ ఈ పిల్లల్ని తులసి ప్రేమగా చూడకపోగా వాళ్లు తన భర్త పిల్లలు అని చెప్పేందుకు కూడా నామోషీ పడు తోందని. శాంతి సులభంగా ఆ ఇంట్లో పసిపిల్లల పరిస్థితి కూడా వూహించుకోగలి గింది. ఆమెకి పిల్లలపట్ల అపరిమితమైన దయా జాలీ కలిగాయి. తన స్నేహితురాలిప ట్ల కోపం కూడా చందూ శాంతికి ఈ మాటల న్నీ చెబుతూన్నప్పుడు భారతి లోపలికి రాబోయి ఈ మాటలు విని భయంతో బిక్కచ చ్చిపోయి పెరట్లోకి పరుగెత్తి అక్కడ సన్నజాజి పందిరి చాటున కూర్చుంది.

కాస్సేపటి తరువాత భర్తని పంపేసి- ''ఇక్క డేం చేస్తున్నావే? అవునూ నీ పిల్లల్ని తీసుకు రాలేదేం?'' అంటూ వచ్చిన తులసి కనుబొమ్మ లు అక్కడ వున్న చందూని చూసి ముడుచుకు న్నాయి.



తులసిని చూసి చందూ తన ఆటవస్తువులు తీసుకుని పరుగెత్తాడు.

''వాడితో కబుర్లేశావా? ఒట్టి అధిక ప్రసంగి. వినేవాళ్లుంటే ఒకటికి నాలుగు కల్పించి కథలు చెబుతాడు'' అనుమానంగా స్నేహితురాలి మొహంలోకి చూస్తూ అంది తులసి.



శాంతి స్నేహితురాలివైపు కోపంతోనూ, కాస్త జాలిగానూ చూసింది. ''అబద్ధాలు కల్పించి, కట్టుకథలు చెప్పే వయసు వాడికి ఎక్కడుంది తులసీ? ఈ వయసులో పిల్లల నోటినుండి మంచి ముత్యాలవంటి స్వచ్ఛమైన నిజాలే బయటికి వస్తాయి. అయితే క్రమంగా మన పెంపకంలో లోపాల్ని బట్టి వాళ్లు ఎంతగా పాడయిపోయినా ఆశ్చర్యపోవాల్సిందేమీలేదు'' అంది.

తులసి మొహం వెలవెలబోయింది.

శాంతి చప్పున వచ్చి స్నేహితురాలి భుజంమీద చెయ్యివేసి, ''నువ్వు అంత సిగ్గుపడాల్సిన, దాచుకోవాల్సిన అవసరం ఏమీలేదు తులసీ. ఈ ప్రపంచంతో నువ్వు ఒక్కతెవే కాదు- బిడ్డల తండ్రిని చేసుకుంటోంది. చాలా మంది స్త్రీలున్నారు. ఇదేం తప్పుకాదు. దాచుకోవాల్సిన చెడ్డ విషయం ఏమీకాదు. నీ భర్తకి నువ్వు భార్యవి అయినప్పుడే వాళ్లు నీ పిల్లలు అయ్యారు. నీ బిడ్డల్ని గురించి నువ్వు చెప్పుకోవడానికి సందేహించాల్సిన అవసరం ఏమిటి? నువ్వలా బయటివాళ్లకి చెప్పినందువల్ల నీకూ పిల్లలకీ మధ్య వున్న సున్నితమైన అనుబంధం దెబ్బతింటుంది. వాళ్లల్లో నీపట్ల విముఖత్వం ఏర్పడుతుంది. పిల్లల మనసులు చాలా సున్నితమైనవి. ఏ మనిషిపట్ల అయినా ఒక అభిప్రాయం అంటూ ఏర్పడిందంటే అది చెరిగిపోవటం చాలా కష్టం.

నీ పిల్లలిద్దరూ రత్నాల్లా వున్నారు. వాళ్ల మనసుల్ని నొప్పించి, బాధపెట్టి నువ్వు బాధపడకు. నీ శ్రేయోభిలాషిగా, స్నేహితురాలిగా ఇది నా సలహా...'' అనునయంగా చెప్పింది శాంతి.

తులసి మొహం రక్తం ఇంకిపోయినట్టు పాలిపోయింది.

''ఈ విషయం నాకు తెలిసిపోయిందనీ, నువ్వేదో అవమానం పాలయ్యావనీ ఏమీ ఫీలవకు. నీకోవిషయం చెప్పనా? మా ఆడపడుచు ఒక అమ్మాయి వుంది, మనవయసే. పదేళ్ల క్రితం పెళ్లయింది. మంచిభర్త దొరికాడు. వాళ్లది చాలా అన్యోన్యదాంపత్యం అని మేమంతా చెప్పుకునేవాళ్లం. రెండేళ్లక్రితం యాక్సిడెంట్‌లో తన భర్తపోయాడు. తను కృంగిపోయింది. ఇద్దరు పిల్లలు. చదువుకున్నది కావడంతో భర్త ఉద్యోగం తనకి ఇచ్చారు. క్రమంగా మనుషుల్లో పడింది. అయితే తన కంటూ ఓ తోడులేనిదే ఒంటరిబ్రతుకు బతకలేననుకుంది. మళ్లీ పెళ్లిచేసుకోవడానికి నిశ్చయించుకుంది. భర్త పోయిన ఆరునెలలకే పెళ్లిచేసుకుందికూడా. మా ఇంట్లో ఎవరూ అభ్యంతరం పెట్టలేదు. ప్రోత్సహించారు కూడా. దగ్గరుండి పెళ్లి జరిపించాం. భర్తగా వచ్చిన ఆ వ్యక్తి మంచివాడే. పిల్లల్ని ప్రేమగా చూస్తాడు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే అతడికి ఇది మొదటిపెళ్లి. మా ఆడపడుచుని చూడగానే అతడికి పెళ్లిమీద ధ్యానమళ్లిందట. ఈ ప్రపోజల్ తెచ్చింది మొదట అతగాడే.

ఇప్పుడు వాళ్లు చాలా సుఖంగా వున్నారు. ఈ పెళ్లిగురించి నలుగురూ నాలుగురకాలుగా అనుకున్నా అతడు లక్ష్యపెట్టలేదు. ఆ పిల్లలు తన భార్య మొదటిభర్త పిల్లలు అని ఎవరైనా ప్రస్తావిస్తే అతడు సిగ్గుపడడు, బాధపడడు, నవ్వేరుకుంటాడు. అతడిముందు ప్రస్తావించినవాళ్లే తమ సంకుచితత్వానికితామే సిగ్గుపడే పరిస్థితిలో వాళ్లని పడేస్తాడు. ఆ పిల్లలచేత నాన్నా అనీ, డాడీ అనీ, అప్పా అనీ, పప్పా అనీ రకరకాలుగా పిలిపించుకుని ఆనందిస్తూంటాడు. పిల్లలు దాదాపు తమ తండ్రినే మర్చిపోయారు. మా ఆడపడుచు తన భర్త స్మృతినొక మధురస్మృతిగా తనలో పదిలపరచుకుంది. ఆమె రెండోభర్త విద్యావంతుడు. తన చదువు అతడికి విజ్ఞానాన్నేకాక సంస్కారాన్నీ నేర్పి, విశాలదృక్పథంతో ఆలోచించడాన్ని నేర్పింది. చూశావా... మనం ఎంతో సంకుచితుడు అనుకునే మగవాడు ఎంత సంస్కారవంతంగానూ, ఆదర్శవంతంగానూ వుండగలుగుతున్నాడో. అదేమీ గొప్ప కాదని కూడా అంటాడతడు. అలాంటప్పుడు మనం మన సాటి స్త్రీ పిల్లలపట్ల వాళ్ల సవతిపిల్లలు అన్న కారణాన నిరాదరణని చూపితే ఆ పసిమనసులు ఎంత క్షోభపడతాయో, దాని మూలంగా వాళ్ల భవిష్యత్తు ఎంతగా దెబ్బ తింటుందో నువ్వే ఆలోచించు తులసీ. నువ్వు బొత్తిగా విద్యావిహీనురాలివేంకాదు. అంతో




# పరిణమముత్యాలు

★ సత్యానికి, సన్మార్గానికి మించిన మతం లేదు.

— గాంధీజీ

★ శాంతి, సౌఖ్యం, విశ్రాంతి ఇవ్వలేని మతంకంటే ప్రకృతి ఆరాధనే ఉత్తమం.

— వర్డ్స్‌వర్త్

★ వివేకవతి అయిన స్త్రీ ప్రేమను సంపాదించడం కష్టం. ఆమె వివేకాన్ని తెలివితేటలను పొగడకుండా వాటిని నీవు గౌరవిస్తున్నావన్న నమ్మకం కలిగితేనే ఆమె నిన్ను ప్రేమిస్తుంది. పొగిడావో నిన్ను అసహ్యించుకుంటుంది.

— లూయి డెనోమర్

★ మనిషికే చావుగానీ మానవతకు లేదు.

— కృష్ణమీనన్

★ మనిషి చనిపోయినదానికంటే మానవత నశిస్తేనే నాకు ఎక్కువ బాధకలుగుతుంది.

— శరత్‌చంద్ర

★ మానవత్వం అనేది అనాది నుంచి అనంతంవైపు పయనించే ప్రకాశవంతమైన కాంతి పుంజంలాంటిది.

— ఖలీల్‌జిబ్రాన్

★ వ్యక్తిగా మానవుడిలో మంచి ఉంది కానీ సమాజంలో లేదు.

— రస్సెల్

★ మనుషులు కలహించుకోవడానికి హేతువులు మూడు. అవి పోటీ, న్యూనతాభావం, ప్రతిష్ట.

— థామస్ హాబ్స్

★ మానవుడు బలవంతుడైతే ఉంటే పనిచేయనివ్వండి. తెలివైనవాడైతే పరిశోధించి ఆలోచన చెయ్యమనండి. ధనవంతుడైతే ఇతరులకు సహాయం చేయమనండి.

— జీన్‌రస్కిన్

★ మానవుడు నెమ్మదిగా అవకతవకగా పనిచేసే అద్భుతమైన భావుకుడు. యంత్రం చకచకా నిక్కచ్చిగా పనిచేసే శుద్ధ అవివేకి.

— డబ్ల్యు.ఎమ్. కెల్లీ

★ ఈ విశ్వమంతా అద్భుతాలయం. కానీ మనిషిని మించిన అద్భుతం మరోటి లేదు.

— సోఫోకిల్స్

★ మృతినెరుగని దేవతలకన్నా నలుగురికి మేలు చేసే నరుడే మిన్న.

— గాలిబ్

---

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

ఇంతో తెలివైనదానివి.

ఈ లోకం గురించి పట్టించుకోకు. అది చాలా చెడ్డది. ఒకనాడు నీకు పెళ్లికాక, అవుతుందన్న ఆశలేక ఇంట్లో వున్నప్పుడు ఈ లోకం నిన్నెంతలా మానసికంగా హింసించింది? ఆనాడు వీళ్లంతా నిన్నాదుకున్నారా? పిల్లలకి తల్లిగా ఇక్కడికి వచ్చావు నువ్వు. నిన్ను నోరారా అమ్మా అని పిలిచే అవకాశాన్ని వాళ్లకి ఇవ్వు. ఒక మంచి అమ్మగా మారడానికి ప్రయత్నించు. నీ మనసులోని అసంతృప్తి నిన్నో బాధ్యతాయుతమైన తల్లిలా వ్యవహరించనీయకుండా చేస్తోంది. నువ్వు ఒకలా ఆలోచించు. నీకు పదిహేడో, పద్దెనిమిదేళ్ల వయసులో పెళ్లయిపోయివుంటే ఖచ్చితంగాభారతి, చందూ వయసు పిల్లలుండేవాళ్లు. నీకు అప్పట్లోనే పెళ్లయిపోయిందనుకో. ఈ పిల్లలు నీ పిల్లలే అనుకో. అప్పుడు నీకు మనశ్శాంతి లభిస్తుంది...

పిల్లల తండ్రిని ప్రేమించినట్టే ఈ పిల్లల్నీ ప్రేమించగలవు. ఒకవిధంగా చూసుకుంటే రెండోపెళ్లి వ్యక్తిని చేసుకున్న స్త్రీ పిల్లలు అసలు మొత్తంలాంటివారు. ఎందువలనంటే వారికోసమే ఆమె ఆ ఇంటికి తీసుకురాబడింది కాబట్టి. భర్త వడ్డీలాంటివాడు. అసలు కంటే వడ్డీముద్దు అన్నట్టు ప్రవర్తించడం అన్నది సంకుచితత్వమేగాక తెలివితక్కువతనంకూడా. మీకోసమే నేను ఉన్నాను అన్నట్టు వాళ్లకి నీ ప్రేమని పంచగలిగితే వాళ్ల దృష్టిలో నువ్వు దేవతవి అవుతావు తులసీ'' అనునయంగా, సుదీర్ఘంగా శాంతి మాట్లాడుతూంటే నిశ్శబ్దంగా వుండిపోయింది తులసి.

అవమానభారంతో, దుఃఖం, ఉక్రోషంతో ఆమె మనసు ఘోషిల్లసాగింది. శాంతి చెప్పినట్టు ప్రతి సవతితల్లి ఆలోచించగలిగితే సవతి తల్లి అన్న పదమే కాలక్రమేణా నిఘంటువుల్లో సైతం మిగలకుండాపోతుందేమో.

మరో అరగంట తరువాత శాంతి వెళ్లిపోయాక, తులసి భళ్లున అగ్నిపర్వతంలా బ్రద్దలయింది.

ఆమె కేకలకి పెరట్లో అరిచేతిలో గుండెపట్టుకున్నట్టు కూర్చున్న భారతి, వాకిట్లో ఆడుకుంటూన్న చందూ పరుగెత్తుకొచ్చారు. తులసి తననితాను మర్చిపోయింది. తలుపులు మూసి గడియపెట్టింది. అదిచూసి ప్రమాదాన్ని గ్రహించినట్టు చందూ బిగ్గరగా ఏడవసాగాడు. తులసి మొదట వాడి జుట్టు పట్టుకుంది. గొడ్డును బాదినట్టు బాదసాగింది. ఎక్కడ కొడుతోందో, ఎలా కొడుతుందో తనకే తెలీనివిధంగా కొట్టసాగింది.

''నన్ను వదులు... నన్నొదులు!.. నన్ను కొట్టకు...'' చందూ ఏడుస్తున్నాడు.

''దెయ్యమా... రాక్షసీ...'' తిడుతున్నాడు.

ఇంకా రెచ్చిపోయింది తులసి.

''అమ్మా వాడ్ని వదులు. వాడ్ని కొట్టకు. నన్ను కొట్టు...'' తులసి కాళ్లుపట్టుకుంది భారతి.

తులసి చందూని వదిలేసింది. జోషి వచ్చినట్టు పడిపోయాడువాడు. ఈసారి తులసి భారతిని బాదబాదసాగింది. దుఃఖాన్ని, వెక్కిళ్లనూ గొంతులోనే అణిచివేసుకుంటూ ఆ దెబ్బల్ని తినడం ప్రారంభించింది భారతి.

''నా పరువు తీస్తారే మీరు?. నాస్నేహితురాలిముందు నన్నో రాక్షసిని చేస్తారా? మిమ్మల్ని ఉప్పు పాతర వేస్తాను'' విచక్షణని కోల్పోయిన తులసి ఓ తల్లిలా కాదు... ఓ మనిషిలా సైతం ప్రవర్తించడంలేదు. చందూగోలకి వాకిట్లో చేరి తలుపులు తడుతూన్నారు ఇరుగూ పొరుగూ.

తులసి పిచ్చెక్కినదానిలా అరిచింది ''వెళ్లండి ... నా పిల్లలు. వీళ్లని చంపుకునే హక్కు కూడా నాకుంది. బుద్ధివుంటే మా కుటుంబవిషయాల్లో జోక్యం కలిగించుకోకండి''

వాళ్లు గొణుక్కుంటూ తిట్టుకుంటూ వెళ్లిపోయారు. తులసి చేతులు నొప్పిపుట్టడంతో అలసిపోయి భారతిని వదిలేసింది. తరువాత తులసి నేలకేసి బాదుకోసాగింది.

భారతి పరుగెత్తుకెళ్లి ''అమ్మా'' అంటూ పట్టుకుంది.

తరువాత తులసి శోష వచ్చినట్టుపడిపోయింది. ఆ ముగ్గురూ ఏడుస్తూన్నారు. ముప్పైఏళ్ల తులసీ,పదమూడేళ్ల భారతి,తొమ్మిదేళ్ల చందూ... సమాజంతీర్పు దిద్దిన సవతి తల్లీ పిల్లలు వాళ్లు.




అదీ మొదలు తులసి పిల్లలమీద నిర్దాక్షిణ్యంగా చెయ్యి చేసుకోవడం. ఈ సంఘటన తరువాత చందూ మరీ బండబారిపోయాడు. సవతి తల్లి తమ విషయంలో తండ్రికి పచ్చిగా అబద్ధాలు చెబుతూందని, అబద్ధాలు చెప్పడం తప్పుకాదన్న ఆలోచనసైతం చందూకి వచ్చింది అప్పుడే. ఒంటిమీది వాతలు తండ్రి కంటబడతాయన్న భయంతో భారతి తప్పుకు తప్పుకు తిరగ్గా ఇదేమీ తెలీని చందూ ఒంటి మీది వాతల్నిచూసి మూర్తి "ఇదేమిట్రా? ఆ వాతలేమిటి? ఎవరు కొట్టారు?" అని ఆందోళనగా అడిగినప్పుడు "తులసి ... తులసి కొట్టింది నాన్నా..." అంటూ బావురుమన్నాడు వాడు.

మూర్తి నిశ్చేష్టుడయ్యాడు. నమ్మలేకపోయాడు.

"ఏమిటీ? తులసి కొట్టిందా?"

"అవును! నేనే కొట్టాను" అంటూ వచ్చింది తులసి. వీడు బొత్తిగా నాకు అలివికావడంలేదు. నిన్న నాస్నేహితురాలు వస్తే నా మీద అసహ్యంగా లేనిపోనివి కల్పించి చెప్పాడు.నేను తమని ప్రేమగా చూడటంలేదట. వాళ్ల నాయనమ్మని విషం పెట్టి చంపానట. మిమ్మల్ని వల్లో వేసుకున్నానట. మీరు సైతం నా మోజులోపడి వాళ్లనిసరిగా పట్టించుకోవడం లేదట. ఎప్పుడో వీళ్లిద్దర్నీకూడా ఏమందో పెట్టి చంపేస్తానుట" ఇలా చెబుతూ బిగ్గారగా ఏడ్చింది తులసి.

తన గురించి బయటివాళ్లు అనుకునే మాటల్ని పిల్లలమీద పెట్టి వాళ్లు అన్నట్టు భర్తతో చెప్పింది తులసి. మూర్తి నమ్మాడు. చందూ రెండు చెంపలూ వాయించాడు. ఏనాడూ కూతురి ఒంటిమీద చెయ్యి వేసి ఎరగని మూర్తి ఆ రోజు భారతిని కూడా కొట్టాడు. ఎదుగుతూన్న పదమూడేళ్ళు నిండుతూన్న కూతుర్ని భార్య మాటలువిని అందులో నిజానిజాలేమిటో తెలుసుకోకుండా భార్య చెప్పినంతటి పెద్దమాటలు మాట్లాడగల తెలివి వాళ్లకివుందా? అన్నవిషయం గురించి ఆలోచించుకోకుండా పిల్లల్ని కొట్టాడు. పిల్లల దృష్టిలో అతడిస్థానం మరింత దిగజారింది.

"అక్క చెప్పినట్టు అబద్ధాలు చెప్పడం తప్పుకాదు. నిజం చెపితే నాన్న నమ్మడు అబద్ధాలు చెప్పిన తులసి మాటలు నమ్మాడు. కాబట్టి అబద్ధాలు చెప్పవచ్చు" అనుకున్నాడు చందూ.

"నాన్నకి తులసి అంటే ఎంతో ఇష్టం. తమంటే నాన్నకి ఇష్టంలేదు" అన్న భావం పిల్లల్లో ఏర్పడింది. నిజానికి పిల్లలపట్ల మూర్తిలో ప్రేమాభిమానాలు లేకపోలేదు. రెండో భార్య అనే మోజు వాటిని కొడిగట్టేలా చేసింది. అంతే.

'భవిష్యత్తు, జీవితం' ఇలాంటి పెద్ద పదాలకి అర్థంతెలీని వయసు భారతిది.అయినా ఏదో అంధకారంలో చిక్కుకుపోయినట్టు అందులోంచి బయటపడేమార్గం కనబడనట్టుగా ఉక్కిరి బిక్కిరి అయిపోసాగింది భారతి లేతమనసు. సవతితల్లి పట్ల అయిష్టం కంటే భయం అనేది జాస్తయిపోయింది.

"అక్కా! ఈ తులసి మన అమ్మలా నాయనమ్మలా చచ్చిపోతే బాగుంటుందికదే" ఆశగా అన్నాడు చందూ.

"అప్పుడు నాన్న మళ్లీ పెళ్ళి చేసుకుంటాడు గదరా? అప్పుడు మనకి మళ్లీ ఇంకో అమ్మ వస్తుంది" భారతి నోటివెంట వచ్చిన ఈ సమాధానంలో మూర్తిలాంటి తండ్రులు సిగ్గుతో ఆత్మహత్యచేసుకోవాల్సినంత ఘాటయిన అర్థం ఇమిడివుంది.

మూర్తిలాంటి భర్తలు చేజేతులా 'ఇలాంటి పరిస్థితుల్ని కొనితెచ్చుకుంటారు. నలభైఏళ్ళు దాటి రెండో పెళ్ళి చేసుకున్న పురుషుల్లో చాలామంది వయసులో వున్న కొత్త భార్యలకి లొంగిపోవడం అన్నది అనేకచోట్ల జరుగుతున్నదే. ఇందుకు కారణాలు అనేకం. అయితే వీటిలో ప్రధానంగా రెండింటిని చెప్పుకోక తప్పదు. ఒకటి భౌతికమైన సెక్స్ అయితే రెండోది మానసికమైనది. భార్య మరణించి కొంతకాలంగా సంసారసుఖానికి దూరంగా వున్న పురుషుడికి కొత్త భార్య లభించడమూ ఆమె మంచి వయసులో వుండడంచేత ఆమెవైపు అతిగా ఆకర్షింపబడటం జరుగుతూంది. ఎంతో కొంత అసంతృప్తితో అతడి జీవితంలో అడుగుపెట్టిన స్త్రీ అతడిలోని ఈ బలహీనతని గమనించి



పడకటింట్లోనే అతణ్ణి తనకి కావలసిన రీతిలో వశుణ్ణి చేసుకోవడమూ ఆ తరువాత అతణ్ణి తన ఇష్టాయిష్టాలకి అనుగుణంగా మలచుకోవడమూ జరుగుతుంది. ఈ విధంగా భార్యకి వశుడైపోయిన పురుషుడు ఆమె ఆడించిన విధంగా ఆడగలడు. భార్యపట్ల అవసరానికి మించినంత ప్రేమని పెంచుకోవడమూ విశ్వాసాన్ని ఏర్పరచుకోవడమూ భార్య తప్ప మరోలోకమే లేదన్నట్టు ప్రవర్తించడమూ తన మంచి చెడ్డల్ని గమనించినంత శ్రద్ధగానూ భార్య తన పిల్లలపట్ల శ్రద్ధవహించగలదని, తనని ప్రేమించినంతగానే తన పిల్లల్నీ ప్రేమించగలదనే గుడ్డినమ్మకానికి రావడం జరుగుతుంది.

కొందరు స్త్రీలు ఇంటికి సంబంధించిన ప్రతిచిన్న విషయమూ భర్త దగ్గరికి తీసుకువెళుతుంటారు. తులసి మాత్రం అలా చేసేదికాదు. పిల్లలకి తనకీ, అరుంధతమ్మకీ తనకీ మధ్య జరిగే గొడవల్ని వీలయినంతవరకూ అతడిదాకా తీసుకెళ్ళకుండా జాగ్రత్తపడేది భర్త దృష్టిలో తను చెడ్డది కాకూడదన్న భావంతో. అరుంధతమ్మకూడా కొడుకు కోడలి మాయలో వుండి తనని చులకనచేస్తాడని తన అభిప్రాయాలకి విలువ ఇవ్వడని ప్రతి చిన్న విషయాన్ని అతడితో చేప్పేదికాదు. దీనితో తన భార్య పిల్లల్ని బాగానే చూసుకుంటూందన్న నమ్మకంతో ఉన్నాడు మూర్తి. అరుంధతమ్మ పోయాక భారతి సైతం భయంతో పినతల్లి మూలంగా అనుభవిస్తూన్న బాధల్ని, వేధింపుల్ని ఏనాడూ తండ్రి దృష్టికి తీసుకువచ్చే ప్రయత్నం చెయ్యలేదు. ఈ ప్రయత్నం చేసింది చందూ మాత్రమే. దీన్ని కొంత చిన్న పిల్లాడి చేష్టలుగా కొట్టిపారేస్తే కొంత వరకూ తన భార్య తనపైకినుక వహించగలదన్న భయంతో మూర్తి చూసీ చూడనట్టు వూరుకుంటున్నాడన్న విషయం తులసి సైతం గ్రహించింది. ఇది ఆమెకి కాస్త అలుసయిన విషయం అయింది. క్రమక్రమంగా సవతితల్లీ పిల్లలమధ్య జరుగుతూన్న ఘర్షణల్ని అతడు గమనించక తప్పలేదు. తెలిసీ తెలీనట్టు నటించే పరిస్థితిని అతడే తెచ్చుకున్నాడు.

మరోటి...





నలభైఏళ్ళు దాటిన రెండోపెళ్లి భర్తలు చాలామందిలాగే మూర్తికూడా కొత్త భార్యకి తను వయసులో అందంలో తగినవాడు కాడేమోనన్న ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడుతూన్నాడు. ఈ విషయం అతడికి మాత్రమే తెలుసు. ఒక భార్యతో పదిహేనేళ్ళు కాపురంచేసి ఇద్దరు బిడ్డలకి తండ్రి అయిన తనపట్ల తన రెండో భార్యకి తగినంత ఆకర్షణ వుండదేమో అన్న భయం అతణ్ణి అనుక్షణం వేధిస్తూండేది. పైపెచ్చు అతడు భార్యని వెంట పెట్టుకుని బయటికి వెళ్ళినప్పుడు కొందరు ఆకతాయి యువకులు "ఆమె అతడి కూతుర్లా ఉందే" అని అల్లరికోసం అన్నమాటల్ని కూడా సీరియస్‌గా తీసుకునేవాడు. ఆమె పక్కన తను వయసు మళ్లిన వాడిలా వున్నాడేమోనన్న భావంతో కుంచించుకుపోయేవాడు. భార్యకూడా తనని వయసుమళ్లినవాడిగా సామర్థ్యం లేనివాడిగా ఎక్కడ భావిస్తుందో నన్నభయంతో అతడు పడకటింట్లో పాతికేళ్ల యువకుడిలా ఆమెని మెప్పించడానికి ప్రయత్నిస్తూండేవాడు. భార్య తన రూపురేఖల్లో మార్పు తెచ్చి తనని కుర్రాడిలా తీర్చిదిద్దడానికి ప్రయత్నించినప్పుడు అతడు మనసులో చాలా కలతచెందాడు.

ఆమె అసంతృప్తితో ఎక్కడ తనపట్ల అయిష్టాన్ని పెంచుకుంటుందోనన్న భయమే ఆమె ఆడించినట్టు అతడు ఆడటానికి మరోకారణం. ఆమెని సంతోషపెట్టడానికీ తృప్తిపరచడానికీ అతడు అనేక విధాలా ప్రయత్నిస్తూండేవాడు. ఆమె అడగకముందే నగలూ చీరలూ తెచ్చి ఇవ్వడం తన సంపాదనంతా పైసల్తో సహా ఆమెకి అప్పగించడం నెలకింత అని ఆమె పేరుమీద బ్యాంక్‌లో డబ్బుదాచడం ఆమెని సినిమాలకీ షికార్లకీ తిప్పడం తల్లికీ ఆమెకీ మధ్య జరుగుతూండే ఘర్షణల్ని పట్టించుకోనట్టు వుండటం ఒక్కోసారి తల్లినే మందలించడం... ఇదంతా భార్యని ప్రసన్నురాల్ని చేసుకోవడంకోసమే.

ఓరోజు తులసి హఠాత్తుగా భర్తని అడిగింది "మనం ఓసారి డాక్టర్‌ని కలిస్తే బావుంటుందేమో?"

"దేనికి తులసీ? ఒంట్లో బావుండలేదా?" ఆత్రుతగా అడిగాడు.

"కాదు మన పెళ్లయి చాలా రోజులు అవుతోందిగదా? నాకు ఇంకా పిల్లలు పుట్టకపోవడం... అందుకూ ..." ఆమె మాటల్లో సిగ్గుకంటే దిగులు ఎక్కువగా కనిపించింది.

మూర్తి నిజంగా భయపడిపోయాడు. అతడు పిల్లలు కలగకుండా ఆపరేషన్ చేయించుకోలేదు. ఈరోజుకాకపోయినా రేపైనా పిల్లలు పుట్టే అవకాశం వుంది. అతడామాట భార్యతో అనలేకపోయాడు. తనకి కాస్త వయసు మీరి నందువల్ల డాక్టర్‌ని కలిస్తే తనమూలంగా తులసికి పిల్లలు పుట్టే అవకాశం లేదన్నమాట డాక్టర్ నోటినుండి వస్తే? ఈ అనవరమైన అర్థంలేని భయంతో అతడు చాలా రోజులుగా భయపడుతున్నాడని తులసికి తెలీదు. భార్య ఈ ప్రసక్తి తెచ్చినప్పుడల్లా ఏదో సాకుతో డాక్టరు దగ్గరికివెళ్లే ప్రయత్నాన్ని వాయిదా వేస్తూవచ్చాడు. తరువాత తను ఇలా తప్పించుకుంటూ వస్తే భార్యకి ఎక్కడ తనమీద అనుమానం వస్తుందోనన్న భయంతో ఓరోజు ఒంటరిగా వెళ్లి డాక్టర్‌ని కలిశాడు. నిక్షేపంగా తనకి పిల్లలు కలుగుతారని రూఢి అయ్యాక ధైర్యం వచ్చింది అతడికి. అప్పుడు భార్యని కూడా తీసుకెళ్ళాడు. ఇద్దరికీ పిల్లలు పుట్టే అవకాశాలు పుష్కలంగా వున్నాయని తెలిశాక మూర్తికి చాలా ఆనందం కలిగింది. తులసీ సంతృప్తిపడింది.

ఎంత త్వరగా తనకి పిల్లలు పుడతారా అని మూర్తి ఎదురు చూడసాగాడు. మళ్ళీ పిల్లలు కావాలన్న కోరికతో కాదతడు అంతగా ఆతృతచెందడం. తనద్వారా పిల్లలు కలిగితే తన రెండోభార్య ఆనంధంగా వుంటుందన్న ఉద్దేశంతో. ఇంకోకారణం ... అతడి మగబుద్ధి. రెండోపెళ్లి భర్తఅయిన మూర్తికి తన అందమైన కొత్తభార్యపట్ల మనసు మారుమూలల్లోది అనుమానంలాంటి వుండేది. అతడు తాను చాలా దగ్గర్లో విన్న విషయాల్ని సంఘటనల్నీ గుర్తుతెచ్చుకుంటూండేవాడు. వయసు మళ్ళిన భర్తలకి భార్యలైన కొందరు స్త్రీలు శారీరకమైన వాంఛలు తీరక అసంతృప్తితో వయసులో వున్న పరపురుషులతో సంబధాలు పెట్టుకుంటూ వుంటారన్న విషయం అతణ్ణి మానసికంగా హింసిస్తూండేది. ఇక్కడ మూర్తి తను మరీ వయసు మళ్ళిన వాడేం కాదన్న విషయం విస్మరిస్తూండేవాడు. అందుకే పీల యినంత వరకూ భార్యని అంటిపెట్టుకుని వుంటూ పుట్టింట్లోసైతం ఆమెని ఒంటరిగా వదలక వెంట పెట్టుకువెళ్లి తనే తీసుకువస్తూండేవాడు. అతడి మనసులోని ఈ భయాన్ని గురించి తెలీని అతడితల్లి బయటివాళ్ళు చివరికి తులసికూడా ఇది అతడికి ఆమెపట్ల వుండే విపరీతమైన ప్రేమగ్గా, మోజుగా భావించారు.

తల్లి పోయాక అతడిలో ఈ భయం ఎక్కువైంది. హఠాత్తుగా, వేళకాని వేళల్లో ఇంటికి వస్తూండేవాడు. ఆమె పొరుగింటికి వెళ్లినా అతడి మనసు అనుమానంతో సతమతమయ్యేది. ఆమె వీధిగుమ్మంలో నిలబడటం అతడికి కోపాన్ని కలిగించేది.

"తులసీ ... వీధిగుమ్మంలో నిలబడకు. రౌడీవెధవలు తిరుగుతూంటారు. లేనిపోని గొడవలొస్తాయి" అంటూ రెండుమూడుసార్లు హెచ్చరించాడుకూడా.

ఇది చందూ చెవులబడటంతో వాడికి సవతితల్లి వీధిగుమ్మంలో నిలబడటం తండ్రికి ఇష్టంలేదన్న విషయం అర్థం కావడంతో ఆమె మీద తనకి కోపంకలిగినప్పుడు "నాన్నా ... అమ్మ ఈరోజంతా వీధిగుమ్మంలోనే నిలుచుంది" అని చెప్పేవాడు.

అప్పుడు మూర్తిలోని మగబుద్ధి బయటపడేది.

"అప్పుడు వీధిలో ఎవరున్నారు? అంబుజమ్మ పెద్దకొడుకా?"

"ఆఁ... అవును! వాళ్ల అక్క కూతుర్ని ఆడిస్తున్నాడు నాన్నా" సులభంగా అబద్ధం చెప్పేవాడు.

మూర్తి కుపితుడయ్యేవాడు. ఆరోజంతా భార్యతో మాట్లాడేవాడుకాదు. తులసికి భర్తలోని ఈ మార్పునిగురించి అర్థంగాక అతడు ఎందుకలా వున్నాడా, తనవలనేం పొరపాటు జరిగిందా? తన గురించి ఎవరైనా చెప్పుడు మాటలు చెప్పారా అని కళవళపడేది. అయితే తను అడగకుండానే పదేళ్ల చందూ ఇలాంటి విషయాలు తనకి ఎందుకు చెబుతున్నాడా అన్న ఆలోచన మూర్తికి రాకపోవడానికి కారణం

అతడు ఈ విషయాన్ని గురించి మెదడుతో కాక మగబుద్ధితో ఆలోచించడమే. తన భార్యపట్ల వున్న తన అనుమానాన్ని తీర్చుకునే సాధనంగా అతడు తన కొడుకునే ఎంచుకున్నాడు.

''చందూ ... అమ్మ ఈరోజు పార్వతివాళ్లింటికి వెళ్లిందా? పార్వతి భర్తతో తను మాట్లాడుతుందా?''

''అంబుజమ్మగారి కొడుకు ఎప్పుడైనా మన ఇంటికి వస్తూంటాడా?'' లాంటి ప్రశ్నలు అడుగుతూండేవాడు.

చందూ ఇచ్చే సమాధానాన్నిబట్టి అతడి మూడ్స్ మారుతూండేవి. అయితే ఇది ఎక్కువ రోజులు కొనసాగలేదు. కొనసాగనీయలేదు భారతి. తండ్రి మనసులో ఏదో వుంచుకుని ఇలాంటి ప్రశ్నలు అడుగుతున్నాడని గ్రహించింది ఆ అమ్మాయి. తమ్ముడు ఇచ్చే సమాధానాన్నిబట్టి తండ్రి ప్రవర్తన ఎలా వుంటుందో కూడా గమనించేది. దీని మూలంగా తులసి దిగులుగా వుంటూండేది. తన అశాంతిని పిల్లలమీద కోపం రూపంలో చూపిస్తూండేది. ఇదంతా ఆకళింపు చేసుకున్న భారతి తమ్ముణ్ని గట్టిగామందలించి, తిట్టి, భయపెట్టి మూర్తిని మానసికంగా హింసించే సమాధానాలు చందూనుండి పొందకుండా చేసింది. అయితే అతడిలో జరిగే ఈ సంఘర్షణ గురించీ, భావాల్ని గురించీ తులసికి ఎంత మాత్రమూ తెలీదు. ఒక్కోసారి అతడి ప్రవర్తన వింతగా, విచిత్రంగా వుంటోందనితప్ప. ఆమెకి అర్థంగాకుండా ఎంతగా జాగ్రత్తలు తీసుకోవాల్నో అంతగానూ తీసుకున్నాడతడు. మగవాడి సంకుచితత్వానికీ, స్వార్థానికీ అతడొక ఉదాహరణ. అయితే కొంతమంది భర్తలు ఈ అనుమానంతో భార్యల్ని చావనీకుండా, బతకనీకుండా హింసిస్తూంటారు. మూర్తిని ఇంతవరకు ఫరవాలేదనుకోవచ్చు.

అతడు ఇలా అనేకవిధమైన ఆలోచనల్తో, అనుమానాల్తో, భయాల్తో తన పిల్లల విషయాన్ని పెద్దగా పట్టించుకోకుండా అశ్రద్ధచేశాడు. పిల్లలు మానసికంగా, ఒంటరితనంతో ప్రేమ రాహిత్యంతో ఎంతగా కృంగిపోతున్నారో అన్నవిషయాన్ని పట్టించుకునేవాడు కాడు. అయినా తల్లిపోయాక అప్పుడప్పుడూ తన భార్యాపిల్లల మధ్య జరుగుతూన్న ఘర్షణలు అతని దాకావచ్చి అతడి మనశ్శాంతినిసైతం హరిస్తూండేవి. భార్యపట్ల వున్న అనురాగంతోనూ, అనుమానంతోనూ, భయంతోనూ అతడు ఆమె పక్షం వహిస్తూండేవాడు సాధారణంగా. ఇది పిల్లల్ని మరింత నిస్పృహకి గురిచేసింది. ఇలా తండ్రి పట్టించుకోనితనంవల్ల తల్లిలేక సవతితల్లి ఆదరణలో బతుకుతూన్న పిల్లలు ప్రేమకి, అభిమానానికి దూరమై క్రమశిక్షణ అన్నది లేకుండా పెరిగే భవిష్యత్తుని పాడుచేసుకోవడం జరుగుతోంది. అయితే మూర్తిలోని తండ్రి అప్పుడప్పుడూ తన పిల్లలకి అనుకూలంగా ప్రతిస్పందించకపోలేదు.

భారతి చదువులో చాలా తెలివిగా పైకివస్తూండటం, నలుగురి అభినందనలకి పాత్రురాలవడం తులసికి చాలా అసూయని కలిగించింది ఆ అమ్మాయిపట్ల వున్న విముఖతని బట్టి. ఒకప్పుడు బాగా చదువుకుని మంచి ఉద్యోగం చెయ్యాలన్న తులసి కోరిక తీరలేదు. ఆమె మనసులో చదువుకునేవారిపట్ల, ఉద్యోగంచేసే స్త్రీలపట్ల వున్న అసూయ మొత్తం ఇప్పుడు భారతి చదువుపట్ల కేంద్రీకృతమైంది. సమయంచూసి భారతి చదువుమానిపించే ప్రస్తావన తెచ్చింది భర్తదగ్గర. సహజమైన తన బలహీనతతో అతడు కాదనలేకపోయాడు. అందులో తులసి ఈ ప్రస్తావన తీసుకొచ్చిన సందర్భం చాలా బలమైనది. అతడూ, తులసీ ఎందుకోసమైతే వెయ్యికళ్ళతో అన్నట్టు ఎదురుచూస్తున్నారో అది రానేవచ్చింది. పెళ్లయిన ఏడాదిన్నర తరువాత తులసి గర్భం ధరించింది. వాళ్ల ఆనందం అంతా ఇంతా కాదు. మూర్తి భార్యని అరచేతిలో మల్లెపూవంత అపురూపంగా చూసుకోవడం ప్రారంభించాడు. దానికితోడు ముప్ఫైయేళ్లు దాటాక వచ్చిన గర్భంకావడంతో తులసి కాస్త బలహీనంగావుంది కాబట్టి వీలయినంత ఎక్కువగా విశ్రాంతి తీసుకోమన్నారు డాక్టర్లు.

సరిగ్గా ఈ సమయంలో ''నేనెలాగూ పనిచేయకూడదు. చేసే శక్తీ నాదగ్గర లేదు. భారతిని చదువు మానిపించేయండి. ఎంత గొప్ప చదువులు చదివినా ఆడపిల్ల కట్నాలతో మరీ అత్తవారింటికి వెళ్లకతప్పుతుందా'' మెల్లమె




ల్లగా సతాయిస్తూ తటపటాయిస్తూన్న భర్తచేత అవుననిపించిగానీ ఊపిరితీసుకోలేదు తులసి.

ఈ విషయం తెలిసి నైన్త్ క్లాసులోవున్న భారతి తల్లి పోయినప్పుడు, నాయనమ్మ పోయినప్పుడు విలవిలలాడిపోయినంతగా విలవిలలాడిపోయింది.

''నీకు దణ్ణంపెడతానమ్మా, నాకు చదువుకోవడం చాలా ఇష్టం, నేను చదువుకుంటాను'' అని ఏడుస్తూ భారతి ప్రాధేయపడుతోంటే తులసి మనసు ఏమాత్రం కరగలేదు.

భారతి తనలోతానే కుమిలిపోసాగింది. కేవలం తనంటే గిట్టని కారణంగా సవతితల్లి తన చదువుకి మంగళం పాడిస్తోందని అర్థంచేసుకుంది ప్రతి విషయాన్ని గురించి ఇప్పుడిప్పుడే లోతుగా ఆలోచించగలుగుతోన్న భారతి. అయితే తులసి తనపట్ల, తన తమ్ముడిపట్ల ఎందుకు ఇంతగా వ్యతిరేకతని పెంచుకున్నది అన్నది ఆ అమ్మాయికి ఇంకా అంతు బట్టని విషయం. ఇప్పుడు ఉరమని పిడుగులా ఈ చదువు మాన్పించడం అన్నది జరుగుతోంది. ఆరోజు భారతి అన్నం తినలేదు. కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తునే వుంది. ఆ సాయంత్రం తులసి పక్కింటి పార్వతితో కలసి గుడికి వెళ్ళింది. ఇరుగూపొరుగు పిల్లల్ని కలవనీయకపోయినా తను మాత్రం వాళ్ళతో సంబంధాలు పూర్తిగా తెంచుకోలేదామె. తులసి ఇంట్లోలేని సమయంలో మూర్తి ఇంటికివచ్చాడు. కూతుర్ని కాఫీ అడిగాడు. భారతి కాఫీ తయారుచేసుకుని తండ్రి గదిలోకి వెళ్ళింది. అకౌంట్స్ బుక్ చూసుకుంటున్న మూర్తి కూతురు అందించిన కాఫీ అందుకున్నాడు.

అయినా కూతురు అక్కడినుండి కదలకపోవడంతో ''ఏమిటమ్మా?'' తలతిప్పకుండానే అడిగాడు. ''నాన్నా... చాలా దీనంగా అంది భారతి. నేను చదువుకుంటాను నాన్నా. నేను స్కూలు మానెయ్యను నాన్నా'' కూతురు కంఠంలో ధ్వనించిన దీనత్వానికి చప్పున తలెత్తిచూశాడు మూర్తి.

భారతి కళ్ళల్లోంచి బొటబొటా నీళ్ళు కారుతున్నాయి. మొహం విపరీతంగా ఏడ్చినట్టు ఉబ్బిపోయింది. ''నేనుబడికి వెళతాను నాన్నా. పనంతా చేసి వెళతాను. అమ్మకి శ్రమ లేకుండా వంటపని కూడా చేసి వెళతాను. ట్యూషన్ మానేసి ఇంట్లో చదువుకుంటాను నాన్నా. నాకు చదువు అంటే చాలా ఇష్టం నాన్నా'' ఇలాంటి విషయంలో ఏ తండ్రినీ ఏ సంతానం వేడుకోని విధంగా వేడుకుంటూ అడుగుతోంది భారతి.

మూర్తి తండ్రిమనసు కదిలిపోయింది. భార్య మరణించి తను మళ్ళీ పెళ్ళి చేసుకున్నాక తన కూతురు నోరుతెరిచి అడిగిన మొదటి కోరిక. నగలూ నాణ్యాలూ కొనిమ్మనికాదు.

''నాన్నా... నేను చదువుకుంటాను నాన్నా...'' అని.

తొలిసారిగా మూర్తి తన భార్యమాటనుకాదని కూతురుకి మాట ఇచ్చాడు ''నువ్వు స్కూలుకి వెళ్ళు భారతీ... నీకు ఇష్టమైనంత వరకూ నిన్ను చదివిస్తానమ్మా'' ఇలా అంటూంటే మూర్తి కంఠం రుద్ధమయింది.

నాన్నా... భారతి వంగి తండ్రి కాళ్ళకి దణ్ణం పెట్టింది.

ఆ ఒక్క చర్య చాలు... ఆ అమ్మాయి అనుబవించిన క్షోభకి నిదర్శనంగా. భారతి మొహం పున్నమి చంద్రుడిలా వెలిగిపోతే ఒక విధమైన పశ్చాత్తాపంతో గిల్టీనెస్‌తో ముడుచుకుపోయినట్టయ్యాడు మూర్తి.

తరువాత అతడు భార్యతో అనునయంగా చెప్పాడు ''భారతిని చదువుకోనీ తులసీ... చిన్నపిల్లని చదువు మానిపించి ఇప్పటి నుంచీ ఇంట్లో వుంచడం భావ్యంకాదనిపిస్తోంది. నీకుతెలీదు భారతితల్లికి అమ్మాయిని చదివించాలని ఎంతగానో వుండేది. చిన్నతనంలో తనకి చదువుకోవాలన్న కోరిక ఎంతగాఢంగావున్నా పెద్దవాళ్ళ చాదస్తం మూలంగా చదువుకోలేకపోయిందట. తనకూతుర్నయినా గొప్పగా చదివించాలని నాతో పదేపదే అంటూండేది'' చాలాకాలం తరువాత పెద్దభార్య జ్ఞాపకాలతో అతడి మనసు భారమైంది. తనని యథాప్రకారం స్కూలుకి వెళ్ళనీ. అంతగా అయితే పనిమనిషిని పెట్టుకుందాం. ఇప్పుడు నా సంపాదన కూడా రోజురోజుకీ

పుంజుకుంటోంది. వందకాకపోతే రెండొందలు పారేస్తే పనిమనిషి వంటమనిషి వస్తారు. నువ్వు కాలుకిందపెట్టాల్సిన అవసరంలేదు'' మొట్టమొదటిసారిగా తన కోరికను భర్త ఆ విధంగా ఆమోదించకపోవడంతో తులసి హతాశురాలైంది.

అయితే ఆమె తన బాధనీ, భావాల్నీ తనలోనే దాచుకుందిగానీ పెదవివిప్పి తన అయిష్టాన్నీ అసమ్మతినీ తెలియజెయ్యలేదు. తొలిసారిగా తన మాటను భర్త కాదన్నప్పుడు గట్టిగా వాదించడం పట్టుబట్టడం అన్నది చేస్తే తను కావాలని ఈర్ష్యచేత కూతురి చదువు మాన్పించడానికి ప్రయత్నిస్తుంది అన్న అనుమానం భర్తకి కలుగుతుందనీ తద్వారా తనపట్ల ఎంతో అనురాగం కనబరిచే అతడిలో చెడు అభిప్రాయం ఏర్పడుతుందనీ భయపడింది తులసి. ఈ విధంగా తండ్రి మనసుతో ఆలోచించి స్పందించి భార్య మాటని అతడు త్రోసి పుచ్చడం అన్నది కూతురి భవిష్యత్తుకోసం మూర్తి చేసిన ఓ పెద్ద సాయం అయింది. ఆ రూపంగా తండ్రిగా అతడు తన బాధ్యతను ఈ విషయంలో సక్రమంగా నిర్వర్తించాడని చెప్పకతప్పదు.

ఇది తులసిని చాలా అశాంతికిగురిచేసింది. భర్త తను మాటకంటే చనిపోయిన భార్య కోరికకి ఎక్కువ విలువ ఇచ్చాడని ఆమె బాధపడసాగింది. తులసి ఇలా ఆలోచించగలిగిందిగానీ, తల్లిగాబట్టి రాధ తను చదువుకోలేకపోయినా కూతుర్ని చదివించాలని తాపత్రయపడింది. సవతితల్లి గాబట్టి తను భారతి భవిష్యత్తుకి గండికొట్టాలని చూసింది. భారతి పట్ల తులసి ఎంతకోపం, ఈర్ష్య పెంచుకున్నా సాధారణంగా తప్పుపట్టడానికి ఆ అమ్మాయి మాటలో ప్రవర్తనలో పనిలో ఎలాంటి లోపాలూ వుండేవికావు. తులసి తన కసినంతా భారతి మీద చిన్నవాడైన చందూ మీద చూపుతూండేది. ఆమె నిరాదరణతో ఆమె ప్రదర్శిస్తూన్న అకారణమైన కోపంతో చందూ కూడా భయం లేకుండా ఒక పద్ధతి లేకుండా తయారయ్యాడు.

ఆమె వద్దన్నకొద్దీ పక్కవాళ్ల ఇళ్లకి ఎక్కువగా వెళ్లేవాడు. ఆమె మీద వాళ్లకి ఎక్కువగా చాడీలు చెప్పేవాడు. ఇంటికి వచ్చి ''వాళ్లు నిన్నిలా అన్నారు. అలా అన్నారు'' అని ఆమెతో చెప్పేవాడు. ఇంట్లో చిల్లరడబ్బులూ తినుబండారాలూ దొంగిలించడం నేర్చాడు. తండ్రికి తమ గురించి తులసి అబద్ధాలు చెప్పి తిట్టిస్తూ కొట్టిస్తూండడంతో తనూ అబద్ధాలుచెప్పడం నేర్చాడు. తులసి చెప్పిన ఏ పనీ చెయ్యకపోవడం ప్రతి చిన్న మాటకీ ఎదురుతిరగడం అన్నమాట తిరిగి అనడం.... ఇంతెందుకు తులసి తన సవతి పిల్లల్ని ఎంతగా ద్వేషిస్తుందో చందూ అంతగానూ సవతితల్లిని ద్వేషిస్తూన్నాడు. చందూ మూలంగా ఇంట్లో వాళ్లకి మనశ్శాంతి కరువైంది. ఒక్కోసారి కొడుక్కీ భార్యకీ నడుమ నలిగిపోతూండేవాడు మూర్తి. ఒక్క మాటలో చెప్పాలంటే చందూ క్రమక్రమంగా పాడయిపోతూన్నాడు. ఒక్కసారి తులసి వాడికి భయపడుతోంది కూడా. ఇది వాడు గమనించాడంటే ఇంకా ఇంకా పేట్రేగిపోతాడని భారతి భయపడుతోంది. చందూ ఒక్కోసారి భారతి మాటవినేవాడు. ఒక్కోసారి వినేవాడుకాడు.

''ఈ దయ్యాన్ని ఎప్పుడో కొట్టి చంపేస్తానే అక్కా...'' అంటూండేవాడు.

భారతికి చాలా భయమేస్తూండేది.

''నువ్వు బుద్ధిగా వుండరా చందూ... నువ్వు పాడయిపోతున్నావురా'' అంటూ ఒక్కోసారి ఏడ్చేది భారతి. ఈ పరిస్థితిని ఎలా చక్కదిద్దాలో ఆ అమ్మాయికి అర్థమయ్యేదికాదు. అలాంటి సమయంలో పరిచయం అయింది సౌదామిని భారతికి. మంటల్లో చిక్కుకున్నివాడికి మంచుగాలిలా మంచుగంధంలా... ఎడారిలో ఒంటరిగా చిక్కిపోయి దప్పికగొన్నవాడికి చన్నీటి చెలమలా... సౌదామిని స్నేహం భారతిని అద్భుతంగా తీర్చిదిద్దింది.

★ ★ ★

''అమ్మా...''

భారతి తృళ్ళిపడి చూసింది. తను ఎప్పుడు ఒళ్లోకి తీసుకుందోగానీ ఒళ్లో ఉన్న పాప పలవరిస్తూ కళ్లు విప్పుతోంది.




''అమ్మా...'' పాప కళ్లు విప్పిచూసింది.

''అంజూ...'' పాప చెంపలు నిమురుతూ ఆర్ద్రంగా పిలిచింది భారతి.

పాప కళ్లల్లో భయం...

''ఎందుకురా అంజూ భయపడతావు? నేను నిన్నేం చేస్తాన్రా? నేను అమ్మని అంజూ'' భారతి ఆర్తిగా అంటూ పాపని గుండెల్లో పొదవుకుంది.

ఆస్పర్శలోని ఆర్తి ఎంతగా నమ్మించిందో పాప తల్లిని కౌగలించుకుంది. భారతి పాప చెంపలని ముద్దులతో ముంచెత్తింది.

మెల్లని స్వరాన ''ఎవరేది చెబితే అది నమ్మేయడమేనా? అమ్మకి నీలాంటి పిల్లల మీద కోపం వస్తే ఓ మాట. అంటుంది. ఓ దెబ్బవేస్తుంది. అంతేగానీ ఇంకొకలా బాధ పెడుతుందిరా అంజూ?'' అడిగింది.

పాప భారతి మొహంలోకి చూస్తూ ఆలోచిస్తూంది. నిజంగా ఈ అమ్మ సుష్మామేడం వాళ్ల అమ్మలాగా చెడ్డదికాదు. చూడూ... డాడీ,అజిత్ నిద్రపోతున్నా తనకి జ్వరం అని ఒళ్లో పడుకోబెట్టుకుని అలాగే మేలుకుని కూర్చుంది. డాడీ, సీత, అజ్జూ చెప్పినట్టు ఈ అమ్మ చాలామంచి అమ్మేమొ. అమ్మ కళ్లలో నీళ్లు కూడా ఉన్నాయి. తనకి జ్వరం వచ్చిందనా? అంత క్రితం భారతిని చూడగానే కలిగిన విపరీతమైన భయం ఇప్పుడామె స్పర్శద్వారా మెల్లమెల్లగా కరిగిపోతూండగా...

''మరి నువ్వు నన్ను కొట్టవుగా?'' జాలిగా అడిగింది.

''ఎందుకు కొడతాన్రా? నువ్వంటే నాకు చాలా ఇష్టం. నువ్వు మంచిపాపవి''

పాప మొహంలోకి వెలుగురాగా ''మరి సుష్మామేడమ్ వాళ్ల అమ్మ...''

''అందరి కొత్తమ్మలూ అలా వుండరు అంజూ. ఇప్పుడు నేను చూడూ మంచిగా లేనూ? నువ్వన్నా బాబు అన్నా నాకెంత ఇష్టం? కావాలంటే డాడీని అడుగు. నువ్వంటే, బాబంటే మీ డాడీకి ఎక్కువ ఇష్టమా? అరవింద ఆంటీకి ఇష్టమా?''

''డాడీకేగా?''

''మరి మీ మంచి చెడ్డల గురించి డాడీకి ఎక్కువగా తెలుసా? బయటివాళ్లకా?''

''డాడీకే''

''అందుకే మీ సుఖం కోసం, మీరు ఎప్పుడూ హాయిగా నవ్వుతూ వుండడం కోసం మీరు అమ్మలేదని బాధపడుతూన్నారని ఈ కొత్త అమ్మని తెచ్చారు మీ కోసం. బయటివాళ్లు ఎవరేది చెబితే అది నమ్మివేయడమా? ఒక వేళ నేను మిమ్మల్ని ప్రేమగా చూసుకోలేదనుకో మీ డాడీ నన్ను మీ అమ్మ దగ్గరికి పంపించేస్తారు''

పాప శ్రద్ధగా ఓమాట కూడా పొల్లుబోకుండా వింటోంది.

''బయటివాళ్లంతా నిన్ను భయపెట్టాలని ఏదో చెబుతూంటారు. నమ్మి ఇలా జ్వరం తెచ్చుకుంటారా ఎక్కడైనా? నీకు తెలుసా అంజూ? నాకో ఫ్రెండ్‌వుంది. ఆ ఫ్రెండ్ పేరు సౌదామిని...'' జ్వరం విడిచి చెమటలుపట్టిన పాప శరీరాన్ని టవల్‌తో తుడుస్తూ భారతి చెబుతూంటే ''సౌదా ఆంటీ నాకు తెలుసుగా'' అంది పాప.

''తెలుసామరి? నాకు ఆ ఆంటీయే చెప్పింది... నీకూ అజ్జూకి అమ్మలేదని చచ్చిపోయిందని అమ్మలేక నువ్వు బాబూ మీ డాడీ చాలా ఇబ్బంది పడిపోతున్నారని'' ఆమె ఆపి పాప మొహంలోకి చూసింది.

''ఊఁ... అప్పుడు మేం బోలెడు కష్టాలుపడిపోయాంలే. రోజూ హొటల్ అన్నంతినేవాళ్లం. ఛీ... బానేవుండేదికాదు. డాడీకేమో వంటరాదు. పనిమనిషి గంగమ్మ లేదూ? వంట చేస్తానని రోజూ పాలూ కూరలూ బియ్యం పప్పులూ దొంగిలించేసేది. ఓ రోజు నేను చూసి డాడీకి చెప్పేశాగా. అరవింద ఆంటీ నాకు పోనిటైల్ కూడా వేసేదికాదు. విసుక్కునేది. డాడీ జుట్టు బాగా కత్తిరింపించేశారు. అప్పుడు ఇల్లు ఇలా వుండేదికాదు. ఎలాగో వుండేది. ఎక్కడి వస్తువులక్కడ పడేసేవాళ్లు డాడీ బాబూ. సర్దడానికి నాకు రాదుగా. ఒక్కోసారయితే ఏడుపొచ్చేది...'' దీనంగా అంది పాప.

''అవును మరి. ఈ విషయాలన్నీ సౌదామిని నాతో చెప్పింది. అమ్మలేని పిల్లలంటే నాకు చాలా ఇష్టం అంజూ. అందుకే నేను ఇక్కడికి

మీ అమ్మగా వచ్చాను. ఇప్పుడు చెప్పు... రెండు పూటలు నీకు జడవెయ్యడానికి ఇష్టపడని అరవింద ఆంటీ మంచిదా? నేనా?''

''నువ్వేగా?''

''అలాంటప్పుడు ఆవిడ నామీద ఏదైనా చెబితే నమ్మేసెయ్యడమేనా? నువ్వే చెప్పు నేను, నిన్ను బాబునీ ప్రేమగా చూస్తున్నానా లేదా?''

పాప చూస్తున్నావన్నట్టు తలూపింది.

''ఈసారి అరవింద ఆంటీ వాళ్ళు నామీద ఏదైనా చెప్పినప్పుడు నువ్వేం చెబుతావు?''

పాప ఆలోచించింది. తరువాత ''మా అమ్మ చాలామంచిది. నన్ను మా అజ్జూని బాగా చూసుకుంటుంది. ముద్దులు కూడా పెట్టు కుంటుంది. మమ్మల్నసలు కొట్టదు. మీ మాట లన్నీ అబద్ధాలు అని చెబుతాను. ఏం...?''

''వెరీగుడ్... అలాగే చెప్పాలి. పెద్దవాళ్ళెప్పు డూ ఇలా అబద్ధాలు చెప్పకూడదు అని కూడా చెప్పాలి''

''మరివాళ్ళు అబద్దాలు ఎందుకు చెబుతా రు?''

''పాపం వాళ్ళకి ఇంట్లో ఏంతోచదుగదా అంజూ. భర్తలని ఆఫీసులకి పిల్లలని స్కూళ్ళ కీ పంపేస్తారు. అప్పుడు ఒక్కరే ఇంట్లో వుంటా రు ఏమీ తోచదు. మన గురించీ సౌందర్యమ్మ గారి గురించీ ఇంకోరి గురించీ కబుర్లు చెప్పు కుంటూంటారు. నీలాంటి పిల్లల్ని భయపెట్టే స్తూంటారు...'' ఈ మాటలు వింటూంటే పాపకి ఎందుకో నవ్వొచ్చింది.

పాప నవ్వడం చూసి పాప నుదిటిమీద ముద్దుపెట్టుకుంటూ - ''మళ్ళీ ఎప్పుడైనా వాళ్ల మాటలు నమ్ముతావా? అలాగైతే నేనిక్కడి నుండి వెళ్లిపోతాను'' అంది.

''ఊహూం ... వద్దు! నువ్వెళ్లిపోవద్దు. నేనిక వాళ్ల మాటలు నమ్మను. మీ మాటలన్నీ అబద్దా లు, మా అమ్మ చాలామంచిది అంటాను. నాకు సీత కూడా చెప్పిందిలే నువ్వు చాలా మంచిదా నివట. సీత కూడా నిన్ను అమ్మా అంటుందిగా''

''అమ్మలంతా ఎప్పుడూ మంచివాళ్లే అంజూ! ఈ జనాలే వాళ్లని మంచిగా ఉండని వ్వరు''

''మీ అమ్మ కూడా మంచిదేనా?''

''చాలా... నీకు తెలుసా అంజూ? నన్ను కన్న అమ్మ ఎప్పుడో చచ్చిపోయింది. నాకు రెండోఅమ్మ వచ్చింది''.

''ఆ అమ్మ నిన్ను ప్రేమగా చూసుకుందా?'' పాప ఆతృతగా అడిగింది.

''ఆసంగతి ఇప్పుడుకాదు, నిదానంగా చెబు తాను'' అంది.

పాప తొలిసారిగా తల్లిని సంబోధిస్తూ ''ఇప్పు డే చెప్పమ్మా'' అంది మారాంచేస్తూ.

''అది చాలా పెద్దకథ అంజూ! నీకు జ్వరం వచ్చి బాగా అలిసిపోయావు. పైగా మనం గట్టిగా మాట్లాడుకుంటే డాడీ, తమ్ముడూ నిద్ర లోంచి లేస్తారు. ఇదుగో ఈ పాలుతాగి నిద్రపో''... లాలనగా చెబుతూ పాలుతా గించింది.

పాప భారతి ఒళ్లోనుండి దిగలేదు. అక్కడే నిద్రపోయింది. పాప తలనిమురుతూన్న భారతి మనసు గతంలోకి తొంగిచూసింది మళ్లీ.

సౌదామిని...

సౌదామిని పరిచయం తమ జీవితాల్ని ఓ మంచి మలుపు తిప్పింది.



''భారతీ... రేపట్నుండి నువ్వు ట్యూషన్‌కి వెళ్లాలమ్మా'' కూతురితో చెప్పాడు మూర్తి.

''ఎందుకు నాన్నా? అమ్మ పనేంచేసుకోగల దు?'' కూతురు ఏదో చెప్పబోతోంటే మూర్తి ''పనిమనిషి వస్తుందమ్మా రేపట్నుంచి. అదీ





గాక వంటకోసం తన చెల్లెల్ని పిలిపించు కుంటానంటోంది తులసి''.

భారతికి చాలా ఆనందం కలిగింది. మూర్తికి భారతి ట్యూషన్ గురించి గుర్తుచేసింది ఆమె ఇంగ్లీష్ టీచర్. అతడు మూర్తికి బాగా తెలుసు. అంతకుముందురోజు అతడు కలిసినప్పుడు ''మీ అమ్మాయి స్కూల్ ఫస్ట్ వచ్చేఅవకాశం వుంది. మంచి ఇంటలిజెంట్, మొన్న అడిగినప్పుడు తనకి ట్యూషన్ లేదంది. మంచి ప్రయివేట్ చెప్పించారంటే చదువులో ఇంకా మెరికలా తయారుకాగలదు...'' అంటూ అతడంత శ్రద్ధగా తన కూతుర్ని గురించి చెబుతూ నలుగురిలో పొగుడుతూంటే మూర్తికి గర్వంగా అనిపించింది.

అతడ్ని అడిగాడు - ''రెండేళ్ళుగా భారతికి ట్యూషన్‌లేదు, ఎక్కడ పెట్టించమంటారో మీరే చెప్పండి?''

''ఓపని చేద్దాం... వీలయివుంటే నేనే చెప్పి వుండేవాడ్ని. అన్ని సబ్జెక్ట్సు నేను చెప్పలేను. నేను అద్దెకి వుండే ఇంట్లో కొత్తగా ఓ అమ్మాయి వచ్చింది. ఇల్లుగలవాళ్ల బంధువు. కొత్తగా ఇక్కడ డిగ్రీకాలేజీలో లెక్చరర్‌గా వచ్చింది. నేను ఆ అమ్మాయితో మాట్లాడతాను. కాదనదనుకుంటాను. ఏవిషయం రేపు భారతికి చెబుతాను'' అన్నాడు.

ఆ సాయంత్రం చూసింది తొలిసారిగా సౌదామినిని భారతి...

సౌదామిని నవ్వుతూ ''నీపేరు భారతి! తెలివైన స్టూడెంట్‌వి! చదువుపట్ల ఆసక్తి జాస్తి. అవునా?'' అంది.

భారతి సిగ్గుపడింది.

సౌదామిని మాస్టారితో ''ఈ అమ్మాయిని మంచి మార్కులతో పాస్ చెయ్యించాలన్న మీ తపనని అర్థం చేసుకున్నాను కాబట్టి ట్యూషన్ చెప్పడానికి ఒప్పుకున్నాను మాస్టారూ. ట్యూషన్ ఫీజులాంటిది నేను తీసుకోను...'' నవ్వుతూనే ఖచ్చితంగా చెప్పింది.

''నీయిష్టం అమ్మా'' అన్నాడాయన.

మళ్లీ సౌదామిని భారతితో- ''చూడు భారతీ, నువ్వు నన్నో ట్యూటర్‌లా కాక ఓ స్నేహితురాల్లా చూడాలి. దేనికీ భయపడకూడదు, సందేహించకూడదు. నీ సందేహాలన్నింటినీ నిస్సంకోచంగా అడిగి తెలుసుకోవాలి. విద్యార్థిలో గురువుపట్ల పిరికితనం వుండకూడదు. అప్పుడే తను మంచిమార్కులు తెచ్చుకోగలిగేది. అర్థమైందిగా నేను చెబుతూంది?'' అంది.

భారతి ఆనందంగా తలూపింది. ఈ మొదటి రెండుమూడు మాటల్లోనే ఈ కొత్త టీచర్‌పట్ల భారతిలో మంచి అభిప్రాయమూ, ఇష్టమూ ఏర్పడిపోయాయి.

సౌదామిని ఆ అమ్మాయిని తన పక్కన కూర్చోబెట్టుకుని చదువుకు సంబంధించిన అనేక విషయాలు చెప్పింది ఆపూట. పాఠాల జోలికి వెళ్లలేదు. ఆ విధంగా భారతిలోని బెరుకునీ, సంకోచాల్నీ పోగొట్టింది సౌదామిని.

''నీకు తెలుసా భారతీ? నేను టెన్త్‌క్లాస్ చదివేప్పుడు చాలా సిగ్గుగా వుండేదాన్ని. చదువంటే ఇష్టమే కానీ క్లాసులో టీచర్‌ని అడిగి సందేహాలు తీర్చుకోవడానికి తెలీని విషయాలు చెప్పించుకోవడానికీ భయపడుతూండేదాన్ని. ఫలితం... టెన్త్‌క్లాసులో ఫెయిలయ్యాను...'' అంటూ సౌదామిని చెబుతోంటే భారతికీ నవ్వొచ్చింది.

తరువాత చెప్పింది సౌదామిని! ఇంటర్‌మీడియెట్‌లో సౌదామిని రాంక్ సంపాదించింది. డబుల్‌ఎమ్మే. డిగ్రీలో, పోస్ట్‌గ్రాడ్యుయేషన్‌లోనూ ర్యాంకులూ, గోల్డ్‌మెడల్స్ సంపాదించింది. ప్రస్తుతం పి.హెచ్.డి చెయ్యాలన్న కోరికతోవుంది. ఆమెకి ఇంకా పెళ్లికాలేదు. తన గురించిన వివరాలు చెప్పిన సౌదామిని భారతి తల్లిదండ్రుల పేర్లూ, తమ్ముడి పేరూ అడిగి తెలుసుకుంది.

ఆ మర్నాటినుండి ప్రారంభమయింది సౌదామిని దగ్గర ట్యూషన్. సౌదామిని పాఠాలు చెబుతుంటే కథలావుండేది. ప్రతి చిన్నవిషయం మెదడులోకి హత్తుకునేలా ఒక మరుపురానివిధంగా వుండేది. నిద్ర లేచింది మొదలు సౌదామిని దగ్గరికి ఎప్పుడెప్పుడు వెళదామా అని భారతి ఎదురుచూసేలా వుండేది సౌదామిని టీచింగ్ పద్ధతి. అంతేకాదు తనని 'అక్కా' అని పిలవడం అలవాటు చేసింది

భారతికి. సౌదామినిపట్ల భారతిలో అభిమానం పెరిగేలా చేసిందో సంఘటన.

అది...

ఆరోజు సౌదామిని సీరియస్‌గా హిందీ పాఠం చెబుతూన్నప్పుడు తీరిగ్గా వచ్చి కూర్చుంది ఆమె పినతల్లి. ఆవిడ పద్ధతి అంతే మధ్యలో వస్తుంది.

"ఏం కూర చెయ్యనే సౌదామినీ?" అంటుంది.

"ఈ రోజు సినిమాకి వెళదామే" అంటుంది.

"మమ్మల్ని డిస్టర్బ్ చెయ్యకు పిన్నీ" సౌదామిని విసుక్కున్నా ఆవిడ పట్టించుకోదు.

ఈరోజు ఆవిడ అలాగే వచ్చి కూర్చుని భారతిని మాటల్లో పెట్టింది.

"అమ్మాయ్... నీకు అమ్మ లేదటగా?"

ఈ వూహించని ప్రశ్నకి భారతి ఓ క్షణం తడబడింది.

"సవతల్లటగా పాపం?" సానుభూతిగా అడిగింది.

ఈసారి భారతి అవునన్నట్టు తలూపింది.

"నిన్నూ మీ తమ్ముణ్ణీ సరిగా చూడదటగా? రాచిరంపాన పెడుతుందట. ఇంత పెద్ద పిల్లవైనా నీ మీద చెయ్యి చేసుకుంటుందటగదా? నిన్న మీ పక్కింటి అంబుజమ్మ గుళ్లో కనబడి చెప్పినదాకా నాకీ విషయం తెలీనే తెలీదమ్మా. ఇంట్లో వున్నంతసేపూ నరకమేనట కదే అమ్మాయ్...? పాపం ఎంత దురదృష్టవంతులు..." అంటూ ఆవిడ జాలిగా అంటూ వుంటే భారతికి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"నీ చదువు ఆపించెయ్యాలనికూడా చూసిందటగదా?"

భారతి కళ్ళు తుడుచుకుంటూ తలూపింది.

"ఏమిటోనే అమ్మాయ్! మంచివాళ్లకే అన్ని కష్టాలు. భగవంతుడు పాపిష్టివాడు. లేకపోతే ఆడుతూ పాడుతూ తిరగాల్సిన వయసులో మీకీ కష్టాలేమిటి చెప్పు..." అని ఆవిడ ఇంకా ఏదో అనబోతూంటే "పిన్నీ! ఇక నువ్వెళ్లు! ఇంటిదగ్గర తనకి చదువుకునే అవకాశం లేదంటూనే నువ్వు ఇక్కడ అనవసరంగా టైమ్ తినేస్తావు..." కోపంగా అంది సౌదామిని. ఆవిడ్ని పంపేసింది.

ఆ తరువాత చదువుమీద మనసు లగ్నం చెయ్యలేకపోయింది భారతి. ఆ ఉదయం ఇంట్లో జరిగిన గొడవ గుర్తొచ్చింది. ఈమధ్య భారతి చదువు విషయంలో భర్త తన ఇష్టాన్ని మన్నించకపోవడంతో ఆ బాధని మనసులో వుంచుకుని తులసి తన అక్కసునంతా వీలయినంత ఎక్కువగా పిల్లలమీద చూపించడం ప్రారంభించింది. భారతి ఎంతో ఓర్పుగా సహిస్తోంది. కానీ చందూ విషయం అలా కాదు.

ఆ రోజు పొద్దున్నే తండ్రితో కలిసి టిఫిన్ చేస్తూన్నప్పుడు "అమ్మా! నాకు ఇంకో ఇడ్లీ కావాలి" అన్నాడు చందూ.

చివ్వున తల తిప్పిచూసింది తులసేకాదు భారతికూడా.

"నిన్నే! ఇంకో ఇడ్లీ వెయ్యమ్మా" అంటూన్న వాడి కళ్లల్లో పెంకెతనం.

భారతి గుండెల్లో దడ ప్రారంభమయింది.

"అమ్మా కంది పొడి వెయ్యవే" అన్నాడు మళ్ళీ వాడు.

తులసీ భారతి అది వాడి కక్షసాధింపుచర్యగా అర్థంచేసుకున్నారు. అంతకుముందు రోజు వాడు బంతికొనుక్కోవడం కోసం అయిదురూపాయలు అడిగితేతులసి ససేమిరా ఇవ్వనంది. ఆ కోపం వాడిలో పర్వతసమానంగా పెరుకుపోయింది. ఇప్పుడు వాడు అదనుచూసి ఆమెను సాధించే ప్రయత్నం చేస్తున్నాడు. అమ్మా అన్న పిలుపుని తులసి సహించలేదు. అదే తండ్రి సమక్షంలో పిలిస్తే ఆమె ఏమీ చెయ్యలేదు. అందుకే ఇప్పుడు వాడు మాటిమాటికీ ఆమెని అమ్మా... అమ్మా అన్న పిలుపుతో వేధించసాగాడు. ఆ తరువాత ఆమె చావబాదినా వాడికి లక్ష్యం లేదు. దెబ్బలకివాడు అలవాటుపడిపోయాడు. భారతి భయపడినట్టేభర్త ఇల్లుదాటి వెళ్లగానే భరించరానికోపంతో వాడి చెంపమీద బలంగా కొట్టింది తులసి.

చందూ ఆమె చేతిని విదిలించిపారేశాడు "నేను చిన్నవాడ్నినేగా వూరికే కొడతావు. ఇంకా




పెద్దవాడిని గానీ నీపని చెబుతాను'' అంటూ వాడు అక్కసుగా అంటూ వుంటే మళ్లీ లేస్తున్న తులసి చెయ్యి కిందకి దిగిపోయింది.

''నీ పర్స్‌లో ఉన్న డబ్బు నాకిమ్మన్నానా? మానాన్న బోలెడు సంపాదిస్తున్నాడు. అది మా డబ్బు. నువ్వు నిన్నగాక మొన్న వచ్చావు మా ఇంటికి. మా నాన్నని కొంగుకి కట్టేసుకుని ఆడిస్తున్నావు...'' ఆ మాటలు వాడిసొంతానివి కావు. బయటవిన్నవి.

తులసి నిర్ఘాంతపోయింది.

''నేను పెద్దవాడినైతే నీ పని చెబుతాను చూస్తూండు. ఈ భారతిలాగాతిట్టించుకుంటూ కొట్టించుకుంటూ వుంటానా?'' అంటూ తల ఎగరేసి వెళ్లిపోయాడు చందూ.

ఈసారి తులసి కోపం భారతిమీదికి మళ్ళింది ''నువ్వే... నువ్వే... వాడికివన్నీ నేర్పిస్తున్నావు. లేకపోతే వాడికంత తెలివి ఎక్కడిది...'' అంటూ చెయ్యి ఎత్తి భారతి మీదకి వచ్చి అంతలోనే చెయ్యిదించేసి బిగ్గరగా ఏడవసాగింది.

లోపల్నుంచి కాత్యాయని పరుగెత్తుకొచ్చింది. ఇరవైఏళ్ల కాత్యాయని తులసి పినతల్లి కూతురు. తులసి కాన్పు అయినదాకా ఇంటిపనుల్లో సాయం కోసం వచ్చింది.

ఏడుస్తున్న అక్కగారిని పట్టుకుని, ''ఈ రాక్షసిబిడ్డలు నిన్ను బతకనిచ్చేలా లేరే అక్కా! వీడెప్పుడో నిన్నుచంపేసేలా వున్నాడు. నువ్వు బావగారికి ఎందుకు చెప్పవు?'' భారతిని మాడ్చేసేలా చూస్తూ అంది.

అనడమే కాదు. ఆ మధ్యాహ్నం చందూ చేసిన గొడవ గురించి ఒకటికిపది కలిపించి మూర్తికి చెప్పింది కాత్యాయని. మూర్తి వాణ్ణి బెల్టుతో చావబాదాడు. మూర్తి వెళ్లాక మామూలే- ''నన్ను కొట్టిస్తావా? చూస్తూండు నీమీద నాన్నకి ఏదోఒకటి కల్పించి చెప్పి చితక్కొట్టిస్తాను'' అంటూ వాడు వీరభద్రావతారంతో వంటగదిలోని గిన్నెలూ, గ్లాసులూ, డబ్బాలు విసిరికొడుతూంటే తులసి హడలిపోయింది.

వాణ్ణి శాంతింపచేయడానికి భారతికి అరగంట సమయం పట్టింది.

''ఒరేయ్... నువ్విలా అల్లరి చేశావంటే నేను అమ్మలా బావిలోపడి చచ్చిపోతాను'' అంటూ భారతి ఏడవడంతో వాడు దిగివచ్చాడు.

''అమ్మా... అమ్మా... మమ్మల్నెందుకు కన్నావే? మమ్మల్ని వదిలి నువ్వెందుకు చచ్చిపోయావు? మా మనసులకి ఒక్కరోజు కూడా సంతోషం లేదమ్మా. ఎప్పుడూ దిగులే. ఎప్పుడూ భయమే. ఒక్కసారి కూడా సంతోషంగా నవ్వుకోవడం లేదమ్మా. నువ్వుంటే మేమిలా వుండేవాళ్లమ్మా? తమ్ముడు చూడమ్మా ఎంతలా పాడయిపోతున్నాడో? నాన్న మమ్మల్ని పట్టించుకోవడంలేదమ్మా...'' చాలారోజుల తరువాత తల్లిని తలచుకుని భారతి కుమిలి కుమిలి ఏడుస్తూంటే- ''అక్కా ఏడవకే! ఇంకెప్పుడూ నేను అల్లరి చెయ్యనే. పోనీ నన్ను హాస్టల్లో చేర్పించెయ్యమని నాన్నతో చెప్పవే...'' దీనంగా అంటూ వాడు వెక్కివెక్కి ఏడ్చాడు- ''నాన్న తనమాట వింటాడనేగా ఆవిడ...''

భారతి ఏడుపు మరింత ఉధృతమైంది- ''చందూ నువ్వు చెడిపోతున్నావురా. శ్రద్ధగా చదువుకోవటంలేదు. ఎప్పుడూ ఏదో గొడవ కావాలి నీకు. అమ్మ పెద్దదికదురా. ఓమాట అన్నా ఓ దెబ్బ కొట్టినా తప్పేమిటి?''

''ఛీ... ఆ దయ్యం అమ్మా? అమ్మకాదు...'' అంటూన్న వాడి చెంపమీద బలంగా కొట్టింది భారతి.

ఇప్పుడదంతా గుర్తొచ్చి కళ్లనీళ్ళు నిగ్రహించుకుందామన్నా సాధ్యం కాలేదు భారతికి. ఆపూట చదువుమీద మనసు లగ్నం చెయ్యలేకపోయింది.

అది గమనించి పుస్తకం మూసేస్తూ ''భారతీ! నువ్వు తెలివైన అమ్మాయివని అనుకున్నాను నేను'' అంది సౌదామిని.

భారతి చప్పున సౌదామినివైపు చూసింది. ఆమె మొహం సీరియస్‌గా ఉంది.

''ఏమయిందక్కా?'' ఆమె అలా ఎందుకు మాట్లాడుతోందో అర్థంగాక విస్మయంగా అడిగింది. ''నీకు తల్లిలేదని, సవతితల్లి వుందని నాకు నువ్వు ఇక్కడికి రాకముందే మాస్టారు ద్వారా తెలుసు. నిన్ను నేను మీ కుటుంబ వివరాలు అడుగుతున్నప్పుడు నువ్వు ఆ

విషయం చెప్పకపోవడం నాకు ఆనందం కలగజేసింది. ఎందుకో తెలుసా? సవతితల్లిని గురించి ప్రత్యేకంగా చెప్పాలని నీకు అనిపించకపోవడంవలన. కానీ, నాకిప్పుడు తెలుస్తోంది... బయటివాళ్లు ఎవరైనా నీ సవతితల్లిని గురించి అడిగితే నువ్వు ఆమెను గురించి వ్యతిరేకంగా చెప్పడానికి వెనుకాడవేమో''

ఈ ఆరోపణకి భారతి తెల్లబోయింది.

''ఏం? కాదా? మా పిన్ని నీ సవతితల్లి గురించి అడిగిందే అనుకో. నువ్వు కళ్లనీళ్లు ఎందుకు పెట్టుకోవాలి? నువ్వు నోరువిప్పి ఆమె మీద ఏమీ చెడ్డగా చెప్పకపోవచ్చు. నీ కన్నీళ్లు మాత్రం నిన్ను నీ సవత్తల్లి వేధిస్తోంది. అన్న విషయం అడిగినవాళ్లకి చెప్పకనే చెబుతున్నాయి- కాదంటావా?''

భారతి తలవంచుకుంది.

''నీ తల్లి స్థానంలోకి వచ్చిన ఆ స్త్రీ ఎలాంటిదైనా కావచ్చు. మీ వ్యక్తిగతమైన గొడవల్ని మీవరకే పరిమితం చేసుకోవాలి. వాటిని గురించి బయటివాళ్లకి తెలిసేలా చేశారనుకో దానిమూలంగా నష్టపోయేది ఎవరు? ఎవరో కాదు... మీరే! ఎలాగో చెప్పనా? ఇప్పుడు నువ్వు కళ్లనీళ్లు పెట్టుకున్నావా? జాలితో పిన్ని హృదయం ద్రవించిపోయింది. ఆవిడ రేపువెళ్లి ఆ అంబుజమ్మో జంబుజమ్మో ఆవిడతో 'నువ్వు చెప్పింది నిజమే సుమీ. సవత్తల్లి పేరెత్తగానే ఆ పిల్ల భోరున ఏడ్చింది' అంటుంది జాలిగా. ఆ జంబూకమ్మ వెళ్ళి 'నువ్వు నీ సవతికూతుర్ని రాచిరంపాన పెడుతున్నావటగదా? ఈ విషయం ఆ పిల్ల బయటంతా చెప్పుకుంటోంది. గుళ్లల్లోనూ, కుళాయిల దగ్గరా, ఈ కథని వింతగా చెప్పుకుంటున్నారమ్మా ఆ పిల్లను కాస్త అదుపులో పెడుదూ' అంటూ మీ పిన్ని మెప్పుకోసం మరో నాలుగు కల్పించి చెబుతుంది. అప్పుడేమవుతుంది? నీ సవతితల్లికి నీపట్ల వున్న అయిష్టమో, కోపమో రెట్టింపుకాగా తన గురించి పదిమందీ ఓ రాక్షసిలా చెప్పుకుంటున్నారన్న బాధతో మనశ్శాంతిని కోల్పోయిన ఆమె నిన్ను వీలయినన్ని ఎక్కువ మార్గాలద్వారా సాధించడం చేస్తుంది. దీని మూలంగా బాధపడేది నువ్వు మీ కుటుంబసభ్యులూ. ఇంట్లో అశాంతి ప్రారంభమవుతుంది. మా పిన్నీ అంబుజమ్మా ఇంకో పుల్లమ్మా ఈ విషయాన్ని గురించి కథలు కథలుగా చెప్పుకుంటూ మీ వెనక నవ్వుకుంటూ వుంటారు. కాదంటావా? ఆలోచించు'' నెమ్మదిగా చెప్పింది సౌదామిని.

సంభ్రమంగా చూసింది భారతి. తమ కుటుంబపరిస్థితుల్ని గురించి ఏమాత్రం తెలీని సౌదామిని ఇప్పుడు చెప్పింది ప్రస్తుతం తమ ఇంట్లో జరుగుతూన్న కథని గురించే.

''నిన్ను మీ రెండోతల్లి ఒకమాట అనవచ్చు. ఓ దెబ్బ కూడా వెయ్యొచ్చు. ఎప్పుడైతే నువ్వు ఈ విషయాన్ని నీలోనే వుంచుకుని బయటివాళ్లకి మీ విషయాల్లో కల్పించుకునే అవకాశం ఇవ్వకపోతావో అప్పుడు క్రమక్రమంగా మీ ఇంట్లో గొడవలూ ఒకరిపట్ల ఒకరికి ఉన్న వ్యతిరేకతలూ, అయిష్టాలూ తగ్గుముఖం పడతాయి...'' అంది సౌదామిని.

''నేనెవరితోనూ మా ఇంటివిషయాల్ని గురించి చెప్పనక్కా''

''నువ్వు చెప్పకపోవచ్చు భారతీ! వాళ్లు అడిగినప్పుడు వాళ్లకేమాత్రం అవకాశం ఇవ్వరాదు నువ్వు. మా సవతితల్లికేం? నన్ను బాగా చూసుకుంటుంది... అను. రెండోసారి వాళ్లు నిన్ను ఈ విషయంగురించి అడగడానికి సందేహిస్తారు. ఏ సవతితల్లీ స్వతహాగా చెడ్డది కాదు భారతీ. ఏ మనిషినీ కన్నీళ్లతో, సాధింపులతో కట్టేసుకోలేం. ప్రేమతో మాత్రమే కట్టేసుకోగలం. నీ ధోరణినిబట్టి మిమ్మల్ని మీ సవతితల్లి తులసి ఆదరంగా చూడడంలేదని అర్థమవుతోంది. పోనీ నువ్వెప్పుడైనా ప్రేమగా ఆమెకి దగ్గరకావడానికి ప్రయత్నించావా? బాగా ఆలోచించి చెప్పు?''

భారతి ఆలోచనలోపడింది. భారతికి తన నాయనమ్మ, సవతితల్లి ఇంటికి రాకముందే ఆవిడ కలిగించిన భయాలు గుర్తొచ్చాయి. ఏనాడూ తనుగానీ, చందూగానీ నాయనమ్మ వుండగా ఆమెకి దగ్గరకావడానికి ప్రయత్నించలేదు. తమని దగ్గరికి తీసే ప్రయత్నం ఆమె చెయ్యనూలేదు. అదే చెప్పింది సౌదామినితో.

''తప్పు ఇద్దరిలోనూ ఉంది భారతీ. మగాడికి రెండోభార్యగా వచ్చే స్త్రీ ఎలాంటిపరిస్థితుల్లో




వస్తుందో తెలుసా?'' అంటూ ఆమె విపులంగా, వివరంగా చెప్పడం ప్రారంభించింది.

వదిహేనేళ్లు నిండుతూన్న భారతికి రెండో పెళ్లి భర్తను చేసుకున్న స్త్రీ ఏవిధంగా ప్రవర్తిస్తుంది? ఆ ప్రవర్తన వెనకవున్న కారణాలు ఏమిటి? అన్న వాటినిగురించి చెబుతూంటే తన నవతితల్లి ప్రవర్తన కళ్లెదుట కనిపించినట్టయింది. ఆమె చాలా విభ్రమంగా వినసాగింది. రెండోపెళ్లి చేసుకున్న భర్త కొత్త భార్యకి ఏవిధంగా దానుడవుతాడో, అతగాడు తాత్కాలికంగా తన పిల్లల మంచిచెడ్డల్ని గురించి విస్మరించడం అన్నది ఎందుకు జరుగుతోందో, ఇరుగూ పొరుగూ ఆ కుటుంబంవట్ల ఎలాంటి ఆనక్తిని ప్రదర్శిస్తారో ఇవన్నీ కలిసి తల్లిని కోల్పోయి నవతితల్లి సంరక్షణకిందకి వచ్చిన పిల్లలమీద ఎలాంటి ప్రభావాన్ని చూపిస్తాయో, తత్ఫలితంగా పిల్లలు ఆమెకి ఏవిధంగా దూరం అవుతారో, తన అసంతృప్తులన్నింటినీ అణుచుకోలేని ఆ స్త్రీ తన ప్రథమ శత్రువులుగా పిల్లల్ని భావిస్తూ వాళ్లని ద్వేషించడం అన్నది ఎలా మొదలవుతుందో చాలా వివరాతివివరంగా చెప్పింది సౌదామిని.

చెప్పి ''నవతి పిల్లలకి తనుగా దగ్గరకావడానికి ఆ స్థానంలో వున్న స్త్రీ చాలా సందేహిస్తుంది. అదేనమయంలో అర్థంలేని భయంతో పిల్లలూ తొలగిపోతూంటారు. మిగతా పరిస్థితులూ ఈ ఇద్దరినీ శత్రువులుగా మారుస్తాయి. ఈ ఇద్దరిలో ఏఒక్కరూ ముందుకు అడుగువేసి నహనంతో ప్రేమనీ, అభిమానాన్నీ వ్యక్తపరచగలిగితే రెండోవాళ్లు దానికి లొంగిపోకతప్పదు'' అన్నది సౌదామిని.

భారతి ఉద్వేగ్నంగా ''అక్కా... నా కథ నీకు చెప్పాలనుకున్నాను. కానీ, నేను చెప్పకముందే కళ్లతో చూసినట్టు నువ్వే చెప్పేశావు. మేము అమ్మా అని పిలవడంకూడా ఆవిడకి ఇష్టంవుండదు'' అంది దిగులుగా.

''ఎలా ఇష్టపడదో చూద్దాం భారతీ! నువ్వు ఓపిగ్గా, ప్రేమగా ఆమె అభిమానం నంపాదించి అమ్మా అని పిలిచిచూడు. అప్పటికీ కాదంటే నువ్వు పిలవనక్కరలేదుకూడా. పెళ్లి కాకుండా పెళ్లికోనం ఎంతగానో తపించి, ఆలస్యంగా పెళ్లి చేసుకుని వచ్చిన యువతి ఒక్కసారిగా ఎదిగిన పిల్లలు తనని అమ్మా అని పిలవడం సాధారణంగా నహించలేదు. ఇది నువ్వు గుర్తించాలి. ఇప్పుడు నువ్వు నీ ప్రేమతో కట్టేనుకోవాలి...'' సౌదామిని భారతి నవతితల్లిని గురించి తెలుసుకోవడానికి ఆనక్తిని ప్రదర్శించలేదు.

ఇంచుమించుగా ఏ నవతి తల్లీ పిల్లల కథయినా ఒకేలా వుంటుందని ఆమెకి తెలుసు. అయితే తులసిలాంటి వారి మనన్తత్వానికి పూర్తి భిన్నమైన మనస్తత్వం గల స్త్రీలు కూడా వుంటారు. అలాంటి ఓ మాతృమూర్తిని ఆమె కళ్లారా చూసింది. అదే చెప్పింది భారతితో.

''భారతీ... నీకు నేను ఓ నవతితల్లి గాని నవతితల్లి గురించి చెబుతాను వింటావా?''

''చెప్పక్కా''

''మా చిన్నతనంలో మా వూరికి ట్రాన్స్‌ఫర్ అయి వచ్చాడు ఓ పోలీసు కానిస్టేబుల్. అతడికి భార్యా ముగ్గురు కూతుర్లూ వుండేవాళ్లు. అతడి భార్యకి తన కూతుర్లంటే పంచప్రాణం. ఆవిడ పిల్లలపట్ల కనబరిచే అభిమానాన్ని మా పెద్దవాళ్లంతా చాలా విచిత్రంగా చెప్పుకుంటూండేవాళ్లు...

''ఆవిడిదంతా అతిప్రేమ, పిల్లల్ని చెడిపేంతగా వాళ్లని గారాబం చేస్తుంది'' అంటూండేవాళ్లు.

దానికి తగినట్టుగానే వుండేది ఆవిడ పద్ధతి కూడా. ఆవిడపేరు జయలక్ష్మి. జయలక్ష్మి కూతుర్లు వరుసగా పదకొండూ, తొమ్మిదీ, ఏడూ నంవత్సరాల వయసులోఉండేవాళ్లు. పెద్దమ్మాయికి సైతం మంచినీళ్లు కూడా తనుగా ముంచుకుని తాగలేనంతగా గారాబం చేసేది. వాళ్ల ఏకోరికా కాదనేదికాదు. వాళ్లు కోరితే అది టి.వి.గానీ, మరోటిగానీ రోజు తిరక్కముందే ఇంట్లోకి రావాల్సిందే. అందరూ విడ్డూరంగా చెప్పుకునేవారు. తరువాత నిదానంగా తెలిసింది మాకు, జయలక్ష్మి ఆ పిల్లలతల్లికాదు. నవతితల్లి. ఈ విషయం తెలిసి ఆ చుట్టపక్కలవాళ్లంతా షాక్ తిన్నంతగా ఆశ్చర్యపోయారు. ఆ పిల్లలకీ ఆ తల్లంటే చెప్పలేనంత ప్రేమ. ఇంకో నత్యం ఏమిటంటే... ఆ పిల్లల తండ్రి ఆమెని పెళ్లికూడా చేసుకోలేదు. నమాజం భాషలో చెప్పాలంటే వుంచుకున్నాడు. ఆమె గత జీవితం గురించి ఎవరికీ



తెలీదు. ఈ విషయం మాత్రం ఎలాగో తెలిసింది...

ఇంకా చిత్రమైన విషయం ఏమిటంటే, జయలక్ష్మి తల్లీ, తండ్రీ, తోబుట్టువులూ చాలా తరచూ కూతురిదగ్గరికి వస్తూండేవాళ్ళు. ఎందుకో తెలుసా? పిల్లల్ని చూడటంకోసం. వాళ్లంతా పిల్లల్ని అంతగా ప్రేమించడం చూసేవాళ్లకి చాలా సంభ్రమాన్ని కలిగించేది. జయలక్ష్మి భర్త తాగుబోతు. తాగివచ్చి భార్యని కొడుతూండేవాడు.

అతడితో విసిగిపోయిన ఆమె ఇరుగూపొరుగూతో- "ఈ ముదనష్టపోడితో వేగలేకపోతున్నాను. ఏనాడో పారిపోయివుందును. ఈ బిడ్డలు నా కాళ్లకి బంధాలైపోయారు" అంటూ కళ్లనీళ్లు పెట్టుకునేది.

పెద్దమ్మాయి ఏ కారణం చేతో చిక్కిపోతోంటే "ఈ అమ్మాయి ఎందుకు ఇలా చిక్కిపోతోంది? ఎదగాల్సిన పిల్ల ఇలా నన్నబడితే ఎలా?" అంటూ దిగులుపడేది.

ఆ అమ్మాయిని హాస్పటళ్ల చుట్టూతిప్పేది. నమ్మశక్యంగా అనిపించడం లేదు గదూ భారతీ? కానీ ఇది నిజం నాకళ్లారా చూసిన ఓ సవతితల్లీ పిల్లల జీవితం. నేనే రచయిత్రిని అయివుంటే జయలక్ష్మి జీవితంమీద ఒకథ రాసి వుండేదాన్ని. చాలామంది అనుకునేవాళ్లు జయలక్ష్మికి పిల్లలు పుడితే సవతిపిల్లల మీద ప్రేమ తగ్గుతుందేమోనని. ఇంతలో ఆమె గర్భవతి అయింది. కొడుకు పుట్టాడు ఆమెకి.

"ఇక ఈ పిల్లలపని సరి. కొడుకు పుట్టాడు గదా?" అనుకున్నారు.

వీళ్ల ఊహాగానాల్ని అబద్ధంచేసింది ఆమె. ఆడపిల్లల పట్ల ఆమె ప్రేమ వీసమెత్తయినా తగ్గలేదు. తరువాత జయలక్ష్మివాళ్లు ట్రాన్స్‌ఫర్ అయిపోయారు. ఆమధ్య గుంటూరు రైల్వేస్టేషన్‌లో కనబడింది నాకు. నేనే గుర్తుపట్టి పలకరించాను. ఇప్పుడామె భర్త యస్సయ్ అయ్యాడు. ఇద్దరమ్మాయిలకి మంచి సంబంధాలు చూసి ఘనంగా పెళ్లిళ్లు చేసింది. ఆఖరి అమ్మాయి యమ్.బి.బి.యస్ చదువుతోందిట. ఈ విషయాలన్నీ సంబరంగా చెప్పుకొచ్చింది. జయలక్ష్మిని గురించి తలచుకున్నప్పుడు ఒక్కోసారి నాకు ఒళ్లు జలదరిస్తుంది. మాతృత్వాన్ని పొందడం గొప్పకాదు. మాతృభావన, మమకారం ముఖ్యం అన్న సత్యం బోధపడుతుంది ఆమెను చూస్తుంటే.

చూశావా? ఆ తల్లీ పిల్లలు ఒకర్నొకరు ప్రేమించుకోబట్టి వాళ్ల జీవితంలో కలతలు లేవు. ద్వేషాలులేవు. వాళ్ల కుటుంబంలో అశాంతిలేదు. ప్రతి సవతితల్లీ జయలక్ష్మిలా వుండకపోయినా సవతితల్లి కూడా మనిషే భారతీ. నువ్వు మీ తమ్ముడూ మీ సవతితల్లిని ప్రేమించడం ప్రారంభించండి. ఆమెలో మార్పు ఎలా రాదో అదీ చూద్దాం" సౌదామిని భారతికి అర్థమయ్యేలా సుదీర్ఘంగా చాలా విపులంగా చెప్పింది.

భారతి ఆలోచనలో పడింది. తనకి తన సవతితల్లిపట్ల ప్రేమ వుందా? తనని తాను ప్రశ్నించుకుందా అమ్మాయి. స్పష్టమైన సమాధానం వచ్చింది లేదు.... భయం.. భయం... తప్ప అభిమానంలేదు. చందూ తెలిసీ తెలీని తనంతో తులసి మీదికి తిరగబడగలుగుతున్నాడు. తాను కాస్త పెద్దదిగాబట్టి మొదట్నించీ ఆమెపట్ల భయం వుండబట్టి తండ్రి ఆమె మాటలు తప్పక ఆలకిస్తాడన్న భయంతో ఒదిగి ఒదిగి వుండడం చేర్చుకుంది. ఇలా ఆలోచిస్తుంటే భారతికి చాలా సిగ్గుగా అనిపించింది. తాము రెండో అమ్మని ఇష్టపడక పోతే ఆమె తమని ఎలా ప్రేమగా చూడగలదు? ఇప్పుడు భారతికి తులసి ప్రవర్తన వెనక వున్న బాధ ఆమె మనసూ అర్థమవుతూన్నట్టనిపించింది. ఆమెకి తమంటే ఎందుకు పడదు? అన్న ప్రశ్నకి సమాధానం దొరుకుతూన్నట్టనిపించింది.

సౌదామిని మాటలూ ఆమె చెప్పిన విషయాలూ భారతి ఆలోచనా పరిధిని విస్తృతపరిచాయి. సాయంత్రం నాలుగ్గంటలప్పుడు సౌదామిని ఇంటికి వచ్చిన భారతి చాలా ఆలస్యంగా ఎనిమిదిన్నరప్పుడు ఇంటికి బయలుదేరింది. భారతికి ఓ విషయం గుర్తొచ్చి చాలా సిగ్గుకలిగింది. సౌదామిని దగ్గర ట్యూషన్ కోసం చేరి నెలరోజులు దాటింది.

ఆ సాయంత్రం ఆమె వస్తున్నప్పుడు ఇదిగో

ట్యూషన్ ఫీజు అంటూ ఇచ్చింది తులసి.

భారతి వద్దనలేదు. సౌదామిని ఫీజు తీసుకోదు అన్న విషయం ఇంట్లో చెప్పడం ఆమె మరిచిపోయింది. భారతికి అప్పుడుకూడా ఆ విషయం ఇంట్లో చెప్పాలని అనిపించలేదు. ప్రతిపైసాకి తులసిముందు చెయ్యిచాపాల్సిన పరిస్థితి గుర్తు వచ్చిందామెకి. ఈ డబ్బు తన దగ్గరుంటే అవసరాలకి ఉపయోగపడుతుందనిపించింది భారతికి. వెంటనే ఆ డబ్బు తీసి తన దగ్గరవుంచుకుంది. అందుకు భారతి ఇప్పుడు సిగ్గుపడింది. ఇందులో రెండు తప్పులున్నాయి. ఇంట్లో వాళ్లని మోసం చెయ్యడం ఒకటి. సౌదామిని మంచితనం గురించి ఇంట్లో వాళ్లకి తెలీనీకపోవడం రెండోది.

భారతి అనుకుంది "ఇదే సవతితల్లిగాక అమ్మతో అయివుంటే తను నిజం చెప్పకపోయేదా?"

సౌదామిని ప్రభావంతో ఆమె ఆలోచనల్లో వచ్చిన గొప్పమార్పు అది. భారతి ఆ డబ్బు సవతితల్లికి ఇచ్చివేయదలచుకుంది. ఇంటికి వస్తున్నప్పుడు ఆమెకి ఓ పండ్ల దుకాణాన్ని చూసి ఓ విషయం గుర్తొచ్చింది.

"పుల్లని వస్తువులు మీదకి మాటిమాటికీ మనసు పోతోంది. నేనా ఇల్లు వదిలి బయటికి కదలడంలేదు. ఏదైనా పట్టుకురమ్మంటే ఆయనకి గుర్తుండడంలేదు" అంటూ తులసి కాత్యాయనితో చెప్పడం.

భారతి తన దగ్గరున్న డబ్బులోంచి ఓ అయిదురూపాయలు తీసి ద్రాక్ష కొన్నది. భారతి వచ్చేసరికి తులసి వీధిగుమ్మంలోనే ఆతృతగా ఎదురు చూస్తుంది. భారతిని చూడగానే విరుచుకుపడింది.

"నాలుగ్గంటలప్పుడు వెళ్లినదానివి ఇప్పుడా రావడం? ఎదుగుతూన్న ఆడపిల్లవా, గాడిదవా? ఎంత ఇప్పుడు సమయం?"

భారతి మాట్లాడలేదు. ఆమెనే చూస్తూ నిలబడింది.

"ఏమిటా నిలువుగుడ్లువేసుకుని చూడటం? ఎంత హడలిచచ్చానో తెలుసా? మీ నాన్న చూస్తే ఇంకా రాలేదు. నీకు హద్దూపద్దూ లేకుండాపోతోంది. బోడిచదువు. నువ్వు చదివి ఉద్యోగాలుచేసి వూళ్లు ఎలాల్నా?" తులసి పెద్దకంఠంతో అరుస్తూంటే...

"ఆలస్యం అయిందమ్మా" అంది భారతి నెమ్మదిగా, మృదువుగా.

ఇప్పుడు అమ్మా అని ఆమెని సంభోదించడానికి భారతికి భయంగా అనిపించలేదు. 'అమ్మా' అన్న ఈ పిలుపువిని కనుబొమలు ముడివేసి తీవ్రంగా ఏదో అనబోతూన్న తులసి చేతికి డబ్బు ఇస్తూ- "ఫీజు వద్దంది ఆమె" అంది.

తులసి డబ్బు అందుకుని లెక్కించి కనుబొమలు ముడివేసి- "అయిదు రూపాయలు తగ్గాయేమిటి?" అంది.

భారతి తన చేతిలోని ద్రాక్షపొట్లం అందించింది.

"ఏమిటిది?"

"ద్రాక్ష"

"ఎందుకూ?" అర్థంగాక అంది.

"నువ్వు పుల్లగా ఏదైనా తినాలని వుందన్నావుగా ఉదయం, అది గుర్తొచ్చి తెచ్చాను"

తులసి చాలా ఆశ్చర్యంగా చూసింది. అప్రయత్నంగా చెయ్యి చాచి అందుకుంది.

భారతి లోపలికి వెళ్ళిపోయింది. తులసి తన చేతిలోని పొట్లంవైపూ, వెళుతున్న భారతి వైపూ విస్మయంతో చూసింది.

"అబ్బో. నిన్ను బాగా బుట్టలో పెడుతోందే నీ కూతురు" అంది అక్కడే వున్న కాత్యాయని.

తులసి ఏమీ మాట్లాడలేదు. భారతి ఎందుకో చాలా కొత్తగా అనిపించిందామెకి. ఇంతలో మూర్తి వచ్చాడు.

తులసి చేతిలోని ద్రాక్షని చూసి- "సారీ తులసీ! ఈరోజు కూడా మర్చిపోయాను. ఎవరి చేత తెప్పించుకున్నావు?" అడిగాడు.

తులసి సమాధానం అయితే చెప్పలేదు గానీ ట్యూషన్ పేరిట భారతి ఆలస్యంగా వస్తూన్న వైనాన్ని పెద్ద కథగా భర్తకి చెప్పాలన్న తన ఆలోచనని మర్చిపోయింది తులసి.

★ ★ ★

"భారతీ! నీలో నీ వయసు పిల్లలకి వుండాల్సిన హుషారు, చురుకుదనం బొత్తిగా లేవు.





ఇలా వుండకూడదు. ఈ మందకొడితనం నలుగురిలో నిన్ను ఒంటరిని చేస్తుంది. క్రమంగా ఇది ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌గా అభివృద్ధి చెంది శాశ్వతంగా నిన్ను తనకి బానిసగా చేసుకుంటుంది. అప్పుడు నీకు మిత్రులూ, సన్నిహితులూ అంటూ ఎవరూ వుండరు. నువ్వు ఎప్పటికీ ఎవరితోనూ కలవలేవు. నువ్వు అనవచ్చు... మా అమ్మ పోయినప్పటినుండి ఇలా అయిపోయాను అని. కానీ, నువ్వు ఈ పరిస్థితినుండి బయటికి రావాలి. వీలయినంతగా నీ స్నేహితుల సంఖ్యని ఎక్కువ చేసుకోవాలి. నా మాటలు అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు. నువ్వు ఒంటరిదానివి, ఎవరికీ అవసరం లేనిదానివి అన్న ఆత్మనూన్యతాభావాన్ని వదిలివేయడానికి ప్రయత్నించు...'' అందోరోజు సౌదామిని.

భారతికి చెప్పుకోదగిన స్నేహితులంటూ ఎవరూ వుండేవాళ్ళు కాదు. ఎవరితోనూ స్నేహం పెంచుకునేది కాదు. పెంచుకుంటే వాళ్ళెక్కడ ఇంటికి వస్తానంటారోనన్న భయం. వాళ్ల ముందు సవతితల్లి చులకనగా మాట్లాడుతుందన్న సందేహం. ఆమె ఒంటరితనాన్ని కోరుకునేది. అందుకే ఆమెకి స్నేహితులంటూ ఎవరూ లేరు.

ఆరోజు మొదటిసారిగా మాటల సందర్భంలో క్లాసులో తన బెంచ్‌మేట్ కాస్త ఎక్కువగా తనతో మాట్లాడే శ్రీలతని పిలిచింది ''మా ఇంటికి వస్తావా లతా? నువ్వడిగిన నోట్ బుక్ ఇస్తాను''

శ్రీలత చాలా ఆశ్చర్యంగా చూసింది. భారతి స్వయంగా తమ ఇంటికి రమ్మని పిలవడమా? ఏనిమిదో వింత. శ్రీలత ఉత్సాహంగా ఒప్పుకుంది. తొలిసారిగా ఓ స్నేహితురాలిని భారతి ఇంటికి తీసుకొచ్చింది.

తులసిని శ్రీలతకి చూపిస్తూ- ''మా అమ్మ'' అంటూ చూపించి- ''అమ్మా! నా స్నేహితురాలు'' తులసితో చెప్పింది.

అమ్మ అన్న ఈ పదం చురుక్కుమనిపించినా ''నమస్తే ఆంటీ'' మర్యాదగా నమస్కరిస్తూన్న కొత్తమ్మాయి ముందు ఏమీ అనలేక ''నీ పేరేమిటి?'' అడిగింది తులసి.

''శ్రీలతండీ'' చెప్పి భారతితో- ''భారతీ! మీ అమ్మ చాలా చిన్నగా వున్నారే? నీ అంత కూతురుందంటే ఎవరూ నమ్మరు? చాలా బావున్నారు కూడా'' అంది శ్రీలత.

భారతి నవ్వింది. ఈ మాటలు తులసి కూడా విన్నది. తను చాలా చిన్నదిగా, అందంగా వుందన్నమాట. ఆమెకి చాలా ఆనందాన్ని కలగజేసింది. తులసి మరో విషయం కూడా గ్రహించింది. భారతికి తాను సవతితల్లి అన్న విషయం ఈ స్నేహితురాలికి తెలీదు. భారతి చెప్పలేదు. ఇంటి విషయాలు బయటి స్నేహితురాళ్ళకి భారతి చెప్పదేమో.

భారతి కూడా తన సవతితల్లి తనని తన ఫ్రెండ్‌ముందు ఏదో సాకున చిన్నబుచ్చకపోవడంతో మనసులోనే ఆనందించింది. తులసి శ్రీలతతో ఆదరంగా మాట్లాడింది. తినడానికేదో పెట్టింది. కాఫీచేసి ఇచ్చింది.

ఆ అమ్మాయి వెళుతూంటే ''అప్పుడప్పుడు వస్తూండు'' అనికూడా అంది.

''తప్పక వస్తానండీ! భారతి తనకి ఇంత మంచి చక్కని అమ్మ వుందని ఎప్పుడూ చెప్పలేదు'' అంది మాటకారి అయిన శ్రీలత కాస్త నిష్ఠూరంగా.

''నీకు ఒకేసారి చూపించాలనుకున్నాను'' అంది భారతి.

శ్రీలత వెళ్ళిపోయాక తులసి ఆరోజంతా ఉత్సాహంగా వుండడాన్ని భారతి గమనించింది. ఇప్పుడు భారతికి తులసి కొంచెం కొంచెం అర్థంఅవుతోంది. భారతి తులసికి దగ్గరకావడానికి తనవంతు ప్రయత్నాలు తను చేస్తున్నా అది అంత సులభం ఏమీ కాలేదు.

''ఇది జీవితం భారతీ! సినిమా కాదు... మనుషులు క్షణాల్లో మారిపోయి ఒకర్నొకరు కౌగలించుకోవడానికి, పాటలు పాడుకోవడానికి'' అంది ఓసారి సౌదామిని.

రెండురోజులకొకసారి ''నీ ఒంట్లో ఎలా వుంటోందమ్మా?'' అని అడుగుతుంది.

అయితే ఇదివరకులా ''నన్ను అమ్మా అని పిలవకు'' అని మండిపడలేకపోతోంది తులసి. అదెందుకో ఆమెకే తెలీదు. ఈమధ్య భారతి హుషారుగా కూడా వుంటోంది. భారతి వీలయినంతవరకూ తమ్ముణ్ని దగ్గర కూర్చోబె

ట్టుకుని నవతితల్లికి ఎదురుతిరగవద్దని, చిన్నా పెద్దా లేకుండా మాట్లాడవద్దని, అది చాలా తప్పనీ నచ్చజెప్పడానికి ప్రయత్నించేది. వాడు ఒక్కోసారి వినేవాడు.

ఒక్కోసారి "ఛో... ఆవిడ కంతేకావాలి. అమ్మట బొమ్మ" అనేవాడు.

"చందూ, నువ్వలా మాట్లాడితే నేను నాన్నకి చెప్పి నిన్ను నిజంగా హాస్టల్లో చేర్పించేస్తాను" ఓసారి బెదిరింపుగా అంది.

'చెప్పుకో! నాకింకా హాయి. ఇక్కడికంటే హాస్టలే మేలు" అనేవాడు బింకంగా.

భారతి ఖచ్చితంగా వీలయినంత త్వరగా చందూలో మార్పు తీసుకురావాలనుకుంటోంది. ఓరోజు పార్వతి ఇంటిమీదకి గొడవకి వచ్చింది...

"మీ చందూగాడు మా ఇంట్లో ఆడుకుంటూన్నట్టు ఆడుకుంటూనే మా టేబుల్‌మీదవున్న అయిదు రూపాయలు తీశాడు..." అంటూ.

తులసి భగ్గున మండిపోయింది. వాడు ససేమిరా తను తియ్యలేదంటే తియ్యలేదన్నాడు. అయితే ఈ మధ్య తులసి చందూ జోలికి వెళ్లడానికి భయపడుతోంది. వాడు ఎంతమాటంటే అంతమాట తిరిగి అంటూన్నాడు. దెబ్బలకి సైతం భయపడనంతగా మొండిబారిపోయాడు. ఇప్పుడు తను గద్దిస్తే వాడు పార్వతి ముందు తననేదయినా అంటాడని ఆమె భయపడింది.

చందూ గొంతు ఇంత పెద్దదిచేసి " నీ కొడుకే తీసివుంటాడు. నేను దొంగనా?" అని అరవడం ప్రారంభించాడు.

భారతికి తమ్ముడిమీద ఎప్పుడూ రానంత కోపమూ, దొంగగా ముద్రపడుతున్నాడన్న దుఃఖమూ కలిగాయి. ఇలాంటి సంఘటనలు ఇంతక్రితం రెండుమూడు జరిగాయి.

చందూ దొంగతనాలకి అలవాటు పడుతున్నాడని బయట అనుకుంటున్నారని భారతికి తెలుసు. భారతి లోపలికి వెళ్లి నీళ్లు తోడుకునే బక్కెట్‌కోసం తెచ్చిన కొత్తతాడు తీసుకొచ్చి చందూని కొట్టసాగింది. చిన్నాచితకా దెబ్బలుకాదు, చావుదెబ్బలు. భారతి అలా కొట్టగలదని వూహించని తులసి, పార్వతి, కాత్యాయని బిత్తరపోయారు. చందూకూడా. వాడికి తన అక్క అభిమానం, అనునయం అప్పుడప్పుడూ వినుక్కోవడం తప్ప ఇంతగా కోపం తెచ్చుకోవడం ఎప్పుడూ తెలీదు. అదే సవతితల్లినయివుంటే వాడు నానామాటలూ అనివుండేవాడు. అక్క అంటే వాడికి చాలా అభిమానం.

"అక్కా, కొట్టకే, నన్ను కొట్టకే, ఇంకెప్పుడూ దొంగతనం చెయ్యనే" అంటూ ఏడవడం తప్ప వాడు భారతికి ఎదురు తిరగలేదు.

అంత సులభంగా వాడిని వదల్లేదు భారతి. తులసి శిలాప్రతిమలా చూస్తూ నిలబడింది. భారతి తమ్ముడిచేత పార్వతికి క్షమాపణలు చెప్పించినదాకా వదల్లేదు. చందూ ఒళ్లంతా వాతలు తేలిపోయాయి. లోపలికి వెళ్లి ఆయింట్‌మెంట్ తెచ్చి "వెధవా... వెళ్లు, వెళ్లి వాతలకి మందురాసుకో" అంది.

చందూ ఏడుస్తూ వెళ్లిపోయాడు.

"వీడ్నిలా వదిలేస్తే లాభంలేదు. వీడికేం తక్కువని దొంగతనాలు ప్రారంభించాడు? నాన్నతో చెప్పాల్సిందే" అంటూంటే భారతి కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

తులసి ఇంకా తేరుకోనేలేదు, భారతి ఆ విషయాన్ని అంతటితో వదిలిపెట్టలేదు. ఆ రాత్రి తండ్రికిచెప్పి "వీడు అమ్మమాటకూడా వినడంలేదు నాన్నా. ఓ ఏడాదిపాటు ఏ హాస్టల్లో అయినా పారేస్తేగానీ దారికిరాడు" అంది.

కోపంతో కొడుకుదగ్గరికి వచ్చిన మూర్తి చందూ ఒంటిమీద వాతలు చూసి చప్పున చల్లబడిపోయాడు.

"నాన్నా... నన్ను హాస్టల్లో చేర్పించకు నాన్నా. నేనిక బుద్ధిగా వుంటాను నాన్నా" అంటూ బావురుమన్నాడు చందూ. మూర్తికి కూతురు మీద కోపం వచ్చింది.

"ఏమిటి భారతీ ఈ కొట్టడం? వాడు మనిషనుకున్నావా? పశువనుకున్నావా"? తీవ్రంగా అన్నాడు.

"వాడ్ని నలుగురూ దొంగగా చెప్పుకుంటూంటే భరించలేకపోయాను నాన్నా" అంటూ ఏడ్చింది భారతి.

ఆ రాత్రి నిద్రపోబోయేముందు అనుకుంది




తులసి "ఈ భారతి ఇదివరకటి భారతి కాదు. అత్తగారు బ్రతికివున్నప్పటి భారతి కాదు. ఏదో మార్పు కనిపిస్తోంది. పెద్దది అవడమేకాదు... తెలివితేటలు కూడా అబ్బుతున్నాయి..." అని.

భారతి రెండురోజులు తమ్ముడితో మాట్లాడ లేదు.

మూడోరోజున వాడు అక్క దగ్గరికి వచ్చి భోరున ఏడ్చాడు. "అక్కా... నాతో మాట్లాడవే. నువ్వు మాట్లాడకపోతే నాకు చాలాదిగులుగా వుంది. ఇంకెప్పుడూ దొంగతనం చెయ్యను" అంటూ.

"సరే... అయితే నువ్వు అమ్మకి ఎదురుతిర గకూడదు సరేనా?"

వాడు మాట్లాడలేదు.

"మాట్లాడవేం?" రెట్టించింది భారతి.

వాడు తలూపాడు.

అయితే ఒక్కసారిగా ఏమనిషిలోనూ మార్పు అన్నది... అది చెడుగానీ మంచిగానీ.. రావడం అంత సులభం కాదని తొందరలో తెలిసివచ్చింది భారతికి. అయితే ఆమె ఓపికగా వీలుదొరికినప్పుడల్లా చందూకి నచ్చ జెప్పడానికి ప్రయత్నిస్తూండేది.

★ ★ ★

భారతి నన్నజాజి పూలుకోస్తోంది. పందిరికా స్త ఎత్తుగావుండడంతో పూలు అందక ఆమె మెల్లిగా గోడ ఎక్కింది. గోడ ఎక్కడం తులసి చూస్తే కేకలేస్తుంది. అందుకని ఆమె గబగబ పూలుకొయ్యసాగింది. పూలు కోస్తూన్న భారతి యథాలాపంగా పార్వతివాళ్ల పెరటివైపు చూ సింది. అలా చూసిన భారతి ఉలిక్కిపడింది. పార్వతివాళ్ల తులసికోట పక్కన పార్వతి భర్త రామూర్తి కాత్యాయనిని కౌగలించుకుని ముద్దు పెట్టుకుంటున్నాడు. భారతి తనకళ్లని తానే నమ్మలేకపోయింది. ఆ అమ్మాయికి అసహ్యా మూ సిగ్గూ కలిగాయి.

చప్పున గోడదిగేసింది. ఈ విషయం తుల సికి చెబుదామా వద్దా అనుకుంది. తను చూ సిన దృశ్యం చాలా తప్పుగా అనిపించింది భారతికి. ఈమధ్య పార్వతి ఇంటికి కాత్యాయని ఎక్కువగా వెళ్తుండడం గంటలతరబడి అక్కడ గడుపుతూండడం గుర్తొచ్చింది. భారతి ఇంకేమీ ఆలోచించక గబగబ ఇంట్లోకి వచ్చింది. తులసి తీరిగ్గా కూర్చుని కొత్త చీరకి ఫాల్ కుట్టుకుంటుంది.

"అమ్మా..."

ఈ పిలుపుకి ఛర్రున తలెత్తి చూసింది తులసి. భారతి మొండికిపడినట్టు అమ్మా అని సంభోదిస్తూన్నా ఆ పిలుపుకి తులసి ఇంకా అలవాటు పడలేకపోతోంది.

"ఏం బొమ్మా..." కోపంగానూ చిరాగ్గానూ అంది.

భారతి అదేమీ పట్టించుకోకుండా "అ మ్మా... కాత్యాయని పిన్నిని పార్వతి వాళ్లింటికి వెళ్లవద్దని చెప్పు" అంది.

"ఏం?" కనుబొమ్మలు ముడివేస్తూ అడి గింది తులసి.

"నేను గోడమీద నుండి నన్నజాజులు కో స్తూంటే పార్వతి పిన్ని భర్త కాత్యాయనిని ముద్దుపెట్టుకుంటున్నాడు..."

తులసి ఉలిక్కిపడింది. మరుక్షణం వేగంగా చాచిపెట్టి భారతి చెంపమీద కొట్టింది.

"అమ్మా..." అంటూ చెంపమీద చెయ్యి వుంచుకుంది భారతి.

"బుద్ధిలేని దానా... నా చెల్లెలి మీద నాకు కథలు కల్పించి చెబుతావా? దాని గుణం ఎలాంటిదో నాకు తెలీదా? నీకేం పొయ్యేబుద్ధి? అదొచ్చినాలుగురోజులుంటే కళ్లల్లో నిప్పులు పోసుకుంటున్నావా? అది నీ బాబు సొత్తు ఏమీ తేరగా తినడంలేదు. బండచాకిరీ చేస్తుంది. వెళ్లు నా కళ్లముందునుండి" అంటూ బు జంపట్టి బయటికి నెట్టింది.

భారతి మౌనంగా అక్కడినుండి వచ్చే సింది. తులసి ఈ విషయం నమ్మకపోవ డంకంటే తాను కట్టుకథ అల్లి చెబుతూన్నట్టు భావించడం భారతికి చాలా బాధని కలి గించింది. భారతి ట్యూషన్‌కి వెళ్లిపోయింది. నిజానికి తులసి ఈ విషయం నమ్మలేదు. భారతి కావాలనే అలాచెప్పిందని భావించిందామె. భారతి అలా అబద్ధం చెప్పా ల్సిన అవసరం ఏముందీ అని ఆమె ఆలో చించలేదు. అందుకు ఆమె దగ్గర సమా ధానం వుండనేవుంది. సవతికూతురు. తనలో



నూ తనవారనుకున్న వారిలోనూ తప్పులు వెద కాలని చూడటం సహజం అని.

కాత్యాయని వచ్చి- ''అక్కా... పార్వతక్కతో సినిమాకి వెళతానే'' అని గారంగా అడిగినప్పుడు తులసి ఏమీ సందేహించకుండా వెళ్ళు అంది.

చందూ కూడా కాత్యాయని వెంట వెళ్ళాడు. ఇంట్లో ఒంటరిగా మిగిలింది తులసి. ఆరు గంటలప్పుడు ఇంట్లో కరెంటుపోయి ఉక్కపోతగా అనిపించడంతో తులసి బయటి వరండాలో వచ్చి కూర్చుంటూండగా వీధి గేటు తీసుకుని ఓ వ్యక్తి లోపలికి రావడం చూసింది.

అతణ్ణి గుర్తుపట్టి తుళ్లిపడింది.

అతడు వస్తూ తులసిని చూసి నవ్వాడు. ''నేను గుర్తున్నానా తులసీ?''

అతణ్ణి చూడగానే తులసిలో భయం ఖంగారూ ఆనందంలాంటి భావాలు ఒక్కసారిగా కలిగాయి. ''భాస్కర్'' అంది గొణిగినట్టు.

''నేనే... ఎంతకాలం అయింది నిన్ను చూసి? నీ అడ్రస్ సంపాదించేసరికి బ్రహ్మప్రళయం అయిపోయింది. ఎలా వున్నావు తులసీ? మనం ఒకర్ని ఒకరం చూసుకుని నాలుగైదేళ్ళయిందేమో కదూ? నీలో అప్పటికీ ఇప్పటికీ మార్పు పెద్దగా లేదు. నీ అందం రెట్టింపైనట్టుంది'' గబగబ మాట్లాడాడతడు.

తులసి భయంగా వీధివైపుచూసింది ''లోపలికిరా'' అంటూ వెళ్ళి వీధిగేటు వేసి వచ్చింది.

అతడు లోపలికి వచ్చి కూర్చున్నాడు. ఇంతలో కరెంటు వచ్చింది.

''నువ్వు పెళ్ళి చేసుకుని వుంటావని నేను అనుకోలేదు తులసీ'' అన్నాడతడు.అతడి చూపులు ఆమెను నిలువెల్లా తడుముతున్నాయి. తులసి తల వంచుకుంది. ఆమె కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

''భగవంతుడు మనల్నిలా దూరంచేస్తాడని కూడా నేను అనుకోలేదు'' చాలా బాధగా అన్నాడతడు.

ఆమె మాట్లాడలేదు.





''నువ్వు పెళ్ళెందుకు చేసుకున్నావు తులసీ?'' ఎంతో ఆవేదనగా అడిగాడతడు. తులసికి ఒక్కసారిగా దుఃఖం వచ్చింది. ''నువ్వు ఆరోజు వెళ్ళిపోయాక ఒక్క ఉత్తరమైనా రాశావా?'' కాస్త రోషంగా అడిగిందామె.

''నాకు స్థిరమైన ఉద్యోగం దొరకలేదు. దొరికాక వచ్చి పెద్దవాళ్ల అంగీకారంతో నిన్ను పెళ్ళిచేసుకోవాలనుకున్నాను''

తులసి మాట్లాడలేదు. ఆమెకి గతం గుర్తొచ్చింది. అప్పుడతడు తమ ఎదురింట్లో అద్దెకి వుండేవాడు. ఏదో ప్రయివేటుకంపెనీలో చిన్న ఉద్యోగం చేస్తూండేవాడు. తమ ఇంటికి కుళాయి నీళ్ళకోసం వచ్చేవాడు. అతడి దగ్గర పుస్తకాలు వుండేవి. తన చిన్న చెల్లెలిని పంపి తెప్పించుకుంటూండేది. అతడి చూపులు ఎప్పుడూ తులసిని వెంటాడుతూ కలవరపెడుతూండేది. అతడు సుస్పురద్రూపి కావడంతో ఆమె మనసు కూడా అతడి వైపు ఆకర్షింపబడింది. ఇది గ్రహించి అతడు పుస్తకాల్లో ప్రేమలేఖలు పెట్టి పంపుతూండేవాడు. తులసి భయం మూలంగా వాటికి సమాధానం అయితే ఇచ్చేది కాదుగానీ తన అంగీకారాన్ని కళ్లతోనే తెలియజేస్తూండేది. తనకి పెద్ద ఉద్యోగంవస్తే ఆమెని పెళ్ళిచేసుకుంటానని అతడు చెబుతూండేవాడు. ఇంట్లో పెద్ద వాళ్లు లేనప్పుడు ఒకటిరెండుసార్లు తులసి అతడితో మాట్లాడింది కూడా. అయితే ఈ విషయం ఎలాగో పెద్దవాళ్లు పసిగట్టారు. తులసిని తిట్టి కట్టడి చేశారు. అతడ్ని ఇంటికి రానీకుండా చేశారు. అతడి ఆకర్షణలో పూర్తిగా మునిగిపోయిన తులసి వెలవెల్లాడిపోయింది.

ఇలాంటి సమయంలో భాస్కర్ ''నేను వూరు వదిలి వెళ్ళిపోతున్నాను. నువ్వు నాతోపాటు వచ్చేస్తే తీసుకెళ్ళి పెళ్ళిచేసుకుంటాను. నామీద నమ్మకంవుంటే ఈ రాత్రి పదిగంటలకి రైల్వేస్టేషన్ దగ్గరికి వచ్చెయ్యి. నువ్వు రాలేకపోయినా నేను కోపగించుకోను. చాలా బాధపడతాను. అయితే నీకోసం వెయ్యి జన్మల వరకైనా వేచివుంటాను. పెద్ద ఉద్యోగం సంపాదించుకొచ్చి మీ వాళ్ల అనుమతితో నిన్ను పెళ్లి చేసుకుంటాను. అని రాసిన ఉత్తరం తులసికి పంపాడు.

అయితే తులసి అతడితో వెళ్ళే ధైర్యం

చెయ్యలేకపోయింది. అందుకు కారణాలు రెండు. ఒకటి... ఆమె మధ్యతరగతి ఆడపిల్ల. మధ్యలో పట్టుబడితేనో ఏకారణంచేతనయినా తిరిగిరావలసివస్తే చాలా చిక్కుల్ని ఎదుర్కోవలసివస్తుందని ఇది పరువు ప్రతిష్ఠలకి సంబంధించిన విషయం అని ఆమెకి తెలుసు. రెండోది... ఆమె టీనేజ్ అమ్మాయికాదు. పాతికేళ్ల యువతి, ముందు వెనకలు ఆలోచించగల విచక్షణవుంది. అందుకే సాహసం చెయ్యలేకపోయింది. అంటే మనసులో అతడిపట్ల ఆమెకి పూర్తి నమ్మకంలేదన్నమాట. భాస్కర్ ఆవూరువదిలి వెళ్ళిపోయాడు.

ఆ తరువాత చాలా రోజులపాటు ఆమె దిగులుపడింది. అతడు ఏనాటికైనా పెద్ద ఉద్యోగం సంపాదించుకుని తప్పక తన కోసం వస్తాడని ఆశగా ఎదురుచూసింది. కానీ, అతడు రాలేదు. కనీసం ఉత్తరమైనా రాయలేదు. అతణ్ణి గురించి ఆమె దాదాపుగా మర్చిపోయి పెళ్ళిచేసుకుని ఓ బిడ్డకి తల్లికూడా కాబోతూండగా ఇలా వచ్చి నెపం మొత్తం ఆమె మీదకి నెట్టాడు భాస్కర్. ఆమె చాలా కలవరపడింది. గతం గుర్తుకువచ్చిఖిన్నురాలైంది. అతణ్ణి చూస్తూంటే తను పోగొట్టుకున్నదేమిటో అర్థమైనట్టు ఆమెలో అశాంతి ప్రారంభమయింది.

"నీకు తెలుసా తులసీ... నేనిప్పుడు వైజాగ్‌లో ఓ పెద్ద కంపెనీలో పనిచేస్తున్నాను. జీతం నాలుగు వేలదాకా వస్తుంది"

ఆమె నమ్మలేనట్టు విభ్రమగా చూసింది.

"ఏం లాభం? నీతో నేను వూహించుకున్న జీవితాన్ని పొందలేని దురదృష్టవంతుణ్ని. నా భార్య నీ అంత అందంగా వుండదు" అన్నాడు.

ఆమె ఉలిక్కిపడి "నీకు పెళ్లయిందా?" అడిగింది.

"పెద్దవాళ్ల బలవంతంతో చేసుకోవాల్సివచ్చింది. ఆ భార్యతో నేను సుఖపడిందీ లేదు. నీ జీవితంలోనూ సుఖంలేదని వయసుమళ్లిన రెండోపెళ్లి వ్యక్తిని చేసుకున్నావనీ విన్నాను. అందుకే నిన్ను వెదుక్కుంటూవచ్చాను. తులసీ... నిన్ను చూస్తూంటే నేను పోగొట్టుకున్నదేమిటో తెలుస్తోంది. తులసీ... మళ్లీ ఇంకోసారి అడుగుతున్నాను. నాతో రాగలవా?" దీనంగా అడిగాడతడు.

తులసి నిర్ఘాంతపోయింది. ఒకనాడు 'జీవితంలో నిన్ను తప్ప మరో ఆడదాన్ని పెళ్లిచేసుకోలేను బ్రహ్మచారిగానైనా మిగిలిపోతానుగానీ' అన్న వ్యక్తి ఈనాడు పెళ్లి చేసుకుని వచ్చి వివాహితురాలైన తనని కోరుకుంటున్నాడు మళ్లీ. అతడి స్వార్థపరత్వం ఆమెకి అర్థం అవుతోంది .

"నేను ఇప్పుడు రెండు కాపులరాలనయినా పోషించగలను" గర్వంగా అన్నాడతడు.

అంటే... తనని ఉంపుడుగత్తెగా రమ్మంటున్నాడన్నమాట?

ఎంత ధైర్యం వీడికి?

తులసికి భరించరానంత ఆగ్రహమూ అసహ్యమూ కలిగాయి.

"భాస్కర్... దయచేసి నువ్వు ఇక్కడినుండి వెళ్లిపో..." తీవ్రంగా అందామె.

భాస్కర్ ఆమె కంఠంలోని తీవ్రతనీ కళ్లల్లో కనబడుతూన్న అసహ్యాన్ని చూసి ఆశ్చర్యపోయాడు.

"కదులు ముందు ఇక్కడినుండి... నీపట్ల నాలో ఏకాస్త గౌరవం అయినా మిగిలి వుందంటే అది ఈక్షణంలో తుడిచిపెట్టుకుపోయింది. నువ్వు అవకాశవాదివి. అప్పుడు నా అమాయకత్వంతో ఆడుకోవాలని చూశావు. ఈరోజు నేనేదో నిస్సహాయస్థితిలో అసంతృప్తిలో మునిగివున్నానని నన్ను మభ్యపెట్టి నీ కోరికల్ని తీర్చుకోవాలని చూస్తున్నావు. నువ్వు ప్రేమికుడివికావు. కాముకుడివి. నీవలలో చిక్కేంత అమాయకురాల్ని కాదు నేను. నువ్వు వూహిస్తూన్నంత దిక్కుమాలిన స్థితిలోనూ లేను. నన్ను ప్రాణంలా భావించే భర్తవున్నాడు. అతడు రెండోపెళ్లి వాడేమోగానీ నువ్వు వూహిస్తూన్నట్టు ముసలివాడేంకాడు. నీకూ నీ ప్రేమకీ నమస్కారం. వెంటనే "వెళ్లిపో..." తన్నుతాను మర్చిపోయి ఆవేశంగా బిగ్గరగా అరుస్తూన్నట్టుంది తులసి.

"తులసీ..." అతడేదో చెప్పబోయాడు.

నువ్వింకేమీ మాట్లాడవద్దు నాచేత అవమానింపబడకముందే వెళ్లిపో..." ఆమె చూపుడు

వేలు గుమ్మంవైపు చూపించింది.

అక్కడ వరండా అరుగుమీద భారతి కూర్చునివుంది.

అడుగుల చప్పుడుకి తలెత్తిచూసింది. తులసి నిర్ఘాంతపోయినట్టు నిలబడింది. భారతి వచ్చి చాలా సేపయిందని తెలుస్తూనే వుంది. అది ఆమె ట్యూషన్ నుండి వచ్చే టైమ్ కాదు. ఏ కారణం చేతనో వెళ్లి వెంటనే తిరిగి వచ్చేసింది. తనకీ భాస్కర్‌కీ మధ్య జరిగిన సంభాషణంతా విన్నది. భయంతోనూ సిగ్గుతోనూ కుంచించుకుపోయింది తులసి. భారతి లేచి ఇంట్లోకి వచ్చింది. తులసి పై ప్రాణాలు పైనే పోతున్నంత భయం కలిగింది. భారతి అంతా విన్నది. ఈ విషయం తండ్రికి చెబితే?

వెంటనే వెళ్లి పెరట్లోనూతిలో దూకి ప్రాణత్యాగం చేద్దామా అన్నంత భయం ఆమెని కమ్మేసింది. భర్తకి తెలిస్తే ఏమిటిగతి? భారతి చెప్పకుండావుంటుందా? ఆమెకి వరసగా తను ఆ ఇంటికి మూర్తి భార్యగా వచ్చినప్పటి నుండి భారతి మీద ఆమె తమ్ముడి మీద సాగించిన కక్షసాధింపు చర్యలన్నీ గుర్తువచ్చాయి. ప్రాణం లేనిబొమ్మలా కూర్చుండిపోయింది తులసి. ఏ మగవాడైనా ఇలాంటి విషయాలకి ఏ విధంగా ప్రతిస్పందిస్తాడో తులసికి తెలుసు. పొద్దుబోయింది. సినిమాకి వెళ్లిన కాత్యాయని చందూ వచ్చారు. కాస్సేపటి తరువాత మూర్తి వచ్చాడు. ముసుగుపెట్టివున్న భార్యనిచూసి ఖంగారుపడ్డాడు. అతణ్ని చూసి ఎప్పుడూ లేనంతగా భయపడిందామె.

"తలనొప్పిగా వుండి పడుకున్నాను" అంటూంటే ఆమె కంఠం వణికింది.

అతడికి భోంచేశానని చెప్పింది. మూర్తి స్నానం చేసి భోజనానికి వెళ్లాడు. మామూలుగా వచ్చి పడుకున్నాడు. భారతిని ఆదరంగానే చేరదీశాడు ఎప్పటిలాగే. భారతి తండ్రికి ఈ విషయం చెప్పలేదు. దాదాపు వారం పాటు ఏ క్షణంలో భారతి అతడికి ఈ విషయం చెబుతుందోనని హడలిపోతూనేవుంది తులసి.

భారతిని తప్పుకు తప్పుకు తిరుగుతోంది. అయితే భారతిలో ఎలాంటి మార్పు లేదు. అసలు ఆ విషయం గుర్తులేనిదానిలా అవసరం వచ్చినప్పుడు తనే వచ్చి సవతి తల్లిని పలకరిస్తోంది. భారతి ఈ విషయం భర్తకి చెప్పదు అన్న నమ్మకం కుదిరాక చాలా ధైర్యంవచ్చింది తులసికి. భారతిపట్ల తొలిసారిగా కృతజ్ఞతాభావం, కొన్ని అభిమానమూ కలిగాయి ఆమెలో. అంతేకాదు, దీన్ని గురించి భారతి ఏమనుకుంటుందోనన్న సిగ్గుకూడా కలిగింది ఆమెకి. భారతి ఆమె అవస్థని గమనిస్తూనేవుంది. ఆరోజు భాస్కర్‌కీ, సవతి తల్లికీ మధ్య జరిగిన సంభాషణ మొత్తం ఆమె విన్నది. విషయం చాలావరకూ భారతికి అర్థమైంది. ఇంకొకప్పుడైతే ఆ సన్నివేశాన్ని ఆ అమ్మాయి ఎలా అర్థంచేసుకుని ఉండేదోగానీ సౌదామిని స్నేహంలో అలవడుతూన్న విశాలమైన ఆలోచనాపరిధి, యుక్తాయుక్త విచక్షణ తులసిని తప్పుపట్టనీయలేదు.

ఆమెస్థానంలో చందూ వుండివుంటే తప్పకుండా జరిగింది జరిగినట్టు తండ్రికి చెప్పి వుండేవాడు. కానీ, భారతిమాత్రం తులసిపట్ల తనకెలాంటి కోపం, అయిష్టం ఏర్పడలేదన్న విషయాన్ని తన ప్రవర్తనద్వారా ఆమెకి తెలియజెయ్యడానికి ప్రయత్నించింది. భారతి మంచితనాన్ని, తనపట్ల కనబరుస్తూన్న అభిమానాన్ని తులసి గ్రహిస్తోంది. తన కృతజ్ఞతని ఆమె పైకి ప్రకటించలేకపోయింది. పైగా ఈ విషయాన్ని ఆధారంగా తీసుకుని భారతి తనని లెక్కచెయ్యకుండాపోతుందేమోనన్న అనుమానం కూడా ఆమెకి కలిగింది. దీనిమూలంగా ఆమె మళ్లీ తను జరిగిన ఈ విషయాన్ని గురించి ఏమీ భయపడటంలేదన్నట్టు బింకంగా ఉండడానికి ప్రయత్నించసాగింది. భారతిని చీటికిమాటికి కేకలువేస్తూండేది.

అయితే ఆమె మాటల్లో, తిట్లలో ఇదివరకటి తీవ్రత కొరవడడం భారతి గ్రహించింది. అధికారం చలాయించడానికి అలవాటుపడ్డ తులసిలాంటి వ్యక్తులు అంత తేలిగ్గా ఓటమిని అంగీకరించలేరు. ఇది ఇలావుండగా ఊహించని మరోసమస్య పెనుభూతంలా ముంచుకొచ్చింది తులసిమీదకి.

అది... కాత్యాయని నెలతప్పడం.

ఈ విషయం తెలిసి హడలిపోయింది తులసి.





"నేనేం చెయ్యనక్కా? రామ్మూర్తి ఓరోజు బలవంతంచేశాడు..." అంటూ నంగి నంగిఏడుపులు ఏడ్చింది కాత్యాయని.

అయితే ఈ మాటల్ని తులసి నమ్మలేదు. ఒకనాడు కాత్యాయని ప్రవర్తనగురించి భారతి చెప్పిన మాటలు వచ్చి నిజం అని అర్థంఅయి పోవడంతో ఆరోజు తను భారతిని అనవస రంగా దండించడం గుర్తొచ్చి చాలా పశ్చాత్తాప పడిందామె.

ఆరోజే నిజానిజాలు తెలుసుకుని కాత్యాయ నిని కట్టడిచేసివుంటే ఇంత ప్రమాదం జరిగి వుండేదికాదని కృంగిపోయింది. నిజంగా ఈ జరిగినదానికి చాలా హడలిపోయింది తులసి. ఓవక్కనుంచి కాత్యాయని ఏడుపు. ఏంచె య్యాలో తులసికి పాలుపోలేదు. ఈ విషయం భర్తకి చెప్పడానికి ఆమెకి ధైర్యంచాల్లేదు.

"నువ్వు మీ వూరికి వెళ్లిపో" అంది.

కాత్యాయని భోరున ఏడుస్తూ - "నువ్వలా అంటే ఏ రైలుకిందోవడి చచ్చిపోతానే అక్కా... నా బుద్ధి గడ్డి తిన్నది... నాన్నకి ఈ సంగతి తెలిస్తే పాతేస్తాడు.... ఈ గండంనుండి నువ్వే నన్ను గట్టెక్కించాలి" అంటూ తులసికాళ్లు పట్టుకుంది.

తనలోతనే మధనపడుతూ రెండురోజులు గడిపింది తులసి.

మూడోరోజు తులసిలోని మార్పుని కనిపెట్టి - "అలావున్నావు ఏమ్మా? ఒంట్లో బావుండ లేదా, హాస్పిటల్‌కి వెళ్లకూడదా?" ఆందోళనగా అడిగింది భారతి.

తులసి కళ్లలో నీళ్లు తిరిగాయి. అదిచూసి మరికాస్త కలవరపడింది భారతి.

"భారతీ ... నీతో ఓ విషయం చెప్పాలి" కళ్లు తుడుచుకుంటూ అంది తులసి.

భారతి కాస్త ఆశ్చర్యంగా "ఏమిటమ్మా అది?" అడిగింది.

కళ్లనీళ్లతో విషయం అంతా చెప్పి - "నా కేంచెయ్యాలో దిక్కుతోచడంలేదు. మీ నాన్నకి తెలిస్తే అసహ్యించుకుంటారు. అదిచూస్తే పె ళ్లికానిది. కళ్ల కావరంతో నెత్తికి తెచ్చుకుంది. ఆరోజు నేను నీ మాటలు నమ్మకపోవడంతో వ్యవహారం ఇంతదూరం వచ్చింది. ఈ గండం గట్టెక్కడం ఎలాగో..." అంది.

భారతికి నోటమాట రాలేదు. ఈ సమస్యనే దో భారతి పరిష్కరించగలదని కాదు తులసి ఆ అమ్మాయికి ఈ విషయం చెప్పింది, తన హృదయభారం దింపుకోవడంకోసం. చిన్నపిల్ల భారతి ఏదోచేసి దీన్నుండి గట్టెక్కించగలదని ఆమె అనుకోలేదు.

అయితే ఆమె వూహించనివిధంగా అప్పు డు మౌనంగా వెళ్లిపోయిన భారతి సాయంత్రం వచ్చి "నేను సౌదామిని అక్కతో ఈ విషయం చెప్పానమ్మా! రేపు కాత్యాయని పిన్నిని తీసుకు రమ్మంది, తనకి తెలిసిన డాక్టర్‌దగ్గర అబార్షన్ చేయిస్తుందట" అని చెప్పింది.

తులసి పట్టరాని ఆనందంతో భారతిని కౌగలించుకుంది.

అప్పుడు చవిచూసింది భారతి చాలా కాలం తరువాత అమ్మ కౌగిలిలోని మధురి మని.

"నీ ఋణం ఎలా తీర్చుకోను భారతీ" అని ఆమె కళ్లనీళ్లతో అంటూంటే ఆనందంతో నిండుకున్న కళ్లతో "ఛ... ఛ... అవేంమాటల మ్మా?" అంది భారతి.

మర్నాడు తనూ తయారవుతున్న తులసిని "నువ్వు వద్దమ్మా! అంతా అక్క చూసు కుంటుంది" అంటూ వారించింది భారతి.

సాయంత్రానికి పని పూర్తిచేసుకుని కాత్యా యనిని ఇంటికి తీసుకొచ్చింది భారతి.

ఓ ఆరిందాలా భారతి ఇదంతా చేస్తుంటే తులసిలో ఆ అమ్మాయిపట్ల కృతజ్ఞత, అభి మానం, ప్రేమ మిక్కుటంగా కలిగాయి. ఓవారం మాత్రం కాత్యాయనిని ఇంట్లో వుంచు కుని ఆమె ఆరోగ్యం సర్దుకున్నాక ఆమెని ట్రైనెక్కించేసింది తులసి. తల్లిదండ్రులమీద బెంగపెట్టుకుని వుండనంటోందని భర్తకి చె ప్పింది.

"నీ సొంత చెల్లెల్ని పిలిపించుకోరాదూ" అన్నాడు మూర్తి.

"బుద్ధివచ్చింది. ఇంకెవర్నీ తెచ్చి పెట్టు కునే ప్రసక్తేలేదు. నేనూ, భారతీ ఎలాగో తంటా లు పడతాం" అనేసింది తులసి.

అప్పటికి ఆమెకి ఆరోనెల నిండుతోంది.



తనకీ, సవతి తల్లికీ మధ్యదూరం చాలావరకు తరిగిపోతుండడాన్ని భారతి ఆనందంగా గమనిస్తూంది. సౌదామిని మాటల్లో నిజమెంతో ఆమెకి అర్థమవుతోంది. కేవలం తను ప్రయోగించిన అభిమానం, ప్రేమ సవతితల్లిని మెల్లమెల్లగా వశపరుచుకుంటున్నాయి. చందూపట్ల కక్షసాధింపు ధోరణిని కూడా తనకి తెలీకుండానే తగ్గించుకుంటోంది తులసి. ఓరోజు సౌదామిని తులసిని చూడటానికి వచ్చింది. తులసి చాలా మర్యాదగా, అభిమానంగా సౌదామినిని ఆహ్వానించింది. కాత్యాయని విషయంలో ఆమె చేసిన సహాయానికి కృతజ్ఞతలు తెలుపుకుంది.

"కాత్యయని చేసిన పొరపాటుని గురించి మీరెంతగా బాధపడుతున్నారో మీ అమ్మాయి చెప్పింది. వాళ్ల నాన్నగారికి తెలీకుండా అబార్షన్ చెయ్యించాలని కోరింది" అంటూ తనతో తెచ్చిన బ్యాగ్‌లోనుండి పండ్లుతీస్తూ "మీకు పుల్లదానిమ్మ ఇష్టం కదా? భారతి చెప్పింది. పూరెళ్లాను నాలుగు రోజుల క్రితం, మా ఇంట్లో చెట్టుంది, మర్చిపోకుండా తెచ్చాను" నవ్వుతూ ఇచ్చింది.

తులసి కళ్లల్లో మెరుపు...

తులసిలో వస్తున్న మార్పుని గురించి సౌదామిని ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనేవుంది. సౌదామిని ఆ పూట అక్కడే వుండిపోయింది. సౌదామినికి భారతిపట్ల చాలా అభిమానం వుందని, ఆ ఇద్దరిమధ్యా గురుశిష్యుల అనుబంధంగాక మంచి స్నేహం వుందని అర్థంచేసుకున్న తులసిని తనపట్ల, తన తమ్ముడిపట్ల తన నిర్లక్ష్యాన్ని గురించి భారతి సౌదామినికి చెప్పివుంటుందేమోనన్న అనుమానం పట్టి పీడించసాగింది.

అయితే తన అనుమానం నిరాధారమైనదన్నట్టు సౌదామిని వెళ్లబోయేముందు, భారతి లేనప్పుడు తులసితో "మీరు నిజంగా అభినందనీయులు" అంది.

ఈ మాట సౌదామిని ఎందుగురించి అంటోందో అర్థంగాలేదు తులసికి.

"అదే... మీరు భారతికి సొంత తల్లి కాదన్న విషయం నాకు ఇటీవలిదాకా తెలీలేదు, భారతి ఎప్పుడూ చెప్పలేదు. అంటే... మీరు భేదభావాల్ని చూపించలేదనేగా అర్థం? తల్లిపోయిన పిల్లలు దురదృష్టవంతులంటారు. మీలాంటి స్త్రీలు ఆ నమ్మకాన్ని అబద్ధం చేస్తూంటారు. నేను అనుకుంటూండేదాన్ని... కడుపున పుట్టినవాళ్లే బిడ్డలు అయివుండనవసరంలేదు. ఇంతవరకూ మీరు మాతృత్వాన్ని పొందకపోయినా ఓ మాతృమూర్తిగా మీ వంతు బాధ్యతని నెరవేరుస్తున్నారు, కాదంటారా?"

ఈ మాటలకి తులసి ఉక్కిరిబిక్కిరయింది. ఈ పొగడ్తలకి తను తగదన్నట్టు మనసులో ఆమె సిగ్గుపడింది.

"ఈ ప్రపంచంలోని అన్ని ప్రేమల్లోకీ మధురమైనదీ, కల్తీ లేనిదీ అమ్మప్రేమ. మీలాంటి తల్లిగాని తల్లులు కొందరు అమ్మ అన్న మాటకి మరింత విలువని, గొప్పదనాన్ని ఆపాదిస్తున్నారు" అంది సౌదామిని మళ్లీ.

గిల్టీనెస్‌తో తలవంచుకుంది తులసి. సౌదామిని అదేమీ గమనించనట్టు నటించింది. కాలుతూన్న ఇనుముమీద సరైన సమయంచూసి సమ్మెటవేసినట్టు సమయంచూసి వచ్చి తులసి మనసుని నొక్కివదిలింది సౌదామిని. ఇంతలో భారతి అక్కడికి వచ్చింది.

★ ★ ★

ఒళ్లో పాపని ఉంచుకుని గోడకి చేరగిలబడి నిద్రపోతూన్న భార్యని చూసి ప్రకాష్ చాలా ఆశ్చర్యపోయాడు. భారతి నడుముచుట్టూ చేతులు బిగించి ఆదమరచి నిద్రపోతోంది పాప. ఈ దృశ్యం చాలా అద్భుతంగా అపురూపంగా అనిపించింది అతడికి. రాత్రి భారతిని చూస్తేనే భయపడిపోయి గొడవ చేసిన పాప ఇంతలో అంత దగ్గర ఎలా అయిందన్నది చాలా ఆశ్చర్యాన్నీ ఆసక్తినీ కలిగించిందతడికి. అతడూ బాబూ లేచిన అలికిడికి భారతి మేలుకుంది.

బాబు తల్లి దగ్గరికి చేరి బిక్కమొహంతో "మమ్మీ... నువ్వు అంజూ అమ్మవా?" అడిగాడు.

భారతి వాడిని దగ్గరికి తీసుకుంటూ- "అంజూ అమ్మనీ అజిత్ అమ్మనీ సరేనా?" అంది. ఇంతలో పాప మేలుకుంది.

అమ్మ కౌగిలోవున్న బాబుని చూసి మరింత గట్టిగా తల్లిని కౌగలించుకుంటూ "అమ్మ




నాది'' అంది.

వాడు మళ్లీ బిక్కమొహంవేసి ''ఇద్దరిదీ'' అన్నాడు.

పాప తల్లి మొహంలోకి చూసింది.

''అవును అంజూ... బాబు చిన్నవాడుకదా? నేను మీ ఇద్దరి అమ్మనేగా?'' అంది.

పాప తలూపింది.

ప్రకాష్ నవ్వుతూ- ''అమ్మ అంటే భయం పోయిందా అంజూ?'' అడిగాడు.

''అమ్మ చాలామంచిది డాడీ. రాత్రి మీరు నిద్రపోయాక నేనూ అమ్మా బోలెడు మాట్లాడు కున్నాంగా. అరవింద ఆంటీ వాళ్ల మాటలన్నీ అబద్ధాలు. సుష్మా మేడమ్ వాళ్ల అమ్మ వెరీ బాడ్. మనమ్మ చాలామంచిది డాడీ. నన్ను అజ్జూని ఎప్పుడూ కొట్టదట. మేమంటే చాలా ఇష్టమట'' అమాయకంగా అంది.

''అయితే బయటివాళ్ల మాటలు నమ్ము తావా ఎప్పుడైనా?'' కూతుర్ని అడిగాడు.

''ఇక నమ్మనుడాడీ. అమ్మమీద దొంగవాడీ లు చెబితే వాళ్లతో పోట్లాడేస్తాను కూడా'' తల్లి కౌగిలిలోని సుఖాన్ని అనుభవిస్తూ అంది పాప.

అతడు అడిగాడు తరువాత ''ఏం మంత్రం పెట్టావుభారతీ పాపకి?''

''అమ్మ ప్రేమ అనే మంత్రం పెట్టాను''

అతడు మెచ్చుకోలుగా చూశాడు. ఆరోజు పాప భారతిని వదలనేలేదు. అంటుకుని అంటుకుని తిరిగింది. అరవింద వచ్చింది జ్వరపడ్డ పాపని చూడటం కోసం అంటూ.

వస్తూనే ''ఎలావున్నావు అంజూ? జ్వరం వచ్చిందిటగా పాపం నీకు? సుష్మా టీచర్‌వాళ్ల సవతితల్లి మూలంగా చచ్చిపోయిందని బాగా భయపడిపోయి ఏడ్చావటగదా? మా రాజీ చెప్పింది. పాపం... ఏం చేస్తాం? రాతమ్మా రాత...'' అంది ఎంతో సానుభూతిగా ''ఏమంటావ్ భారతీ?''

భారతి ఏమీ అనలేదు.

పాప వెంటనే తల్లితో ''అమ్మా... ఈ ఆంటీ అన్నీ అబద్ధాలు చెబుతుంది.మరేమో నువ్వు నన్నూ తమ్ముణ్ని కొడతావుట. తిటతావట. డాడీ నువ్వు చెప్పినట్టే వింటాడట. మమ్మల్ని హాస్టల్లో చేర్పిస్తావట. ఇలాగు చెబుతుంది ఎప్పుడూ. నాకేమో భయం వేస్తుంది'' అంది.

పాప ఇలా మాట్లాడటంతో అరవింద బిత్తర పోయింది. అప్పటికీ భారతి మాట్లాడలేదు.

పాప మళ్లీ అరవిందతో ''ఆంటీ నీ మాటల న్నీ అబద్ధాలు. మా అమ్మ సుష్మా మేడమ్ వాళ్ల అమ్మలా చెడ్డదికాదు. చాలామంచిది. ఇకనీ మాటలూ బామ్మ మాటలూ నేను నమ్మనుగా. ఇక మీ ఇంటికి కూడా నేను రాను. నన్ను భయపెట్టేస్తావు నువ్వు. నాకేమో ఏడుపొ స్తుంది. మీ రాజీనే మా ఇంటికి రమ్మను'' అంది.

అరవింద మొహం కోపంతో అవమానంతో ఎర్రబడగా ''బాగానే నేర్పించావు భారతీ నవ తికూతురికి. నేను ఇంటికి రావడం ఇష్టంలేక పోతే ఆ విషయం నా మొహం మీదనే చెప్పవచ్చుగా పిల్లదాని చేత అడిగించడం ఎందకూ?'' అంది.

''పొరబడ్డారు అరవిందగారూ. నేనేమీ చె ప్పలేదు. పాప తెలివైంది. ఎవరిమాటల్లో నిజం ఎంతవుందో అర్థం చేసుకోగలుగుతోంది. ఆ మాటలు తనుగా మాట్లాడింది తప్ప నేను నేర్పించిందేమీ లేదు. కావాలంటే తననే అడ గండి'' అంది.

అరవింద విసురుగా వెళ్లిపోయింది.

ప్రకాష్‌లోపలి గదిలోంచి వస్తూ- ''ఇలాంటి వాళ్లను ఇంటికి ఎందుకురానిస్తావు భారతీ? ఖచ్చితంగా రావద్దని ఎందుకు చెప్పవూ?'' అన్నాడు.

''మంచివారే'' అంది భారతి ''ఇరుగూపొ రుగూతో స్నేహంగా ఉండడం తప్ప కోరికోరి శత్రుత్వం తెచ్చుకోవడం మంచిదికాదు ప్ర కాష్. మనిషి సంఘజీవి. పక్కవాడితో అవ సరం ఎప్పుడూ వుంటుంది.

''నీ మాటలు చాలా చిత్రంగావుంటాయి భారతీ...'' అతడు ఆశ్చర్యంగా అన్నాడు.

''ఇందులో చిత్రం ఏముంది? ఏ మనిషిలో అయినా ఎంతోకొంత మంచితనం కొన్ని సుగు ణాలు వుండకపోవు. అరవిందలాంటివాళ్లు అమ్మలక్కల వ్యవహారంనడిపి చెడ్డ అని పించుకుంటూవుంటారు'' అంది.

అతడు భార్య వైపు ఆరాధనా పూర్వకంగా చూశాడు.

వారంరోజులు గడిచిపోయాయి. పాప తల్లికి బాగా దగ్గరయింది. అయితే అప్పుడప్పుడూ ఒంటరిగా దిగులుగా ఆలోచిస్తూ కూర్చోకపోలేదు. ఓసారి అడిగింది- "అమ్మా... నువ్వెప్పుడూ ఇలాగే వుంటావా? ఎప్పుడూ నేనంటే ఇష్టంగా వుంటావా?"

"ప్రామిస్ అంజూ... ఎప్పుడూ నువ్వంటే నాకు ఇష్టమే" ఈ వారం రోజులకి గానీ పూర్తిగా భారతిని నమ్మలేదు పాప.

ఈలోపల సౌందర్యమ్మ రెండుమూడుసార్లు పాపని పిలిపించుకుని భారతి మంచితనం గురించి చెబుతూండేది. ప్రస్తుతం ఢిల్లీలో వుంటూన్న సౌదామినికి తన కొత్త కాపరం గురించి పిల్లలగురించి చాలా వివరంగా ఉత్తరంరాస్తూ ఓసారి వచ్చివెళ్లమని కోరింది భారతి. అదేరోజు ఆమెకి తండ్రి ఇచ్చిన టెలిగ్రాం అందింది.

"తులసి భారతి దగ్గరికి వస్తోందని, ఓ వారం వుంటుందన్నది" ఆ టెలిగ్రాం సారాంశం. భారతి ఆనందంగా ఈ విశేషాన్ని తన భర్తకీ, పిల్లలకీ చెప్పింది.

"అమ్మా ... మీ అమ్మ నాకు అమ్మమ్మ అవుతుందికదూ?"

"అవున్రా"

"నేనలా పిలవచ్చా? అమ్మమ్మ ఏమీ అనుకోదా?"

"ఏమీ అనుకోదు ... అమ్మమ్మ చాలా మంచి అమ్మమ్మ"

"అమ్మమ్మ ముసలావిడా?" తన సొంత అమ్మమ్మని గుర్తుతెచ్చుకుంటూ అడిగింది పాప.

సుజాత తల్లిదండ్రులు ప్రకాష్ తమ చిన్న కూతుర్ని రెండో భార్యగా స్వీకరించలేదన్న కోపంతో రాకపోకలు మానేశారు.

"అబ్బే ... కాదు, ఈ అమ్మమ్మ అందంగా చిన్నగా వుంటుంది" నవ్వుతూ చెప్పింది.

"నీకు తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ లేరా?" బాబు ఆరిందాలా అడిగాడు.

"ఉన్నార్రా, ముగ్గురూ తమ్ముళ్ళే"

"వాళ్లనేం పిలవాలి?" బాబు సందేహం.

"మామయ్యా అని పిలవాలి"

"మామయ్యలు కూడా వస్తారా అమ్మా?"

"వాళ్లంతా చదువుకుంటున్నారు అంజూ. సెలవులిస్తేగానీ రారు. ఓసారి మనం అమ్మమ్మవాళ్ల ఊరు వెళదాం ... సరేనా?"

పిల్లల మొహాలు వికసించాయి. రాబోయే అమ్మమ్మని గురించి పిల్లలిద్దరూ లక్ష ప్రశ్నలతో ఊపిరితిరగనివ్వలేదు భారతికి. ఆ రాత్రి పిల్లలు నిద్రపోయాక అడిగాడు ప్రకాష్.

"నువ్వు మొదట్లో మీ సవతితల్లి దగ్గర బాగా కష్టపడ్డావని 'నీలా' తల్లిని కోల్పోయిన ఇద్దరు పిల్లలయినా బాధలు అనుభవించకుండా వుండాలన్న తపనతో భార్యపోయి పిల్లలున్నవ్యక్తిని పెళ్ళి చేసుకోవాలన్న నిర్ణయానికి వచ్చావని మన పెళ్ళికి ముందు నాకు సౌదామిని చెప్పింది. నా పిల్లల్ని కన్న తల్లిలా ప్రేమగా పెంచే స్త్రీమూర్తి కోసం వెదుకుతూండగా అదృష్టంలా కోరికోరి నా జీవితంలోకి ప్రవేశించావు. నిన్ను ఓ మంచి అమ్మగా మలచిన ఆ కథ వినాలని వుంది"

ఆ గతాన్ని తలచుకోవడానికి ఆమె ఎప్పుడూ బాధపడదు. అతడికి చెప్పడం ప్రారంభించింది. అతడాసక్తిగా వినసాగాడు.



**భా**రతి టెన్త్ క్లాస్ పరీక్షలు రాస్తూండగా తెలిసింది తులసికి సుఖప్రసవం అయిందని, మగపిల్లాడు పుట్టాడని. పిల్లల్ని కాస్త కనిపెట్టి వుండమని ఇరుగూపొరుగూకి చెప్పి మూర్తి







కొడుకుని చూసుకోవడానికి బయలుదేరివెళ్ళాడు.

"అక్కా ... మనం చిన్న తమ్ముణ్ణి చూసేది ఎప్పుడే? మనం వూరువెళ్లమా? నాకు తమ్ముణ్ణి చూడాలనివుందే" అంటూ భారతిని వేధించసాగాడు చందూ.

భారతి నవతితల్లికి ఉత్తరం రాసింది: "అమ్మా ... నాకూ, చందూకి చిన్న తమ్ముణ్ణి చూడాలని ఎంతగానో అనిపిస్తోంది. నీకు ఇష్టం అయితే ఓసారి అక్కడికి వస్తాం అమ్మా" అంటూ.

"ఇక మీ నవతితల్లి మీ మొహం కూడా చూడదే భారతీ. తొలిసారి కొడుకే పుట్టాడు గదా?" ఈమధ్య నవతితల్లీ, పిల్లలూ కాస్త అనుకూలంగా వుండటం గమనిస్తూన్న అంబుజమ్మ అంది.

"మా అమ్మ మంచిది. తమ్ముడు పుడితేమాత్రం ఏం? మమ్మల్ని ప్రేమగా చూస్తుంది" అంది భారతి.

"ఓయబ్బో ... అదీ చూడమా? తమ్ముడూ, అమ్మా అని పాకులాడాల్సిందేగానీ ఆ మనిషికి మీ పొడేగిట్టదాయె" అంది ఆవిడ.

ఇక తులసి నవతి పిల్లల్ని ఎఫేలా నిర్లక్ష్యంచేస్తుందన్న నమ్మకానికి [illegible]రు వాళ్ళు. మూర్తి తిరిగివచ్చాడు.

"నాన్నా ... తమ్ముడు ఎలా వు[illegible]డు?" ఆతృతగా అడిగింది భారతి.

"నాలా వున్నాడా నాన్నా?" చం[illegible]అడిగాడు.

మూర్తి కొడుకుని దగ్గరికి తీ[illegible]న్నాడు. ఏనాడైతే తులసికీ, పిల్లలకీ మ[illegible] దూరం తరగడం ప్రారంభమయిందో త[illegible] పిల్లలకీ మధ్య దూరం కూడా తరిగిపో[illegible] వచ్చింది.

"అచ్చు మీ అమ్మలా ఉన్నా[illegible]" సంతోషంగా చెప్పాడు మూర్తి.

"అయితే చక్కగా వు[illegible]" అంది భారతి.

అప్పుడు చెప్పాడు మూ[illegible] భారతీ ... నీ పరీక్షలు అయిపోగానే [illegible]అమ్మ నిన్నూ

చంగానీ తీసుకురమ్మంది''

చదూ ఎగిరిగంతేశాడు. భారతి సంతోషం చెప్పనలవికాదు. సౌదామినికి ఈ విషయం చెప్పినప్పుడు ''మీ అమ్మలో మార్పువచ్చింద నడానికి ఇదో పెద్దఉదాహరణ'' అంది.

చెప్పినట్టు పరీక్షలయిపోగానే కూతుర్నీ కొడుకునీ తీసుకుని భార్య దగ్గరికి వెళ్లాడు మూర్తి. భారతి వెళ్తూ తండ్రి చేత తమ్ముడికి కొత్తచొక్కాలు కొనిపించడం మర్చిపోలేదు. ఆరాటంగా వచ్చి తమ్ముణ్ణి చూసుకుంటూన్న పిల్లలిద్దర్నీ ఆర్తిగా చూసింది తులసి.

''అమ్మా ... తమ్ముడు అచ్చం నీలా వున్నాడమ్మా'' అని భారతి అంటూంటే నవ్వింది తులసి కళ్లు చెమ్మగిల్లగా.

రెండు నెలలక్రితం చూసిన భారతి కాస్త పొడవైనట్టనిపించింది. భారతి పరీక్షలు ఎలా ాసిందో శ్రద్ధగా అడిగి తెలుసుకుంది తులసి. ందూ పురిటిమంచం వదలడంలేదు. మ్ముణ్ని తన చేతికి ఇవ్వమని తులసికి ప్పమంటూ ఒకటే గొడవ. ఈసారి తులసి బంధుమిత్రులతో భారతిని తన పెద్ద కురిగా పరిచయం చెయ్యడానికి ఎంతమా త్రూ సందేహించలేదు. మొత్తం నాలుగు రోజులుందక్కడ భారతి. ఈ నాలుగురోజుల్లో తులసిలో తనపట్ల, తమ్ముడిపట్ల గణనీయంగా వచ్చిన మార్పుని గమనించి సంబర పడిపోయింది భారతి. తులసి పుట్టింటివారు పిల్ల బాగా ఆదరించారు. నాలుగోరోజు తండ్రి ప్రయాణం కావాల్సివచ్చింది. మూర్తి వ్యాపా దెబ్బతింటుందంటూ కూతుర్ని బయల్దేరదీశాడు. అతడికి భోజనం ఇబ్బందవుతుంది కాబట్టి భారతి వెళ్లకత ప్పదు. చందూ మాత్రం తను రానని మొండికేశాడు.

అటు భారతీ, ఇటు తులసీ ఇద్దరూ భయపడ్డారు. చందూ తులసి మాట వినడు. వాడు ప్రతి చిన్నవిషయానికీ ఎదురుతిరుగుతూంటే తనవాళ్లవద్దు తలవంపులవుతుందని భయపడింది తులసి. వాడికి లక్షజాగ్రత్తలు చెప్పింది భారతి. చిన్నారి తమ్ముణ్ణి వదిలివెళ్ల లేక భారతి కళ్ల నీళ్ళు పెట్టుకుంటూంటే'' వీలయినంత త్వరగా వచ్చేస్తాన్లే భారతీ ... తమ్ముడికి మంచి పేరు వెదికిపెట్టు'' అంది.

తండ్రితో ఊరికి తిరిగి వచ్చిన భారతి తన చిన్న తమ్ముణ్ణి గురించి అందరికీ చెప్పుకుంది. ఈ తమ్ముడు వచ్చేరోజుకోసం వెయ్యి కళ్ళతో ఎదురుచూసింది. చెప్పినట్టే నెల వెళ్ళిపోకముందే వచ్చేసింది తులసి. ఈ ఇరవైరోజుల్లో చందూలో వచ్చిన మార్పుని చూసి చాలా ఆనందించింది భారతి.

వాడు తులసిని ''అమ్మా'' అని పిలవడానికి అలవాటుపడ్డాడు.

తులసిసైతం వాణ్ని చీటికిమాటికి విసుక్కోకుండా దగ్గరికి తీస్తోంది. తన కొడుక్కు భారతికి ఇష్టమైన రాణాప్రతాప్ అన్నపేరు పెట్టింది తులసి. చాలాకాలం తరువాత భారతి మేనమామ వచ్చాడు వాళ్లని సెలవుల్లో కొంతకాలం దగ్గర వుంచుకుంటానంటూ. మూర్తి రెండో పెళ్ళి చేసుకున్నాక తులసి పిల్లల్ని సరిగా చూడటంలేదనీ, మూర్తికి రెండో భార్య మాట వేదవాక్కనీ అరుంధతమ్మ పదేపదే ఉత్తరాలు రాస్తూండటంతో వాళ్లివైపు రావడం మానేశారు.

''వెళ్లు భారతీ'' అంది తులసి.

''ఊహూ ... నేను వెళ్లనమ్మా, తమ్ముడితో నువ్వు ఒక్కదానివీ ఎలా వేగగలవూ''? అంది భారతి.

తులసికి ఆనందం కలిగింది అయినా ''పనిమనిషి వుందిగదా? ఎలాగో చేసుకోగలను. ఆయనింతదూరం వచ్చినప్పుడు వెళ్లకపోవడం ఏం బావుంటుంది?'' అంది.

''ఎందుకు బావుండదు? ఈసారి సెలవుల్లో వెళతాన్లే. అప్పటికి రాణా కాస్త పెద్దవాడవుతాడు''

''నేనూ వెళ్లను. తమ్ముణ్ణి చూడకుండా నేనుండలేను'' అన్నాడు చందూ.

భారతి ఇదే విషయం మేనమామతో చెప్పింది. ఆయన ఇదివరకటిలాకాక తులసి పిల్లల్ని దగ్గరికి తీయడం గమనించాడు. భారతిని చాటుకి పిలిచి ''మీ సవత్తల్లి మిమ్మల్ని బాగా చూసుకుంటూన్నట్టుంది గదమ్మా?'' అని అడిగాడు. ''ఆ విషయం గురించి మీరు బెంగపెట్టుకోకండి మామయ్యా అమ్మ





మాతో ఇప్పుడు చాలా బాగుంది'' అంది భారతి.

''అంతకంటే కావలసిందేంవుంది తల్లీ. మువ్వల్లాంటి బిడ్డల అభివృద్ధిని చూసుకుని మురిసిపోయేయోగం రాధమ్మకి లేకపోయింది. బాగా చదువుకోండమ్మా''అంటూ కళ్లు ఒత్తుకున్నాడాయన.

తల్లి స్మృతులతో భారతి మనసు భారంగా అయింది. మేనమామ వెళ్ళిపోయాడు.

క్రమక్రమంగా తల్లీ పిల్లల విషయంలో చాలా మార్పులు వచ్చాయి ఆ ఇంట్లో. చందూ ఇంట్లో వున్నంతసేపూ తమ్ముణ్ణి చంకదింపేవాడు కాదు. తులసి సినిమాలకి వెళ్లాలన్నా ఇంకేదయినా అవసరంమీద బయటికి వెళ్లాలన్నా ఇదివరకులా భర్తతోకాక పిల్లల్ని వెంటపెట్టుకుని వెళుతుంది. ఏ చిన్న విషయానికీ భారతిని సంప్రదిస్తుంది. తులసి దగ్గర చనువయ్యేకొద్దీ చందూ అలవరచుకున్న మొండితనం, మంకుపట్టు మాయం అయ్యాయి. చందూ సెవెంత్ క్లాసులోకివస్తే భారతి టెన్త్‌లో స్కూల్ ఫస్ట్ వచ్చింది. మూర్తితోపాటు తులసీ సంతోషించింది. తులసి ఇష్టంమీద తన ఫ్రెండ్స్‌నీ, సౌదామినినీ పిలిచి ఇంట్లో పార్టీ ఇచ్చింది భారతి.

భారతి కాలేజీలో చేరుతోంటే తను దగ్గరుండి విలువైన బట్టలు తీసింది తులసి. చూస్తూండగానే ఇరుగూపొరుగూకి బయటివాళ్లకి నమ్మశక్యంగానంత మార్పు వచ్చింది తులసిలో. ఇదివరకటి అసంతృప్తి పూర్తిగా ఆమెనుంచి తుడిచిపెట్టుకుపోయింది. ఇప్పుడామె తన సవతిపిల్లల్ని గురించి బయటివాళ్లకి ''మా పెద్దమ్మాయి, అబ్బాయి'' అని చెబుతుంది.

సౌదామిని చెప్పిన గురజాడ పలుకులు 'ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును' అన్నది ఆ తల్లీ పిల్లల విషయంలో అక్షరాలా నిజమైంది. రెండేళ్లు తిరిగేసరికి తులసికి ఇంకో కొడుకు పుట్టాడు. ఇప్పుడామె తన పుట్టింటికిసైతం పెద్దపిల్లలిద్దరూ వెంటలేకుండా వెళ్లదు. పద్నాలుగేళ్ల చందూ 'అమ్మా అమ్మా' అంటూ ఆమె కొంగుపట్టుకు తిరుగుతాడు. 'స్వీట్ హోమ్' అన్న మాటకి నిర్వచనంలావుంది ఇప్పుడు మూర్తి ఇల్లు. ఒకనాడు రాధ వున్నప్పటి పరిస్థితులు పూర్తిగా నెలకొన్నాయి.

ఓరోజు తులసి అడిగింది ''భారతీ'' నీకు మీ అమ్మ ఎప్పుడూ గుర్తురాదా? బాధ అనిపించదా?''

''ఎందుకు గుర్తురాదమ్మా? నువ్వున్నావు గదా ఆ లోటును పూడ్చేస్తూ! అమ్మ స్మృతిని ఓ మధురస్మృతిగా మాత్రమే గుర్తుతెచ్చుకుంటాను. పదమూడేళ్లుమాత్రమే అమ్మతో నా అనుబంధం! ఇక మిగిలిన జీవితానికంతా నువ్వే నాకు తల్లివి'' అంది భారతి ఆర్తిగా.

తులసి ఉప్పొంగిపోయింది. ఆమె ఇప్పుడు ఓ పరిపూర్ణ మాతృమూర్తి అయిది.

భారతి డిగ్రీచదువులోకి వస్తూండగా సౌదామిని పెళ్లిచేసుకుని అక్కడినుండి ట్రాన్స్‌ఫరయి వెళ్లిపోయింది. ఆమె వెళుతూన్నప్పుడు చెప్పిన మాటలు భారతి ఎప్పటికీ మర్చిపోలేదు.

''భారతీ! పదిహేడేళ్లకే ఓ వ్యక్తిత్వం అన్నది నీలో రూపుదిద్దుకుంది. మంచి, చెడుల విచక్షణ అన్నది ఏమిటో తెలుసుకోగలిగావు. మనిషి జీవితం సుఖదుఃఖాలకి ఆలవాలం. విజ్ఞతతో దుఃఖంలో కూడా ఆనందాన్ని వెదుక్కోగలిగినప్పుడే ఆ మనిషిని ఏ దుఃఖమూ ప్రభావితం చెయ్యజాలదు. చూశావా... ఒకనాడు పిరిగ్గా కృంగిపోయి, జీవితంలో మధురిమను అనుభవించడమే తెలీనట్టు వుండేదానివి. ఈనాటి నువ్వెలావున్నావు? చురుగ్గా, ప్రపంచంలోని ఆనందం అంతా నీదేనన్నట్టు, నిన్నుమించిన అదృష్టవంతులెవరూ లేరన్నట్టు లేవూ? సుఖదుఃఖాలెప్పుడూ శాశ్వతాలు కావు, వాటి ప్రభావాలకు లొంగిపోయి కృంగిపోవడం, పొంగిపోవడమే తెలివితక్కువ రెండింటినీ ఒకేవిధంగా తీసుకోగలిగిననాడ మన జీవితాన్ని చాలా ఈజీగా జీవించెయ్యగలం. ఇదంతా ఇప్పుడు నీకెందుకు చెబుతున్నానంటే జీవితంపట్ల నీకు పూర్తిఅవగాహన కలిగించడానికి.

భారతి ఆలోచించింది. నిజమే! న్నిటిదాకా తమ ఇంట్లో అశాంతి పేరుకునివుండేది. ఈనాడు ఆనందంతప్ప ఏమీలేద. మరోరూ

వంలో కష్టం అన్నది రేపు ముట్టుముట్టవచ్చు. ఈ ఆనందాన్ని ఎంత ఆనందంగా అనుభవి స్తున్నారో కష్టాల్ని అంత స్థయిర్యంతోనే ఎదుర్కో గలగాలి.

"జీవితం అంటే ఇదీ ... నేర్చుకో నేస్తం" ంటూ జీవితపాఠాలు నేర్పిన ప్రియమిత్రురా ల సౌదామిని వెళుతోంటే తన శరీరంలోని ఓ భాగం దూరంఅయినట్టు విలవిలలాడింది భారతి.

'పిచ్చిభారతీ! నాకుమాత్రం బాధలేదను కున్నావా? జీవితం ఓ సుదీర్ఘమైన ప్రయా ణంలాంటిది. ఆ ప్రయాణంలో ఒకరికొకరు తారసపడిపోయే పాసింజెర్స్‌లాంటివాళ్లం మనం కాకపోతే ఆ కొంతసేపట్లో మనసులు బాగా కలసినప్పుడు కొంతమంది ఒకరి అడ్ర సులు ఒకరు తీసుకుని ఆ అనుబంధాన్ని శాశ్వతంచేసుకుంటారు. మనమూ అంతే. నేను ఉత్తరాలు రాస్తూంటానుగా. వీలయినప్పుడు వస్తూంటాను. చదువు విషయంలో శ్రద్ధతీసుకో మని నీకు నేను ప్రత్యేకంగా చెప్పనవసరంలే దు. ప్రతి మనిషి జీవితానికీ ఓ గమ్యం అంటూ వుంటుంది - నీ గమ్యం ఏమిటి?" అంటూ ప్రశ్నించింది.

చప్పున సమాధానం ఇచ్చింది భారతి "త ల్లిలేని పిల్లలకి అమ్మని కావడం" అని.

సౌదామిని మొదట ఆశ్చర్యపోయింది. తరువాత భారతిచేతిని తన చేతిలోకి తీసు కుంటూ చిరునవ్వు నవ్వి "మంచి నిర్ణయమే భారతీ! మొదట చదువు పూర్తిగానీ" అంది.

తరువాత సౌదామిని వెళ్లిపోయింది. తర చూ ఇద్దరిమధ్యా ఉత్తర ప్రత్యుత్తరాలు సాగేవి. ఏడాదికోసారి కలుసుకుంటూండేవారు. ర్యాంకులతో పోస్టుగ్రాడ్యుయేషన్ వరకూ సాగించిన చదువుని పూర్తిచేసింది భారతి. వెంటనే ఏదైనా ఉద్యోగం చూసుకోవడానికి ప్రయత్నిస్తే తులసి అంగీకరించలేదు.

"చదువు చదువు అంటూ ఇంతదాకా విశ్రాంతిలేకుండా గడిపేశావు. నువ్వు ఇప్పుడు ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం ఏమిటి? మీ నాన్న బాగా సంపాదిస్తున్నారుగదా? అంతగా నీకు ఉద్యోగం చెయ్యాలన్న కోరిక గాఢంగా వుంటే ఓ ఏడాది తరువాత ప్రయత్నాలు ప్రారంభించు. ఈలోపల తమ్ముళ్లతో ఇంటిప ట్టున హాయిగా గడుపు" అంది.

కాదనలేదు భారతి. కళ్లుమూసి తెరిచేలోగా సంవత్సరం తిరిగిపోయింది. ఓరోజు హఠా త్తుగా ఊడిపడింది సౌదామిని. మాటల సంద ర్భంలో మెల్లగా ఆ ప్రస్తావన తెచ్చింది.

"ఏమోయ్! కడుపున పుట్టని పిల్లలకి తల్లి కావాలన్న నీ నిర్ణయం ఏమయింది?" తమా షాచేస్తున్నట్టు అడిగింది.

భారతి నవ్వకుండా "ఇంకా బలపడింది. ఇంట్లో అమ్మానాన్న సంబంధాలు వెదుకుతు న్నారు. కట్నం తీసుకునే భర్తకన్నా నాకు ఇద్దరు పిల్లల్ని ఇవ్వడానికి సిద్ధంగావున్న భర్త కావాలని వుంది. ఎందుకో తెలుసా? ఇదేదో పెద్ద త్యాగం, ఆదర్శం అని గొప్పగా అని పించుకోవాలన్న కోరికతో కాదక్కా! తల్లిని పోగొ ట్టుకున్న పిల్లలు వున్నారనుకో వాళ్ల తండ్రి ఎలాగూ మళ్లీ పెళ్లిచేసుకుంటాడు. అయి ష్టంతోనోఅసంతృప్తితోనో పిల్లల తల్లిస్థానంలోకి వచ్చిన అమ్మాయి వాళ్లని ప్రేమగా చూసుకోగ లదన్న నమ్మకం ఎలాగూ లేదు. ఇటు పిల్లలకి బాధ, ఆమెకి వేదన. ఓస్త్రీకి అలాంటి స్థితిని తప్పిద్దామనికాదు, తల్లిలేని పిల్లలకి తల్లినవు దామన్న తపన నాలో మిక్కుటంగా వుంది. నువ్వు నన్ను అర్థంచేసుకోగలవుగదా!" అంది.

సౌదామినికి అంతకంటే ఇక ఏమీ చెప్పా ల్సిన అవసరం లేకపోయింది.

"అమ్మానాన్న ఒప్పుకుంటారా?"

"ఒప్పించగలను. నీకు అలాంటి వ్యక్తి తార సపడితే చెప్పు నేను చెబుతున్నాను"

"తారసపడ్డాడు భారతీ! అందుకే నిన్ను వెదుక్కుంటూ వచ్చాను"

"ఎవరు?" ఆసక్తిగా అడిగింది.

"అతడి పేరు ప్రకాష్. ఇంజనీరు. ఏడాది క్రితం భార్య పోయింది. ఎనిమిదేళ్ల పాప, ఆరేళ్ల బాబు ఉన్నారు. అయినవాళ్ల సంబంధా లు వున్నాయి. అతడు ఇష్టపడటంలేదు. అత డికి భార్యగానేకాక పిల్లల్ని కన్నతల్లిలా చేరదీ యగల స్త్రీ కోసం వెదుక్కుంటున్నాడు. కన్నె పిల్లని చేసుకునేకంటే వితంతుస్త్రీని చేసు కుంటే బావుంటుందన్న అభిప్రాయాన్ని వ్యక్త పరిచాడు. నాకు నువ్వు గుర్తొచ్చావు. ముందు నీ





అభిప్రాయం కనుక్కునిగానీ అతడికి నీ గురించి చెప్పకూడదనుకున్నాను'' అంటూ చెప్పుకొచ్చింది సౌదామిని.

''అతడ్నిచూసి అతడితో మట్లాడాలి నేను'' అంది భారతి చాలా ఆతృతగా.

వారంతరువాత ప్రకాష్ వచ్చాడు. భారతి ఉద్దేశాన్ని సౌదామినిద్వారా విని చాలా ఆసక్తితోనూ, ఆతృతతోనూ బయలుదేరి వచ్చాడతడు. భారతి అతడికి నచ్చింది. అతడ్నిచూసి ఆమె కూడా స్పందించింది. తన పరిస్థితిని వివరించి చెప్పాడతడు. ఇద్దరూ ఇష్టపడి ఓ నిర్ణయానికి వచ్చారు. మొదట్లో ఈ పెళ్లికి మూర్తి, తులసి సుముఖత చూపించలేదు. అయితే భారతి వాళ్లకి నచ్చజెప్పింది. భారతి బిడ్డల తండ్రిని చేసుకోవాలన్న నిర్ణయానికి ఎందుకు వచ్చిందో భార్యాభర్తలిద్దరూ గ్రహించారు. ఇక కాదనలేకపోయారు వాళ్లు. ప్రకాష్ మంచి వయసులోవుండడం, విద్యాధికుడై మంచి వుద్యోగంలో ఉండడం వాళ్లకి ఊరట కలిగించినవిషయం. చాలా సింపుల్‌గా ప్రకాష్‌తో భారతి పెళ్లి జరిగిపోయింది. తను కోరుకున్న జీవితంలోకి మనస్ఫూర్తిగా అడుగుపెట్టింది భారతి.

''నా బాల్యం దుఃఖమయం అని నేనెప్పుడూ అనుకోను ప్రకాష్. అది నా భావిజీవితాన్ని తీర్చిదిద్దుకోవడానికి ఉపయోగపడిన అద్భుత జీవితపాఠం'' అంది భారతి తన కథ ముగిస్తూ.

''నిన్ను భార్యగా పొందిన నాకంటే అమ్మగా పొందిన నా పిల్లలు ఎక్కువ అదృష్టవంతులు భారతీ'' అన్నాడు ప్రకాష్.

''ఆ మాట ఒక వయసూ, జ్ఞానమూ వచ్చిననాడు వాళ్లు అనవలసినమాట. అప్పుడు సంతోషిస్తాను నేను. నా బాధ్యతని సక్రమంగా నిర్వర్తించగలిగాననని గర్విస్తానుకూడా'' అంది భారతి.

★ ★ ★

సీత సవతి తండ్రి వచ్చాడు.

''కాస్త డబ్బు అవసరమైందమ్మా'' అన్నాడు చేతులు నులుముకుంటూ. ''గుంటూరుదాకా వెళ్లిరావాలి'' అన్నాడు.

భారతి మొదట ''లేదు'' అని చెబుదామనుకుంది. ఆమె మొదట్లోనే అతడికి సీత తాలూకు మూడునెలలజీతం అడ్వాన్స్‌గా ఇచ్చేసింది. అంతలోనే ఏదో ఆలోచించి అతడికి ఓ వందరూపాయలు ఇచ్చింది. కూతురుగాని కూతురికి బుద్ధులుచెప్పి వెళ్లిపోయాడు. అతడు వెళ్లాక సీత పుస్తకం చదువుతూ కూర్చున్న భారతి దగ్గిరకి రెండుసార్లు వచ్చి ఏదో అడగబోయి అంతలోనే అడగలేనట్టు వెళ్లిపోయింది.

మరోసారి వచ్చినప్పుడు భారతి పుస్తకం కిందపెట్టేసి ''అమ్మదగ్గరకి వెళతావా సీతా?'' నవ్వుతూ అడిగింది.

సీత మొహం వెలిగింది. చప్పున తలూపుతూ - ''నాయన లేడుగదమ్మా. ఆయనతో...'' సీతకంఠం రుద్ధమైంది.

''నాకు తెలుసు సీతా! అతడికి నేను డబ్బు ఇచ్చేదాన్ని కాదు. నీకోసం ఇచ్చాను. వెళ్లి రెండురోజులు సంతోషంగా, సంతృప్తిగా అమ్మ దగ్గర గడిపిరా'' అంటున్న భారతికి తెలుసు అమ్మదగ్గర రెండురోజులు గడిపినంతమాత్రానే తృప్తి కలగదని.

సీత ఆనందంగా రెండుజతల బట్టలు సర్దుకుంది. మధ్యాహ్నం సీతని తీసుకెళ్లి బస్ ఎక్కించి వచ్చింది భారతి.

సీత రెండురోజుల తర్వాత ఆనందమూ, దుఃఖమూ కలగలిసిన మొహంతో తిరిగివచ్చింది. ''మా అమ్మ వచ్చేజన్మలో నీ కడుపున పుడతానని చెప్పమందమ్మా. నీకు వెయ్యి దణ్ణాలని చెప్పమంది. నాయన వచ్చినా పైసా డబ్బివ్వద్దని, ఆ డబ్బు మీదగ్గిరవుంచి నా చదువుకోసం ఖర్చుపెట్టమంది'' అంటూ తన తల్లికబుర్లూ, తమ్ముడి కబుర్లూ చెబుతూనే వుంది ఆరోజంతా.

భారతి నిట్టూర్చింది. ఈ వయసులో తల్లికి దూరంగా వుండటం ఎంత శిక్ష. అదీ హాస్టల్లో వుండి చదువుకోవడంవేరు. అప్పుడది దూరం కాదు. దురదృష్టం కాదు. అవసరం అవుతుంది. ఈ పరిస్థితి వేరు. తల్లికి బలవంతంగా దూరంచెయ్యబడిందిసీత. అదే దురదృష్టకరం. సీత వచ్చిన సాయంత్రం సీత వాళ్ల వూరినుండి ఓ మనిషి వచ్చాడు.

"సీతా మీ అమ్మని పట్నం తీసుకొచ్చాం - ఆసుపత్రిలోవుంది'' అంటూ.

సీత హడలిపోయింది "ఏమయింది పెద్దయ్యా అమ్మకి?''

"నువ్విట్టా రాగానే ఆదరిద్రుడొచ్చాడమ్మా ఏ కుళ్లుమోతునాకొడుకులో నువ్వొచ్చిపోయావని అంటించేశారు. దానిమీద గొడవపెట్టేసుకున్నాడు. మాటామాటా పెరిగి ఆ పిల్లని కొడవలితో జుట్టుకోశాడు. చావచితకతన్నాడు. గాయాలయితే ఆసుపత్రికి తీసుకొచ్చాం''

సీత పెద్దగా దుఃఖించసాగింది. భారతి గుండెలు మండిపొయ్యాయి. మగవాడి ద్వేషానికి, సంకుచితత్వానికి గురయి ఎన్నివిధాల హింసించబడుతోంది స్త్రీ? ఎన్నివిధాల అవమానించబడుతోంది? అయినా అతగాడ్ని తిరస్కరించలేకపోతోంది. అతడి నీడలోనుండి ఇవతలికి రాలేకపోతోంది. సీత తల్లిలాంటి స్త్రీల పరిస్థితీ అలాగేవుంది. ఆర్థికంగా తమకాళ్లమీద తాము నిలబడగలిగిన స్త్రీల పరిస్థితీ అలాగే వుంది. స్త్రీ పిరికితనం, బలహీనత మూలంగా సింగరాజులాటి మగవాళ్లు పేట్రేగిపోతున్నారు.

సీతతోపాటు తనూ హాస్పిటల్‌కి వెళ్లింది భారతి. అయితే సీత తల్లి అప్పటికి అక్కడలేదు. అక్కడివాళ్లు చెప్పారు "గాయాలకి మందువెయ్యించుకుని వెళ్లిపోయింది. ఆ మొగుడితో ఇంక కాపురం చెయ్యలేనని అటోఇటో తేల్చుకుంటానని వెళ్లిపోయింది''

"ఏంతేల్చుకుంటదో, ఏంపాడో? వాడీమద్దెన ఇంకోదాన్ని మరిగాడు'' సీతకోసం వచ్చిన వృద్ధుడు మొత్తుకుంటూన్నట్టన్నాడు.

"నేను పెద్దాయనతో వెళ్తానమ్మా'' అంది సీత.

ఆ అమ్మాయి కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూనేవుంది.

"నువ్వెళితే ఇంకా గొడవలు అవుతాయేమో సీతా?''

"ఈసారి మేం అంతా చూస్తూ వూరుకోంలేమ్మా. వాడినంగతేందో తేల్చుకుంటాం. ఈరోజే వూరోళ్లంతా తన్నబోయేసరికి పారిపోయాడు'' ముసలాయన చెప్పాడు.

కాస్త డబ్బు చేతిలో పెట్టి సీతని బస్సు ఎక్కించి ఉస్సురంటూ భారతి తిరిగివచ్చేసరికి తల్లి వూరినుండి వచ్చివుంది. తులసి కూతురి సంసారాన్నిచూసి ఆనందించింది. పిల్లల్ని చూసి ముచ్చటపడింది. అల్లుడి ఆదరణకి ఉప్పొంగిపోయింది.

"భారతీ! ఈ నెలరోజులలో బాగా చిక్కావు. అలవాటులేని సంసారబాధ్యతలుకదూ'' అని ఆమె అంటూంటే భారతి నవ్వేసింది.

"నీకంటికి అలాగే అనిపిస్తాన్లే! జాకెట్లు బిగుతుగా అయ్యాయి తెలుసా?''

"ఏం చేద్యంగా చెబుతావే'' అంది తులసి.

"అమ్మా! అమ్మమ్మ పెద్దగాలేదే? చక్కగా ఎంత బావుందో'' అంది పాప.

"అమ్మమ్మ చాలా మంచిదమ్మా'' అన్నాడు బాబు.

"మరే! మా అమ్మ బంగారుకొండ'' అని భారతి అంటూంటే తులసి కళ్లు చెమ్మగిల్లాయి. "నువ్వు తీర్చిదిద్దుకున్న అమ్మని భారతీ నేను'' అనుకుంది మనసులో.

తులసి కూతురిదగ్గర ఓ వారం వుంది. భార్యాభర్తల, పిల్లల అన్యోన్యతనిచూసి సంతృప్తిపడింది. అయితే ఆమెని కలవరపెట్టిన విషయం ఒక్కటే. కొత్త పెళ్లికూతురయిన భారతి పిల్లల్ని చెరోవైపున వేసుకుని పడుకోవడం. ఈవిషయమై సున్నితంగా మందలించింది కూతుర్ని.

భారతి కాస్త సిగ్గుతో, మొహమాటంతో "చిన్నపిల్లలు కదమ్మా'' అంది.

"అవునమ్మా... చిన్నపిల్లలే. నువ్వు కొత్తపెళ్లికూతురివి. ఆ విషయం మర్చిపోతే ఎలా?'' అంటూ పిల్లల్ని తన దగ్గిర పడుకోబెట్టుకోవడం ప్రారంభించింది. అమ్మమ్మ దగ్గర బోలెడు కథలున్నాయన్న ఆశతో కాస్త చీకటిపడగానే ఆమె పక్కలో చేరిపోయేవాళ్లిద్దరూ.

"అమ్మమ్మా... నువ్వు చాలా మంచిదానివట గదూ? మా అమ్మచెప్పింది''

"అమ్మమ్మా... మా అమ్మ చాలా మంచిఅమ్మ తెలుసా?''

"అమ్మమ్మా... మాకు తాతయ్యనీ, మామయ్యనీ చూపించవామరి?'' అని అడుగు





తూండేవాళ్లు.

"నాతో మా వూరికి ఓసారి వస్తార్రా పిల్లలూ?"

"ఓ! అమ్మ కూడా వస్తుందా?"

"అమ్మరాదు... నాన్న భోజనం అదీ ఎవరు చూస్తారు?"

"అవును... అయితే అమ్మ రాకపోతే ఎలా?"

"నేనున్నానుగదా?"

"అయితే వస్తాం అమ్మమ్మా!"

"చూడమ్మా అంజూ! నువ్వు పెద్దమ్మాయివి. అవునా?"

పాప గర్వంగా "అజ్జూకంటే పెద్దదాన్ని" అంది.

"అలాంటప్పుడు నువ్వూ, తమ్ముడూ అమ్మ దగ్గర పడుకోకూడదమ్మా! అమ్మదగ్గర పడుకునేది చిన్నపిల్లలు. విడిగా వేరేగదిలో పడుకోవాలి" అనునయంగా, లాలనగా చెప్పింది తులసి.

"అప్పుడలాగే పడుకునేవాళ్లంగా. ఇప్పుడేమో భయమేసి..." పాప మొన్నటిదాకా తల్లికి దూరంగావున్న సంగతి తులసికి తెలీదు.

"భయం ఎందుకూ? పక్కగదిలోనే వున్నారుగా అమ్మానాన్నా? పిలిస్తే పలుకుతారు. పెద్దదాన్ని! నామాటలు వినాలమ్మా! మంచి పిల్లలుకాదూ? నువ్వు, తమ్ముడూ ఇక్కడే పడుకోండి"

"ఓ... అలాగే" సులభంగా అంగీకరించేసింది పాప.

"నేకూడా" అన్నాడు బాబు.

"పిల్లల్ని నాతో తీసుకెళ్లి ఓ పదిరోజులు వుంచుకుంటాను" అని తులసి అడిగినప్పుడు ప్రకాష్ కాదనలేకపోయాడు.

"వాళ్ల చదువులమ్మా" భారతి అడ్డం చెప్పబోతే "ఏం చదువులే? నీ పిల్లలు మెడిసిన్ చదువుతున్నారా? ఇంజనీరింగా?" చిరుకోపంగా అంది తులసి.

తల్లి ఉద్దేశాన్ని గ్రహించి "మీరు అమ్మమ్మతో వెళతార్రా?" అడిగింది భారతి.

"వెళతాం అమ్మా" ఇద్దరూ ముక్తకంఠంతో ఉత్సాహంగా చెప్పారు.

తను కూతురుదగ్గిరికి వచ్చిన పదకొండో రోజు పిల్లల్ని తీసుకుని విజయవాడ ట్రైన్ ఎక్కింది తులసి. పిల్లలులేని ఇల్లు బోసిగా అనిపించింది భారతికి. ప్రకాష్ ఆఫీసుకి వెళ్లాకయితే ఇల్లు మరీ నిశ్శబ్దంగా అనిపించేది. సాధారణంగా ఆ సమయంలో పిల్లలున్నా ఇంట్లో వుండరు. స్కూలుకి వెళతారు. వాళ్లు ప్రస్తుతం వూళ్లో లేరు అన్న భావన ఇల్లు మరీ నిశ్శబ్దంగా బోసిపోయినట్లు అనిపించడానికి కారణం. మనిషి మనసుకి వున్న పవర్ చాలా అపూర్వమైనది.

సీత వెళ్లిందేగానీ అంతులేదు. అక్కడి విశేషాలేమీ తెలీలేదు. తల్లివచ్చి వుండడంతో సీత విషయం తాత్కాలికంగా విస్మరించింది. భర్తకి చెప్పి మర్నాడు సీతవాళ్ల వూరికి వెళ్లిరాదలచుకుంది భారతి. సీతని తన దగ్గర చేర్చుకున్న టైమ్ ఎలాంటిదోగానీ ఆ అమ్మాయిపట్ల అపేక్ష ఏర్పడిపోయింది భారతిలో. తీరా సీతవాళ్ల వూరికి బయలుదేరబోతూండగా వచ్చింది సీత తన తల్లి, తమ్ముళ్లతో. సీత మొహం కళకళలాడిపోతూంది.

"అమ్మా... మా అమ్మ" అంది.

ఆమె వచ్చి చప్పున భారతి కాళ్లు పట్టుకోబోయింది.

భారతి చప్పున వెనక్కి తిరుగుతూ "ఆఁ... ఆఁ... ఏమిటిది? భలేదానివే?" అంది.

"అమ్మా... నువ్వు దేవతలాంటిదానివమ్మా! నా బిడ్డని నీ కడుపులో పెట్టుకుని కాచుకుంటున్నావు. నా బిడ్డని నీ చేతుల్లోపెట్టేశాను" అంది కళ్లనీళ్లతో.

సీత ఆనందంగా "అమ్మా! అమ్మ అతన్నొద్దంటే వద్దంది. వూళ్లో పంచాయితీచేశారు. అమ్మకి తను రాసిఇచ్చేశాడు. ఇక తనకీ, మాకూ ఏం సంబంధంలేదు. తమ్ముళ్లు కూడా తనకి వద్దంట. అరెకరం పొలం రాసిఇచ్చాడు. ఇంకోపెళ్లి చేసేసుకున్నాడు. ఈ గొడవలన్నీ సర్దుకునేసరికి ఇన్నిరోజులయింది" అంటూ చెప్పుకొచ్చింది.

భారతికి చాలా ఆనందం కలిగింది. దుర్మార్గుడైన భర్త చేతిలోనుండి ఎలాగైతేనేం... తప్పించుకోగలిగింది సీత తల్లి శేషు.



"నా రెక్కల కష్టంమీద ఈ బిడ్డల్ని సాక్కోగ లనమ్మా. మా సీత మీ బిడ్డేతల్లీ" అంది.

"సీతగురించి నువ్వేమీ ఆలోచించనవస రంలేదు. సీత ప్రయోజకురాలైనంత వరకూ నాదగ్గరే వుంటుంది. మళ్లీ సింగరాజులాంటి స్వార్థపరుల పంజాకి అందకుండా జాగ్రత్తప డు" అంది భారతి.

"బుద్ధి వచ్చిందమ్మా నాకు! బంగా రంలాంటి బిడ్డని వుంచుకుని కళ్ల కావరంతో వాడి మోజులోపడి నేను నాశనమై, నా బిడ్డ బతుకునికూడా నాశనం చెయ్యబోయాను. ఇదంతా నా పొగరువల్ల జరిగింది" అంటూ చెంపలు వేసుకుంది శేమ.

ఓ రోజుండి తన కొడుకులతో వెళ్లిపో యింది. ఈసారి తల్లి వెళుతోంటే సీత ఏడవలే దు. ఇంకెందుకూ ఏడుపు? అమ్మ అందుబా టులోవుంది, అమ్మకి ఇప్పుడు కావలసినంత స్వేచ్ఛవుంది, అదీ ధైర్యం. శేమ వెళ్లాక భారతి ఆలోచిస్తూ కూర్చుంది. ఏమిటో మనసంతా దిగులుగా వుంది. పిల్లలువెళ్లి పదిరోజులు దాటింది. ఇంట్లో తనూ, భర్తా, సీతా వున్నా ఎవరూలేనట్టు ఏదో వెలితిగావుంది. ఈ నెలరో జులకే పిల్లలతో ఎంత అలవాటు పడిపో యింది తను?

భారతికి ఓ విషయం స్పష్టంగా బోధపడిపో యింది. ఏ వస్తువుమీదనయినా, మనిషిమీద నయినా నాది అనుకుంటూ మమకారం పెంచుకున్నాక ఆ వస్తువూ లేక మనిషీ కాస్త దూరంగా వున్నా ఆ ఎడబాటుని భరించడం కష్టం. అదీ తల్లీ, పిల్లల విషయం అయితే మరీ చెప్పనవసరంలేదు. పిల్లలకోసంగా వాళ్ల కి తల్లి లేని లోటు తీర్చడంకోసంగా ప్రకాష్‌ని పెళ్లిచేసుకుంది తను. పిల్లలు తనకెంతో దగ్గర య్యారు.

వాళ్లు తన కడుపున పుట్టలేదుకదా? అన్న భావమే కలగడంలేదు.

సౌదామిని అన్నట్టు మాతృత్వంకంటే మాతృత్వపు మమకారం గొప్పది. దాన్ని పంచ డానికైనా, పొందడానికైనా కనివుండటం, కడు పున పుట్టివుండటం ప్రధానం కాదు. ఈ ప్రపంచంలో అన్ని ప్రేమల్లోకీ గొప్పదీ, మధురమై నదీ, కల్మషంలేనిదీ తల్లి ప్రేమ మాత్రమే. ఇక్కడ కన్నతల్లి, సవతి తల్లి అన్నదికాదు ముఖ్యం. ప్రేమించగలిగిన తల్లి అన్నది. తల్లి మనసెప్పుడూ వెన్నలాంటిదే.

జీవితంపట్ల అసంతృప్తితో ఒకనాడు సవతి తల్లుల్ని ఛీదరించుకున్న తులసి ఆ తరు వాత తల్లిగా మాతృత్వపు బంధానికి కట్టుబ డింది.

తెచ్చుకున్నవాడి పిల్లలమీద పెంచుకున్న మమకారంతో దుర్వ్యసనపరుడైన ఆ మగవా డ్ని భరిస్తూవుండిపోయింది జయలక్ష్మి...

యవ్వనంలో కోరికలకి తలవొగ్గి ముందువె నకలు ఆలోచించకుండా రెండోపెళ్లి చేసుకుని ఆ భర్త అనబడే వ్యక్తిచేత నానా హింసలకి గురయి మళ్లీ బిడ్డల తల్లయికూడా అతడితో బంధం తెంచేసుకుంది శేమ...

ఎందుకూ?

స్వార్థపరుడూ, సంకుచితుడూ అయిన ఆ మగవాడి భార్యగా వుండేకంటే ఓ తల్లిగా మిగిలిపోవడంకోసం...

వీళ్లంతా దేనికి కట్టుబడ్డారు?

మాతృత్వపు మమకారానికి ... మాతృత్వపు కడుపుతీపికి ...

ఇక్కడ కన్నతల్లి, సవతితల్లి, పెంచుకున్న తల్లిలాంటి పేర్లు ఎన్నయినా వుండవచ్చు. లోకం ఏపేరుతోనైనా పిలవవచ్చు. తల్లి ఎప్పు డూ తల్లే. ఏ స్వార్థంలేనిది తల్లిప్రేమ మాత్రమే. తనొకనాడు బిడ్డ స్థానంలో తల్లిప్రే మకోసం అర్రులుచాస్తే, ఈరోజు అదే తల్లిస్థా నంలో నిలబడి బిడ్డలకి ప్రేమని పంచ డంకోసం తహతహలాడుతోంది. సకల చరా చర జగత్తులో సర్వప్రాణికోటి ఉనికికీ ఆధారం తల్లి.

ఈ మధురమైన ఆలోచనలతో భారతి కళ్ల ల్లో ఆనందంతోకూడిన భాష్పాలు నిలిచాయి.

అప్పుడే బయటినుండి వినిపించింది 'అ మ్మా...' అన్న రెండు పసిగొంతుకల ఆర్తితో కూడిన పిలుపు.

చాలా ఆరాటంగా కదిలింది భారతి... కా దు... ఆమెలోని మాతృమూర్తి.

★







## కాంట్రిబ్యూషన్

ఆ ఉదయం పేపరు చూస్తూనే ఎగిరిగంతేశాడు కనకరాజు.

''ఫలానా సాహితీ సంస్థ ఆధ్వర్యంలో హనుమాన్ టెంపుల్‌లో - ఫలానా రోజు కవి సమ్మేళనం జరుగనున్నది. పాల్గొనదలచిన ఔత్సాహికులు, వర్ధమాన కవులు వివరాల కోసం ఫలానా అడ్రసులో మా కార్యదర్శిని సంప్రదించండి'' అన్న ప్రకటనే అందుక్కారణం.

వివరాలు తెలుసుకుందామని వెంటనే బయలుదేరి ఆ సాహితీసంస్థ కార్యాలయాన్ని చేరుకున్నాడు కనకరాజు.

కనకరాజు కవిత్వమంటే పడిచస్తాడు. దేవులపల్లి, శ్రీశ్రీల్లాంటి మహాకవుల్లా కాకపోయినా తనూ ఓ మోస్తరుగా కవిత్వం గిలుకుతుంటాడు. అలా గిలికినదాన్ని పత్రికలకు పంపడం - అది తిరుగు టపాలో వచ్చేయడం షరామామూలుగానే జరిగిపోయింది. అందుకే అవకాశంవస్తే ఇకముందు తన గళాన్ని కవిసమ్మేళనాల్లోనే విన్పించాలని అతనెప్పుడో నిర్ణయించుకున్నాడు.

సంస్థ కార్యదర్శి అతన్నిచూస్తూనే సాదరంగా ఆహ్వానించి కూర్చోపెట్టాడు. తర్వాత అతనొచ్చిన పని తెల్సుకొని మరింత సంతోషపడ్డాడతను.

''చాలా సంతోషం సార్... మీలాంటి యువ సాహితీ మిత్రుల్ని ప్రోత్సహించడమే మా సంస్థ ప్రధాన ధ్యేయం... అందుకే ఈ కవిసమ్మేళనాలు ఏర్పాటుచేయడం... బైదిబై మీ కాంట్రిబ్యూషన్ ఓ ఫిఫ్టీ వేసుకోమంటారా'' అన్నాడాయన.

కనకరాజుకి అతని ఉద్దేశం మొదట అర్థంకాలేదు. తర్వాత అర్థమైంది. అవును మరి! ఈ ఏర్పాట్లన్నింటికీ డబ్బెక్కడినుంచి వస్తుంది? కాబట్టి ఆయనలా అడగడంలో తప్పు లేదన్పించింది.

అతను ఆలోచనలో పడటంచూసి కార్యదర్శి మళ్లీ అన్నాడు-

''బలవంతమేం లేద్సార్... మీ తాహతుకు తగినట్లే వేద్దాం''

''అహఁ... పర్లేదు ఫిఫ్టీ వేస్కోండిసార్..'' అని అప్పటికప్పుడే పర్సుతీసి పైకం ఇవ్వబోయాడు కనకరాజు.

పైకం తీసుకోకపోగా తోకతొక్కిన తాచులా కస్సున లేచాడాయన.

''ఏమిటిసార్ డబ్బులు తీసుకొని సన్మానాలు చేసే సంస్థల్లా కన్పిస్తోందామాది? ఎవడిక్కావాలిసార్ మీ బోడి డబ్బు?''

తెల్లబోయాడు కనకరాజు.

''క్షమించండి... కాంట్రిబ్యూషన్ ఫిఫ్టీ అన్నారు... అంటే మీ ఉద్దేశం కుర్చీలుగానీ మరే



వైనా...' గొణిగాడు కనకరాజు.

''మా సంస్థమీద మీకింత చిన్నచూపు తగదుసార్! కుర్చీలు గట్రా ఫర్నిచర్ కూడా ఎరేంజి చేయలేమనుకుంటున్నారా? ఇప్పటికి 500 కవిసమ్మేళనాలు నిర్వహించి రికార్డు సృష్టించింది సార్ మా సంస్థ'' ఈసారి ఆయన గొంతులో కోపంబదులుగా ఇన్‌సల్టింగ్‌గా ఫీలవడు స్పష్టంగా అర్థమైంది కనకరాజుకి.

ఏంమాట్లాడితే ఏంతంటానో అని మౌనంగా ఊరుకున్నా కనకరాజు ఆలోచనలకి మాత్రం బ్రేక్ పడలేదు. కాంట్రిబ్యూషన్ డబ్బూకాదు... ఫర్నిచరూకాదు... మరైతే ఏమిటి? ఒకవేళ పండలేమో! యువకవుల్ని స్టేజీమీదికి ఆహ్వానించినపుడు వేయడానికి కాబోలు... కానీ అడగడానికి ధైర్యంచాలలేదతనికి.

"ఏంసార్ ఇంకా అర్థంకాలేదా? అయితే కవిసమ్మేళనాల్లో పాల్గొనడం మీరిదే మొదటిసారన్నమాట'' అన్నాడు కార్యదర్శి పళ్లికిలిస్తూ.

సిగ్గుతో చితికిపోతూ అవునన్నట్లు తలూపాడు కనకరాజు.

మెల్లగా కార్యదర్శి అన్నాడు-

'ఇక్కడ కాంట్రిబ్యూషన్ అంటే డబ్బూ ఎట్సెట్రాకాదాన్సార్. జనం... మీ కోటాకింద ఓ యాభైమంది జనాన్ని శ్రోతలుగా లాక్కొస్తే మన కార్యక్రమం విజయవంతమౌతుంది. ఇందాకే లవణరాజుగారు తమ కాంట్రిబ్యూషన్ రెండొందలు వేశారు! ఆయన స్కూల్ టీచర్‌లెండి... పిల్లలనైనా తోలుకురాగలరు! అదీగాక బంధుమిత్రులూ చాలామంది ఉన్నారాయనగారికి...''

ఇంకా ఆయనేదో చెబుతున్నాడుగానీ కనకరాజుకవేమీ విన్పించడంలేదు. కారణం అతనెప్పుడో మూర్ఛపోయాడు.

— ప్రతాపచంద్ర



## పోలికలు

ప్రముఖ సినీతార కామిని గర్భవతి అయిందని తెలిసి సినీ పత్రికా విలేకరులందరు హుటాహుటిన ఆమె గృహం చేరుకొన్నారు. కారణం ఆమె అవివాహిత.

అందరినీ సాదరంగా ఆహ్వానించి కూర్చుండపెట్టింది కామిని. అప్పటికప్పుడు స్వల్పంగా తేనీటివిందు ఏర్పాటుచేసింది.

అట్టడుగుస్థాయినుండి స్వయంకృషితో పైకి వచ్చి, రొటీన్‌పాత్రలనేగాక స్త్రీసమస్యలకు సంబంధించిన అనేక చిత్రాల్లో ఎన్నో శక్తివంతమైన పాత్రలను సమర్థవంతంగా పోషించి అటు పరిశ్రమవర్గాల్లో మంచి గుర్తింపును, ఇటు లక్షలాది ప్రేక్షకులనుండి ఎన్నో ప్రశంసలనందుకొంది కామిని.

ఆమె వ్యక్తిగత జీవితంగురించి అనేక వదంతులు వ్యాప్తిలో ఉన్నాయి. ఎటువంటి ప్రశ్నకయినా సూటిగా, ధైర్యంగా సమాధానం







చెప్పడం ఆమె ప్రత్యేకత.

విందు ముగిసింది. ఇంటర్వ్యూ మొదల యింది.

మొదటి ప్రశ్న: ఓ అగ్రశ్రేణి సినిమా పత్రిక నుండి వచ్చిన విలేకరి అడిగాడు సౌమ్యంగా - "మీరు గర్భవతి అనే వదంతి బయల్దేరింది. దీనికి మీరేం సమాధానం చెప్తారు?"

"వదంతి కాదు ... నిజమే" చిరునవ్వుతో అంది కామిని.

"మరి ఇన్నిరోజులు ఆ వార్తని ఎందుకు గోప్యంగా ఉంచారు" అగ్రశ్రేణి పత్రికను అను కరించి ద్వితీయ అగ్రశ్రేణి పత్రికగా చెలామణీ అవుతున్న మరో పత్రికనుండొచ్చిన విలేకరి అడిగాడు.

"దాస్తే దాగే వార్త కాదుగా ఇది. అయినా ఆ అవసరంకూడా లేదు. మొదటినుండి ఇర్రెగ్యు లారిటీ సమస్య ఉన్నందువల్ల నాకూ అను మానం రాలేదు డాక్టరుగారు పరీక్షచేసి చె ప్పేంతవరకు"

"దీనికి మీరెలా స్పందిస్తున్నారు?" మరో విలేకరి అడిగాడు.

"చాలా సంతోషంగా ఉంది. ఎవరి పిల్లల్తోనో కాలం వెళ్లబుచ్చడంకంటే నా స్వంత పిల్లల ఆలనాపాలనా చూడటం ఎంతో ఆనందాన్ని స్తుంది. ఇది దేవుడు నాకిచ్చిన వరంగా భావి స్తున్నాను" అంది స్వతహాగా పిల్లలంటే ఎక్కువ మక్కువ చూపే తారగా ప్రఖ్యాతురా లైన కామిని.

"ఈ పరిణామంతో మీ కెరీర్ దెబ్బతినే అవకాశం ఉందిగదా? మీ నిర్మాతలు ఇబ్బంది కి గురి కావల్సి ఉంటుందిగదా?" విలేకరి ప్రశ్నించాడు.

"దీనివల్ల నా అవకాశాలు సన్నగిల్లుతా యని నేనేం భయపడటంలేదు. నా సామ ర్థ్యంమీద నమ్మకమున్న నా నిర్మాతలు సహృద యంతో కొంతకాలంపాటు నిరీక్షించగలరను కుంటున్నాను. అయినా నాకేం పెళ్లికాలేదుగా అంతగా అందరూ భయపడ్డానికి" కొంటెగా నవ్వుతూ సమాధానమిచ్చింది కామిని.

"దీనికంతటికీ కారణం అయిన ఆ సంఘ టనను వివరిస్తారా? ఆ వ్యక్తి ఎవరో చెబు తారా?" సినిమా పత్రిక పేరుతో బూతుపత్రిక నడుపుతున్న ఓ సంపాదకుడు కమ్ విలేకరి అడిగాడు నవ్వుతూనే.

"నేను వివరించి చెప్పకపోయినా, కల్పించి రాయడానికి మీరున్నారుగా" చిన్నగా చురక అంటించింది కామిని.

"చివరి ప్రశ్నగా మళ్లీ అడుగుతున్నాం. పుట్టబోయే మీ బిడ్డకు తండ్రెవరు?" సందే హిస్తూ మెల్లగా అడిగాడింకో విలేకరి.

సమాధానం ఇచ్చేముందు దీర్ఘంగా ఆలో చించి ఆ తరువాత ఇలా అంది కామిని- "ఊహూఁ ... నాకూ ఖచ్చితంగా తెలియడంలే దు. అయితే బిడ్డ పుట్టిన తర్వాత మీరే సునాయాసంగా చెప్పగలరు పోలికల్నిబట్టి" అంది కామిని.

— కె. బలరామిరెడ్డి

# విచిత్ర ప్రపంచం

## కొండెలేని తేలు

అంగుళంలో మూడవవంతుకన్నా చిన్నదిగా కన్పించే నకిలీ తేలు చాలా గమ్మత్తయిన జీవి. అసలు తేలుకిమల్లే ముందు రెండు డెక్కలుంటాయిగానీ కొండె మాత్రం దీనికుండదు. విషపూరితమైనది కూడా కాదు. శత్రువులు చుట్టుముట్టినప్పుడు చచ్చిపోయినదానిలా పడివుండి తప్పించుకోవడంలో ఇది దిట్ట. ఆపద వచ్చినప్పుడు ముందుకేగాక వెనక్కి కూడా పరుగెత్తుతుంది.

గూళ్లు కట్టడంలో నకిలీ తేలుది అందెవేసిన చెయ్యి. చెక్కపొడిని పేస్టులాచేసి దానితో మంచి మంచి గూళ్లు నిర్మించగలదు. కుటుంబసభ్యులందరికీ విడివిడిగా గదులుండేలా ఉంటాయా గూళ్లు. సాధారణంగా ఇంటా బయటా పనంతా మగప్రాణే చేసుకుంటుంది. ఆడప్రాణి మాత్రం చాలాభాగం కాలాన్ని నిద్రతోనే గడిపేస్తుంటుంది. ఈ ప్రాణుల కలయిక కూడా గమ్మత్తుగానే ఉంటుంది. ఆడప్రాణిని సమీపించి మగప్రాణి తలను మెల్లగా ఊపుతుంది. శరీరాన్ని కదిలిస్తుంది. అయినా ఆడదానిలో చలనం మాత్రం రాదు. అప్పుడు తన శరీరాన్నుంచి ఒక విధమైన ద్రవపదార్థాన్ని విడుదల చేస్తుంది మగప్రాణి. ఆ పదార్థానికి ఆకర్షితురాలై అప్పటికిగాని దారికిరాదు ఆడప్రాణి. ఆ రకంగా వాటి రొమాన్స్ మొదలవుతుంది.



Uma '82



## అదృష్టబాలుడు

యాక్సిడెంట్‌లో కన్నవాళ్లకి దూరమై, తిరిగి పదకొండునెలల తర్వాత ఒకానొక పుణ్యాత్ముడి దయవల్ల తల్లివడికి చేరుకున్నాడో రెండేళ్లబాబు. 1989 నవంబర్ 1న అలహాబాదునుంచి బయలుదేరిన తుఫాన్ ఎక్స్‌ప్రెస్‌లో తాత, తల్లి, అన్న, అక్కలతో కలిసి ప్రయాణిస్తున్నాడు రెండేళ్ళ లల్లా. మరికొంచెం సేపటిలో మొఘల్‌సరాయికి చేరుతుందనగా ఆ ఎక్స్‌ప్రెస్ పెద్ద ప్రమాదానికి గురైంది. ఎనిమిది బోగీలు తలక్రిందులయ్యాయి. లల్లా తాతగారు అక్కడికక్కడే మరణించగా, మిగిలినవాళ్లంతా తీవ్ర గాయాలతో స్పృహలేనిస్థితిలో ఆసుపత్రికి తరలించబడ్డారు. కాని తలకి తగిలిన గాయంతో స్పృహకోల్పోయి విరిగిపోయిన ఓ సీటుకింద పడివున్న లల్లానెవ్వరూ గమనించలేదు.

చాలాసేపటి తర్వాత బెంగాల్‌కి చెందిన బిశ్వజిత్ అనే ఉప్పుడుబియ్యం వ్యాపారి లల్లాని గమనించి వైద్యం చేయించాడు. తర్వాత ఆ బాబు తాలూకు పెద్దవాళ్ల గురించి ఎంతగా వాకబు చేసినా ఫలితం లేకపోయింది. పోలీస్ రిపోర్టు ఇస్తే వాళ్లు కుర్రాడి ఫొటో తీసుకుని అబ్బాయిని అతని వద్దనే ఉంచమని కోరారు.

కలకత్తాకు చెందిన బిశ్వజిత్ ఒంటరివాడు. ఆ కారణంగా లల్లావల్ల అతనికి మంచి కాలక్షేపం కాసాగింది. వ్యాపారం పనిమీద వెళ్లిన ప్రతిచోటుకీ అతని కూడా లల్లా ఉండాల్సిందే. బిశ్వజిత్ అతన్ని ప్రేమగా 'గోపాల్' అని పిలుచుకునేవాడు.

1990 జులైలో తప్పిపోయిన పిల్లల ఆచూకి తీసే బృందం ఒకటి లల్లా గురించి తెలుసుకుని రేడియోల్లోనూ, పేపర్లలోనూ ప్రకటించింది. ఓ బెంగాలీ స్నేహితుడి ద్వారా ఆ విషయం తెలుసుకున్న లల్లా తల్లిదండ్రులు కలకత్తాకు పరుగులు తీశారు. కాని అక్కడ బిశ్వజిత్ కనబడలేదు. బిడ్డతోసహా అతడు బృందావన్‌కెళ్లాడని తెల్సుకుని అంతా అక్కడికి చేరుకున్నారు. లల్లాని తల్లిదండ్రులకి అప్పగించడానికి బిశ్వజిత్ పేచీ ఏమీ పెట్టలేదుగానీ తిరిగి తాను ఒంటరివాడైనందుకు మాత్రం కుమిలిపోయాడు. ఇవేమీ తెలియని లల్లా మాత్రం అమ్మ వళ్లో వెచ్చగా ఆడుకుంటూ కూర్చున్నాడు. అదీ 11 నెలల సుదీర్ఘ ఎడబాటు తర్వాత.





## ఊరంతా ఆయన కుటుంబమే

**147** ఏళ్ల కెల్లాభాయ్‌నే మనదేశం మొత్తంమీద అత్యంత వయోవృద్ధుడిగా చెప్పుకొని తీరాలి. కొండప్రాంతంగా ప్రసిద్ధికెక్కిన గుజరాత్‌లోని బోర్‌ఖండ్ గ్రామానికి కేవలం కెల్లాభాయ్ నవరాభాయ్ రాట్లాని చూడ్డానికే రోజూ ఎందరో యాత్రికులు వస్తుంటారు. నిజానికి తన వయసెంతో కెల్లాభాయ్‌కే స్పష్టంగా తెలియదు. జ్ఞాపకశక్తి కూడా చాలా భాగం నశించిపోయిందతనికి. గుజరాత్‌లో భయంకరమైన కరువు సంభవించేనాటికి అతని వయస్సు ఖచ్చితంగా 17 సంవత్సరాలని మాత్రం తెలుస్తోంది. చరిత్ర తిరగేస్తే ఆ కరువు 130 ఏళ్ల క్రితం వచ్చినట్లు స్పష్టమైన దాఖలాలు అనేకం కన్పిస్తున్నాయి.

కెల్లాభాయ్ తన ఇద్దరి భార్యల ద్వారా అక్షరాలా ఇరవైరెండు మంది సంతానానికి తండ్రయ్యాడు. మనుమలు-మనుమరాళ్లు అరవై మంది దాకా ఉన్నారు. ఒరకంగా చెప్పాలంటే బోర్‌ఖండ్ గ్రామంలోని 60 కుటుంబాలూ అతని బంధువులవే. వారంతా అతనికి మనుమలో కొడుకులో అయి తీరతారు. అందుకే ఆ గ్రామం మొత్తం కెల్లాభాయ్‌ని తమ వంశానికి మూలపురుషుడిగా భావించి గౌరవిస్తుంది. ప్రస్తుతం కెల్లాభాయ్ చిన్న భార్య వయస్సు 90 సంవత్సరాలు. అతని పెద్దకొడుకు ఈమధ్యే నూరో పుట్టినరోజు జరుపుకున్నాడు. ఆశ్చర్యమేమంటే భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన విషయం కెల్లాభాయ్‌కి ఇప్పటికీ తెలియదు. ఇంకా తెల్లదొరల పాలనలోనే ఉన్నామనుకుంటున్నాడతను. మహాత్మా గాంధీ పేరు ఒకటి రెండుసార్లు వినడమే తప్ప ఆయనను గురించి తనకేమీ తెలియదంటాడతను. మరో విచిత్ర మేమంటే తన సుదీర్ఘ జీవితయాత్రలో ఇప్పటివరకూ ఒకే ఒక్క సారి బస్సెక్కాడట కెల్లాభాయ్. కంటి చూపు, వినికిడిశక్తి బాగా తగ్గిపోయినా ఆరోగ్యంగానే కన్పిస్తాడు. తమ కాలంలో తులం బంగారం పాతికరూపాయలకే కొనేవాళ్లమనీ, ఆ రోజుల్లో నెయ్యి కిలో పావలా కన్నా ఎక్కువ ఉండేది కాదని చెబుతుంటాడతను.

ఒకప్పుడు నూరెకరాల భూమికి హక్కుదారుడైన కెల్లాభాయ్ ప్రస్తుతం ఒకే ఒక్క ఎకరంతో జీవితం వెళ్లదీస్తున్నాడు. కొడుకులు, మనుమలు, మునిమనుమలు అందరికీ పంపకాలు పోను అతనికి మిగిలిందా ఎకరం నేలేనట.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.

